రచయితలు :
శ్రీ వేదురుమూడి కృష్ణారావు పంతులుగారు, బి.ఏ.,
గవర్నమెంటు ఆంధ్రానువాదకులు (రిటైర్డు)
శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు, బి.ఏ.,
డెప్యుటీ కలెక్టరు (రిటైర్డు)

రెండవ కూర్పు
(సమ్యక్పరిశోధితము, సంగ్రహరూపరచితము)



వెల : రూ. 5.

ది జూపిటర్ ప్రెస్, లిమిటెడ్, మద్రాసు-1.

విషయసూచిక

పటములు

# అ వ తా రి క

ఈ గ్రంథపు మొదటికూర్పు ప్రకటించి (1933) ఇరువదేండ్లు కావచ్చినది. ఆ ప్రతులన్నియు ఎన్నేండ్లనాఁడో అమ్ముడుపోయినవి. అప్పటినుండి ఎందెందఱో ప్రతులకై వ్రాయుచున్నను పునర్ముద్రణ ప్రయత్నము అనేక కారణములచే కొనసాగలేదు. అనివార్యముగ కలిగిన ఈ యాలస్యమునకు పాఠకలోకము మమ్ము క్షమించుఁగాక!

మొదటి కూర్పులోని పాఠము ఇంగ్లీషు మూలమునకు సరియైన తెనుఁగు. 856 పుటల పెద్దగ్రంథము. ఖరీదులు తక్కువగా నుండిన ఆ కాలముననే దాని వెల 5 రూ. పెట్టవలసివచ్చినది. పిమ్మట ప్రారంభమైన కాగితపు కఱవులో ఆ గ్రంథము నట్లే మరల ముద్రించుటకు ప్రయత్నించినను, వలసినంత కాగితము దొరకుట సాధ్యమైయుండెడిది కాదు. ఎట్లో ముద్రించినను, దానికై ఆత్యాతురతతో నిరీక్షించుచుండిన పాఠకులలో అనేకులకు దానివెల అందుపాటులో నుండియుండదు.

సర్వజనసౌభ్రాత్రమును, సర్వమతాంగీకారమును, బోధించు శ్రీరామకృష్ణసందేశము సార్వజనీనమైనది. ఆ బోధకు కార్యరూపవ్యాఖ్యానమైన ఆయనజీవితము "మనకు భగవత్సాక్షాత్కారభాగ్యము కలుగుటకు తోడ్పడఁగలదు" అని గాంధీమహాత్మునంతటి యుగపురుషుఁడే చెప్పియున్నాఁడు. అనిర్వచనీయరామణీయకము కలిగి, అలౌకికసౌరభములు వెదచల్లు, ఆ దివ్యజీవితముయొక్క అనన్యమాధుర్యమును చవిచూచి యానందించు నవకాశమును ఈ యధునాతనకాలమున ప్రతిమనుష్యునకును కల్పించుట ముఖ్యమని మా యాశయము. అందుచే ఈ గ్రంథమును సంగ్రహరూపమున వ్రాసి ఆంధ్రపాఠకలోకమంతటికిని అందుపాటులో నుండునట్లు చేయవలసివచ్చినది.

ఈ సంక్షేపణకార్యములో ప్రాణప్రాయమగు ముఖ్యవిషయమేమియు విడువఁబడలేదని మా నమ్మకము. ఇందు అవలంబింపఁబడిన ముఖ్యమార్గము లివి: పూర్వపాఠములోవలె శబ్దవాక్యానుసరణము నంతగా పాటింపక, భావానుసరణమునకు మాత్రమే ప్రాధాన్య మిచ్చుట; ఇంగ్లీషు మూలమునఁ బ్రాస్తావికముగా చేర్పఁబడిన విషయములను, జీవితకథకు

అంతగా ముఖ్యములు కావని తోఁచిన యితరవిషయములను, వదలుట; ఈ యిరువదేండ్లలో ఆంధ్రమున ప్రకటింపఁబడిన, ఇప్పుడు ప్రకటింపఁబడు చున్న, శ్రీ రామకృష్ణవాఙ్మయములో లభ్యములగు విషయములు కొన్ని మరల ఇందు ఉదాహరింపకుండుట. ఇట్టి నిరాక్షేపణీయమార్గములు మాత్రమే అవలంబింపఁబడి, ముఖ్యవిషయ మంతయు పోషింపఁబడుటచే, గ్రంథము 478 పుటలకన్న చిన్నదిగా చేయుట సాధ్యము కాలేదు.

ఇందలిభాష గ్రాంథికము, వ్యాకరణబద్ధము. కాని గ్రంథము విద్యార్థులు కానివారికి కూడ సుబోధముగా నుండవలెనను ఉద్దేశము ననుసరించి: (1) పదములు విడఁబఱచి, శబ్దసిద్ధములగు నర్ధానుస్వారములు మాత్రమే ఉంచి, సాధ్యమైనంతవఱకు విసంధిగా వ్రాయఁ బ్రయత్నింపఁబడినది. కాని ఇది అపరిచితమార్గమగుటచే గ్రంథము సగము సాఁగువఱకు అంత పూర్ణముగా నిర్వహింపఁబడలేదు. (2) వేదాంత వాసనాభూయిష్ఠమగు నిట్టిగ్రంథములో నచ్చటచ్చట కొంత భాషాకాఠిన్యము అనివార్యమే యైనను, అపూర్వశబ్దప్రయోగములు; దీర్ఘసమాసములు, అలంకారవిజృంభణములు, త్యజించి, కథనభాగమంతయు సాధ్యమైనంత సులభశైలిలో వ్రాయఁబడినది. (3) గ్రాంథికముగా నొకయర్థము, వ్యావహారికముగా వేఱొకయర్థము, కల "ఉచితము", "అవసరము", "అబద్ధము", "వ్యక్తి", "అవ్యక్తము", "ధర్మము" మున్నగుమాటలు వ్యావహారికార్థమున ప్రయోగించుట అర్థసౌలభ్యమునకు తోడ్పడునని తోఁచినచోట్ల అట్లే ప్రయోగింపఁబడినవి. (4) "ప్రతిది", "ప్రతి అక్షరము"; "వృద్ధాప్యము", "యక్షగానములు", "పాపిష్ఠి", "ద్వారా" ఇట్టి వ్యవహారసిద్ధరూపములు, "కాలేజీ", "హెడ్ మాస్టరు", "సలహా" ఇట్టి వ్యాప్తిలోనుండు విదేశీయశబ్దములు, ఒక్కొకచో వాడఁబడినవి. అనివార్యముగ ప్రయోగింపఁబడిన పారిభాషికాదిపదములజాబితా నొకటి చేర్చి, వానియర్థము లందు వివరింపఁబడినవి.

సంగ్రహపఱచి వ్రాయుటలో మూలవాక్యము లెన్నెన్నియో పూర్తిగా మాఱిపోయినవి. కాని అత్యంతమధురమగు శ్రీ కృష్ణరావుగారి భాష సాధ్యమగుచోట్లనెల్ల, ఆవశ్యకములగు చిఱుతకమార్పులతో, నిలుపఁబడినది. 369 వ పుటలో తెలుపఁబడిన కారణములచే "అనుబంధము" మాత్రము క్రొత్తగా వ్రాయవలసివచ్చినది.

ప్రస్తుతరూపమున ఈ గ్రంథము అనువాద మనిపించుకొనదు. చిన్న సైజులో తీసిన ఫోటోగ్రాఫు అని చెప్పవచ్చునేమో! ముఖ్యాంగములు మాత్రము స్పష్టముగనే కానవచ్చును. జీవకళ, జీవరేఖలు, నిలిచియుండును. పరిమాణముమాత్రము స్వల్పము.

శ్రీ రామకృష్ణుని భక్తుల విషయము మూలగ్రంథమున నచ్చటచ్చట పదునెనిమిది అధ్యాయములలో వ్రాయఁబడియున్నది. అందు వారు వచ్చిన కాలక్రమముమాత్రమే పాటింపఁబడుటచే, వేఱువేఱుతరగతులవారొక యధ్యాయముననే పేర్కొనఁబడిరి. ఇం దట్లుకాక, అందఱను వేర్వేఱు తరగతులుగా విభజించి, యొక నూతనాధ్యాయమున (30) విభజన క్రమమును పేళ్లను తెలిపి, వివరములు గ్రంథాంతమున అనుబంధముగా కూర్పఁబడినవి.

మనుష్యుల యొక్కయు, స్థలముల యొక్కయు, పేళ్లు భిన్నరూపముల కెడమిచ్చు ఇంగ్లీషువర్ణక్రమమునుండి యూహింపఁబడక, యథార్థోచ్చారణప్రకారము సవరించి వ్రాయఁబడినవి. కావున నిందలి రూపములు ప్రామాణికములుగా గ్రహింపవచ్చును. కాని, వంగదేశనామముల చివరను కనిపించు చట్టోపాధ్యాయ, భట్టాచార్య, సేన్, మల్లిక్, ఇత్యాదులు కుటుంబనామములు (ఇంటిపేళ్ల వంటివి) అనియు, కావున స్త్రీనామములకుకూడ ఇట్టియంతములే ఉండుననియు, మొదట తెలియక పూర్వముద్రణములోవలె చట్టోపాధ్యాయుఁడు, సేనుఁడు, మల్లికుఁడు, ఇత్యాది రూపములు ప్రయోగింపఁబడెను. ఈ పొరపాటు తెలియవచ్చినపిదప, ఈ యపప్రయోగములు మానఁబడెను.

ప్రథమముద్రణపాఠమును రచించిన శ్రీ వెదురుమూడి కృష్ణరావు పంతులుగారి కిప్పుడు ఈ పునర్విరచనాకార్యమునకు వలయు ఓపికగాని, తీఱికగాని, లేకపోయినను, ఎంతో జాగ్రత్తతో గ్రంథమునంతయు పునః పరిశీలనముచేసి, అందు విడిచిపెట్టఁదగిన భాగములన్నియు వారికి స్వకీయులగు శ్రీ తాడూరి లక్ష్మీనరసింహారావు, బి. ఎస్‌సి., గారి తోడ్పాటుతో గుఱుతులిడి యిచ్చిరి. ఆ గుఱుతుభాగములను చాలవఱకు విడిచి, మిగిలిన భాగములు పెక్కుచోట్ల ఆంగ్లమూలముతో సరిచూచి, శ్రీ గురుదేవుని గృహస్థప్రశిష్యులలో నొకరగు శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు మా

కోర్కెపై గ్రంథమును ఈ ప్రస్తుతరూపమున రచించి శ్రీ గురుదేవునకు సభక్తికముగా సమర్పించుకొనిరి.

పచ్చైయప్ప కాలేజిలో తెలుఁగు ప్రొఫెసరుగానుండు శ్రీ శ్రీ రాం-వేంకటభుజంగరాయశర్మ, బి. ఏ. (ఆనర్సు) గారు కార్యాంతరమగ్నులయ్యును, ఈ గ్రంథముద్రణకాలమున ప్రూఫులు చూచు భారములో కొంతభాగమును వహింప నంగీకరించి, వానిలో కానవచ్చిన ముద్రణ స్ఖాలిత్యములు సవరించుటే కాక, పదప్రయోగములను, కథాకథనవైఖరిని, ఔచిత్యమును, కూడ నత్యంతశ్రద్ధతో పరిశీలించి దోషములను లోపములను సూచించుచు, ఈ రచనాకార్యమున నెంతయు తోడ్పడి, తమ ప్రతిఫల నిరపేక్షసేవచే శ్రీ గురుదేవునికి కృపాపాత్రులైరి. వారికి మా కృతజ్ఞతాభివందనములు.

తప్పొప్పులపట్టికనుగూర్చి యొకమాట. అది సుదీర్ఘముగా కానిపించినను, అందు అర్థభేదము కల్పించి, పాఠకులను బాధించు, తప్పులు ( * ) అంతగాలేవు. కొన్ని పైన సూచింపఁబడిన బెంగాలీ పేళ్ల ( † ) లోని తప్పులు. తక్కినవానిలో అనేకములు సులభముగా గ్రహింపఁదగినవియును, కేవలప్రమాదజనితములును, ఐనను గ్రంథము విద్వాంసులపరీక్షకుకూడ తాళవలెనను కోర్కెతో చేర్పఁబడినవి. ఇన్నితప్పులు పడుటకు మూలకారణము విరచనాకార్య మత్యంతవేగముగాజరుగుట. 856 పుటల మూలగ్రంథములో సుమారు 600 పుటలు సంగ్రహరూపముగ పునర్విరచన మొనర్చుటయు, తక్కిన సుమారు 250 పుటలు అనుబంధరూపమున నూత్నవిరచన మొనర్చుటయు, రెండునెలలలోనే పూర్తియయ్యెను! ముద్రణముకూడ నట్లే అతిత్వరితగతితో జరిగెను. రాత్రి వచ్చిన ప్రూఫు ప్రొద్దున 9-30 లోపల చూచి యిచ్చుటయు, కొన్నిసార్లు ఒకేరాత్రి రెండు మూఁడువిధములైన ప్రూఫులు వచ్చుటయు! ఈ ప్రూఫులు చూచిన యిరువురికిని ఇట్టి తెనుఁగు ప్రూఫులు చూచుటయందు పూర్వానుభవము ఇంచుమించుగా లేనేలేదు. అన్నిటికన్న ముఖ్యకారణము పునర్విరచితభాగమునకు శుద్ధప్రతిలేకపోవుట. ఒక ప్రథమముద్రణప్రతిలోనే మార్పులన్నియు చేయఁబడెను. ఎన్నో వాక్యములు కొట్టివేయుట, ఎన్నో వాక్యములు మార్చుట, ఎన్నో వాక్యములలో క్రొత్తభాగములతో ప్రాఁతభాగములు కలుపుట, ఎన్నోసారులు మొదటచేసిన మార్పును మరల మార్చుట. వీని యన్నిటి గరిష్ఠఫలము

ఆ 600 పుటలును దుర్గమారణ్యముగ మారిపోవుట. అందుచే వాక్యములు క్రొత్తగా కలిపిన చోట్లలో కొన్ని యర్ధానుస్వారములు, యడాగమములు, తీసివైచుట లేక కలుపుట, లేక సరళములు, 'స' 'వ' లు, పరుషములుగా మార్చుట, ఇత్యాదులు ఆవశ్యకమయ్యెను. కాని ఇవి కనిపట్టి దిద్దుట ఆ తొందరలో సాధ్యముకాలేదు. ముద్రణానంతరము ప్రూఫులు సావకాశముగా చూచుటచే ఈ తప్పులన్నియు ఇప్పుడు తెలియవచ్చినవి. ఈ పట్టికయు సమగ్రముకాదేమో! ఇట్లు చిత్తుప్రతిలోనుండి ముద్రింపని (నూత్నవిరచిత) భాగమున (గ్రంథములో సుమారు నాలవవంతు; 267–275, 369–474 పుటలు) ముద్రణదోషము లత్యల్పములగుట ఈ సందర్భమున గమనార్హము.

గహనప్రాయముగానున్న చిత్తుప్రతిలోని పాఠమును కనుగొని ముద్రించుటలో జూపిటర్ ప్రెస్ వారు చూపిన యసాధారణశక్తి ప్రశంసార్హము.

గ్రంథ మీ సంగ్రహరూపమున పాఠకలోకమునకు ఆదరణపాత్రమగునని యాశించుచున్నాము.

శ్రీ రామకృష్ణమఠము, మదరాసు – 4.<br>
శ్రీ దేవీనవరాత్రములు,<br>
నందన, 1952.

ప్రకాశకులు.

# ప్రథమ ముద్రణములోని "ప్రకాశకుల విజ్ఞప్తి"

## (సరియైన ప్రతి)

శ్రీ రామకృష్ణుని జీవిత విషయములను క్లుప్తముగ నాంధ్రలోకము నెదుట నుంచుటయే ఈ గ్రంథముయొక్క ముఖ్యోద్దేశము. ఇందలి యంశములెల్ల ఆంగ్లమాతృకనుండి గ్రహింపబడినవి.

శ్రీ రామకృష్ణుని జీవితచరిత్రను వ్రాయుటయందు పెక్కు చిక్కులు గలవు. ఈ విచిత్రవ్యక్తియందు సామాన్యదృష్టికి పరస్పర విరుద్ధములుగ గాననగు ననేక లక్షణములుండెను. కాననే ఈయనను గూర్చి అనేకు లనేకవిధములుగ నభిప్రాయపడిరి. ఈ గ్రంథమున ఈయననుగూర్చి యెట్టి సిద్ధాంతమును చేయక జరిగిన విషయములను జరిగినట్లు వ్రాయుటతోడనే మేము సంతృప్తిపడితిమి,

ఈ గ్రంథమున విరివిగాఁ గాననగు అమానుష విషయములను గుఱించి సమాధానరూపముగా నొక్కమాట చెప్పవలసియున్నది. ఈ విషయములెల్ల యథార్థముగ జరిగినవియై యున్నందున వాని నిచట ప్రస్తాపింపక తప్పినదికాదు. సామాన్య మానవునకు కేవల మసంభవముగఁ దోఁచునట్టి అదృశ్య ప్రపంచ చిత్రములను సూక్ష్మదర్శిని (మైక్రాస్కోపు), దూరదర్శిని (టెలెస్కోపు) యంత్రముల సాయమున శాస్త్రజ్ఞుఁ డెట్లు చూచుచున్నాఁడో, సుశిక్షితమును పవిత్రవంతమునగు మనస్సు నుపయోగించి యోగి యమానుష విషయముల నట్లే గ్రహించుచున్నాఁడు. ఇందువలననే యిట్టి విషయములు మనకు గమనార్హములు కాకతప్పదు. శాస్త్రము (సైన్సు), ముఖ్యముగా మానసికశాస్త్ర మింకను ప్రాథమికావస్థ లోనే యున్నది. అది సమాధానము చెప్పఁజాలదను కారణము మాత్రమున యథార్థవిషయములను బ్రకటింపనియెడల దాని భావ్యభివృద్ధికే భంగము వాటిల్లఁగలదు. కావున సత్యాన్వేషణాపరు లీ విషయముల నిర్లక్ష్యముగఁ ద్రోసివేయక వాని నాధారములుగా గొని కృషిచేసి, నూతనాధ్యాత్మిక పరిణామ సిద్ధాంతముల నేర్పఱచుట యుక్తము.

ఈ పుస్తకమందలి విషయము లేవియైన పాఠకుల కాయాసకరము లుగ నుండినచో వాని నుపేక్షించి, హర్షనీయములగు సంగతులనే వారు గ్రహించి యానందింపఁ గోరుచున్నాము. ఇట్టి సంగతు లిందెన్నియేని కలవని మా నమ్మకము.

ఈ గ్రంథమున వైష్ణవ మతప్రసక్తి వచ్చినప్పుడెల్ల, వంగదేశ వైష్ణవమునకే యది వర్తించునని తెలియవలయును.

ఈ గ్రంథము క్రీ॥ శ॥ 1929 లోనే శ్రీ గురుదేవుని దయవలన పూర్తియయ్యె, కొన్ని యనివార్య కారణములవలన 1932 ఆగస్టువరకు ముద్రణమునకు రాలేదు.

దీనిలోని మొదటి భాగమున కొన్ని పుటలను, విశేష యశోవిరాజితులు శ్రీయుత దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులుగారు తమ ముద్రణాలయమున నుచితముగ ముద్రించి మా కిచ్చినందులకు, వారికి మా కృతజ్ఞతాపూర్వక వందనములు. ముద్రణకార్యమునకు విశేష ధన సాహాయ్య మొనర్చి గ్రంథ ప్రచురణను సాధ్యపఱచిన శ్రీమంతులు యమ్. కాంతారావునాయుఁడుగారును, ఒంగోలు తాలూకా, తిమ్మాసముద్రము కాపురస్థులు గోరింట్ల వెంకన్నగారు, తదితరు లనేకులును మా విశేష కృతజ్ఞతకు పాత్రులు. ఈ గ్రంథరచనకు ప్రేరేపకులైన శ్రీయుత బారు రాజారావుపంతులవారికిని, దీని ప్రచురణ కార్యమున మిక్కిలి శ్రమపడి సాయముచేసిన శ్రీయుత టి. వి. రంగాచార్లవారికిని తక్కిన యువ భక్తులకును మేము చాల కృతజ్ఞులము.

ఆంధ్రదేశమున కీ గ్రంథము నతిత్వరితముగ నందఁజేయవలయు ననెడి యుద్దేశముతో ముద్రణమును జాల నవ్యవధిగ కొనసాగింపవలసి వచ్చినది. ఆ కారణముచే గ్రంథమున నచ్చు తప్పులును ఇతర దోషములును చాల మిగిలిపోయినవి. రెండవ కూర్పున వానిని సవరించుకొనఁ గలవారమని మనవిచేయుచు, పాఠకుల క్షమాపణమును గోరుచున్నాము.

ప్రకాశకులు.

# తప్పొప్పుల పట్టిక



(ఈ క్రింది సవరణలు చేసికొని, ఆ పిదప గ్రంథమును చదువ నారంభింపవలెను.)

* సామాన్యపాఠకులకు ముఖ్యమగు తప్పులు.

† వంగ దేశనామములలోని తప్పులు.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 5 | †చట్టోపాధ్యాయుఁడు | చట్టోపాధ్యాయ |
| 2 | 7 | దాని | దానిని |
| 3 | 19 | గడుప | గడప |
| 6 | 24 | దినమంతయు | దినమంతయుఁ |
| 7 | 7 | గాఁబోలు | కాఁబోలు |
| | 8 | జయలుదేఱెను | బయలుదేఱెను |
| 8 | 5 | జేసెను | చేసెను |
| 9 | 25 | కనఁడెను | కనఁబడెను |
| 11 | 7 | దాని | వాని |
| 12 | 20 | జేసి | చేసి |
| 14 | 6 | రాఁబడి | రాబడి |
| 15 | 22 | బడదు | పడదు |
| 16 | 3 | †భగవత్ | భాగవత్ |
| 17 | 8 | పాఠశాలలోకూడఁ | పాఠశాలలోకూడ |
| 18 | 4 | జేసి | చేసి |
| | 14 | బరిణమించు | పరిణమించు |
| 19 | 3 | గ్రంధ | గ్రంథ |
| 21 | 1 | గ్రహిణి | గ్రహణి |
| | 11 | బ్రాఁకుట | ప్రాఁకుట |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 22 | 21 | గూడ | కూడ |
| 24 | 13 | కొయ్యబాఱి | కొయ్యపాఱి |
| | 21,22 | మెన్నడు | మెన్నఁడు |
| 27 | 13 | నీశ్వరార్చనయందు | నీశ్వరార్చనయందుఁ |
| 29 | 21 | క్రమముగాఁ | క్రమముగా |
| 30 | 7 | డొకడు | డొకఁడు |
| | 9 | బ్రశంసించు | ప్రశంసించు |
| | 13 | బోయెను | పోయెను |
| 31 | 6 | క్రిందఁ గుమిగూడి. | క్రింద గుమిగూడి |
| | 12 | డప్పఁగింప | డప్పగింప |
| 32 | 3 | బ్రతి | ప్రతి |
| 33 | 19 | రాఁబడి | రాబడి |
| 37 | 11 | నని | యని |
| | 20 | చున్నదని | చున్న'దని |
| 39 | 19 | బెటుకొని | పెట్టుకొని |
| 42 | 13 | గలవని | కలవని |
| | 22 | జన్మించితి | జన్మించె |
| 45 | 12 | గాలవాహిని | కాలవాహిని |
| 47 | 18 | రాఁబడి | రాబడి |
| 48 | 12 | †విశ్వాసుఁ డామె | విశ్వాస్ ఆమె |
| 49 | 20 | జాప | జాఁప |
| 51 | 6 | పురోహితుఁడు | అర్చకుఁడు |
| | 7 | స్వీకరించుటకుగాని | స్వీకరించుటకుఁగాని |
| | 22 | *కొనుటనుగాని, | కొనుటనుగాని, అప్పుడు దేవాలయ |
| 54 | 15 | మహమ్మదీయ | మహమ్మదీయుల |
| | 23 | జెప్పి | చెప్పి |
| 55 | 16 | పాటింపబడు | పాటింపఁబడు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 56 | 22 | త్రాఁగు | త్రాగు |
| 58 | 18 | †ముఖోపాధ్యాయుఁడను | ముఖోపాధ్యాయ అను |
| 60 | 14 | యసహ్యాము | యసహ్యాత |
| 62 | 3 | జూచుట | చూచుట |
| 63 | శీర్షిక | వ్రథమ | ప్రథమ |
| 64 | 11 | బాటు | పాటు |
| 67 | 14 | †భట్టాచార్యుని | భట్టాచార్య |
| 75 | 24 | నెట్టబారి | నెట్టవారి |
| 84 | 2 | యుఁడును. | యుండును.” |
| 85 | 23 | ద్రాఁగి | ద్రాగి |
| 86 | 22 | నోలవక | నోలువక |
| 87 | 2 | ‘ఆ సాధన | ఆ సాధన |
| | 25 | బడబోఁగా | బడఁబోఁగా |
| 88 | 25 | గూడ | కూడ |
| 90 | 17 | నుండియోఁ గొట్టు | నుండియో కొట్టు |
| 91 | 24 | †బారానగరునకు | బరానగరునకు |
| 107 | 15 | లాఁగుకొము | లాగుకొను |
| 111 | 21 | సింధు | సిన్ధు |
| 112 | 14 | భనము | భవము |
| 113 | 25 | గ్రహిణి | గ్రహణి |
| 115 | 4 | యీ | ఈ |
| 116 | 13 | అని | మని |
| 121 | 20 | అతీంద్రయా | అతీంద్రియా |
| 124 | 6 | జెప్పిన | చెప్పిన |
| 133 | 1 | వస్తుపు | వస్తువు |
| 134 | 6 | †దేవుకనుకూల | దేవునకనుకూల |
| 139 | 17 | *యోగ | తంత్ర |
| 142 | 23 | †మల్లికుఁడను | మల్లిక్ అను |
| | 25 | తడబడు | తడఁబడు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 147 | 12 | *భగవన్నియుక్తుఁడై | తన్మహాకార్యసాధనకై |
| 148 | 25 | †మధుసూదనదత్తు | మధుసూదనదత్త |
| 153 | 8 | గడపుచు | కడపుచు |
| 169 | 13 | *ఖేదమయు | భేదమయ |
| 176 | 22 | యీ | ఈ |
| 177 | 5 | గనఁబడు | కనఁబడు |
| | 16 | నూహించు | ఊహించు |
| 179 | 20 | తెల్లదనము | తెల్లఁదనము |
| 182 | 15 | దీఱిపోవు | తీఱిపోవు |
| 187 | 9 | ఎఱిగి | ఎఱిఁగి |
| 192 | 8 | కాశ్శి | కాశి |
| 199 | 2 | వారిరుపురును | వారిరువురును |
| | 12 | గర్వించునా ? | గర్వించునా ?' |
| | 21,25 | "నీవు * * చెప్పుము" | 'నీవు * * చెప్పుము' |
| 200 | 1,3 | "ఈ * * వాఁడు" | 'ఈ * * వాఁడు'. |
| | 18 | వేడెదను. | వేఁడెదను. |
| 202 | 9 | దాటి | దాఁటి |
| 203 | 8 | "ఇదియే * * స్థితి" | 'ఇదియే * * స్థితి' |
| | 9 | చెప్పితిని. | చెప్పితిని." |
| 205 | 18 | కృష్ణుఁడేడీ (రెండుసార్లు) | కృష్ణుఁడేఁడీ |
| 209 | 12 | పిడికెడు | పిడికెఁడు |
| | 14 | పాతిపెట్టి | పాఁతిపెట్టి |
| 216 | 1 | †దత్తుని | దత్త |
| | 4 | వాఁడుక | వాడుక |
| | 13 | *యూడెను. | యుండెను. |
| 217 | 17 | చేయుచున్నారు ?" | చేయుచున్నారు ? |
| 218 | 25 | మాత్రుఁడనేయని | మాత్రుఁడేయని |
| 223 | 14 | కామెకు | నామెకు |
| 224 | 24 | యని | అని |
| 225 | 18 | నెఱుఁగడు | నెఱుఁగఁడు |

# ఈ గ్రంథములో వచ్చు పారిభాషికాదిపదముల వివరణము

పుట

18 పారవశ్య (లేక అతీంద్రియ) స్థితులు. మనస్సు అంతర్ముఖమై, దివ్యభావప్రపంచమున మునిఁగి, శరీరమును, బాహ్యప్రపంచమును, మఱచియుండు స్థితి. ఈ స్థితిలో గోచరించునవే అతీంద్రియదృశ్యములు, అతీంద్రియానుభూతులు.

28 సమాధి. సాధనచతుష్టయముచే పవిత్రతనొందిన మనస్సు అంతర్ముఖమై, ఆత్మాన్వేషణప్రయత్నమున ఏకాగ్రమై, గాఢధ్యానమున మునిఁగి, త్రిపుటిని (అనఁగా ఎఱుఁగువాఁడు, ఎఱుఁగఁబడునది, ఎఱుఁగుట, అను భావముల కొలవాలనుగు స్థితిని) దాఁటి, భావాతీతస్థితి నంది, సత్యజ్ఞానానందమయ మగు పరమాత్మతో ఐక్యము ననుభవించు స్థితిని నిర్వికల్ప (పు. 163) లేక జడ (పు. 96) సమాధి యందురు. ఆ స్థితిలో శ్వాసనాడీచలనాదిజీవచిహ్నము లేవియు నుండవు. ఇది జ్ఞానమార్గపరమావధి. భక్తిమార్గపరమావధియగు భావసమాధిలో భక్తుఁడు, భగవంతుఁడు, అను భిన్న భావముమాత్రము నిలిచియుండును.

32 అతీంద్రియావస్థ = పారవశ్యస్థితి (పైని చూచునది.)

41 గౌరాంగుఁడు = శ్రీ చైతన్యదేవుఁడు.

60 అపరోక్షజ్ఞానము. ఆత్మ బ్రహ్మముతో ఐక్యసంధానమునందియుండు అనుభవము.

74 పరసువేధి (లేక స్పర్శవేధి). ఒక ద్రవపదార్థము. దీనితోడి కూడికచే ఇనుము బంగారుగా మాఱునని పూర్వకాలమున ప్రసిద్ధి.

91 దశమహావిద్య. వరాహనగరములోని కాళికాదేవి పేరు.

95 దాదా (వంగభాష) = అన్న.
హఠయోగము. ముఖ్యముగా దేహారోగ్యమును సాధించుకొనుటకై అభ్యసించు నొకవిధమైన యోగము.

101 ద్వంద్వప్రపంచపు పొలిమేర. దీనినే "భావముఖము" అనియు అందురు. ఇది యొక అత్యున్నతమగు నాధ్యాత్మికస్థితి. ఈ స్థితి నొందిన మహనీయుని మనస్సు నిత్యమునకును (నిర్గుణపరబ్రహ్మము) లీలకును (భేదమయప్రపంచము) నడిమిపొలిమేరలో నిలిచియుండును. అతఁ డా స్థితినుండి బ్రహ్మానందానుభూతి నొందుచుండఁ గలఁడు, లేక ఇచ్ఛవచ్చెనేని, భగవంతుని మూర్తిభావముగా నీ లోకమును చూచి, తత్కార్యకలాపమునఁగూడ పాల్గొనఁగలఁడు.

139 కుండలినీశక్తి. 'కుండలి' అనఁగా సర్పము. వెన్నెముకనడుమ సుషుమ్నానాడి యను నొక కాలువ కలదు. అది గుదప్రాంతమునకు కొంచెము పైనుండి మెదడు వఱకు వ్యాపించి యుండును. దానియందు దాఱు "చక్రము" లుండుననియు, అన్నిటికి క్రిందిదగు మూలాధారచక్రమున నిద్రితసర్పమువలె మనుష్యుని యాధ్యాత్మికశక్తియంతయు అణఁగి యుండుననియు, నిర్ణీతసాధనలచే ఈ శక్తిని మేలుకొల్పినచో, నిది సుషుమ్నానాడిని తెఱచుకొని, ఆఱు చక్రములను క్రమముగా భేదించుకొని, మెదడుకడనుండు సహస్రారచక్రమును చేరుననియు, ఆ శక్తి పైకెగయుకొలఁది సాధకునకు ఆధ్యాత్మికానుభూతులు క్రమాధికముగా కలుగుననియు, చివరకు నిర్వికల్పసమాధి లభించుననియు, తాంత్రికసాధకులు చెప్పుదురు.

156 శాంతభావసాధన. ప్రసన్నము ప్రశాంతము అగు మనస్సుతో చేయు భక్తిమార్గసాధన. తక్కిన నాల్గింటివలె నిది ప్రేమమూలము కాదు.

165 కర్మాధిష్ఠానదేవత. సర్వాభీష్టప్రదాత యని భక్తు లర్చించు సగుణబ్రహ్మము, కర్మసూత్రము నుల్లంఘింపఁజాలక, తదనుసారముగా జగత్తును పాలించుటతప్ప వేఱు శక్తి యేమియు లేనివాఁడని

యద్వైతుల మతము. కావున వారి కతఁడు కేవలకర్మాధిష్ఠాన దేవతయే. కర్మశాసనము, తత్కర్త, తత్పాలకుఁడు, తాత్త్వికముగా నొకటేయని వారిలో కొందఱందురు.

177 ఆవరణవిక్షేపశక్తులు. ఇవి మాయాశక్తియొక్క ప్రభావములు. సర్వగతమగు అఖండసత్యవస్తువును అగపడకుండ కప్పిపెట్టునది ఆవరణశక్తి. ఆ సత్యవస్తువుస్థానమున మిథ్యాప్రపంచమును సృష్టించి, దీనినే సత్యముగా తోఁపఁజేయునది విక్షేపశక్తి.

189 దివ్యసాధిక. తాంత్రికసాధకులలోఁ గల మూఁడుతరగతుల (పశు, వీర, దివ్యభావసాధకులు) లోను అత్యున్నతపదవి నందినవారు దివ్యభావసాధకులు. వీరు ఇంద్రియప్రేరణల కతీతులు. భగవత్సాక్షాత్కారతీవ్రవాంఛ మహాప్రవాహమువలె వీరిమనస్సుల నాక్రమించి, తుచ్ఛవాంఛలను నిర్మూలమొనర్చును.

197 బాబా (వంగభాష) = తండ్రి.

213 సంధిపూజ. దేవీనవరాత్రములలో మహాష్టమీ మహానవమీతిథుల సంధికాలమున దుర్గాదేవి కర్పించుపూజ. ఇది అత్యంతపవిత్రము.

238 ప్రతీకము. దృష్టిగోచరుఁడు కాని భగవంతుని స్థానమున ఆరాధనార్థమై భక్తుఁడు కల్పించుకొను ప్రత్యక్షచిహ్నమే "ప్రతీకము". ఈ చిహ్నము విగ్రహరూపమైనచో "ప్రతిమ" అనఁబడును.

284 ముక్త్యార్‌నామా (హిందుస్థాని). తనకుఁగా వ్యవహరించుటకై ఇతరునకు పరిపూర్ణస్వాతంత్ర్యము నిచ్చు అధికారపత్త్రము.

312 ఠాకూర్ (వంగభాష). భగవంతుని, పూజ్యులగు పెద్దలను, సూచించు ప్రేమగౌరవవాచకపదము. శ్రీ మాతృదేవి ఈ పేరితో శ్రీ గురుదేవుని సూచించుచుండెడిది.

322 ఇషణాత్రయము. మనుష్యుని వినాశమునకు మూలకారణమై, అరిషడ్వర్గములో ప్రథమస్థానము నాక్రమించియుండు కామము

(కోరికలు) మూఁడు ముఖ్యరూపములు దాల్చును: దారేషణ (భార్యయం దాసక్తి), పుత్రేషణ (బిడ్డలయం దాసక్తి), ధనేషణ (ద్రవ్యమునం దాసక్తి). వీనినే శ్రీ రామకృష్ణుఁడు రెండుతరగతు లలో నిమిడ్చి "కామకాంచనము" లనువాఁడు.

331 ప్రాతినిధ్యానుభూతిసిద్ధాంతము. ప్రతి మనుష్యుఁడును తన పురాకృతకర్మమును తానే అనుభవించి తీర్చుకొనవలసియుండఁగా, మహాపురుషులు ఇతరుల కర్మమును తా మనుభవించి వారిని విముక్తుల నొనర్పఁగలరు అను సిద్ధాంతము.

364 ఆత్మారాముఁడు. ఆత్మయే తానని గ్రహించి, అనాత్మరూపమగు నింద్రియగోచరప్రపంచమున నేమాత్రము ననురక్తుఁడు కాక, ఆత్మయందే ఎప్పుడును క్రీడించుచు, నిత్యానందమయుఁడైయుండువాఁడు.

373 అనాత్మవాదము. ఆత్మ యనువస్తు వేదియు లేదనియు, ఈ చరాచరప్రపంచమున కంతటికిని ప్రకృతిలోని మార్పులే కారణభూతము లనియు చెప్పు నాస్తికవాదము.

382 అంతరవలోకనము. బుద్ధి యంతయు బాహ్యప్రపంచమునుండి మరలి, లోనికి చొచ్చి, ఆత్మపరిశీలనమునకు కడఁగుట.



# తొలి పలుకు

(ఆంగ్ల మహాలగ్రంథమునకు)

రామకృష్ణపరమహంస జీవితకథ ఆచరణరూపమౌ ఆస్తిక ధర్మముయొక్క గాథ. ఈ జీవితము మనకు భగవత్సాక్షాత్కార భాగ్యము కలుగుటకు తోడ్పడఁగలదు. ఈ మహనీయుని చరిత్ర చదివిన తరువాత భగవంతుఁడే సత్యము, తక్కినదెల్ల మిథ్య యను జ్ఞానమెల్లరకును కలుగఁగలదనుట నిజము. రామకృష్ణుఁడు దివ్యత్వముయొక్క సజీవాకృతి. ఈయన యుపదేశములు పండిత మాత్రుని వాక్యములు కావు, జీవిత మను గ్రంథములోని పుటలు. స్వానుభవ ప్రకాశకములు. కనుకనే వానిని చదువునప్పుడు పాఠకుల కనివార్యమగు చిత్తసంస్కారము కలుగుచుండును. పారమార్థిక విశ్వాసశూన్యమగు నీయుగమున సజీవమై దేదీప్యమానముగ ప్రకాశించుచు, ఆధ్యాత్మికతేజోలాభము నొందు నవకాశములేని వేనవేల స్త్రీ పురుష జీవితములకు వెలుఁగునిచ్చి, మన శ్శాంతిని చేకూర్పఁగల నిశ్చలభగవద్విశ్వాసమునకు రామకృష్ణుని దివ్యజీవితము అద్భుతదృష్టాంతము. అహింసావిషయమున రామకృష్ణుని జీవితము సకల జనులకును గుణపాఠముగ నుండఁగలదు. ఈ మహాను భావుని ప్రేమప్రవాహము దేశకాలవర్ణాదులచే కట్టువడక యనంతముగ వ్యాపించెను. ఈ సద్గ్రంథమును చదువు పాఠకుల నెల్లప్పుడు నిట్టి దివ్య ప్రేమయే ప్రేరేపించుచుండుఁగాక.

సబర్మతి
మార్గశీర్ష కృష్ణప్రతిపత్తు,
విక్రమ సంవత్సరము 1981. *

మో. క. గాంధి.

---

* విక్రమార్క శకములో 1981 వ సంవత్సరమునకు సరియైన క్రీ॥ శ॥ 12-11-1924.

శ్రీ రామకృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీ రామకృష్ణ లీలామృతము

## వంశచరిత్ర

పదునెనిమిదవ శతాబ్దము మధ్యమున వంగరాష్ట్రమందలి హుగ్లీ జిల్లా దెరేపూరు గ్రామమం దత్యంత పవిత్రజీవనమునకుఁ బేరుగాంచిన పురాతన బ్రాహ్మణ కుటుంబ మొకటి నివసించుచుండెను. ఈ కుటుంబమునకు మాణిక్యరామ్ చట్టోపాధ్యాయుఁడు (చటర్జీ) అనునతఁడు పెద్ద. ప్రస్తావకాలమునాఁటికిఁ గొంచె మెచ్చు తగ్గుగా నేఁబది యెకరముల భూమి కలిగి మాణిక్యరాముఁడు సంపన్నస్థితియందుండెననియే చెప్పనొప్పును. అతనికి క్షుదిరాముఁడు, నిధిరాముఁడు, రామ్‌కనాయి అను కొమాళ్లును, రామశీల యను కొమార్తెయుఁ గలిగిరి. మాణిక్యరాముఁడు మరణించిన తరువాత సంసారభార మంతయు జ్యేష్ఠపుత్రుఁడగుటచే క్షుదిరామునిపైఁ బడెను. ఈతఁడు సదాచార సంపన్నుఁడు, పరులకష్టముల నోర్వని దయార్ద్రహృదయుఁడు, తన కెట్టి కష్టనష్టములు వాటిల్లనుండినను అణుమాత్రము చలింపని నిత్య సత్యవ్రతుఁడు, నిశ్చలదైవభక్తికి పెట్టినపేరు. ప్రథమ భార్య బాల్యమునందే చనిపోవుటచే నీతఁడు చంద్రమణీదేవి యను నామెను వివాహమయ్యెను. నిర్మలమును, నిరా

డంబరమునైన యామె కోమలహృదయ మెప్పుడును దయా రసముతో నుప్పొంగుచుండెడిది.

దెరేపూరు గ్రామ జమీందారుఁడు రామానందరాయి బహునిరంకుశుఁడు, దుశ్చరిత్రుఁడు. అతఁ డొకనిపైఁ దెచ్చిన యసత్యపు వ్యాజ్యెములోఁ దనపక్షమున బూటకపు సాక్ష్య మిచ్చుటకు క్షుదిరాముఁ డంగీకరింపమిచే నత్యంతకుపితుఁడై, అతనిపై నసత్యపు వ్యాజ్యెము నొకదాని దెచ్చి, యాతని పిత్రార్జితమైన భూస్థితినేకాక, వంశపారంపర్యముగా వారికి నిలువ నీడ నిచ్చుచుండిన కుటీరములనుగూడ నపహరించెను. కాని యెఱిఁగి యెఱిఁగి, సత్యనిష్ఠకై సర్వమును గోల్పోయిన ఆ మహానుభావుఁ డందుచే నధైర్యమునకు లోనగునా? ఆ కష్టమంతయుఁ దనమేలున కుద్దేశింపఁబడిన గాఢపరీక్షయే కాని వేఱొండుకాదని తలంచి, ఆతఁడు సర్వేశ్వరునే నమ్మి నిశ్చలుఁడై యుండెను. సోదరు లిరువురును దమ యత్త వారిండ్ల నాశ్రయింపఁగా, క్షుదిరాముఁడు మాత్రము సుఖ లాల్ గోస్వామి యను స్నేహితుని యాహ్వానము నంగీకరించి, కామార్పుకుర్ (కామారపుష్కరిణి) గ్రామములోఁ గాఁపుర మేర్పఱచుకొనెను.

కామార్పుకుర్ గ్రామము హుగ్లీ జిల్లా పశ్చిమోత్తరపు సరిహద్దు మిట్టయొద్ద నున్నది. ఆ ప్రాంతపుటూళ్లు అప్పటికి మన్నెపుజ్వరముల బాడి నెఱుఁగవు. అందుచే మన కామార్పుకుర్ అప్పుడు ఆరోగ్యవంతమై, పాడిపంటలతోడను, సంగీతప్రదర్శనములతోడను, ఇతర వినోదములతోడను అలరారుచు, ప్రాయికముగాఁ బ్రతిదినము నేదో యొక భగవత్సంబంధమయిన ఉత్సవముతో శోభిల్లుచుండెను. గ్రామ

ములో మూఁడు నాలుగు పెద్ద మంచినీటి చెఱువులు గలవు. వానిలో హాల్దార్ పుకుర్ ముఖ్యమైనది.

క్షుదిరాముఁడు తన యాహ్వానముపై కామార్పుకుర్ వచ్చుటతో డనే సుఖలాలు వారి నివాసార్థమై తన స్వగృహమునకుఁ జేరిన కొన్ని గుడిసెలను, పోషణార్థమై ఫలవంతమైన 'లక్ష్మీజాల' యను పేరిటి అరయెకరము భూమిని అతనికి ఉచితముగా నిచ్చెను.

భార్యతోడను, పదేండ్ల కుమారునితోడను, నాలుగేండ్ల కొమార్తతోడను తనముప్పదితొమ్మిదవ సంవత్సరమున క్షుదిరాముఁ డీనూతన గృహప్రవేశ మొనర్చెను. భగవంతుని విచిత్రలీలచేఁ గలిగిన యీ మార్పు క్షుదిరాముని దృక్పథమును బూర్తిగా మార్చివై చెను. నిరాశాంధకారఘోరకాలమునఁ దలవని తలంపుగా లభించిన సాహాయ్యమును జూచి యాతఁ డీశ్వరేచ్ఛయందు శరణాగతుఁడయ్యెను. ఇంతటి నుండి యాతనియందు సకల బాహ్యవిషయములయెడల పూర్ణమయిన యశ్రద్ధయును, లౌకికవ్యాపారములయెడల కేవలవైరాగ్యభావమును, జనించి కులదైవమగు శ్రీరామచంద్రుని ధ్యానప్రార్థనార్చనాదులయం దాతఁడు విశేషకాలము గడుపఁ జొచ్చెను. సారవంతమైన 'లక్ష్మీజాల' భూమివలన అతివృష్టి అనావృష్టి కాలములలోఁగూడ వారికి సంవత్సర మంతకును సరిపోవు గ్రాసము లభించుటయేకాక, యాచకులకును, పరదేసులకును అన్నదానము చేయుటకుఁ జాలిన ధాన్యముగూడ మిగులుచుండెను.

క్షుదిరాముఁ డొకనాఁడు కార్యవశమున నొక సమీపగ్రామమునకుఁ బోయి యింటికి మరలివచ్చుచు నలసటఁజెంది

యొక చెట్టుక్రింద విశ్రమించి అట్లే నిద్రించెను. నిద్రలో నతఁ డొక చిత్రమైన కలఁ గనెను. దర్భ లేఁజివురు నీలి ఛాయతోఁ దన యిష్టదైవమగు శ్రీరామచంద్రమూర్తి బాల రూపమున కనఁబడి 'చాలకాలముగా నిచ్చట తావు తిండి తాలు లేకుండ నిరాహారుఁడనై పడియున్నాను, నీ సేవల నందు కొనుటకుఁ జాలఁ గుతూహలముగానున్నది. మీయింటికిఁ దీసికొనిపొమ్ము' అని చెప్పెను. అతఁ డానందపరవశుఁడై 'స్వామీ, నేను భక్తిశూన్యుఁడను, నిఱుపేదను, మీకుఁ దగిన సత్కారములు చేయుటకుఁ దప్పినయెడల దురంత నరకవేదన ననుభవింపవలసినవాఁడ నగుదును.' అని విన్నవించుకొనెను. కాని శ్రీరామచంద్రుఁ డాతని కభయమిచ్చి 'నీ సపర్యలతో నే నెల్లప్పుడును తృప్తిపడియుందును, లోపములు పాటింపను' అని చెప్పెను. ఈ యవ్యాజ కరుణాకటాక్షమునకు హర్షాశ్రుపూరితనేత్రుఁడై అతఁడు మేల్కాంచి నలుదిక్కులు కలయఁజూచి, స్వప్నమందు గోచరించిన స్థలమునకు దడదడలాడెడు హృదయముతోఁ బోయి చూడఁగా, నొక త్రాఁచుపాము పడగనీడ నొక సాల గ్రామ మతనికిఁ గనుపట్టెను. ఆశ్చర్యానందములు ముప్పిరి గొన దానిని దీసికొనుట కతఁడు చేయి చాఁచినంతనే యా పా మంతర్ధానమయ్యెను. రఘువీరనామమును స్మరించుచు నతఁడు శుభలక్షణలక్షితమగు నా సాలగ్రామము నింటికిఁ దీసికొనిపోయి, యిష్టదైవముగాఁ బూజింప నారంభించెను.

క్షుదిరాముఁడు త్వరలోనే తన యప్రమత్త దైవభక్తి చేతను, పరిశుద్ధాంతఃకరణముచేతను, నిష్కలంక నిర్మల

జీవనముచేతను, కామార్పుకుర్‌లో నపారగౌరవ ప్రపత్తుల నార్జించెను. కొలఁదికాలముననే యతఁడు చాల నాధ్యాత్మికాభివృద్ధినిగూడఁ గాంచెను. పూజార్థమై పూలు గోయు సమయమున శీతలాదేవి తనయెదుట నెనిమిదేండ్ల బాలికవలె మందస్మితవదనారవిందముతో, నానావిధామూల్యాభరణములతో, నడయాడుచు, చెట్లకొమ్మలను వంచి, పూలు గోయుటలోఁ దనకు సాయపడుచుండిన ట్లతనికిఁ గనఁబడు చుండును. ధ్యానవేళలయం దతని చెక్కిళ్లపై ఆనందాశ్రువులు రాలుచుండును. మనస్సు స్థూలప్రపంచమునుండి మహోన్నత దివ్యలోకముల కెగసి, యిష్టదేవతానుసంధాన పరమానందమున నోలలాడుచుండును.

గ్రామ జనులకు క్షుదిరామునం దెంత భక్తి కలదో, ప్రేమామృతవాహినియు, త్యాగమూర్తియు, వినిర్మలహృదయయు, నగుచంద్రాదేవియందును నంతటిప్రేమ గౌరవములు కలవు. కాలాంతరమున శ్రీరామకృష్ణుఁడు తన తలిదండ్రులనుగుఱించి శిష్యులతోడను, భక్తులతోడను, ఇట్లు చెప్పువాఁడు : ''సౌశీల్యమునకును, సత్యప్రియత్వమునకును మూర్తీభావమే మాతల్లి. నిజమును ఆమె దాఁపఁజాలదు. లౌకిక వ్యాపారజ్ఞాన మామెకు లేదు. ఆ సాధ్వి యేవిషయమునైనను నెవరితోనైనను వెంటనే చెప్పివైచును. ఆమె నిష్కపటహృదయమునకు జను లెంతయు నామెను మెచ్చుకొని ప్రేమించుచుండెడివారు. మాతండ్రి శూద్రులకడనుండి దానముల నెన్నఁడును పరిగ్రహింపలేదు. పూజాజపాదుల యందు విశేషకాలము గడపెడివాఁడు. ప్రార్థనాయత్తచిత్తుఁడై ప్రతిదినము గాయత్రీదేవి నావాహనచేయునపుడు

వక్షఃస్థల ముబ్బి దివ్యతేజస్సుతోఁ బ్రకాశించుచుండును; ఆనందబాష్పములు చెక్కిళ్లపై జాఱుచుండును. పూజాది కములందు నిమగ్నుఁడుకాని తీఱికసమయములందుఁగూడ నతఁడు రఘువీరునకుఁ బూమాలలను గట్టుచుండును. అసత్య సాక్ష్యమును జెప్పనోడి తన పితృపితామహులు నివసించు చుండిన పవిత్రగృహమును విడనాడెను. గ్రామస్థులందఱు నతని నొక ఋషీశ్వరునిగా గౌరవించెడువారు.''

క్షుదిరాముఁడు కామార్పుకుర్ వచ్చి యాఱేండ్లయినది. ఇప్పు డతని ప్రథమకుమారునకు పదునాఱేండ్లు, కొమార్తకు పదునొకండేండ్లు. కొలఁదికాలముననే వీరిరువుర కును వివాహములు చేసెను. రామకుమారుఁడు మూఁడు నాలుగేండ్లలో ధర్మశాస్త్రపఠనమును బూర్తిచేసికొని యుక్తవయస్కుఁడై వృద్ధాప్యమందున్న తండ్రికిఁ గొంత వఱకు కుటుంబనిర్వాహణభారమును దగ్గింపఁజొచ్చెను. మంత్రోపదేశమునొంది యతఁడు శక్తిపూజ చేసెడివాఁడు. ఒకనాఁడు దేవి జ్యోతిషమునఁ దన కద్భుతశక్తుల నను గ్రహించిన ట్లతనికిఁ గనుపట్టెను. అప్పటినుండియు నతఁడు మనుష్యుని జూచినంతమాత్రముననే వాఁడు జీవించునో, జీవింపఁడో చెప్పఁగలుగుచుండెను. అతని జోస్య మమోఘ మని జనులు నమ్మువారు.

రామకుమారుఁడు సంసారకార్యముల నెల్ల నిర్వ హించుచుండినందున క్షుదిరామున కెక్కువ తీఱిక కలుగుటచేఁ బ్రాయికముగా నతఁడు పూజాజపధ్యానాదులందును, ఆధ్యా త్మిక ప్రసంగములందును దినమంతయు గడపుచుండెను. బహుతాపపూరితమైన యీ ప్రపంచమున నిరంతర భగవ

ద్భక్తియే శరణ్యమని యతఁడు గ్రహించెను. భక్తులచేఁ దఱచు సందర్శింపఁబడుచు అనాదిగా సాధు, ఋషివర్యుల యునికిచేఁ బునీతములయిన పుణ్యక్షేత్రములయందు భగవంతుఁ డెక్కువగాఁ బ్రత్యక్షమయి యుండునని హిందూ శాస్త్రములు బోధించుచుండుటచే, క్షుదిరాముని కీసమయమున తీర్థయాత్రలుసలుప నభిలాషపొడమెను.

1824–వ సంవత్సరమున గాఁబోలు నతఁడు రామేశ్వరయాత్రకు జయలుదేతెను. ఇదయే అతని మొదటి యాత్ర. సుమారు పదునైదువందల మైళ్లు దూరముగల యీయాత్ర నతఁడు కాలినడకనే సాగించెను. దారిలో నున్న వివిధ పుణ్యక్షేత్రములను దర్శించుచుఁ దుదకచ్చటఁజేరి, శ్రీరామలింగేశ్వరుని సేవించి, రమారమి యొకసంవత్సర మయినతరువాతఁ గాలినడకను దిరిగి యింటికి వచ్చెను. పిదప నొక సంవత్సరమునకు (1826) అతని రెండవ కుమారుఁడు పుట్టెను. ఈ నూతనశిశువునకు రామేశ్వరుఁడని యాక్షేత్రనాథుని పేరుపెట్టిరి. శివుని శిలా చిహ్నమగు బాణలింగమును క్షుదిరాముఁడు రామేశ్వరము నుండి తీసికొనివచ్చి దానిని రఘువీరునితోపాటును శీతలా దేవితోపాటును బూజించుచుండెను.

సుమారు పదునొకండేండ్ల పిమ్మట మఱియొక తీర్థయాత్ర చేయవలయునని కోరికకలుగఁగా 1835–వ సంవత్సర ప్రారంభమునఁ బ్రయాణమై క్షుదిరాముఁడు ఆ మార్చి నెలలో గయాక్షేత్రము చేరెను.



# జననము

క్షుదిరాముఁడు గయలో సుమా రొకనెలనాళ్లుండి శాస్త్రానుగుణముగా వివిధములైన కర్మలను జరిపెను. స్థానికముగా గదాధరుఁడని పిలువఁబడు శ్రీ మహావిష్ణువు దేవాలయమునకు వెళ్లి యతఁడు పరలోకగతులైన తన పితృదేవతలకు పిండప్రదానము జేసెను. పితరుల ఋణము దీర్చుటకై పుత్త్రుఁడు చేయవలసిన ముఖ్య కర్మములలో నొక దాని నిట్లు నిర్వహించిననాఁ డతఁడు పొందినయానందము వర్ణనాతీతము. గదాధరుని పాదములకడఁ దాను సమర్పించిన పిండములను, ఉదకమును దన పితృదేవతలు స్వీకరించి తన్ను హృదయపూర్వకముగా దీవించుచుండిన ట్లతనికిఁ దోఁచెను. అతఁడు దేవాలయమునుండి తిరిగి బసకు వచ్చి, ఆ రాత్రి యొక చిత్రమైన కలఁగనెను. గదాధరాలయమునకుఁ దాను తిరిగి వెళ్లినట్లును, ఆపవిత్రావరణలో సంతుష్టాంతరంగులై తన పితృదేవతలు పిండములను భుజించుచున్నట్లును, ఆకస్మికముగా ఆగర్భాలయమంతయు దివ్యతేజస్సుతో నిండినట్లును, సింహాసనారూఢుఁడై దేదీప్యమానముగఁ బ్రకాశించుచున్న యొకపురుషునకు పరలోకగతులైన జీవులు భక్తిపూర్వకముగా సాష్టాంగ ప్రణామములు చేయుచుండినట్లును, అతనికిఁ గనఁబడెను. ఆదివ్యపురుషుఁడు తనను సింహాసనముకడకు రమ్మని సంజ్ఞ చేసెను. క్షుదిరాముఁడు ముందునకువచ్చి సాష్టాంగముగ నమస్కరించి భక్తితో నాతని స్తుతించెను.

ఆదివ్యపురుషుఁడును మృదుమధురస్వరమున క్షుదిరాము నితో నిట్లు పలికెను : 'నిర్మలమైన నీ భక్తికిఁ జాల సంతసించితిని. దుష్టులను శిక్షించుటకును, శిష్టులను రక్షించుటకును, నేను భూమిపై నప్పుడప్పు డవతరించుచుందును. ఈసారి నీకుటీరములోఁ బుట్టి నిన్ను నాతండ్రిగాఁ బరిగ్రహింతును.' క్షుదిరాముఁ డానందపరవశత్వమున నిశ్చేష్టుఁ డయ్యెను. ఒక నిమేషమువఱకు నోట మాటయే రాలేదు. కొంతసేపటి కతఁడు తన యెప్పటిస్థితికిఁ దిరిగివచ్చి యిట్లనెను: 'స్వామీ, వలదు. ఇట్టిదయకు నే ననర్హుఁడను. నాయోగ్యతకు మించిన దయను మీ రిదివఱకే చూపియున్నారు. మీకు సరిగా సేవచేయఁజాలని నిఱుపేదను నేను.' భగవంతుఁ డతని లోపములకుఁ దా నెన్నఁడు నాగ్రహింపనని యభయ మిచ్చి యూఱడించెను. అంత కలయు సంతమై క్షుదిరాము నకు మెలఁకువ వచ్చినది. ఆతని హృదయ మానందముతో నుప్పొంగుచుండెను. ఏప్రిలునెల చివర కతఁడు తిరిగి స్వగృహముఁ జేరెను.

క్షుదిరాముఁడు గయలో నుండఁగా చంద్రాదేవి కూడ నద్భుత స్వప్నములను గాంచుచుండెను. ఒక రాత్రి కేవలము తన భర్తనుబోలు తేజస్వియగు నొక పురుషుఁడు తన ప్రక్కను బరుండియున్నట్లామె కలఁగనెను. ఆపురుషుఁడు తన భర్తయే యయియుండవచ్చునని యామె మొదటఁ దలంచెను. కాని యట్టి దివ్యసౌందర్యము మానవమాత్రున కసాధ్యమని గ్రహించి యామె నిద్రనుండి మేల్కాంచెను. అప్పటికిని స్వప్నము నిలిచిపోక యింకను జరుగుచున్నట్లే కనఁబడెను. దీనినిబట్టి యెవ్వఁడో దుష్టుఁడు తన గదిలోనికిఁ

ప్రవేశించి యుండవచ్చుననియు, వానియడుగుల చప్పుడువలన స్వప్నము గలిగియుండవచ్చుననియు నూహించి, యామె తనశయ్యను విడిచివచ్చి దీపము వెలిఁగించెను. కాని యెప్పటివలెఁ దలుపునకు లోపలినుండియే గడియ వేయఁబడి యుండెను. అయినను నామెకు భయముమాత్రము పోలేదు. ఆరాత్రియంతయు నిద్రపట్టలేదు. ఉదయానంతరముధర్మదాస్ లాహా యనునాతని కొమార్తయగు ప్రసన్నకును, పొరుగున నివసించు కమ్మర స్త్రీ యగు ధనికిని ఈ సంఘటనమును దెలిపెను. వారలామె యమాయికత్వమునకు నవ్వి యూ సిచ్చి వర్తమానము నిఁక నెవ్వరికిని జెప్పవలదని హితబోధ లొనర్చిరి.

మఱియొకనాఁడు తన యింటిప్రక్కనున్న శివాలయ మున కెదురుగా ధనితోఁగూడ నామె నిలువఁబడియుండఁగా, శివవిగ్రహమునుండి యొక దివ్యతేజస్సు బయలుదేఱి తన వైపునకు వచ్చుచున్నట్లామెకుఁ గనఁబడెను. ఆమె యీ యద్భుతానుభవమును దన స్నేహితురాలికిఁ జెప్పఁబోవు చుండఁగా ఆ తేజస్సు పూర్తిగా నామె నావరించి దేహ ములోఁ బ్రవేశించెను. ఆమె స్మృతితప్పి క్రిందఁబడిపోయెను. ప్రక్కనున్న ధని యామెను సేదదేర్చి కథనంతయు విని మొట్టమొదట వచ్చెరువొంది, పిదప నది నరముల దౌర్బ ల్యముచేఁ గలిగియుండునని తలంచెను. కాని చంద్రా దేవికిమాత్ర మప్పటినుండియు గర్భచిహ్నములు తోఁప సాఁగెను.

తీర్థయాత్రనుండి తిరిగివచ్చిననాఁటినుండియు క్షుది రామునకుఁ దన భార్య ప్రవర్తనలోఁ గలిగిన గొప్ప మార్పు

స్పష్టమయ్యెను. ఆమె విశ్వమానవప్రేమ యిప్పుడు శత
గుణాధికమయ్యెను. ఇరుగుపొరుగువారలకు సర్వవిధములఁ
దోడ్పడు టామె కిప్పుడు నిత్యధర్మమయ్యెను. తన యింటి
సామగ్రి నిచ్చి వారి లోటులను దీర్చును. తాను పస్తుండి
యైనను వారి యాఁకలి దీర్చును. ఆమె యద్భుతానుభవ
ములను, గర్భధారణ ప్రకారమును విని క్షుదిరాముఁడు
గయలోఁ దనకుఁ గలిగిన స్వప్నమును దాని కనుసంధించి,
యీసంఘటనలన్నియు భగవంతుని దయావిశేషమువలన
జరిగినవనియుఁ దమ గృహము శీఘ్రకాలమున నొక దివ్య
శిశు జననముచేఁ బావనము కానున్నదనియు నామెకు నమ్మ
కము కలుగఁ జెప్పెను.

చంద్రాదేవి యీ కాలమునఁ బ్రతిదినమునను అద్భుత
దృశ్యములు గాంచెడిదఁట. ఒకప్పుడు తన శయ్యాగృహ
ములో దేవత లుండిన ట్లామెకుఁ గనిపించును. మఱొక
ప్పుడు దివ్యవాక్కులు వినవచ్చును. మేల్కొనియుండఁగనే
ఒకనాఁ డొకబిడ్డ కాలిగజ్జెలచప్పుడు వినెను. మొట్టమొదట
గదిలోని కెవరో బిడ్డవచ్చెనని యనుకొనెను, కాని ఎవరును
గన్పడలేదు. తలుపునకు లోపల నెప్పటి యట్లు గడియకూడ
వేయఁబడియే యుండెను. కొన్నివేళలం దామె దివ్యపురు
షులతోను, దేవతాస్త్రీలతోను మంతనములాడుచుండును.
ఆమె తన చిత్రానుభవములనెల్లఁ దన భర్తకుఁ దఱచుగా
వినిపించుచుండెను. ఏ ప్రార్థనసమయమందో, ఏ ధ్యాన
సమయమందో కాక జాగ్రదవస్థయందే ఇట్లు జరుగుచుండు
టచే నరముల దౌర్బల్యమువలని వ్యాధియో పిశాచముల
దుండగమో యని యామె యాందోళన పడుచుండెడిది. కాని

ఇవన్నియు దివ్యశిశు జనన సూచకమాత్రములని చెప్పి క్షుదిరాముఁడు ఆమె నూఱటపుచ్చును. మతప్రవర్తకులును, దివ్యపురుషులును, నవతరించునప్పు డిట్టి యద్భుతసంఘటనలు జరుగుట ప్రసిద్ధమే కదా !

1836–వ సంవత్సరము ఫెబ్రువరి 17–వ తేది యుదయమున చంద్రాదేవి తన ప్రసవకాలము సమీపించుచున్నదని భర్తతోఁ జెప్పెను. కాని ఆ పగలంతయు, రాత్రి చాలవఱకుఁ గూడఁ గడచిపోయినది. మఱునాఁటి ప్రభాతసమయమున నామెకు పుత్త్రోదయమయ్యెను. అది వసంతర్తువు. దీర్ఘ శీతకాలానంతరము ప్రకృతియంతయు నూతన జీవకళతో నలరారుచుండెను. ప్రబలవిషయభోగభారముచేఁ గ్రుంగి కుందుచున్న మానవకోటి కాశాసందేశము నొసఁగుటకు ఒకచేత ననంత ప్రేమామృతమును, మఱియొకచేత ననంతజ్ఞాన తేజమును ధరించి ప్రపంచములోనికి వచ్చిన నూతనప్రవర్తకు, మధుర గీతములను బాడెడు శకుంతములును, దివ్యపరిమళవిరాజితములయిన వికసితపుష్పచయములును, సుస్వాగత మర్పించినవి. క్షుదిరాముని కుటీరమేకాక ఈనవయుగ మహాపురుషుని జననముచే లోకమంతయు ధన్యమైనది.

ప్రసవకాలమునఁ దోడై యుండిన ధని తల్లికిఁ గావలసిన సాయముజేసి, శిశువుకై చూడఁ దొలుతఁ దానుంచినచోట లేఁడు ! ప్రక్కనున్న పొయ్యిలోనికిఁ బొరలి, బూడిదచే సగము కప్పఁబడి, యేడుపుగూడ లేకుండ, పరుండియుండెను! చేతులలోనిడుకొనిచూడ, నాఱుమాసముల ప్రాయపు పరిమాణముఁ గలిగి, యామె కాశ్చర్యము గొలిపెను. ఇదివఱకే యాకుటీరమునకు వచ్చియున్న కొంతమంది

స్నేహితులకు ధని యీశుభవర్తమానమును దెలిపెను. ఎల్లరును చాల సంతసించిరి. బాహ్యప్రపంచమునకే పుణ్యవార్తను శంఖారావములు ప్రకటించెను. మహోన్నతభావి దశను సూచించు శుభముహూర్తమున శిశువు జన్మించెనని జ్యోతిషశాస్త్రజ్ఞుఁడగు క్షుదిరాముఁడు గ్రహించెను. కొంత కాలమైన తరువాత ఇతర సుప్రసిద్ధజ్యోతిషికులుగూడ ఈ సంగతిని ధ్రువపఱచిరి.

కుమారుని భావిమహాదశకు క్షుదిరాముఁ డానంద భరితుఁడై తనకు గయలోఁ గలిగిన స్వప్నమును, చంద్రాదేవికిఁగలిగిన దివ్యానుభవములను బహుకృతజ్ఞతతో జ్ఞప్తికిఁ దెచ్చుకొనెను. గయలోఁ దనకుఁ గలిగిన యద్భుతానుభవమునుబట్టి బాలునకు గదాధరుఁడను పేరుపెట్టెను.



## శైశవము

జగన్మోహన సౌందర్యరాశియగు నా ముద్దుల బిడ్డఁ డుదయించినప్పటినుండియు, కుటుంబభాగ్యస్థితిగూడఁ జాల వృద్ధినొందెను. రామకుమారుఁడు వివిధ కర్మలను, వ్రతములను విధ్యుక్తముగాఁ జేయించుటయం దతినిపుణుఁడను ఖ్యాతి విస్తారముగా వ్యాపించెను. దీనివలన పేదఱికముతో మిక్కిలి కష్టపడుచున్న యా కుటుంబమునకు మంచి రాఁబడి లభింపఁజొచ్చెను. ఇంతేకాక గదాధరుఁడు జన్మించెనను సంతోషవార్త క్షుదిరాముని మేనల్లుఁడగు రామచంద్రునకుఁ దెలిసినతోడనే యతఁడు కుటుంబావసరముల నాలోచించి యొక గోవును క్షుదిరామున కంపెను. ఇంతవఱకును దాను పంపుచుండిన పదునైదురూపాయల నిప్పుడుగూడఁ బ్రతి మాసమునను దప్పక పంపుచుండెను. తలవని చోట్ల నుండికూడ సాహాయ్యము చేకూరెను. కుటుంబమునకుఁ గల లోటులు కొంతవఱకుఁ దీఱెను.

గదాధరున కాఱవమాసమున నన్నప్రాశన తలపెట్టిరి. కొందఱను మాత్రమే పిలిచి యీ కార్యమును దన స్థితికిఁ దగినట్లు జరపుట యుక్తముగ నుండునని క్షుదిరాముఁడు మొట్టమొదటఁ దలంచెను. కాని యతని జమీందారు స్నేహితుఁడగు ధర్మదాసులాహా అందుల కామోదింపక ఖర్చులోఁ జాలభాగమును దాను సంతోషపూర్వకముగా భరించుటచే వేడుక లతివైభవముగా జరిగెను. బహు భిక్షుకుల కన్నప్రదానము చేయఁబడెను.

గదాధరుఁడు జన్మించినప్పటినుండియు వివిధములైన యసాధారణసంఘటనలు జరుగనారంభించెను. వీనివలన మాతృప్రేమపూరితమైన చంద్రాదేవిహృదయము భయాక్రాంత మయ్యెను. ఒక మహానుభావుఁడు తనకుమారుఁడుగా జన్మించెనను తలంపు మానసికప్రపంచమున నొక్కొకప్పుడు మెఱుపువలె మెఱసినను గదాధరున కేదో దుష్టగ్రహములచే నాపద రానున్నదని ఆ కోమలమాతృ హృదయము తల్లడిల్లుచుండెను. శిశువు కొన్ని వేళలందుఁ దానెత్తుకొనఁజాలనంత బరువుగ నుండును. మఱుక్షణమునఁ బూర్వమట్లే తేలికగానుండును! గదాధరుఁ డెనిమిది నెలలబాలుఁడుగ నుండ నొకనాఁడు పాలిచ్చి, శిశువు నిద్రించుచుండఁగాఁ బఱుపుపైఁ బరుండఁబెట్టి చంద్రాదేవి మఱియొక పనిని చూచుకొనుటకు వెళ్లెను. కొన్ని నిముసములయిన తరువాత తిరిగివచ్చి చూచునప్పటికిఁ బఱుపుపైఁ దనబిడ్డకు బదులుగా ఆజానుబాహుఁడగు నొక పెద్ద మనుష్యుఁడు కనఁబడెను. చంద్రాదేవి యులికిపడి కేక వేసెను. క్షుదిరాముఁడు వెంటనే వచ్చిచూడఁగా బాలుఁడు యథాప్రకారము నిద్రపోవుచుండెను! దివ్యశిశువుల విషయములో నిట్టి యలౌకసామాన్య సంఘటనలు క్రొత్తలుకావనియును, తమ కులదైవమగు రఘువీరుఁడు బాలుని నెల్లపుడును రక్షించుచుండునని యును క్షుదిరాముఁ డెంతచెప్పినను ఆమె మనసు కుదుటబడదు. బిడ్డని క్షేమముకై దేవతలనెల్లఁ బ్రార్థించుచుండును.

గదాధరుఁ డైదేండ్లవాఁడగునప్పటి కాతఁడు గ్రామమువారి కందఱకును గారాబుబిడ్డఁడయ్యెను. ఆరోగ్యవంతుఁ


వంశవృక్షము
మాణిక్యరామ్ చటర్జీ
ఖుదిరామ్
రామశీల=భగవత్ బనర్జీ
నిధిరామ్
రామ్‌శనాయి
రామచంద్రుఁడు
హేమాంగిని=
కృష్ణచంద్రముఖర్జీ
రామతారక్
(హలధారి)
కాళిదాసు
రాఘవుఁడు
రామరత్నము
హృదయరాముఁడు
రాజారాముఁడు
రామకుమారుఁడు
రామేశ్వరుఁడు
కాత్యాయని=
కేనారామ్ బనర్జీ
గదాధరుఁడు
(శ్రీరామకృష్ణుఁడు)
సర్వమంగళ
అక్షయుఁడు
రామలాల్
లక్ష్మి
శివరాముఁడు

డైన యీ బాలుని సుందరముఖవిలాస మెల్లర నానందపర వశులఁ జేయుచుండెను.

అంత చిన్నతనములోఁగూడ గదాధరుఁడు కనుపఱచిన యద్భుతబుద్ధివిశేషమునకును, ధారణాశక్తికిని ఖుదిరాముఁడు చాల నాశ్చర్యమొందెను. తన పూర్వుల పేళ్లను, వివిధ దేవతా స్తోత్రములను, రామాయణాది పురాణములలోని కథలను, ఒక్కసారియే విన్నను, ఎన్నాళ్లకైన మరల నిర్దుష్టముగాఁ జెప్పఁ గల్గును. పాఠశాలలోఁకూడఁ విద్యార్థులకును, ఉపాధ్యాయునకును, ప్రియతముఁడయ్యెను.

గదాధరుఁ డసాధారణుఁడని ప్రప్రథమమునుండియు నెఱిఁగిన ఖుదిరాముఁ డాతనియెడ మిక్కిలి యభిమానమును చూపుచు, నతని స్వేచ్ఛాప్రవర్తనమును నిరోధింపక, బాల్య చేష్ట లొకింత హద్దుమీఱినప్పుడుకూడ నుపేక్షించి యూరకుండును. మఱియు గదాధరుని చేష్టలకును నితర బాలుర చేష్టలకును జాలభేదము కలదు. తాను చేయు పనులన్నియు నతఁడు బాహాటముగాఁ జేయును. ఎవరైనను తప్పుపట్టి యడిగినచో, మఱుఁగుపఱుప యత్నింపఁడు. అతని యల్లరిపనులను భయపఱచి మాన్పుట సాధ్యముకాదు. ప్రేమమార్గమున, శాంతముగా, నచ్చఁజెప్పినమాత్ర మణఁకువచూపును. ఎంత యల్లరి చేసినను ఆ మృదులహృదయుఁ డెవరికి నెట్టిహాని నెన్నఁడును జేయలేదు.

గదాధరునకు వ్రాయుటందును, జదువుటందును నేర్పు గలిగినది గాని, గణితశాస్త్రము నెడ మాత్రము కేవలవైముఖ్యము. గ్రామస్థులు ప్రదర్శించు పుణ్యకథానాటకములందును, యక్షగానములందును అతని కపారప్రీతి. వానినిబహుశ్రద్ధతోఁ

జూచి, నటుల యభినయములు జాగ్రత్తగా గమనించును. అట్టి నాటకములను తలుచు వేడుకకొఱకు తన స్నేహితుల యెదుట నొకమారైనను పొల్లుపోకుండ తిరిగ ప్రదర్శించును. ఒకసారి వినినతోడనే దేనినైనను కంఠస్థము జేసికొనఁగల యద్భుతశక్తి యతనికుండెడిది. ఒకనాటకకళనేకాదు. కుమ్మరుల కడ దేవతావిగ్రహములు చేయుట నేర్చి చక్కని జీవకళగల బొమ్మలు చేయును. చిత్రకారులకడఁ జిత్తరువు వ్రాయుట కూడ నభ్యసించెను.

జీవనోపాధి కనుకూలించు చదు వితర బాలురవలె నేర్చుకొనక గదాధరుఁ డాధ్యాత్మికమహాపురుషుల జీవిత చరిత్రలు చదువుచు, తత్ఫలముగా తఱచు ప్రపంచమును మఱచి గాఢధ్యాననిమగ్నుఁడగును. కాలాంతరమున నీ యభ్యాసమే యాధ్యాత్మికభావావేశము కలిగినప్పుడు పారవశ్యరూపమున బరిణమించుచుండెను.

అతనికి నైజములయిన కొన్ని యితరగుణములుగూడ కాలక్రమమున ప్రస్ఫుటము కాఁ జొచ్చినవి. అద్భుతధైర్యమిందొకటి. భూతప్రేతపిశాచములు విహరించు చోటులని యితరులు విడనాడు ప్రదేశముల కతఁడు ఆ చిన్నతనములోఁ గూడ నిర్భయముగాఁ బోవును. మఱియొక నైజగుణము జనుల నెల్లర నాకర్షింపఁగలిగిన యద్భుతశక్తి. అతనితో నాడుకొను బాలురు కొలఁదికాలమయిన నాతనిని వదలియుండఁజాలరు. ఒకసారి చూచినవారుకూడ మిఠాయీలు, పండ్లు తీసికొని మరల మరల నతనిఁ జూడ వచ్చుచుందురు. ఈ యసాధారణ జనాకర్షణశక్తి యతనియందు జీవితాంతమువఱకు నమోఘమై యొప్పుచుండెను.

పవిత్రగ్రంథములందు గదాధరున కాసక్తి యధికమగుటచే, వానిని గ్రామస్థులకుఁగూడఁ జదివి వినిపించును. అట్టి తరుణములలో నతఁడు మైమఱచి గ్రంథవిషయముతోఁ బరిపూర్ణైక్యము నొందును. ఆ భావోద్రేకమునకు శ్రోతలెల్లరు మంత్రముగ్ధులవలె పరవశత్వము నొందుదురు. గదాధరుని బంధువు లతని వాస్తవతత్త్వము నెఱుఁగక, చిత్తవైకల్యమని భావించుచుండిరి. పుస్తకములే కాక రమణీయమైన యే ప్రకృతి వైచిత్ర్యమైనను, ఏ యద్భుతసంఘటనమైనను అతని నిట్టి స్థితిలోనికిఁ దేఁజాలునని కొలఁదికాలములోనే విదితమయినది. ఆనందపరవశత్వమునఁ దేల్చునట్టి ప్రకృతి సమ్ముఖమున గదాధరుఁడు కేవలతన్మయుఁడై యొక్కొకప్పుడు దేహస్మృతి గూడఁ గోలుపోవును. ఒకనాఁ డిట్టి సందర్భము జరిగి తలిదండ్రులకును, బంధువులకును జాల భీతిఁ గలిగించెను. ఈ విషయము నాయన కాలాంతరమున భక్తులతో నిట్లు చెప్పువాఁడు.

"ఆ యూరిలో బాలు రాడుకొనఁబోవుచు, మధ్యాహ్న స్వల్పాహారమునకై పేలాలు తెచ్చుకొనువారు. రోడ్లమీఁదను, వరిపొలములలోను ఆడుకొందురు. నేనును అట్లొక వేసవి దినమున—అప్పుడు నా కాఱేండ్లుండును—రెండు పొలముల నడిమిగట్టున ఆకసమువంకఁ జూచుచు పేలాలు తినుచుఁ బోవుచుంటిని. చక్కని చిన్న కాఱుమబ్బొక టగపడెను. త్వరలో నది పెద్దదై ఆకసమునంతను ఆవరించుకొనెను. కొంత సేపటికి దానికడ్డముగా తెల్లని కొంగలబారొకటి యెగిరిపోవుచుండెను. నల్లని మబ్బునకును తెల్లని యా పక్షులకును గల తారతమ్యములోని రామణీయకత నాకద్భుతావహమై, బాహ్యస్మృతి

తప్పి క్రింద పడిపోయితిని. ఒడిలోని పేలాలు నలుదిక్కులఁ బడి పోయినవి. అట్టియవస్థలోఁ గొందఱు చూచి నన్నింటికెత్తు కొనిపోయిరి. ఆనందపరవశత్వమున నేను పూర్తిగా మైమఱ చుట కిదియే మొదటిసారి.''

శరీరస్మృతి వచ్చిన తరువాత నతఁడు పూర్ణారోగ్యమున నున్నట్లే కనఁబడినను తలిదండ్రులు చాలభయపడిరి. మూర్ఛా వ్యాధి యని తలఁచి జాగ్రత్త వహించుట యుక్తమనుకొనిరి. చంద్రాదేవి దీనినంతయు నేదో యొక పిశాచమున కారోపిం చెను. బాలుఁడుమాత్ర మీ యనుభవము తనకేవ్యాధిచేతను కలుగలేదనియు, తన మన సనిర్వచనీయ భావపరవశత్వము నొందుటచే బాహ్యస్మృతి తప్పెననియు, పైకి స్మృతిపోయి నను లోలోన వర్ణనాతీతమగు నానందమనుభవించుచుంటినని యుఁ జెప్పెను. తలిదండ్రులుమాత్ర మతనిని కొలఁదినాళ్లవఱకు బడికి పంపుట మానివేసిరి.



## బాల్యము

గదాధరుని ఏడవయేట క్షుదిరాముఁడు రక్తగ్రహిణిచే మరణించెను. అప్పుడతఁడు మేనల్లుఁడగు రామచంద్రునింట నుండుట తటస్థించెను. భక్తాగ్రేసరుఁడగు నాతఁడు మాట లాడలేనంత నీరసస్థితిలోనుండియు, శ్రీరామచంద్రనామమును వినుటతోడనే, హఠాత్తుగా స్మృతిఁగొని రఘువీరనామము ముమ్మారుచ్చరించి, ప్రాణములు విడిచెను! అది దేవీనవ రాత్రకాలము. ఆ జగజ్జనని కృప యెంత మహితమో కాని, ప్రాణాపాయస్థితియందున్న యా భక్తుని మృతి పూజాకలాప మునకు విఘ్నము కలిగింపక, తత్సమాప్తియైన వెంటనే జరిగినది!

ఈ దుఃఖవార్త కామార్పుకుర్ లోనికి బ్రాఁకుటతోడనే, చటర్జీ కుటుంబము విచారసముద్రమున మునిఁగిపోయెను. ప్రత్యక్షదైవమగు భర్తయొక్క మరణవార్తను విని చంద్రా దేవి యెంతయో దుఃఖించెను. ప్రాయికముగ నామె యిప్పుడు ప్రపంచమునకు మరణించినదయ్యెను. ఇంతవఱ కనుభవించు చున్న కొలదిసౌఖ్యములుగూడ విడనాడి భగవత్ప్రార్థనము నందును, ధ్యానమునందును యావచ్ఛక్తిని వినియోగించుచు, ప్రాణేశ్వరునిఁ జేరు సుదినమునకై యెదురుచూచుచుండెను.

సంసారబాధ్యతయంతయు నిపుడు రామకుమారునిపైఁ బడినది. వితంతువగు తల్లి క్షేమమును గనిపట్టుటయు, గదా ధరునకు చదువు చెప్పించుటయుఁ, గుటుంబ సంప్రదాయమున కనుగుణముగ గృహకృత్యములు నిర్వహించుటయు, నాతనికి

విధాయకధర్మములయ్యెను. తండ్రి మరణము గదాధరునిలోఁ గూడ గొప్పమార్పును గలిగించెను. తండ్రిలేనికొఱంత కతఁడు మిక్కిలి దుఃఖింపఁజొచ్చెను. ఆ మహాత్ముని ప్రవర్తనకును ఇతరుల ప్రవర్తనకును గల ప్రబలతారతమ్య మతని మనస్సునకు స్ఫురింప నారంభించెను. సహజముగనే యంతర్ముఖమగు నతని మనస్సు, పూర్వముకంటె నెక్కువ గంభీరము కాఁదొడఁగెను. పై కుత్సాహవంతుఁడుగనే కన్పించినను, అతఁడు తఱచు తనయింటిసమీపముననున్న మామిడితోఁటలోనికో, శ్మశానభూమికో, యొంటిగాఁ బోయి, గాఢాలోచనాతత్పరుఁడై చాలకాలము గడప మొదలిడెను. ఇంతేకాక పురాణపఠనమందేమి, దేవతావిగ్రహములు చేయుటందేమి, వెనుకటికంటె నిప్పు డెక్కువ ఆసక్తిఁ జూపసాఁగెను.

తల్లియెడలఁగూడ గదాధరుని ప్రవర్తనలో మార్పు గోచరించెను. తానామెతోనున్నయెడల నామెకుఁ జాల మనశ్శాంతి గలుగునని గ్రహించి, యామెకు గృహకృత్యములందేమి, రఘువీరునిపూజయందేమి, ప్రతిదినము సాయముచేయ మొదలిడెను. ఇది తెమ్మని అది తెమ్మని యామెను వెనుకటంత యెక్కువగ వేధించుట మానివైచెను. ఇంతేకాక తల్లియొక్క విచారభారమును తగ్గించి, చేతనైనంతవఱ కామె జీవితశేషమునకు సంతోషమును శాంతిని సమకూర్చుట తన విధాయక ధర్మమనిగూడ గ్రహించెను.

కొలఁదికాలములో మఱియొకవిధమైన కాలక్షేపమందు గదాధరునకు కుతూహలము గుదిరెను. ఆ కాలములో రైలు రోడ్లు లేనందున యాత్రికులకును, దేశాటనముచేయు సాధువులకును, కాలినడకను జగన్నాథముపోవు నితరులకును, నిదియే

మార్గము. అట్టివారి సౌకర్యముకై లాహాకుటుంబమువారు కట్టించిన సత్రమునకు ప్రయాణికులువచ్చి, కొలఁదిదినము లుండువారు. వారి నిరాడంబరజీవనము, శరీరసుఖదుఃఖముల పట్ల వారికిఁగల నిర్లక్ష్యభావము, వారి నిశ్చలభక్తి, కేవల పరమేశ్వరార్పితమైన వారి చిత్తవృత్తి, యాచనవలన లభించు నెట్టియాహారమునైన భుజింపఁజాలువారి సంతృప్తి, ఈ బాలు నత్యంత మాకర్షించెను. ప్రాపంచికసుఖముల యనిత్యస్వభావ మా వివేకశాలి కిదివఱకే గోచరించియుండెను. సాధువుల సహవాస మబ్బినతరువాత నీ భావ మింకను దృఢపడినది. ఈ సాధువులతో నెంతోకాలముగడపుచు వారి యాధ్యాత్మిక ప్రసంగములు వినుచు, వారియొద్ద పాటలు నేర్చుకొనుచు, వారితోఁగలసి ప్రార్థనలును, ఒక్కొకపుడు భోజనముగూడఁ జేయుచు, గదాధరుఁ డానందించువాఁడు. వారికిఁగూడ పవిత్ర శీలుఁడైన యీ నిరాడంబర బాలునియందు ప్రేమ యధిక మయ్యెను. ఇట్లుండ నొకనాఁడు గదాధరుఁడు శరీరమంతటను విభూతిపూసికొని, బట్టను రెండుముక్కలుగఁ జించి, కౌపీన మువలె మొలకుఁ జుట్టుకొనివచ్చి, "అమ్మా! నేనుగూడ నెట్లు సాధువునైతినో చూచితివా!" అని నవ్వుచుఁ బల్కెను. చంద్రాదేవి యీ వైఖరినిజూచి మిగుల భయపడి వారికడ కిఁకఁ బోవలదని చెప్పెను.

దేశసంచారులైన యీ సాధువుల సహవాసముచేతను, పవిత్రగ్రంథములలోని యద్భుతవిషయశ్రవణముచేతను, సహజముగ భావపూరితమైన గదాధరునిమనస్సు నానాఁటికి ధ్యానాధీనము కాఁజొచ్చెను. దక్షిణేశ్వరకాళికాలయమున కఠిన తపోనిష్ఠాగరిష్ఠుఁడు గాకమునుపే, ఈ చిఱుబాల్యమునఁగూడ

నతనియందు లోకాతీత మానసికస్వభావలక్షణములు చూచాయగా ప్రత్యక్షములయ్యెను. దీనినిబట్టి సామాన్యజనులకంటె భిన్నమైన మనోవైఖరితో ఈ మహాపురుషుఁడు జన్మించెననుట స్పష్టము.

ఒకనాఁడు కామార్పుకుర్ స్త్రీలు కొందఱు విశాలాక్షిని గొలుచుటకై, ఆనూరను సమీపగ్రామమునకుఁ బోవుచుండిరి. వారిలో ధర్మదాసులాహా కొమార్తె ప్రసన్నకూడ నుండెను. గదాధరుఁ డామె కత్యంతప్రేమపాత్రుఁడు గాన, వారితోఁగూడ నా బాలుఁడును బయలుదేఱి మార్గమధ్యమందు దేవీకీర్తనలు మనోహరముగాఁ బాడుచుండెను. కొలఁదికాలములో నతనిహృదయము దివ్యభావోద్రేక పరవశము కాఁగా, అకస్మాత్తుగా నొక పాట నట్టనడుమ నిలిచిపోయెను. శరీరము కొయ్యబాఱి నిశ్చేష్టితమయ్యెను. బాహ్యస్మృతియే లేదు. కన్నీళ్లు కాఱుచుండెను. ఎంత బిగ్గరగాఁ బిలిచినను బదులు లేదు. బాలుఁ డెట్టి యుపచారములచేతను సేదఁదేఱమిచే దిక్కుతోఁపక విశాలాక్షీ దేవిని ప్రసన్న ప్రార్థింపఁదొడఁగెను. వెంటనే అతఁడు తేఱుకొన మొదలిడి, కొంచెముసేపటికి పూర్తిగా స్మృతినొందెను. దేహములో నెట్టి దుర్బలతగాని, ఇతర వ్యాధి లక్షణములుగాని కనఁబడలేదు.

గదాధరున కిప్పుడు తొమ్మిదేండ్లు. ఇఁక నుపనయనము జరుగవలసియుండెను. ఆ సుదినమెన్నడువచ్చునా, రఘువీరుని స్వయముగ పూజచేయు మహాభాగ్య మెన్నడు కలుగునా, యని గదాధరుఁ డాత్రముతో నెదురుచూచుచుండెను.

ఉపనయన సందర్భమున నొక చిత్రము జరిగెను. యజ్ఞోపవీత ధారణమైన తరువాత, నూతనవటుఁడు ప్రథమ

భిక్ష బంధువులయొద్దనుండియో, తత్సమానులగు నితరుల యొద్దనుండియో స్వీకరించు టాచారము. ప్రథమభిక్ష పెట్టు నవకాశమును దనకిమ్మని ధని యాతనిని జాలకాలముక్రిందటనే ప్రార్థించియుండెను. చంద్రాదేవికి పురుడుపోసి, శిశుగదాధరుని స్వహస్తములతో లాలింపనోచుకొనిన మహాధన్యజీవియే యీ ధని. హృదయపూర్వకమైన యామె ప్రేమకు మెచ్చి గదాధరుఁ డిందుల కియ్యకొనియుండెను. ధని మిగుల సంతోషించి, యీ మహావకాశమును బేరాసతో నెదురుచూచుచుండెను. మున్ను ధనికి తాను జేసిన వాగ్దానమును గదాధరుఁడు రామకుమారునకుఁ దెలుపఁగా అది కుటుంబాచారమునకు విరుద్ధము గావున నతఁడు కూడదనెను. కాని సత్యస్వరూపుఁడైన యీ బాలుఁడు మాటతప్పునా? ధనియొద్దనుండి తప్ప మఱి యెవరియొద్దనుండియు భిక్ష గైకొననని పట్టుపట్టెను. గత్యంతరములేక వా రంగీకరించిరి. గదాధరునకు ప్రథమభిక్షఁ బెట్టిన ధని యెంత మహాపుణ్యముచేసికొనియుండెనో గదా!

గదాధరుని వ్యక్తిత్వవిశేషములు కొన్ని మన కిందుచే గోచరించును. ఇందు ప్రథమ మతని నిశ్చలసత్యానురక్తి. రెండవ దతని యసాధారణ బుద్ధివైభవము. ధర్మదాసులాహాయింటిలో శ్రాద్ధకర్మ మొకటి జరుగుచుండెను. అచ్చటికివచ్చిన బ్రాహ్మణపండితులొక శాస్త్రవిషయమునుగూర్చి యుద్రేకముతో వాదించుకొనుచుండిరి. గంటలకొలఁది వాదము జరిగినను సమస్యాపరిష్కారసూచన లేమియుఁ గానఁబడవయ్యెను. అచట తోడిబాలురతో నాడుకొనుచుండిన గదాధరుఁ డీ వాదముచే నాకర్షింపఁబడి దానినంతయు శ్రద్ధతో విని కొంత

నేపటికొక బ్రాహ్మణుని చెవిలో నేదో చెప్పి వివాదాంశమునకు సమాధాన మిదికాదా యని యడిగెను. ఆ బ్రాహ్మణుఁడు మిగుల నచ్చెరువంది, బాలకుని సూచనను తక్కినవారికి తెలిపెను. అందఱును తమ క్లిష్టసమస్యకు సత్సమాధాన మదియే యని యొప్పుకొని, పదియేండ్లయినను బూర్తిగా నిండని యా బాలుని యత్యద్భుత బుద్ధిపరిణతి కాశ్చర్యపరవశులైరి.

అవతారమూర్తులగు మహాపురుషుల జీవితములలో నిట్టి విషయములు క్రొత్తలుకావు. శ్రీకృష్ణుఁడు, శంకరుఁడు, చైతన్యుఁడు మున్నగువారుకూడ అతిబాల్యమందే యిట్టి యసాధారణశక్తులను గనుపఱచిరి. ఎనిమిదేండ్లప్రాయమునకు పూర్వమే శంకరుఁడు హిందూశాస్త్రములనెల్ల పరిపూర్ణముగ నవగాహనముచేసికొని పదునాఱవయేఁటనే తన యుద్గ్రంథములను రచించెనుగదా! చైతన్యుఁడుకూడ కేవలము బాల్యమునందే యద్భుత బుద్ధివిశేషమును, ధారణాశక్తిని గనుపఱచియున్నాఁడు. ఏసుక్రీస్తు తన పండ్రెండవయేఁట జెరూసలేములోని 'రబీ' లకు (మతవిద్వాంసులు) తన యసమానప్రతిభను గనుపఱచి వారిని నివ్వెఱఁగందించెను. సాధారణ స్త్రీ పురుషులకు అసాధ్యములయిన రహస్యజ్ఞాననిధులు మహాపురుషుల యధీనమున నుండుననుట సుప్రసిద్ధము.

యజ్ఞోపవీతధారణానంతరము గదాధరుఁడు తమ కులదైవమగు రఘువీరు నర్చించుట కనుమతివడసెను. ఇట్టి యధికార మబ్బినందులకు అతఁ డపరిమితానందమునొందెను. ఆస్వామిని తనతండ్రి యెంతటిభక్తితోఁ గొలిచెడివాఁడో అతఁ డెఱిఁగియుండెను. పూజావేళలందు రఘువీర విగ్రహము నతఁడు శిలామూర్తిగా భావింపక, సృష్టిస్థితిలయ కారకుఁడగు

పరమేశ్వరుని మూర్తీభావముగాఁ దలంచును. ధ్యాన పూజాదికకాలమున నతని మనస్సు బాహ్యవిషయప్రపంచమును వీడి యత్యున్నతస్థితి కెగయుటవలనఁ దఱుచుగా వివిధములయిన దివ్యానుభూతు లతనికిఁ గలుగుచుండెను.

ఒక శివరాత్రినాఁటిరేయి గ్రామములో నొక నాటకమాడుట కేర్పాటు జరిగెను. శివుని దివ్యలీలలలో నొక భాగము ప్రదర్శనవిషయము. ప్రదర్శనశాల కామార్పుకుర్‌లో సీతానాథపాయిన్ అను ధనికుని యిల్లు. ఇట్టి సమయములందు పగలంతయు నుపవసించి, రాత్రి ప్రార్థనలతోడను, పూజలతోడను, కీర్తనములతోడను గడపుట శివభక్తుల యాచారము. రాత్రి నాలుగు జాములందును నాలుగు అర్చనలు జరుగును. ఆనాఁడు బాలగదాధరుఁడు కూడ నుపవసించి, రాత్రియంతయు నీశ్వరార్చనయందు గడప నిశ్చయించికొనెను. మొదటిజామున జరుపవలసిన యర్చనను బూర్తిచేసి, ధ్యానాయత్తచిత్తుఁడై కూర్చుండియుండఁగా నతనిమిత్రులు, గయావిష్ణుఁడు మొదలగువారు వచ్చి, సీతానాథపాయిన్ ఇంటిలో జరుగనున్న నాటకమునందు శివపాత్ర ధరింపవలసియుండిన యతఁడు హఠాత్తుగా జబ్బుపడెననియు, గ్రామములోని ప్రముఖు లీపనికి తన్ను కోరియుండిరనియు, కావున వెంటనే రావలయుననియు కోరిరి. ఆపుణ్యరాత్రమున తన యర్చనను విడువఁజాలనని చెప్పి గదాధరుఁడు వారి యాహ్వానమును మొదట నిరాకరించెను. కాని నాటకములో వేషము దాల్చినప్పుడుగూడ నిరంతరధ్యానము శివునియందే యుండును గాన, నదికూడ అర్చనతో సమానమేయని, నచ్చఁజెప్పి యతనిని సీతానాథు నింటికిఁ దీసికొనిపోయి,

తామే యతనిని శివచిహ్నములతో నలంకరింపనారంభించిరి. వారు భస్మము, జడలు, రుద్రాక్షమాలలు మున్నగువానితోఁ దన్నలంకరించుచుండఁగా, నతనిమనస్సు విషయప్రపంచస్మృతి నతిక్రమించి మహోన్నతపదవి కేగెను. వేషముపూర్తియైనపిదప నతఁడు స్నేహితుల సాయముతో మెల్లగా నడచుచు, గంభీర వదనముతో, పారలౌకికమగు చూపుతో, రంగస్థలమును బ్రవేశించుసరికి చూపఱులకెల్లర కతఁడు సాక్షాదీశ్వరుఁడుగాఁ దోఁచెను. వారియెదుట నతఁడు చేష్టలు దక్కి, శిలావిగ్రహమువలె నిలిచియుండెను. అదంతయు నభినయవిశేషమని తలంచి ప్రేక్షకులు మొట్టమొదట నత్యంత స్వాభావసిద్ధముగా నున్న యీ వేషమునకును, ఆ అభినయమునకును నతనిని మెచ్చుకొనిరి. అంతకంతకు వారి యుత్సాహమతిశయించెను. గదాధరుఁ డప్పటికి దివ్యశివస్వరూపధ్యానమునందు పూర్తిగా మైమఱచెను. భౌతికలోకాతీతమై, యాతనిమనస్సు పరమ శివునియందు లీనమై, అచంచలశాంతానందమయమగు ప్రపంచమున మెలఁగుచుండెను. దేవదేవుఁడగు మహాదేవుని నిరుపమాన ప్రభావ విశేషములెల్ల నాతని మనోనేత్రమునకుఁ బ్రత్యక్షములయ్యెను. శాంతమును, సౌందర్యమును, నిస్పృహతయు, ప్రాపంచికసుఖదుఃఖాతీతమగు నుదాసీనభావమును, మూర్తీభవించి, సమాధినిమగ్నత నొందిన ట్లాయనకుఁ దోఁచెను. అందుచే నతఁడు తన్నావరించియుండిన ప్రపంచమును పూర్తిగామఱచి, శివప్రభావాతిశయములో మునిఁగియుండెను. ఎంతసేపటి కక్లేనిలిచియుండుటచే, నాటకనిర్వాహకుఁడును, ఇతరు లిరువురును సమీపించిచూడ, నతనికి బాహ్యస్మృతియే లేదు. కన్నుల నానందబాష్పప్రవాహమును, ముఖ

మున దివ్యవర్చస్సును శోభిల్లకపోయియుండినయెడల, నతఁడు మరణించెననియే వారు భావించియుందురు. ఈ యద్భుత దృశ్యమువలనఁ బవిత్రహృదయు లైన ప్రేక్షకులెల్లరకును గలిగిన యానంద మపారము. కాని బాలుఁడుమాత్ర మింకను స్మృతితప్పియే యుండెను. స్నేహితులు భయపడి వివిధోప చారములు చేసి మరల స్మృతిఁ గలిగింపఁ బ్రయత్నించి విఫలులైరి. ప్రదర్శనము నిలిచిపోవలసివచ్చెను. అతనిని ఆ స్థితిలో నింటికిఁ దీసికొని పోయిరి. మఱునాఁటి యుదయము వఱకును స్మృతిరాలేదు.

ఇప్పటినుండి యిట్టి పారవశ్యస్థితులు పూర్వముకంటె మెండయ్యెను. భక్తిపూరితమైన పాట వినునప్పుడుగాని, ధ్యానమునందున్నప్పుడుగాని, యతనిమనస్సు బాహ్యవిషయములనుండి విడివడి చాలకాల మంతర్ముఖమై యుండును. ఇందులకుఁ గారణమేమని యడిగిన, నతఁడు తా నేదేవతను ధ్యానించుచుండునో ఆ దేవత తనకు సాక్షాత్కరించుననియును, అట్టి దివ్యదర్శనమువలనఁ గలిగిన భావావేశముచేఁ దనకు బాహ్యస్మృతి పూర్తిగానశించుననియును జెప్పువాఁడు. తల్లియు, నితరబంధువులును ఈ పారవశ్యస్థితులను మూర్ఛలుగాభావించి మిగుల భయపడిరి. కాని వీనివలన బాలుని యారోగ్యముగాని, దేహదార్ఢ్యముగాని చెడనందున, వారు క్రమముగాఁ హృదయములను శాంతపఱచికొనిరి. తఱచుగా నిట్టి భావపరవశత్వమును బొందినను, దానివలన నతని దైనికకృత్యముల కెట్టిభంగమును గలుగుట లేదు.

గ్రామములో జరుగు దైవకార్యము లన్నిటియందు నతనికి మిగుల నభిరుచి. భేదభావ మేమియు లేక సర్వదేవతల

యర్చనలందును సమప్రీతిని చూపుచుండెను. ఇందువలననే మున్ముందతఁడన్ని యాకృతులందును, అన్నిమతములందును ఒకేదైవమును చూడఁగలిగెను.

ఆకాలమునఁగూడ బాలగదాధరుని మహత్త్వమును గ్రహించి యతనిని పూజించిన పుణ్యాత్ములు కొందఱాయూర నుండిరి. వారిలో శంఖపుగాజులుచేసి జీవించు శ్రీనివాసుఁడను నాతఁడొకడు. ఈతని మహాపవిత్రవర్తనమును, పారమార్థికతను కాలాంతరమున శ్రీరామకృష్ణుఁడు తఱచు ప్రశంసించువాఁడు. హృదయపూర్వకముగ బాల గదాధరుని ప్రేమించి, యతని సాన్నిధ్యభాగ్యమున కానందించుచు, శ్రీనివాసుఁడతనితోఁ దఱచు భాగవత విషయికచర్చలు చేయువాఁడు. ఒకనాఁడతఁడు పూజార్థము పూలమాలలు గట్టుచుండఁగా గదాధరుఁడచ్చటికి బోయెను. శ్రీనివాసుఁడు వెంటనే కొన్ని మిఠాయిదినుసులను కొని తెచ్చి, నిర్జన ప్రదేశములో నొక చెట్టుక్రిందికి గదాధరునిఁ దోడ్కొని పోయి, యాసీనుఁజేసి, నలుదెసలఁ జూచి యెవ్వరును లేరని తెలిసికొని, యాతని మెడలో నాపూలమాలను వైచి, బహు ప్రేమపూర్వకముగ మిఠాయీలు తినిపించి, హృదయమున భావావేశము పొంగిపొరలఁ, గన్నుల నీరునించుచు, గద్గద స్వరముతో బాలుని సంబోధించి యిట్లు పలికెను: "నాయనా, నేను ముసలివాఁడ నయితిని. మరణకాలము సమీపించుచున్నది. ప్రపంచమున నీవు చేయనున్న మహాద్భుతకార్యములను జూచి యానందించు భాగ్యము నాకుఁ గలుగదు. కాన ఈదీనునియం దెప్పుడును దయయుంతువుగాక! ఇదియే నా ప్రార్థన."

గదాధరుఁడును, అతని స్నేహితులును ఆటపాటలందును, ఇతరవినోదములందును చాలకాలము గడపువారు. పాఠశాలకుఁ బోవుట తఱుచు మాని పొలములలో సుఖముగా బ్రొద్దుపుచ్చుచుందురు. జనోపయోగార్థము మాణిక్యరాజా యనునతఁడు ప్రతిష్ఠించిన పెద్దమామిడితోఁట వారియభిమాన విహారభూమి. అందఱు నొక పెద్ద చెట్టుక్రిందఁ గుమిగూడి, యిండ్లయొద్దనుండి తెచ్చుకొన్న అటుకులు తినువారు. పాడఁ గలిగిన కొంతమంది చిన్నబాలురతో గదాధరుఁ డొక నాటక సమాజము నచిరకాలములో నేర్పఱిచి, భారతరామాయణములనుండి కై కొన్న కథలను ప్రదర్శింప నారంభించెను. తన యద్భుత మేధాశక్తిచే నొక యతురమైన లోపింపకుండున ట్లాకథాభాగముల నతఁడప్పఁగింపఁగలుగువాఁడు. ప్రతి నటునకు నతఁడే పాత్రను నిర్ణయించి, కథానాయకపాత్రను తాను ధరించువాఁడు. ఒక్కొకప్పుడు గ్రామములో జరుగు నితర వినోదనాటకములుగూడ ప్రదర్శింపఁబడును. కృష్ణలీలలు గదాధరుని యభిమాననాటకకథ. అందు మఱియు ముఖ్యము వ్రజలీలాది బాల్యక్రీడలు. శ్రీకృష్ణలీలలను, శ్రీ రాధావియోగవేదనను వర్ణించు హృద్యమయిన పాటల నతఁడు పాడినప్పుడు నాటకము బహురమ్యముగా నుండెడిది. ఇతర బాలురు సుబలుఁడు మున్నగు శ్రీకృష్ణుని స్నేహితుల పాత్రలు ధరించువారు. గదాధరుఁడు తన సహజసుందరరూపముతో, దీర్ఘ శిరోజములతో, మెడలో పూదండఁ దాల్చి, వేణువు నూఁదుచు శ్రీకృష్ణవేషమున రంగస్థలమునఁ బ్రవేశించును. మఱొకప్పుడు రాధికావేషము ధరించి శ్రీకృష్ణవిరహవేదనచే శోకమూర్తియై ప్రవేశించును. ఈపాత్రలను బ్రదర్శించునప్పు డాయా కథా

సందర్భోచిత భావములకుఁ బూర్తిగా వశుఁడై, గదాధరుఁడు తఱచుగ నతీంద్రియావస్థల నొందును. మఱికొన్ని వేళలందు బాలురు కలిసి పాడెడు కీర్తనలతో ఆమామిడితోఁట ప్రతిధ్వనించును. పాటలందును, ఇతరవిధ వినోదములందును, కాలము వ్యర్థపుచ్చుచు బాలురు బడికి వచ్చుట మానివేయుచున్నారని ఉపాధ్యాయునకుఁ దెలిసి, యతఁడొకనాఁడు పిల్లలనందఱిని తనయెదుటకుఁ బిలిపించి, మీ నాయకుఁ డెవరో తెలుపుఁడని యడిగెను. వారెల్లరును గదాధరుని గనుపఱచిరి. అంతట నుపాధ్యాయుఁడు 'మామిడితోఁటలో నీవేమి చేసితివో తిరిగి ప్రదర్శింపు'మని గదాధరు నడిగెను. నిర్భయముగా నా బాలుఁ డొకపాట పాడెను. ఆతని మృదుమధురస్వరమునకు ముగ్ధుఁడై, శిక్షార్థము పిలిపించిన మాటయే మఱచి, యా యుపాధ్యాయుఁడు గదాధరుని మఱియొకపాట పాడుమనెను. అప్పుడతనిస్నేహితులుగూడ నతనితోఁ గలిసి పాడ నారంభించిరి. ఉపాధ్యాయుఁడు చివరకొక మందలింపుమాటగూడ పలుకఁజాలకపోయెను!

వయసు ముదిరినకొలఁది, బడిచదువనిన గదాధరునకు వైముఖ్య మెక్కువగుచుండెను. పాఠశాలలో జరుగు నిత్యకార్యక్రమమునెడల నతని కసంతృప్తి. పురాణాది పవిత్ర గ్రంథములు చాల ప్రియములు. తనహృదయమందుఁ బ్రజ్వలించుచున్న ఆధ్యాత్మికోత్సాహతేజమునే యతఁ డా గ్రంథములందుఁగూడఁ గాంచుచుండును. పురాణములు చదివి తన్మానందింపఁజేయుటకు గ్రామస్థు లతనిని తఱచుగ రావించువారు. అట్టిసమయములం దతఁడు ప్రహ్లాదుఁడు, ధ్రువుఁడు మున్నగు మహాభక్తుల జీవితములు చదువును. ఈ వ్యాసంగ

మధికమగుకొలఁది, నతనికిఁబాఠశాలపై వైముఖ్యముకూడ నధికమయ్యెను. మూర్ఛలని వారు తలఁచు నతీంద్రియావస్థలు తఱచు కాన్పించుటచే నతనికి మానసిక పరిశ్రమ మయుక్తమని పెద్దలుకూడ బలవంతపెట్టరైరి.

రామేశ్వరుఁడును, గదాధరుని చెల్లెలగు సర్వమంగళయును, పెద్దవారై, వారి వివాహములు జరిగెను. ఆ కాలముననే రామకుమారుని భార్యయు గర్భవతియయ్యెను. ఆమె మొదటికానుపుననే మరణించునని రామకుమారుఁ డెన్నఁడో చెప్పియుండెను. అట్లే యామె యక్షయుఁడను కుమారునిఁగని (1854) కొలఁదికాలములోనే మరణించెను. అప్పటినుండి కుటుంబాదాయముకూడ తగ్గిపోఁజొచ్చెను. ముప్పదేండ్లు సహధర్మిణిగ నుండిన భార్య మృతిచేఁ గలిగిన విచార మింకను శోకపూర్వమే రామకుమారుఁడు ఘోరదారిద్ర్యమునఁ గుటుంబభారము వహింపవలసివచ్చెను. లక్ష్మీజాలవలన వచ్చునది కుటుంబమునకు వలయు ధాన్యము మాత్రమే. ఇతరసామగ్రిఁగొన ద్రవ్యములేదు. క్రొత్తబిడ్డవలనఁగూడఁ గుటుంబవ్యయమధికమయ్యెను. ఇందుచేఁ గొంచెము ఋణమేర్పడి క్రమముగాఁ బెరుగుచుండెను. కాన మఱొక చోటికిఁ బోయి శక్తినెల్ల వినియోగించి యెక్కువ రాఁబడి నార్జించుటకు రామకుమారుఁడు నిశ్చయించుకొనెను. సమీపమందున్న పెద్దపట్టణములగు బర్దమాను కలకత్తాలలోఁ గలకత్తాకుఁ బోవ నిశ్చయించుకొని, యచటికిఁబోయి! యా పట్టణమున ఝామాపుకుర్‌లో నొక పాఠశాలఁ బెట్టెను.

కుటుంబపోషణభారమిప్పుడు రామేశ్వరునిపైఁ బడినది. ముసలితల్లి, చిన్నతమ్ముఁడు, పసిభార్య, రామకుమారుని

శిశువు, వీరందఱిని పోషింపవలసివచ్చెను. విద్యయెడల గదాధరునకుఁ గల నిర్లక్ష్యభావమును గ్రహించి యాతని భావి జీవితవిషయమునఁగూడ నతఁ డాకులపాటునొందును. కుటుంబ దారిద్ర్యము ముందుముం దెట్టి పరిస్థితులు కల్పించునో యని భీతిల్లును. కాని కలిమిలేములు కేవలభగవత్సంకల్పితములుగా భావించి వానికై యతఁ డంతగాఁ జింతిల్లక కేవలము రఘువీరునిపైననే యాధారపడి కొన్నిసమయముల నప్పుగూడఁ జేయుచు, నెట్లెట్లో కుటుంబపోషణము చేయుచుండెను.

రామకుమారుని భార్య మృతిచే చంద్రాదేవి స్థితి మిగుల శోచనీయమయ్యెను. ఆ కోడలు గృహనిర్వాహకురాలుగా నుండినప్పుడు సంసారపులంపట చాలవఱకు తగ్గి, రఘువీరార్చనయందు విశేషకాలమును గడపుచు వైధవ్య దుఃఖము కొంత శమింపఁజేసికొన నామెకు వీలైనది. ఇప్పుడు పసిదగు రామేశ్వరుని భార్య తప్ప కుటుంబములో రెండవ యాఁడుదిక్కే లేదు. తల్లిలేని యక్షయునిఁ బోషించు నవసరముగూడ నేర్పడెను. ఇందుచే దాదాపఱువదేండ్ల వార్ధక్య దశయందు పాపము చంద్రాదేవి అక్షయుని సంరక్షణమందే కాక వంటచేయుటందును, రఘువీరుని పూజయందును, ఇతర గృహకృత్యములందును అత్యధికముగా శ్రమపడవలసివచ్చెను. కాని, ఇదంతయు భగవదాజ్ఞగా శిరసావహించి, మూర్తీభవించిన క్షమవలె చంద్రాదేవి తన నూతన కార్యభారమును నిర్వహింప నారంభించెను.



# యౌవనోదయము

తనకండ్లయెదుటఁ గుటుంబములో జరిగిన యీమార్పు లెల్ల—సోదరుని భార్య మరణము, కుటుంబపరిస్థితులలోని తాఱుమాఱు, ఆదాయక్షీణత—ఐహికభోగములు చంచలము లను గదాధరుని నమ్మకమును మఱింత దృఢపఱచినవి. అంత చిన్నతనములోఁగూడ నతనికి ప్రపంచమునెడ విరక్తి గలి గెను. బడిచదువునెడ నుపేక్ష ప్రబలెను. లౌకికజ్ఞాన మనిత్య ములగు ధనప్రతిష్ఠల నార్జించుకొనుటకు సాయపడును గావున, దానికొఱ కందఱును ప్రాకులాడుదురనియుఁ దా నట్లుచేయక తండ్రివలె సత్యవంతుఁడై, నిరాడంబరముగా, ఉన్నతభావ ములతో జీవితము గడపవలెననియు, నిశ్చయించుకొనెను. ధ్యాన ప్రార్థన పూజాదు లతని చిత్తము నాకర్షింపఁదొడఁ గెను. నిత్యకృత్యములు చేయుచుండినను, చాలకాలము రఘు వీరునిపూజయందో, పవిత్రగ్రంథపఠనమందో కడపుచుండెను. గృహకార్యనిర్వహణములోఁ దల్లికి సాయముకూడ చేయు చుండెను.

రామకుమారుఁడు కలకత్తాకు వెళ్లిన తర్వాత గదా ధరుఁడు తననిర్ణీతకార్యములకై విశేషకాలమింటిలోనే గడప వలసివచ్చెను. ఇరుగుపొరుగు స్త్రీల కందుచే నతని సహ వాసభాగ్యము పూర్వముకంటె నెక్కువగా లభించెను. ఇంటిపనులు తీర్చుకొని వారందఱును చంద్రాదేవి యింటికి వచ్చి బాలుని చుట్టును గూర్చుండి పాటలుపాడించియో, పురాణము చదివించియో, వినువారు. ఒక్కొకప్పు డతఁడు

గ్రామస్థులాడు నాటకములలోని భాగములను తిరిగి ప్రదర్శించి వారిని వినోదింపఁజేయును. వానిలోవచ్చు వివిధ పాత్రలను వేర్వేఱు కంఠస్వరములతో తానేనిర్వహించును. స్త్రీ వేషము ధరించినప్పుడు కేవలము స్త్రీవలెనే మాటాడును. అట్టి సమయములం దతని బాలునిగా గుర్తించుటకే వీలులేదు. ఇతరుల వేషభాషలనుగూడ నతఁడు బాగుగా ననుకరించును. తల్లిగాని, యితర స్త్రీలుగాని, విచారముగా నున్నప్పుడు వినోదచర్యలచే వారిని వెంటనే సంతోషపఱచును. ముద్దులు మూటగట్టు నతని చిఱునవ్వును, సుందరాకారమును, సహజ మృదుమధురస్వభావమును, కరుణామయహృదయమును, వారి మనస్సంతాపముల నమోఘముగ నివారించు దివ్యౌషధముగా నుపకరించుచుండెను.

ఈ స్త్రీల కతనియెడ క్రమముగా నత్యంత వాత్సల్యము కలిగెను. అతని జననసమయమున జరిగిన యద్భుత సంఘటన లెఱిఁగియుండిన యా స్త్రీ లతని యాధ్యాత్మికోత్సాహమునకును, నిశ్చలభక్తికిని, అనౌద్ధత్యమునకును, సత్యసంధతకును, పవిత్రతకును, ఆనందపరవశలైరి. ప్రసన్నమయి వంటి వయసుచెల్లిన స్త్రీలు కొందఱతనిని శ్రీకృష్ణునిగనే భావించిరి. ఇతర స్త్రీ లతనియందు శ్రీకృష్ణుని లక్షణములు కొన్ని కలవనితలఁచిరి. గదాధరుని సహజనిర్మల ప్రవర్తనముచేతను, అకృత్రిమభావములచేతను, ఆ స్త్రీ లతనిని తమలో నొకనిగనే చూచుకొనుచు, తమరహస్యములుకూడ నతనితో ధారాళముగఁ జెప్పుచుండిరి. గోపబాలురతోడను, బృందావన గోపికాస్త్రీలతోడను శ్రీకృష్ణుఁ డొనర్చిన లీలావిహారములు వర్ణించు వైష్ణవగీతములందును, వీథి నాటకము

లందును, అతనికిఁగల మక్కువచే, నతని స్వభావ మీకాల మున విచిత్రరీతిని స్త్రీ స్వభావము ననుకరించెను. ఆ స్త్రీజన మున కాయనయెడఁ గలిగిన యభేదభావమున కిదియే ముఖ్య కారణము.

ప్రాణసఖుఁడగు శ్రీకృష్ణునెడ గోపికల యనన్య సామాన్యప్రేమ, యనురాగతీవ్రత, వియోగవేదన, పునస్స మాగమమహానందము : వీనికన్నిటికి మూలకారణమగు మహోన్నతాదర్శము గదాధరుని భక్తిపూరితహృదయమున స్థిరముగా నాటుకొనెను. ఇందుచేఁ దఱచుగ భగవంతుని కొఱకు తహతహలాడుచు, మైమఱచి, తానొక గోపికాస్త్రీ నని భావించి, తదనుగుణముగ వర్తించువాఁడు. వైష్ణవసంప్ర దాయములోఁ బుట్టి పెరిఁగినవారును, పవిత్రబుద్ధిగలవారును అగు నా గ్రామ యువతీమణులను చూచినప్పుడు బృందావన గోపిక లతని జ్ఞప్తికి వచ్చుచుండిరి. అందుచే నతఁడు వారి సహవాసము నెక్కువగాఁ గోరుచుండెను. గోపికలు స్త్రీలైన కారణముచేఁ గదా శ్రీకృష్ణుని తమభర్తగా భావించి, యాతని శాశ్వతసమాగమానందము ననుభవింపఁగలిగిరని తలఁచి, ఆ యాదర్శసిద్ధిని తానుగూడ వాంఛించి 'అయ్యో! పురుషుఁ డనై జన్మించితినే, యీ పురుషజన్మముగదా ప్రాణప్రియు నుండి న న్నెడసేయుచున్నదని పరితపించును. ఇట్లు మనోహ రునికొఱకు పరితపించునప్పుడతఁ డొక్కొకప్పుడు జన్మాంతర మున నొక పవిత్రబ్రాహ్మణకుటుంబములో జన్మించిన బాల వితంతువుగా నుండఁగోరును. ఆ బాలిక పెద్ద తలకట్టును, సుందరరూపమును గలిగి, శ్రీకృష్ణునే ప్రాణేశ్వరునిగా నిరం తరము ధ్యానించుచు కాలము గడపును. ఒక పాఁడియావును,

నూలువడకు రాట్నమును, కాయగూరలు పండించుకొనుటకు కుటీరసమీపమున బారెడు నేలయునే ఆమెకుఁ గల సంపద. ఒక వృద్ధస్త్రీమాత్ర మామెకు తోడునీడ. పాలతో వివిధము లైన తినుబండారములుచేసి, ప్రియునికై దాఁచియుంచును. పగటిపనియైన తరువాత రాట్నము చెంతఁ గూరుచుండి, నూలు దీయుచు, హృదయాహ్లాదకరమైన, మృదుమధురగీతలరూప మున తన భావమును వెల్లడించును. పిమ్మట సంజచీఁకటి పడు చుండునప్పుడు శ్రీకృష్ణుఁ డా కుటీరములోనికి గోపబాలరూప మున నిశ్శబ్దముగాఁ బ్రవేశించి భక్ష్యముల నారగించును. ఇట్లాయన యూహాసౌధములు నిర్మించుకొని శ్రీకృష్ణ సాంగ త్యమునందు కాలముగడపుచుండును.

గ్రామస్త్రీల యెదుట స్త్రీపాత్రల నభినయించునప్పు డతఁడు తదనుగుణమైన దుస్తులు ధరించి మిగుల సొంపుగా నుండును. వినోదార్థమై యతఁ డప్పుడప్పుడు స్త్రీవేషము ధరించి, నీళ్లకడవ నెత్తుకొని హాల్దార్ పుకుర్ కుఁ బోవును. అతని నప్పుడు గుర్తించు టెవ్వరికిని సాధ్యము కాదు.

సీతానాథపాయిన్ ఇల్లు ఖుదిరాము నింటికి సమీ పము. అతని కేడుగురు కొమార్లును, ఎనమండ్రు కొమార్త లును గలరు. వివాహములైన తర్వాతఁగూడ వా రాతని యొద్దనే యుండిరి. ఈ కుటుంబమువా రందఱును చంద్రా దేవితో నెక్కువ చనవుగా నుండువారు. సీతానాథుఁడు బాలగదాధరుని బ్రేమించి, ఎక్కువగా గౌరవించెడువాఁడు. సౌందర్యవతులును, యౌవనవతులు నైన యతని కొమార్త లందఱును ఈ బాలునితో చనవుగానుందురు. అతఁడును పురాణ పఠనమున వారితో చాలకాలము గడపుచుండును.

అప్పు డితర స్త్రీలుకూడ సమావేశమై గదాధరుని పాటలు వినియు, నతని బాలక్రీడలు చూచియు నానందించువారు.

సీతానాథుని యింటి సమీపముననే దుర్గాదాస్ పాయిన్ అను నతఁడు నివసించుచుండెను. ఇతఁడును గదాధరుని మెచ్చుకొనును గాని, బాలికలతోడి యతని చనవున కిష్టపడఁడయ్యెను. ఘోషాపద్ధతియెడ నితనికిఁ జాలపట్టుదల. తనయింట స్త్రీలుండు స్థలములోని కితరపురుషుఁ డెన్నఁడును బ్రవేశింపలేదని యతఁడు డంబములాడువాఁడు. ఒకనాఁడిది గదాధరుఁడు విని, స్త్రీ శీలమును కాపాడుటకు మార్గమామెను మఱుఁగున బంధించుట కాఁజాలదనియు, చక్కని చదువు, భగవద్భక్తి మాత్ర మిందు తోడ్పడఁగలవనియు చెప్పుటేగాక, అతనియింటిలోనికి తాను సులభముగ ప్రవేశింపఁగలననికూడ చెప్పెను. అట్లు చేసిచూపుమని దుర్గాదాసు బాలునడిగెను. 'సరే! చూచెదముగాక!' యని గదాధరుఁడు సమాధానముచెప్పి, నవ్వుచు వెడలిపోయెను.

ఒకనాఁటి సాయంకాలమున, తన చావడిలో కొంత మంది స్నేహితులతో దుర్గాదాసు మాటాడుచుండఁగా, నిఱు పేదరాలిదుస్తులుధరించి, తలపై ముసుఁగు గప్పుకొని, చంకలో గంపబెట్టుకొని, యొకస్త్రీవచ్చి వారియెదుట నిలిచి, తాను పొరుగూరి సాలెదాననినియు, నూలమ్ముకొనుటకై సంతకు వచ్చి, స్నేహితులందఱు నిండ్లకుఁ బోవుటచే, నాసంజచీఁకటి వేళ నొంటిగాఁ బోఁజాలకున్నాననియుఁ జెప్పి, ఆ రాత్రికి తన స్త్రీజనముతో నుండనిమ్మని ప్రార్థించెను. అతఁడామెను కొలఁది ప్రశ్నలడిగి, 'సరే! లోనికిపోయి స్త్రీలనడుగుము' అనిచెప్పెను. ఆమె యంతట నింటిలోనికిఁ బోయి, తన సమాచార మా

స్త్రీలకు తెలుపఁగా వారామె నిస్సహాయతకై జాలిపడి, నిరాడంబరతకై సంతసించి, తమతోఁగూడ నుండనిచ్చి, భోజనము పెట్టిరి. ఆమెయు వారిచెంతఁ గూర్చుండి భోజనము చేయుచు, ఇంటిలోని ప్రతిగదిని వివరముగాఁ బరిశీలించుచు, వారు చెప్పుకొను మాటలు వినుచు, అప్పుడప్పుడు వారి సంభాషణలోఁగూడ పాల్గొనుచుండెను. ఈవిధముగా మూఁడుగంటలు గడచెను. ఈలోపున గదాధరుఁ డింటిలో చాలకాల మగపడనందున చంద్రాదేవి యాందోళనపడి వెదకుటకు రామేశ్వరుని బంపెను. సీతానాథపాయిన్ ఇంటికతఁడు తఱచు వెళ్లువాఁడుకావున రామేశ్వరుఁడు మొదట నచ్చటికి పోయెను. కాని యచ్చట కనఁబడనందున, పేరఁ బిలుచుచు వేఱుచోట్లకుఁ బోవుచుండెను. ఇందులకు దుర్గాదాసునింటి స్త్రీలయావాసము నుండి 'అన్నా! ఇదే వచ్చుచున్నాను!' అని ప్రత్యుత్తరము వచ్చెను. బాలికావేషముతో సాలెదాననని తమ్మెల్లర వంచించిన శ్రీ గదాధరుఁడని కనుఁగొని యాస్త్రీ లాశ్చర్యపరవశలైరి. దుర్గాదాసు ప్రథమమున నించుక కుపితుఁడైనను, నుత్తరక్షణముననే తానుగూడ నీ చమత్కారమునకు సంతసించి, బాలుని సామర్థ్యమును మిక్కిలి కొనియాడెను. ఈ విధముగ తమ నిర్బంధము తీఱినందున ఆ యింటిస్త్రీలుకూడ సీతానాథునింటికి గదాధరుఁడు వెళ్లినపుడెల్లఁ బోవ నారంభించిరి. గదాధరుని రాకవలన సీతానాథుని గృహమునకు గ్రామస్త్రీలందఱును బహుసంతోషపూర్వకముగ విచ్చేయుచుండిరి. భక్తిపూరితములైన పాటలు పాడుచు, తఱచుగ పారవశ్యస్థితి నొందునప్పుడాతనియందు వారికిఁగలగౌరవము వేయిమడుంగులతిశయించును. అట్టిసమయములం దాతని పవిత్రరూపమున

శ్రీకృష్ణుఁడో, గౌరాంగుఁడో యవతరించెనని తలంచి వారిలో కొందఱాతని పూజించువారు. ఈస్త్రీలందఱును గలసి యతని కొక బంగారుపిల్లంగ్రోవిని, స్త్రీ పురుషపాత్రలు రెంటిని ప్రదర్శించుట కనువైన దుస్తులును బహుమతిగా నిచ్చిరఁట.

పవిత్రచరిత్రలును, భక్తురాండ్రునగు పాయిన్ కుటుంబ స్త్రీలు గదాధరుని సహవాసభాగ్యమువలన మహోదారమన స్కలైరన్న నాశ్చర్యమేమున్నది! 1893-వ సంవత్సరములో శ్రీరామకృష్ణుని సన్న్యాస శిష్యులు కొందఱు కామార్పు కుర్ కుఁ బోఁగా రుక్మిణియను నఱువదేండ్ల వృద్ధురాలిట్లు తెలిపెను: 'నేనపుడు పదునేడు పదునెనిమిదేండ్లదానను. సీతానాథపాయిన్ మా తండ్రి. మా యింటిలో నప్పుడు పదు నేడ్గురమో పదునెనమండ్రమో అక్కచెల్లెండ్రమును, దాయా దులము నుంటిమి. అందఱమును ఇంచుమించొక యీడువా రమే. గదాధరుఁడు బాల్యమునుండియు మాతో నాడుకొను వాఁడు. అందుచేత మా కతనితోఁ జాలఁ జనవు. మాకు వివాహములై ఈడువచ్చినతరువాతఁ గూడ, అతఁడును నీడు వచ్చినవాఁడయ్యును, మా గదులలోనికి విచ్చలవిడిగా వచ్చు చుండెను. గదాధరుఁడు చెప్పు పురాణగాథలు వినుచు, అతఁడు చేయు వినోదములు చూచుచు మేము పనులుచేసికొనువా రము. అతని సాహచర్యమున మాకుఁ గలుగు నానందము నెట్లు వర్ణింపఁగలను! ఒక్కనాఁడతఁడు రానిచో నతని కనా రోగ్యమేమో యని తపించిపోవుదుము. ఏదో మిషతో మాలో నెవరో చంద్రాదేవి కుటీరమునకుఁ బోవలసినదే. అతని క్షేమవార్త వినువఱకు మాకు శాంతియుండదు. అతని ప్రతిమాటయు మా చెవులకు కత్యాహ్లాదకరముగా నుండును.

మాయింటి కతఁడు రాఁజాలని దినములలో మే మతనిని గూర్చియే మాటాడుకొనుచుందుము. మా తండ్రి కాతనియెడ గాఢప్రేమ. ఇష్టదేవతవలె నాదరించువాఁడు.'

స్త్రీలేకాక పురుషులుకూడ నతని కోమలస్వభావము చేతను, సర్వతోముఖప్రతిభచేతను ఆకర్షింపఁబడిరి. వారి భగవత్సంకీర్తనములలో నతఁడు పాల్గొనును. పురాణాదులు వారికిఁ జదివి వినిపించి యర్థము బోధించును. అంత చక్కఁగాఁ జదువఁగలవారుగాని, బోధింపఁగలవారుగాని గ్రామములో నితరులెవ్వరునులేరు. ఆతని దివ్యోత్సాహము, ఆనందపరవశత్వము, మృదుమధురస్వరము, రమణీయనృత్యము, వారి నానందవార్ధిలో నోలలాడించును.

గదాధరున కద్భుతమగు ప్రాజ్ఞతయు, సూక్ష్మమగు నంతర్దృష్టియు, గలవని వారు త్వరలోనే గ్రహించిరి. విషయపరిశీలనమున నతని దృక్పథమే వేఱు. ఎట్టి క్లిష్టవిషయమునైన నతఁ డవలీలగాఁ దేటపఱుపఁగలఁడు. సత్యము నిర్భయముగాఁ బ్రకటించు టతనికి నైజము. అందుచే కపటవర్తనులు, తమ గుట్టు బయటపడిపోవునను భీతిచే, నతఁడున్నచోట్లకురారు. గ్రామములోఁ గొందఱు (శ్రీనివాసునివంటివారు) అతని యాధ్యాత్మికశక్తిని గ్రహించి, యతఁడు లోకాతీతుఁడని భావించిరి. అతని మహత్త్వము నందఱెఱుఁగుదురు కాని, ఆ మహత్త్వ మెట్లు పరిణమించునో యెవ్వరు నెఱుఁగరు.

తానొక మహాకార్యము నెఱవేర్చుటకై జన్మించితినను తలంపుకూడ నతని కీకాలమునఁ బొడమ నారంభించెను. ఆ మహాకార్య మేదియో గుఱుతింపఁజాలకపోయినను, భగవత్సాక్షాత్కారము పడయుటే తనజీవితపరమావధియని

మాత్రము గ్రహించెను. సన్న్యాసజీవితమునం దాతని కెక్కువ యనురక్తి యారంభమయ్యెను. సర్వసంగపరిత్యాగియై భిక్షుక వృత్తి నవలంబించియుండును గాని, యిట్టివైరాగ్యభావ మంకు రించు వెంటనే యతని కోమలహృదయమునఁ దల్లియొక్కయు, సోదరులయొక్కయు దుఃస్థితి స్ఫురించి, వారి సాహాయ్యముకై తదేకదీక్షతోఁ బాటుపడ నుత్సహించును. ఇట్టి విరుద్ధభావ సంఘర్షణమున నతఁ డేమియు నిర్ణయించుకోలేక సకాలమున రఘువీరుఁడే మార్గముచూపునను సంపూర్ణవిశ్వాసముతో నుండును.

గదాధరునికి బడిచదువుపైఁ గల వైముఖ్యము దిన దినాభివృద్ధి నొందుచుండినను, తనసాంగత్యము లేనిచో గయా విష్ణువు మున్నగు మిత్రులు క్లేశపడుదురను తలంపతనిని నిరో ధించినది. కాని వారి సాంగత్యము వదలకయే తాను బడి మానుకొను మార్గ మొకటి ఆకస్మికముగా లభించెను.

ఒకనాఁ డితని మిత్రులలో నొకఁడు నాటకసభ నొక దానిని ప్రారంభింపవలెననియు, గదాధరుఁ డందులోఁ జేర వలెననియుఁ గోరెను. గదాధరుఁ డిది యామోదించుటచే నచిరకాలములో సభ యేర్పాటుచేయఁబడెను. గదాధరుఁడే ప్రధానపాత్రను ధరించుచు నితరబాలురను సుశిక్షితులను జేయుచుండెను. కథావస్తువు శ్రీరాముని, శ్రీకృష్ణుని జీవిత ములనుండి గ్రహింపఁబడుచుండెను. ఈ ప్రదర్శనములలో గదా ధరుఁ డతీంద్రియావస్థలు గాంచువాఁడఁట.

ఈ కాలమున గదాధరుఁడు మట్టిబొమ్మలుచేయుట లోను, చిత్రలేఖనములోను చతురుఁడయ్యెను. ఈ కళలలో నతఁ డశిక్షితుఁడై నను, తన ఏకాగ్రచిత్తవృత్తివలనను, స్వత

స్సిద్ధమైన యాదర్శపరిజ్ఞానమువలనను, విగ్రహముయొక్క వివిధావయవములకు సరియైన పరిమాణము లున్నవో లేవో అవలీలగాఁ గనుఁగొనఁగల్గెను. బొమ్మలుచేయువారియొద్ద కెప్పుడైనఁ బోయినచో, వారి విగ్రహములలోని కన్నులు మొదలగు సూక్ష్మభాగములందుఁగల లోపములను గనుపఱచి వారి కచ్చెరువుగలిగించి, ఆ లోపములు చక్కఁజేయువిధముఁ గూడ సూచించుచుండును. ఆ మార్పుల ఫలితముగాఁ గలుగు జీవకళ కెల్లరు నాశ్చర్యపడువారు. అతీంద్రియావస్థలయం దతనికి వివిధ దేవతారూపములు ప్రత్యక్షములయ్యెడివి. ఆదృశ్యములవలనను, తన సహజ శిల్పచాతుర్యమువలనను, అతఁడు అదేవృత్తిగాఁగల శిల్పుల పనితనములోఁగూడ లోపములు కనిపట్టుటకును, వారికంటె నెక్కువ రమణీయముగా తానే విగ్రహములు చేయుటకును సమర్థుఁడయ్యెను.

అచట రామకుమారుఁడు కలకత్తాయందలి తన పాఠశాలలో విద్యనేర్పుటయు, కొన్నియిండ్లలో దేవతార్చన చేయుటయు పెట్టుకొని, రెంటిని నిర్వహింపఁజాలక గదాధరుని సహాయ మపేక్షించెను. తనయొద్దనున్నచో గదాధరుఁడు పాఠములు చెప్పించుకొనుచు, తనకు గృహకృత్యములలో సాయముకూడఁ జేయవచ్చునని యాతని యూహ. గదాధరుఁ డంగీకరించి యొక శుభదినమున రఘువీరునియొక్కయు, తల్లి యొక్కయు నాశీస్సుల నందుకొని కలకత్తాకు బయలుదేఱెను.

గదాధరుఁడు కామార్పుకుర్‌లోఁ గడపిన పదియేడు సంవత్సరములలో వతఁ డింటివారి కల్లారుముద్దుల బిడ్డఁడై, గ్రామ బాలబాలికలకు సోదరుఁడై, నెచ్చెలియై, ప్రజాసామాన్యమునకు బోధకుఁడై, గురుప్రాయుఁడై, యాధ్యాత్మిక

దృష్టిఁగల సుకృతాత్ములకు పూజ్యుఁడై, దైవమై, తన వినిర్మల ప్రవర్తనచేతను నిష్కపటమృదులస్వభావముచేతను ఎల్లర నాకర్షించి, తన దివ్యనృత్యగాన రామణీయకముచేతను శిల్ప కళాకౌశలముచేతను అసాధారణ మేధాప్రాజ్ఞతలచేతను సమ్మోహితులఁజేసి, తన పారవశ్యస్థితులచే నద్భుతావహు లఁజేసి, సర్వజనుల హృదయము లపహరించెను. కాని ప్రపంచము నుద్దీప్తమొనర్ప నవతరిల్లిన దివ్యజ్యోతి యొక్క మార్పాల గ్రామములో నెన్నాళ్లుండఁగలుగును? ఎన్నిహృద యములు కుమిలినను, ఎన్ని మోములు వాడినను, ఎన్ని కన్నులు చెమ్మగిల్లినను, జగజ్జననీ చోదితుఁడగు బాలగదా ధరుఁడు విశాలప్రపంచోన్ముఖుఁడై, అందలి కేంద్రస్థానములలో నొకటగు కలకత్తా మహాపట్టణము చేరఁగోరి గాలవాహినిలో నడుగిడెను. ఇంతటితో నాయన జీవితమహానాటకములోఁ బ్రస్తావన ముగిసినది. రంగస్థల మిఁకఁ గలకత్తాకును, దక్షి ణేశ్వర పుణ్యభూమికిని మార్పఁబడుచున్నది. అచట నెన్నెన్ని తెరలెత్తఁబడునో, ఏమేమి యద్భుతదృశ్యములు ప్రదర్శింపఁ బడునో సూత్రధారిణియగు నా జగదీశ్వరికే ఎఱుక!



## "పొట్టకూటి చదువు"

గదాధరుఁడు రామకుమారునకు నిత్యకృత్యములలో సాయపడుటయేగాక, అతని దేవతార్చనాభారమునుకూడ వహించెను. ఆ కుటుంబముల నిర్వాహకులు - ముఖ్యముగా స్త్రీలు - తామిదివఱకెఱిఁగిన యర్చకుల ప్రవర్తనకును, ఈ క్రొత్త యర్చకుని ప్రవర్తనకును గల యపారభేదమును గ్రహించిరి. ఎట్లో హటాహుటీగా ముగింపక అతఁడు బహు శ్రద్ధతోను, భక్తితోను పూజచేయును. అతని ఋజువర్తనము, పవిత్రశీలము, భక్తి, చిత్తశుద్ధి, ఎల్లర చిత్తము లాకర్షించెను, వారికోర్కెచే నతఁడు తన యభిమానకీర్తనలుపాడుచు, స్వల్పసాహాయ్యములు చేయుచు, గంటలకొలఁది వారితోఁ గడవును. ఇందుచే నతనికి పాఠములు చదువుట కెక్కువ తీఱిక లేకుండెను. చదువుకొనవలెనను కోరికయు నతఁడెన్నఁడును గనుపఱుపఁడయ్యెను. అందుచే రామకుమారుఁ డతని నొకనాఁడు దగ్గఱకుఁ బిలిచి విద్యావిషయమున నతనికిఁ గల యుపేక్షకును, సామాన్యవిషయములందుఁ గల యుదాసీన భావమునకును మెల్లగా మందలించెను. 'అన్నా! వట్టి పొట్టకూటి చదువుతో నేనేమి చేయుదును? ఇంతకంటె హృదయమును వికసింపఁజేసి శాశ్వత సంతుష్టిని గూర్చు జ్ఞానమును సంపాదించుట కిచ్ఛగింతును' అని యా బాలుఁడు నిర్భయముగా, నిష్కపటముగాఁ, బ్రత్యుత్తరమిచ్చెను. చూచుటకివి మాఁటేమాటలైనను, బ్రహ్మసూత్రవాక్యములఁ బోలియున్న వీని యంతరార్థమును రామకుమారుఁడు పూర్తిగా గ్రహింప

లేకపోయెను. స్వార్థపరమగు లౌకికప్రవర్తనమునకు కొంతవఱ కలవాటుపడినరామకుమారునకు, విషయమాలిన్యముచే మసక గ్రమ్మని తీక్ష్ణదృష్టిచే లోకము నిస్సారమని గ్రహించిన యీ యద్భుత బాలుని యాంతరంగికతత్త్వము దురవగాహముగా నుండెను. సాధారణమానవకోటివలెఁగాక యేవియో దివ్యప్రయోజనములుసాధించుకొఱకుతాను జన్మించెననియు, దోషభూయిష్ఠులగు వేలకొలఁది మనుష్యుల కాదర్శముగాఁ దాను జీవింపవలెననియు, జననమరణయుక్తమైన సంసారసాగరమునుదాఁటించుజ్ఞానమును సంపాదింపవలెననియు, నతని భావము. కనుక సందేహ మెంతమాత్రమును లేక సోదరుని మందలింపున కా ప్రత్యుత్తరము నిచ్చెను. రామకుమారుఁ డాశ్చర్యవివశతచే నిరుత్తరుఁడయ్యెను. పిమ్మటఁ జదువువలని లాభములనుగూర్చి యతఁ డెన్నోవిధములఁ జెప్పిచూచెను గాని, యీ బాలుని అభిప్రాయ మిసుమంతయు మాఱలేదు.

రెండేండ్లు కడచినవి. రామకుమారుని యార్థికస్థితి బాగుపడలేదు సరేకదా, పూర్వముకంటె చెడినది. ఋణము చేయుట తప్ప గత్యంతరము తోఁపలేదు. కాని యది తీర్చుటెట్లు? క్రొత్తమార్గము లేవైన కలవా, రాఁబడి నధికముచేసి కొనుటకు? లేవు. ఇఁక గతియేమి? ఈ సందిగ్ధస్థితిలో మునిఁగి, దిక్కుతోఁపక రఘువీరుని సంకల్పప్రకారము జరుగుననియు, కానున్నది కాకమానదనియు నమ్మి, కాల గతిని నిర్లక్ష్యభావముతోఁ జూచుచుండెను. ఆశలెల్ల నంతరించి శోకాంధకార మినుమడింపనున్న ఈకష్టకాలమున నాశాకిరణ మొకటి ఆకస్మికముగాఁ బొడచూపెను.



# దక్షిణేశ్వర దేవాలయము

రాణి రాస్మణి (రాసమణి) యొక్క విశాలభవనము కలకత్తాలో జాన్ బజారునందుండెను. ఆమె నలువదినాలుగేండ్ల ప్రాయమున వితంతువై, తన భర్తయగు రాయి రాజచంద్ర దాసుయొక్క గొప్పయాస్తికి వారసురాలయ్యెను. అపారమగు నాయాస్తిని మిక్కిలి ప్రవీణతతోఁ గాపాడుకొనుశక్తికే గాక, ధైర్యసాహసములకు, విశ్వమానవప్రేమకు, దయార్ద్రహృదయమునకు, ఆస్తికతకు, దైవభక్తికి, నామె పేరొందెను. కలకత్తాలోను, చుట్టుపట్టును ఆమెచేఁ బ్రతిష్ఠింపఁబడిన యనేక ధర్మసంస్థ లిప్పటికిని ఆమె మహోదారహృదయమునకుఁ దార్కాణములై వెలయుచున్నవి.

రాణి రాస్మణికి నలుగురు బిడ్డలు. అందఱు స్త్రీలే. మథురామోహనవిశ్వాసుఁ డామెయల్లుండ్రలో సుప్రసిద్ధుఁడు. ఇతఁడు సుగుణములం దామె కిసుమంతయుఁ దీసిపోక, జమీందారీ వ్యవహారముల నత్యంతసమర్థతతో నిర్వహించుచు, ఆమెకు సర్వవిధముల సాహాయ్యమొనర్చుచుండెను.

కాళికాదేవి యామె యిష్టదేవత. కాశీయాత్ర యామెకు చిరకాలవాంఛితము. వలయుధనముకూడ భద్రపఱచెను. కాని జమీందారీ నిర్వహణభారముచేఁ దీఱికలేక కాలముగడచిపోవుచుండెను. మథురాబాబు విశ్వాసు డా బాధ్యత వహింప నంగీకరించుటచే నామె యాత్రార్థ మేర్పాటులుచేసికొనెను. ప్రయాణదినమునకు ముందురాత్రి కాళికాదేవి స్వప్నములోఁ గనఁబడి ప్రయాణమును మానుమనియు, గంగా

తీరమున నొక యాలయముఁ గట్టించినచో తా నా విగ్రహమందు సాక్షాత్కారమొసఁగుదుననియుఁ బలికెను. యాత్ర ప్రారంభమై, దక్షిణేశ్వరగ్రామముకడ గంగానదిలో పడవ లాఁగియుండఁగా, నీ స్వప్నము కలిగినట్లు కొందఱు చెప్పుదురు. ఇందేది నిజమైనను, రాస్మణి యా స్వప్నాదేశమును శిరసావహించి, గంగాతీరమున దక్షిణేశ్వరగ్రామములో నిరువదియెకరముల భూమిని 1847 వ సంవత్సరమునఁ గొని, ఎనిమిదిలక్షలు వెచ్చించి, ఎనిమిదేండ్లకు దేవాలయ నిర్మాణకార్యమును బూర్తిచేసెను.

దక్షిణేశ్వరము కలకత్తా కుత్తరమున నాలుగుమైళ్ల దూరములో నున్నది. దేవాలయమునకుఁ బడమట స్నానఘట్ట సోపానములమీఁదుగా గంగానది ప్రవహించుచుండును. పడవపై వచ్చు యాత్రికు లీ సోపానములెక్కి, ఉత్తరమునను దక్షిణమునను గల యాతేసి శివాలయముల వరుసకు నడుమ నున్న సింహద్వారములోఁ బ్రవేశింతురు. దానికి తూర్పున నిటుకరాళ్లు పేర్చిన విశాలావరణ మొకటి కలదు. దీని నడుమ రెండు పెద్ద గుడులున్నవి. వీనిలో నుత్తరమున నున్నది రాధాకృష్ణుల గుడి; దక్షిణమున నున్నది కాళికాదేవి గుడి. కాళికాలయమున సుందరమైన సహస్రపత్రరజతపద్మముపైఁ జాపకట్టుగాఁ బడియున్న శివవిగ్రహముయొక్క వక్షఃస్థలము మీఁద నిలిచియుండు భవతారిణి యను పేరుగల జగన్మాతృ విగ్రహము కలదు. ముద్దులుమూటగట్టు నీ విగ్రహ మేకాండపు నల్లరాతితోఁ జెక్కఁబడినది. దేవి వివిధభూషణాలంకృతయై, దక్షిణదిశాభిముఖయైయుండును. గుడికి తొమ్మిది గోళాకారములై మొనతేలిన శిఖరములు గలవు. ఈ గుడి కెదుట

నొక విశాలనటమందిరము గలదు. ఆవరణములో దక్షిణము నను, తూర్పునను, ఉత్తరమునను ఉన్న గదులలో కొన్ని దేవాలయోద్యోగుల నివాసములు, కొన్ని యుగ్రాణములు, కొన్ని వంటిండ్లు. వాయవ్యమున శివాలయముల వరుస నాను కొని, వానికుత్తరమున నొక గది కలదు. ఈ యాలయమున నుండినంతకాలము శ్రీరామకృష్ణుఁ డీ గదిలో నివసించియుం డెను. అందుచే నది పరమపావనము, మనకత్యంతముఖ్యము. ఈ గదికి పడమటివైపున నర్ధవలయాకారమైన వసారాయొకటి కలదు. ఇచ్చటనుండి యాయన గంగానదిని చూచుచుండు వాఁడు. ఈ వసారా కెదురుగా నుత్తర దక్షిణములుగా నొక దారి, దారికిఁ బడమట పూఁదోఁట, తోఁటప్రక్కనే యడు గున గంగానదీప్రవాహము. దేవాలయావరణము వెలుపల, ఉత్తరదిక్కున నొకభవనము కలదు. రాస్మణికుటుంబమువారు వచ్చినప్పు డిందే యుందురు. దేవాలయావరణకు నైరృతిదిశ నొకటియు, వాయవ్యదిశను మఱొకటియు రెండు వాద్య మండపములు గలవు. తోఁటలో రెండు కొలఁకులును, అనేక వృక్షములును గలవు. ఈ వృక్షములలో నతిముఖ్య మొక విశాలవటవృక్షము. శ్రీరామకృష్ణుని సాధన లధికముగ నీ వటవృక్షముక్రిందను, కొన్ని తోఁట కుత్తరభాగములోని యొక బిల్వవృక్షముక్రిందను జరిగినవి.

విగ్రహప్రతిష్ఠాపనకు 1855–వ సంవత్సరము మే నెల 31 తేదిని ముహూర్తము నిర్ణయింపఁబడినది. అది స్నాన యాత్రయను పేరిటి పుణ్యదినము. ప్రతిష్ఠామహోత్సవమునకు సర్వము సిద్ధముగ నుండెను. ఆ విగ్రహమున సాక్షాత్కరించి రక్షింతునని దేవి కలలోఁజెప్పినమాటఁ దలఁచుకొని, రాస్మణి

యానందమగ్నురాలయ్యెను. కాని, యీ శుభకార్యము జరుగుటకు పూర్వము ప్రబలవిఘ్నముల నెదుర్కొనవలసి వచ్చినది.

ఈ హడావడిలో నొక ముఖ్యవిషయము 'నెల్లరును మఱచిరి. రాస్మణి శూద్రకులస్త్రీ. అందుచే సద్బ్రాహ్మణుఁ డెవ్వడును పురోహితుఁడుగా నుండుటకుఁగాని, దేవాలయ ప్రసాదము స్వీకరించుటకుగాని యొప్పుకొనఁడు. రాణికి దిక్కు తోఁపలేదు. ప్రతిష్ఠాపన మాఁగిపోవుటయేకాక, తన యిష్ట దేవతయగు కాళికాదేవికి అన్నపునైవేద్యమును సమర్పించు కొనవలయునను చిరకాలవాంఛితముకూడ భగ్నమగును. అన్నపునైవేద్యమును బ్రాహ్మణుఁడుతప్ప మఱెవ్వరును సమ ర్పింప నర్హుఁడు కాకపోవుటచే, తనకై యీ యర్పణమొనర్చు బ్రాహ్మణుఁడు దొరకనిచో, సర్వప్రయత్నము విఫలమగును. అయినను, ఆమె నిరాశ చెందక, పూర్ణప్రయత్నములు చేయఁ బూని అనేకపండితుల కుత్తరములు వ్రాసెను. కాని ప్రత్యు త్తరములన్నియు నుత్సాహభంగకరములుగనే యుండెను. తన మనోరథసిద్ధికి దారితీయు సాయ మిఁక నేమి లభించునని నిరాశనొందుచుండఁగా, రామకుమారుని యుత్తరము వచ్చి నది. కాళికాదేవాలయపు సొత్తునెల్ల, దేవాలయ సంరక్షణకు చాలినంత యాదాయముతోఁగూడ, నొక బ్రాహ్మణునకు దానముచేసినచో, నా బ్రాహ్మణునియొద్ద నర్చకపదవి నొప్పు కొనుటనుగాని, ప్రసాదము స్వీకరించుటనుగాని, శాస్త్రములు నిషేధింపవని ఆయన వ్రాసెను.

కాని శాస్త్రము లంగీకరించు మాత్రముచే చిక్కు తొలఁగిపోవునట్లు లేదు. శాస్త్రానుగుణముగా పూజావిధాన

మును జరుపఁగల పవిత్రవర్తనుఁడును, భక్తుఁడును నగు బ్రాహ్మణుఁడు లభించు టెట్లు? దేవాలయము బ్రాహ్మణునకు దత్తమైనను శూద్రస్త్రీ నిర్మితమను నిరసనభావము జనులకు కలదు. అర్చకపదవి నంగీకరించు టటుండఁగా సద్బ్రాహ్మణు లా దేవికి బ్రణమిల్లుటకుఁగూడ నొప్పుకొనరు. ఎవరైన నంగీకరించినచో కులముఁ గోల్పోవుదురు! ఈ సమయమున రాస్మణి జమీందారీలో నుద్యోగియు, రామకుమారునికి స్నేహితుఁడు, నగు శిహోరుగ్రామవాసి మహేశచంద్రచటర్జీ యనునతఁడు తన యన్నయగు క్షేత్రనాథుని రాధాకృష్ణ దేవాలయమున కర్చకునిగా నియమించెను. కాని విశ్వప్రయత్నములు చేసినను కాళికాదేవి యర్చన కర్హుఁడైన బ్రాహ్మణుఁడు దొరకలేదు. ఇట్టిస్థితిలో మహేశచంద్రుని బుద్ధి రామకుమారునివంకకుఁ దిరిగెను. ఆయన పాండిత్యమును, భక్తియు, నితరయోగ్యతలు, నతనికి తెలియును. కాని శాస్త్రనియమములు జవదాఁటని చటర్జీకుటుంబములోనివాఁడగు నతని యంగీకారము లభించునా? ఎట్లైనను ప్రయత్నింతమని తీర్మానించుకొనెను. రాణికి తనతీర్మానము తెలిపి, తన్నతనియొద్దకుఁ బంపుమని కోరెను. రామకుమారుని యుదారభావమేకదా ఆమెకిప్పటి కుపకరించినది! అందుచే నాతనియెడ నామె కపార గౌరవము కుదిరియుండెను. కావున వెంటనే మహేశచంద్రుని సలహా నంగీకరించి, యతనిచేత రామకుమారున కొక జాబు పంపెను. కాళికాలయ సంప్రోక్షణ ప్రయత్న మాతని సలహా వలననే సుసాధ్యమైనదనియు, శుభముహూర్తముకూడ నిర్ణయింపఁబడెననియు, ప్రతిష్ఠాపనోత్సవమును జయప్రదముగా జరుపుట కర్హుఁడైన యర్చకుఁడు లభింపలేదనియు, ఈ కష్టము

నుండి దరిచేర్చుటకై తననే నమ్ముకొనియున్నాననియు, ఇట్టి పవిత్రమైనట్టియు, చాల బాధ్యతగలట్టియు కార్యమునకు సదాచారసంపన్నుఁడును, విద్వాంసుఁడును నైన తనవంటి యర్చకునే నియమింపఁగోరుచున్నాననియు, నాయుత్తరములో వ్రాసెను. మహేశుఁడు రామకుమారునికడకుఁబోయి రాస్మణి కోరికను దెలిపి, విషయమంతయు బోధపఱచి, సమర్థుఁడైన బ్రాహ్మణుఁడు లభించువఱకు శ్రీ కాళికార్చనను చేయుచుండు మని ప్రార్థించెను. ఈ నియమము ప్రకారమే యతఁడా యర్చకపదవి నంగీకరించెను కాని, రాస్మణియును మథురాబాబును తనయెడలఁ జూపుచుండిన ప్రేమగౌరవముల కలరి, తన జీవితశేషమునంతయు నచ్చటనే కడపెను.

సంప్రోక్షణ మహోత్సవము జరిగినది. అఖండజ్ఞాన చైతన్యస్వరూపిణియగు శ్రీవిశ్వేశ్వరి నా సుందర శిలావిగ్రహములో శాశ్వతముగా సాక్షాత్కరించుట కావాహన చేసిరి. రాస్మణికోరిక ఫలించినది. ఆమె హృదయము సంతోషముతో నుప్పొంగిపోయెను. ఆమెయసామాన్య భక్తిచేతను, సమర్థుఁడగు నర్చకుని నిర్మల ప్రపత్తిచేతను, ఆవిగ్రహము సచేతనమైనట్లే ప్రకాశింపసాఁగెను. నాఁటినుండి దక్షిణేశ్వరాలయము క్రూరసంసారవ్యాఘ్రదంష్ట్రావిదారితహృదయులైన యనేకజనులకు శాంతిధామమై వెలయుచున్నది. విజనములగు రమణీయారామములతో, లతానికుంజములతో, పవిత్రవాతావృతమై, పావనగంగానదీతీరస్థమై, యచిర కాలముననే తన యునికిచే దానికి శాశ్వత పావనతఁ జేకూర్పనున్న యొక దివ్యపురుషుని యాగమనముచే, నీదేవాలయము భక్తులకును, పరమార్థ జిజ్ఞాసువులకును ప్రియమైనపుణ్యక్షేత్ర

మయ్యెను. ఇప్పటికిని ఆ దేవాలయగోపురములను, అచ్చటి వృక్షశిఖరములను పడవవాండ్రు రాణిరాస్మణియొక్క పవిత్ర శీలమునకు స్మారకచిహ్నములుగా చూపుదురు. యాత్రికులు భక్తిపూరితులై శ్రీవిశ్వేశ్వరికి ప్రణమిల్లుదురు.

సంప్రోక్షణమహోత్సవమునుగుఱించి శ్రీ రామకృష్ణుఁడు తన శిష్యులతో ముచ్చటించువాఁడు. కాశీయాత్రకొఱ కించుమించుగా నూఱు పడవలు, వానికి తగిన హంగులతోఁగూడ, సేకరించుకొని రాణి యేర్పాట్లు చేసియుండుటయు, ప్రయాణదినమునకు పూర్వపురాత్రి దేవి యొసఁగిన స్వప్నాదేశమునుబట్టి ప్రయాణము మానుకొనుటయు నిజమేయని చెప్పువాఁడు. ఇట్టి యాలయ నిర్మాణమునకు గంగా పశ్చిమతీరమే యర్హమని తలంపఁబడుటచే నచ్చట పూర్ణ ప్రయత్నములు చేయఁబడెను కాని విఫలములయ్యెననియు, దక్షిణేశ్వరమునం దీ యాలయముకొఱకేర్పాటుచేయఁబడిన స్థలము మహమ్మదీయగోరీలమెట్టగా నుండి యర్ధగోళాకారముకలిగి యుండుటచే తంత్రసిద్ధాంతములప్రకారము శక్తి పూజకు అర్హమనికూడ చెప్పువాఁడు. విగ్రహనిర్మాణ మారంభమైనప్పటినుండి, ఆహారనిద్రాదికమున కఠిననియమములవలంబించుచు, రాణిరాస్మణి తనశక్తికొలఁది పూజాజపములు సలుపుచుండెననియు, పెట్టెలో తాళమువేసియుంపఁబడిన విగ్రహమున కేలాగో బూజుపట్టెననియు, రాణికిఁ గలలో శక్తి కనఁబడి, ఆపెట్టెలో నింక బంధింపఁబడియుండలేననియు, శీఘ్రముగా ప్రతిష్ఠాపనోత్సవము జరుపుమనియు జెప్పినందున, విష్ణుపూజకే కాని శక్తిపూజ కంతగా నుచితముకాని పూర్ణిమాదినమున సంప్రోక్షణముహూర్త మాకస్మికముగా నేర్పఱుప

వలసివచ్చెననియు తెలుపువాఁడు. తక్కువజాతిస్త్రీయగుటచేఁ గలిగిన చిక్కులను దొలఁగించుటకు దేవాలయమును రాణి తన కుటుంబ గురువునకు వ్రాసియిచ్చుటఁగూడ నాయన స్థిర పఱచువాఁడు. ఇంతేకాక సంప్రోక్షణమెంతవైభవముగా జరిగెనో, ఆ పుణ్యస్థలము భజనలతో, నాటకప్రదర్శనములతో, పురాణగోష్ఠులతో నెట్లు ప్రతిధ్వనించెనో, దీపాలంకరణము లెంత శోభాకరములుగనుండెనో, యిట్టివెన్నో వివరములు కూడ చెప్పువాఁడు.

* శ్రీరామకృష్ణుఁడాదినమంతయు నుత్సవపువేడుకలు చూచుచుండియు, దేవాలయములో భోజనముచేయక, యొక కాని పేలాలుమాత్రముతిని, సాయంకాలము ఝామాపుకుర్ పాఠశాలకు తిరిగివచ్చెను. ఉత్సవానంతర మించుమించొక వారమువఱకు రామకుమారుఁడింటికి రాకపోవుటచే దక్షిణేశ్వరము వెళ్లి విచారించెను. అచ్చట రాస్మణి మిగుల బతిమాలుకొనినందున అర్చకపదవి నతఁడు శాశ్వతముగా నంగీకరించెనని విని, తమ తండ్రిచే నతినిష్కర్షగాఁ బాటింపబడుచుండిన చటర్జీ కుటుంబసంప్రదాయములకు భిన్నముగా శూద్రులక్రింద కొలువుచేయుట కుటుంబ యశస్సునకు లోపమని యెంతయో వాదించెనుగాని, రామకుమారుఁడు శాస్త్ర ప్రమాణములు చూపి తన నిర్ణయమును సమర్థించుకొనఁజూచెను. చివరకీ వాదమువలన నుపయోగము లేదని, చీట్లు వేసిరి. తత్ఫలితము రామకుమారునకే యనుకూలముగ నుండుటచే నది భగవ

---

* ఇంతటినుండి గదాధరుఁడనుటకు మాఱు సుప్రసిద్ధమగు శ్రీ రామకృష్ణనామము వాడెదము. ఈపే రాయనకెట్లు వచ్చెనో తెలియదు. రాణిరాస్మణి యల్లుఁడగు మథురాబాబు పెట్టెనని యాయనే చెప్పెనఁట.

త్సంకల్పము కానోపు నని శ్రీరామకృష్ణుఁడు తృప్తిపడెను. కాని, దేవాలయ ప్రసాదమును తీసికొనుటకు మాత్ర మంగీకరింపఁడయ్యెను. చివరకు రామకుమారుఁడు పరమ పవిత్రమగు గంగాతీరమున వంటచేసికొమ్మని బోధింపఁగా, నంగీకరించి, స్వయముగా వంటచేసికొని తినుచు, నన్నతో నివసింప నారంభించెను.

కాని కొలఁది కాలములో నాయన తన నూతనపరిస్థితుల కనుగుణముగా ప్రవర్తింపఁగలిగెను. ఆ యేకాంతస్థలమందలి పవిత్రవాతావరణము : సోదరుని వాత్సల్యము : రాణిరాస్మణి మథురాబాబులుచూపు గౌరవము : అనన్యసామాన్యభక్తితో నర్చింపఁబడుచు పిలిచినంతనే "ఓ" యని పలుకు శ్రీ కాళికా దేవి సాన్నిధ్యము : ఇవన్నియు నతని హృదయమును చూఱ గొని అందు మహాపరివర్తన మొనర్చెను.

శ్రీరామకృష్ణున కెల్లప్పుడును గంగానదిపట్ల నిశ్చల భక్తి. "బ్రహ్మపదార్థ మెంత పవిత్రమో గంగాజలముగూడ నంత పవిత్రము. గంగాతీరమందు నివసించినంతమాత్రమున నెట్టి నాస్తికుఁడైనను మహాభక్తుఁడగును. గంగానదీతుషారపూరితమైన గాలి ప్రసరించు ప్రదేశమంతయును పవిత్రమైనది. ఆ ప్రదేశమందలి జనుల కప్రయత్నముగ నాధ్యాత్మికప్రబోధము కలుగును" అని యాయన తఱచు చెప్పువాఁడు. భక్తుఁ డెవ్వఁడైన దీర్ఘలౌకికప్రసంగములు చేసినను, లౌకికసహవాసము చేసినను, గంగాజలమొకింత త్రాఁగుమని చెప్పును. విశేషలౌకికవిషయాధీనమనస్కుఁడైన వాని స్పర్శచే నే ప్రదేశమైనను కలుషితమైనచో, నచట గంగాజలము చల్లించును. గంగానదియందిట్టి గాఢభక్తి యాయనకు బాల్యము

నుండియు కలదు. కావుననే గంగానది పేరిట రామకుమారుఁడు హెచ్చరించుటతోడనే, యాయన యాహారవిషయిక సందేహములెల్ల పటాపంచలయ్యెను.

దేవాలయప్రసాదము స్వీకరింపకుండుట ఛాందసలక్షణమని కొందఱు భావింపవచ్చును. కాని శ్రీగురుదేవుని వర్తన మట్టిది కానేకాదు. శాస్త్రోక్తియందును, కుల కుటుంబాచార నియమములందును, ఆయనకుఁగల పరిపూర్ణనిష్ఠయే ఆచర్యకుఁ గారణము. కాని తరువాత దేవీభక్తి యధికమై, ఆమెప్రసాద మత్యంతపవిత్రమనియుఁ, దద్విషయమున జాతివిచక్షణలకెంత మాత్రము తావులేదనియు, దృఢవిశ్వాసమేర్పడుటతోడనే, యాయన కులసంబంధములైన యడ్డంకుల కతీతుఁడై సంతోష పూర్వకముగ ప్రసాదాన్నమును భుజింప నారంభించెను. ప్రవర్తనను దిద్దుకొనవలసిన యావశ్యకమునుగూర్చి శ్రీ గురుదేవుని జీవితమందలి ఈ స్వల్పవిషయ మెట్టి గుణపాఠమును బోధించుచున్నది!



## దేవీసాన్నిధ్యము

కొలఁది వారములలోనే కాళికాలయములో నొక యపూర్వ యువకుని యునికి మథురాబాబునకు గోచరించెను. ఆ బాలుఁ డతని ననిర్వచనీయ విధమున నాకర్షించెను. పేరు ప్రతిష్ఠలు లేని నిరాడంబరుఁడైన యొక బీదబ్రాహ్మణ బాలుఁడు తన్నిట్లాకర్షించుట కతఁడు వింతపడెను. అతఁడు రామ కుమారుని కనిష్ఠసోదరుఁడని తెలియఁగానే, కాళికాలయములో నేదో పనికి నియమింపఁగోరి, రామకుమారునితోఁ బ్రస్తావించెను. కాని యాయన తన సోదరుని చిత్తవృత్తి యపూర్వమైన దనియు, కార్యబద్ధుఁడగుట కతఁ డిష్టపడఁ డనియు విశదపఱచెను. ఇట్లు నిరుత్సాహపఱుపఁబడియు, మథురుఁడు తన యుద్దేశమును పూర్తిగా విడిచిపెట్టక, దానిని సాధించుకొను నవకాశముకై వేచియుండెను.

ఇపుడు, మన కథారంగమున శ్రీరామకృష్ణున కిప్పటి నుండి యిరువదియైదేండ్ల పర్యంతము తోడునీడయై మెలఁగ నున్న మఱియొక యువకుఁడు ప్రవేశించుచున్నాఁడు. శ్రీరామ కృష్ణుని కఠోరసాధనకాలమం దాయనకు సర్వోపచారములు చేయుచు, నాయన దివ్యానుభవములకెల్ల సాక్షిగా నుండిన హృదయరామ ముఖోపాధ్యాయుఁడను నీ బాలుఁడు శ్రీరామ కృష్ణుని మేనత్త కొమార్తె హేమాంగినీదేవికి పుత్త్రుఁడు. శ్రీరామకృష్ణునకన్న నితఁడు కొంచెము చిన్నవాఁడైనను, వీరిరు వురును బాల్యమునుండి యెక్కువ కలసి మెలసి యుండువారు. శ్రీరామకృష్ణుఁ డెన్నోసార్లు వీరి స్వగ్రామము శిహోరుపోయి

ఇతనితో చాలకాలము నివసించువాఁడు. ప్రస్తావకాలము నాఁటికి హృదయుఁడు పదునాఱేండ్లవాఁడు. సమీపపట్టణమగు బర్ద్వానులో నుద్యోగము లభింపక, మేనమామల * ప్రాపకముతో దక్షిణేశ్వరములోఁ బ్రయత్నించుటకై యట కేతెంచెను. చిన్ననాఁటినుండియుఁ దనకత్యంతప్రియుఁడగు హృదయుని రాకకు శ్రీరామకృష్ణుఁడు మిక్కిలి యానందించెను. ఆయన మానసిక విధానము కొంత యెఱిఁగినవాఁడగుటచే హృదయుఁ డాయన చర్యలపై వ్యాఖ్యానమేమియు చేయక సేవచేయుచుండెను. ఆయన యత్యద్భుత వ్యక్తిత్వముచే ముగ్ధుఁడనై యాయన నెల్లప్పుడును నీడవలె ననుసరించుచుండువాఁడనని హృదయుఁడే చెప్పువాఁడు. భోజనకాలమందు తప్ప వారెల్లప్పుడును గలసి పనులు చూచుకొనుచుండువారు. శ్రీ గురుదేవునకు గంగాతీరమున వంటచేసిపెట్టుచు, తాను మాత్రము కాళికాలయములోనే భుజించుచుండెను.

హృదయుఁడు దక్షిణేశ్వరమునకు వచ్చుట భగవత్సంకల్పమనియే చెప్పవలెను. అతఁడు చాల బుద్ధిశాలి. పొడవుగ, నందముగ నుండును. దృఢశరీరుఁడు, నిర్భయుఁడు, అసాధారణ కార్యశూరుఁడు, మేనమామ సేవయం దెంతటి కాయకష్టమునైనను సంతోషపూర్వకముగ సహించు నుత్సాహి. శ్రీ గురుదేవుఁడు దివ్యభావావేశముచే సమాధినిమగ్నుఁడై శరీర సంరక్షణ మేమాత్రమేనియు చేసికొనఁజాలకున్న కాలమున నిట్టివాని సాన్నిధ్య మాయన కత్యంతావశ్యకమయ్యెను.

---

* వంగదేశమున పినతండ్రి పెత్తండ్రి బిడ్డలవలెనే మేనత్తబిడ్డలు కూడఁ దోఁబుట్టువులుగ భావింపఁబడుదురు. అందుచే శ్రీ గురుదేవునకు హృదయుఁడు మేనల్లుఁడు. 'మామా' అని యాయనను పిలుచువాఁడు.

మథురుఁడు తనయెడ శ్రద్ధవహించుచుండుటేకాక, తన్ను కాళికాలయమున నియమింపఁ జూచుచున్నాఁడనికూడ గ్రహించి శ్రీ గురుదేవుఁ డతనికంటఁబడకుండ తప్పించుకొను చుండెను. ఒకనాఁ డాయన ఆవరణములో నొకచోట శివ పూజ చేసికొనుచుండెను. పూజానిమగ్నుఁడైన యాయనను మథురుఁడు దూరమునుండి చూచి సమీపించెను. జీవకళ యుట్టిపడుచుండిన యా సుందరవిగ్రహమునుఁ జూచి యచ్చెరు వొంది, యది శ్రీగురుదేవునిచేతనే చేయఁబడినదని విని, హృద యుని సహాయమున నాయన యనుమతితో నా విగ్రహమును పూజానంతరము తీసికొనెను. తదనంతర మతఁడు రామకుమా రుని ద్వారమున మరల శ్రీ గురుదేవునికై యత్నించెను. కాని మరల నపజయమునే పొందెను.

శ్రీరామకృష్ణునికి సేవకవృత్తియెడ నపరిమితమైన యసహ్యము. కామకాంచన వ్యామోహములను గెలిచి, యపరోక్షజ్ఞానసిద్ధిఁ బడయుటే జీవితపరమార్థమని యాయన యభిప్రాయము. కాని ఆ దేవాలయావరణమందే నివ సించుచు, మథురు నెన్నాళ్లు తప్పించుకొనుట సాధ్యము! ఒకనాఁ డాయనయు హృదయుఁడును కాళికాలయ సమీ పమున నుండఁగా మథురుఁడు చూచి వెంటనే పిలిపిం చెను. శ్రీ గురుదేవుఁడు సందేహించుచుండ, హృదయుఁడు "ఏల సందేహించుచున్నా"వని యడిగెను. "పోఁగానే ఉద్యోగమంగీకరింపుమని యతఁడు కోరును" అని యాయన బదులుచెప్పెను. "అందు తప్పిదమేమున్నది? మథురుఁడు సజ్జనుఁడు; నియమనిష్ఠాపరుఁడు. అతనిక్రింద పనిచేయుటలో గౌరవహానిలేదు" అని హృదయుఁడు చెప్పెను. "జీవనముకై

పరాధీనుఁడనగుట నాకిష్టము లేదు. ఇదిగాక కాళికాలయములో కొలువనిన, దేవియమూల్యాభరణములను స్వాధీనమందుంచు కొను మహాబాధ్యత కలదు. ఆ బాధ్యతవహించుటకు నీ వంగీకరించుచో, మథురుని కోరిక తీర్పఁగలుగుదునేమో" అని ప్రత్యుత్తరమిచ్చెను. ఉద్యోగముకొఱకే వచ్చిన హృదయుఁడందులకు వెంటనే సమ్మతించెను. మథురుఁడిద్దరిని దేవికొలువున నియమించెను. దేవి వస్త్రాద్యలంకరణము శ్రీరామకృష్ణుని పని. ఆయనకును రామకుమారునకును సాయముచేయుట హృదయునిపని. ఇదంతయు దేవాలయ ప్రారంభోత్సవమైన మూఁడు నెలలలోనే జరిగినది.

ఇట్లు కాళికాలయములో నియమితుఁడైన కొలఁది కాలములోనే ఒక విశేషసంఘటనవలన నాయనయెడ రాణి రాస్మణికిని, మథురునకును గౌరవమతిశయించెను. పూజానంతర మనుదినమును రాధాకృష్ణవిగ్రహములను ప్రక్కనున్న పడకగదిలోనుంచుట యాచారము. ఈ విగ్రహముల నుదయమునను, సాయంకాలము నాలుగుఘంటలకును, తిరిగి వానిస్థానముల నుంతురు. కృష్ణాష్టమికి మఱునాఁడు దేవాలయపు పాలరాతినేలమీఁదుగ పడకగదిలోనికి విగ్రహములను తీసికొనిపోవుచు అర్చకుఁడగు క్షేత్రనాథుఁడు జాఱిపడినందున కృష్ణవిగ్రహముయొక్క కాలు విఱిగిపోయెను. క్షేత్రనాథుఁడు వెంటనే పనిలోనుండి తొలఁగింపఁబడెను. ఇట్లు జరుగుట రాస్మణియొక్క కుటుంబమునకు దుశ్శకునమని తలంపఁబడెను. విఱిగిన విగ్రహము పూజకు పనికిరాదనియు, దానిని గంగానదిలోఁ బాఱవేసి క్రొత్తవిగ్రహము ప్రతిష్ఠింపవలెననియుఁ బండితులు తీర్మానించిరి. క్రొత్తవిగ్రహముకొఱకు వెంటనే

యుత్తరువయ్యెను. కాని, తాను పూజించుచుండిన విగ్రహమును గంగపాలు చేయుటకు భక్తురాలైన రాణికి మనసొప్పలేదు. అప్పుడప్పుడు శ్రీ గురుదేవుని పారవశ్యస్థితులు జూచుటచే నాయన యెడల నిదివఱకే గౌరవభావము కలిగియుండిన మథురుని సలహాపై నామె శ్రీ గురుదేవుని యభిప్రాయమడిగెను. అంతయువిని యాతఁ డతీంద్రియావస్థయం దిట్లు చెప్పెను: "పండితుల నిర్ణయము హాస్యాస్పదము. ప్రమాదవశమున రాణిగారి యల్లుని కాలు విఱిగినచో నతనిని విడనాడి అతని స్థానమున మఱియొకరి నుంచునా, చికిత్స చేయించునా? ఇచ్చటను అదియే మార్గము. విగ్రహమును బాగుచేయించి యథాప్రకారము పూజింపనగును." ఈ యద్భుతమార్గమును విని పండితులెల్ల రాశ్చర్యపరవశులైరి. హృదయమునుండి వెలువడినదగుటచే ఈ తీర్మానము చులకనగానుండియు, పరమ తృప్తికరముగ నుండెను. పండితులకది మొదట నచ్చక పోయినను, చివరకంగీకరింపవలసినవారైరి. రాణి యానంద మునకు మేరలేదు. విగ్రహశిల్పమున శ్రీ గురుదేవునకుఁ గల నైపుణ్యము తానిదివఱకే యెఱిఁగియుండుటచే "విఱిగిన కాలి నతికింపుఁ" డని యామె ప్రార్థింపఁగా, ఆయనయు నందుల కొప్పుకొనెను. బాగుచేసినతరువాత నెంత జాగ్రత్తగా పరిశీలించినను, అతుకేమాత్రమును కానరాకుండెను! మథురుని కోరికపై రామకుమారుఁడు ప్రోత్సహింపఁగా, శ్రీ రామకృష్ణుఁడు క్షేత్రనాథుని పని నంగీకరించెను. కాళికాదేవి నలంకరించుటయందు రామకుమారునకు సాయము చేయుటకు హృదయుఁడు నియమింపఁబడెను.



## శ్రీ విశ్వేశ్వరీ ప్రథమదర్శనము

నిశ్శబ్దముగను, నిగూఢముగను ప్రపంచములోనికి వత్తురు, మెఱపుతీఁగలవలె తెప్పపాటులో మాయమవుదురు. వారినిచూచువారే కొద్దిమంది. గ్రహించువారంతకన్న కొద్దిమంది, అనుసరించువారింకను కొద్దిమంది. సర్వకాలము లందును, సర్వదేశములందును, మహాపురుషుల—మతప్రవక్తలయు, మహాజ్ఞానులయు, అవతారమూర్తులయు—జీవిత చరిత్ర ప్రాయికముగా నిదియే. పండ్రెండుగురు శిష్యులను మాత్రమే భూమిపై దిగవిడిచి సామాన్యదోషివలె శ్రీక్రీస్తుప్రభువు సిలువపై మరణింపవలసివచ్చెను. ఈ శిష్యులలోఁగూడ కొందఱాయనను విచారణసమయమున త్యజించిరి. కాని, యిప్పుడాయన నాదర్శపురుషునిగా నెన్నికోట్ల జనులు స్వీకరించిరో చూడుఁడు! బుద్ధదేవుఁడీ ప్రపంచమును విడిచివెళ్లినప్పటి కాయన యనుచరుల సంఖ్యబహుస్వల్పము. ఇరువదియైదు శతాబ్దములు కడచినతర్వాత నేఁడు ప్రపంచములో మూఁడవభాగ మామహాత్ము నారాధించుచున్నది. అయినను ప్రపంచ మింకను వారిని పూర్తిగా గ్రహింపలేదు! ఇది చిత్రమా? మన సంకుచితదృష్టితో వారిని గ్రహించుటెట్లు? బలవంతులకే బలము బోధపడును. సింహము ఘనత యేనుఁగునకుఁగాక పిచ్చుకకు తెలియునా? మహత్త్వమును మహత్త్వమే గ్రహింపఁగలదు. భగవంతుని భగవంతుఁడే తెలిసికొనఁగలఁడు. నిజమగు క్రీస్తు, నిజమగు బుద్ధుఁడు, మనయందే యున్నారు. కాని యా సత్యము మనకు బోధ

పడినఁగాని మనము క్రీస్తును, బుద్ధుని ప్రత్యక్షపఱచుకోఁ జాలము. మనకిప్పు డత్యంతసత్యములుగాఁ దోఁచు పుణ్యాపాపములు, జ్ఞానాజ్ఞానములు, సుఖదుఃఖములు, సత్యాసత్యములు, మున్నగుద్వంద్వములన్నియుఁ గేవల మనఃకల్పితములు, ఒకేనాణెముయొక్క రెండుముఖములు, అను జ్ఞానము కలిగినచో మన దృక్పథమంతయు మాఱిపోవును. మన కిప్పుడు అనుభవైకవేద్యముగానుండు భిన్నతయంతయు—తల్లి, తండ్రి, ఇల్లు, నీది, నాది మొదలగు భిన్నత—అదృశ్యమై మఱియొక సృష్టి, మఱియొక ప్రపంచము, గోచరించును. మహాపురుషుల కా ప్రపంచము కరగతము. మనముకూడ దాని నందు బాటులోనికిఁ దెచ్చుకోవలయుననియే వారి బోధ.

శ్రీరామకృష్ణుని జీవితమునం దిఁక ప్రారంభము కానున్న నూతనాశ్వాసముయొక్క రామణీయకము, ప్రాభవము, ఔన్నత్యము, సారస్యము, దేవీపాద సన్నిధియం దాముముక్షుఁడు చేసికొనిన యాత్మార్పణము, లోకజనని సందర్శనముకై యతఁడనుభవించిన దుర్భర సంతాపము, అతఁడు చేసిన యత్యంత కఠోర సాధనలు, తత్ఫలితముగా లభించిన భగవత్సాక్షాత్కారము, భగవంతునితో తనకుఁ గల సంబంధమును దెలిసికొనుట, దానియందు సుస్థాపితుఁడగుట, ఇవన్నియు నత్యంత మనోహరములు. ఇట్టి మహోన్నతాధ్యాత్మికసిద్ధికి లోకోద్ధారకులగు నితరమహానుభావుల దివ్యానుభూతి యొక్కటియే సమానము కాఁగలదు. ఈ సహస్రపత్రపద్మము సమగ్రవికాసము నొంది, దశదిశలను నిజదివ్యపరిమళసాగరమున ముంచివేయుటకు తోడ్పడిన యా హృదయసంచలనములో, ఆత్యాగములో, నిర్మలస్ఫటిక

సమానమైన ఆచిత్తశుద్ధిలో, భగవంతునికొఱకైన ఆమహో త్సాహములో, శతాంశమునైనను పాఠకులకు వ్యక్త పఱచుట అసాధ్యము. భగవంతుని సందర్శింపవలెనను వాంఛ యీమహానుభావునిహృదయము నెంత తీవ్రతతో, నెంత యనివార్యపాటవముతోఁ, గలఁచివైచెనో కాని, ఆయనజీవితమునందు పండ్రెండు కఠినసంవత్సరములు భగవ ద్ధ్యానప్రమత్తచిత్తవృత్తియందే కడచెను. ఈ కాలములో నర్ధభాగము నిద్రయెఱుఁగఁడు. కనుఱెప్పలు మూయనేలేదు! ఆఁకలిదప్పులు మున్నుగాఁగల శరీరధర్మములు కూడ మఱచెను. బాహ్యప్రపంచమేమైనదికూడఁ దెలియదు, ఆ పండ్రెండేండ్లలోఁ బ్రతిదినము, ప్రతినెల, ప్రతిసంవత్సరము, ఆధ్యాత్మిక మహాంభోధిలో మునిఁగియే యుండెను. సామాన్యదృష్టి కతఁడు వెఱ్ఱివాఁడే!

శ్రీరామకృష్ణుఁడు రాధాకృష్ణాలయములో నర్చకుఁడుగా నియమింపఁబడెను. ఆయన పూజాపద్ధతికిని, ఇతరుల పూజాపద్ధతికిని, చాల భేదముకలదని మథురునకు త్వరలోనే గోచరించెను. విగ్రహము నాయన ప్రత్యక్షభగవంతునిగనే భావించి వ్యవహరించుచుండును. పూజాకార్యమున కాసీనుఁడై యున్నప్పుడు, బాహ్యప్రపంచస్మృతిఁ గోల్పోవును. ప్రేక్షకుల యునికియే తెలియదు. ఒక్కొకప్పుడు గంటల కొలఁది చేష్టలుదక్కి కూరుచుండును. ఇట్టిసమయములం దీయనను సాధారణమానసికస్థితికిఁ దీసికొనివచ్చుట బహుకష్టసాధ్యము. వివిధమంత్రముల నుచ్చరించునపుడు ఇతర అర్చకులు కేవల మూహించుకొనవలసిన విషయములు లాయనకుఁ బ్రత్యక్షముగాఁ గనఁబడుచుండును. తనచుట్టు నగ్నిజ్వాల

యున్నట్లు భావించుకొనుమని యర్చకుని నాదేశించు 'రం' అను బీజాక్షరము నుచ్చరించునపు డాయనకు తాను నిజముగా జ్వాలావలయముయొక్క మధ్యనున్నట్లును, ఆ జ్వాల తనను, పూజాస్థలమును, దుష్టసంపర్కమునుండి సంరక్షించుచున్నట్లును తోచును. మఱియు, కుండలినీశక్తి వెన్నెముకయొక్క దిగువకొననుండి సుషుమ్నామార్గమున, వెన్నెముకలోనుండు నాఱు కేంద్రస్థానములలో నొక్కొకదానిని దాటి పై కెగయుటయు, నా కేంద్రములలో ముకుళితములై, యధోముఖములై యుండిన పద్మములు దాని స్పర్శచేఁ బూర్ణముగా వికసించి, యూర్ధ్వముఖములై నిక్కపొడుచుకొని నిలుచుటయు, నది చివరకు కపాలాంతర్గతమగు సహస్రారపద్మమును చేరుటయు, నతనికి ప్రతిదిన మనుభవవేద్యములు. పూజాసమయమున నాయన ముఖమునందలి దేదీప్యమానమైన తేజస్సును, ఆయన ధ్యాననిమగ్నతను, ఆయన నిర్మించు పవిత్రవాతావరణమును, చూచినవారు, శాస్త్రములలో వర్ణింపఁబడిన బ్రాహ్మణతేజ మచ్చట మూర్తీభవించెనని తలంతురు. అట్టి భావోద్రేకమును, భక్తిని, ఇంతకుముందెవ్వరును జూచియెఱుఁగరు.

శ్రీగురుదేవుఁడు తన నూతనోద్యోగమున కలవాటుపడి ఇతరచింతల నెల్ల మఱచిపోయెను. అందుచేఁ గుటుంబక్షేమముపై తన దృష్టిని మరల్చుటకు రామకుమారున కిపుడవకాశము కల్గెను. తన అవసానకాలము సమీపించుచున్నదని గ్రహించి, దక్షిణేశ్వరమున తన యుద్యోగములోనికి తనతర్వాత తన సోదరులలో నొకరు ప్రవేశింపఁగల్గు నెడల కుటుంబపోషణము నిరాఘాటముగ జరుగఁగలదని యాతఁడు నమ్మెను. కాని శ్రీ గురుదేవుఁడు నిర్జనస్థలములం దేకాంత

ముగ నుండుటయు, ప్రపంచముపట్ల నిర్లిప్తతఁ జూపుటయు, నతనికి సంతాపకరముగ నుండెను. ఆలయములలోని వేడుకలలోఁ బాల్గొనియానందించుటకు బదులు, దేవాలయారామములోని నిర్జనారణ్యభాగమున నే చెట్టు క్రిందనో కాలము గడపుటయు, ఉదయ సాయం సంధ్యా వేళల గంగానదీతీరమున నొంటిగ బహుదూరము కాలి నడకను బోవుచుండుటయు, నాయన కర్థముకాలేదు. కాళికా పూజనమును స్వతంత్రముగా నిర్వహించుటకై తద్విధాన వివరములు పూర్తిగాఁ దమ్మునికి నేర్పవలెనని అతఁడు నిశ్చయించుకొనెను. విధ్యుక్తముగా మంత్రోపదేశము నొందక శక్తిపూజ చేయుట యుక్తము కానందున, శ్రీగురుదేవుఁ డీ మంత్రోపదేశ మొందుట కంగీకరించి, శక్తి పూజా విషయములో విశేషభక్తియు ననుభవమును గలవాఁడని ప్రసిద్ధికెక్కిన కేనారాంభట్టాచార్యునియొద్ద నుపదేశ మొందెను. మంత్రము చెవిని బడినంతనే భక్తిపరవశుఁడై యొక కేక వేసి గాఢధ్యానమున మునిఁగిపోయెనఁట! గురువు శిష్యుని యసామాన్యభక్తికి మిగుల నచ్చెరువొందెను.

ఇప్పటినుండి రామకుమారుఁ డప్పుడప్పుడు కాళికా పూజ తమ్మునిపైఁబెట్టి, రాధాకృష్ణపూజ తాను చేయఁ దొడఁగెను. మథురుఁ డిది యొకటిరెండుసార్లు చూచి, యొకనాఁడు కాళికాపూజ నెల్లప్పుడును చేయుచుండుఁడని శ్రీగురుదేవుని వేఁడుకొనెను. తన కాపూజావిధానము చక్కఁగాఁ దెలియదని యాయన చెప్పినను వదలక "మీకు శాస్త్రవిధాన మక్కఱలేదు. మీ విశేషభక్తిశ్రద్ధలే దేవిని తృప్తిపఱచును. ప్రేమపూర్వకముగా దేవిపాదములకు మీ

రేమి యర్పించినను ఆమె యంగీకరించును. మీ ప్రేమ భక్తిచే నామె తప్పక విగ్రహమున సాక్షాత్కరించును" అని మధురుఁడు సవినయముగాఁ బలికెను. అతని గాఢవిశ్వాసమునకు మనసుకరఁగి ఆయనయు నంగీకరించెను. రామకుమారుఁడు రాధాకృష్ణాలయమునకు మార్పఁబడెను. కాని వార్ధక్యమువలనను, అవిరామముగ నిన్నాళ్లు దేవాలయమునఁ బనిచేయుచుండినందువలనను, ఆరోగ్యము చెడి యతఁడు కొన్నాళ్లు విశ్రాంతికై ఇంటికిఁ బోవ నిశ్చయించుకొనెను. అతఁడు తిరిగి వచ్చువఱకు పనిలో హృదయుఁడు నియమింపఁబడెను. కాని ఇంటికి వెళ్లులోపలఁ గార్యాంతరమున నొక గ్రామమునకుఁ బోయి రామకుమారుఁ డచ్చటనే స్వర్గస్థుఁ డయ్యెను.

రామకుమారుని మరణము శ్రీ గురుదేవుని మనస్సున గాఢముగా నాటుకొనెను. అతిబాల్యముననే తండ్రి గతించినందున నాయన ప్రేమయంతయు నన్నయందే లగ్నమైయుండెను. అట్టి యన్న చనిపోవుటవలన సర్వమును శూన్యమైనట్లు తోఁచెను. అప్పటికే ఆయన మనస్సు దృశ్యప్రపంచపు టనిత్యత్వమును గ్రహించి, నిత్యము, అవినాశము, నగుసత్పదార్థమును సాధించు ప్రయత్నమున మహాసంక్షోభమునొందుచుండెను. అఖండశాశ్వతానందానుభవము కలిగినపుడే మానవుఁడు సర్వాపదుఃఖముల కతీతుఁడై అమరత్వమును సాధింపఁగలఁడను నమ్మక మాయనకు నానాఁటికి హెచ్చుచుండెను. భగవంతుని సందర్శింపవలెనను గాఢకాంక్ష హృదయమున తీవ్రతరదీప్తితోఁ బ్రజ్వలించుటచే, భగవద్వియోగమువలన దారుణవేదనల ననుభవించుచుండెను. ఇట్టితరుణమందే ఆయన

కాళికార్చనకు నియమితుఁడైనది. మంత్రోపదేశమునాఁటి నుండియు కాళికాదేవియే యాయన కిష్టదేవత. దేవియం దాయనకుఁ గల భక్త్యావేశ మిపుడు వేయిరెట్లెక్కువయ్యెను. పూజాకాలమందు ప్రతిదినము దేవిని చక్కని దుస్తులతోను పూవులతోను చందనముతోను అలంకరించి, విగ్రహమును ప్రత్యక్షదేవిగ భావించునే కాని, అచేతనశిలగా నెన్నఁడును భావింపఁడు. నిజమున కామనోహర విగ్రహము జీవకళ యుట్టిపడుచు, దివ్యవర్చస్సుకలిగి అసామాన్య శిల్ప నైపుణ్యమునకు లక్ష్యమై యొప్పుచున్నదని చూపఱులెల్లరు నంగీకరింతురు. దేవి విలువగల బనారసు చీరను ధరించి యుండును; ఆపాదమస్తకము నమూల్యాభరణములతో ధగ ధగలాడుచుండును. మెడలో కపాలముల హారము. తెగఁ గొట్టబడిన మనుష్యుల చేతులే మొలనొడ్డాణము. ఇవన్ని యును బంగారుతో చేయఁబడినవి. క్రింది ఎడమ చేతిలో త్రుంపఁబడిన మనుష్యశిరము. ఇదియు బంగారుదే. పై ఎడమ చేతిలో ఖడ్గము. క్రింది కుడిచేయి భక్తులకు వరములను, పై కుడిచేయి అభయమును ఇచ్చుచుండును. కపాలములును, ఖడ్గము నామె రౌద్రస్వభావమును, వరాభయములు ప్రసాదించు కుడిచేతు లామె దయాస్వభావమును వ్యక్తీకరించు చుండును. ఒకవైపున లయమొనర్చుచు, మఱియొకవైపున సృష్టిచేయుచుండు ప్రకృతివలెనే, యామె మూర్తి రౌద్రముగను, శాంతముగనుగూడ కానిపించును. శ్రీ గురుదేవుఁ డనుదిన మర్చించుచుండిన దేవి ఆమెయే. లోకసంహారిణియు, లోకసంరక్షిణియుఁగూడ నామెయే. కాని శ్రీ గురుదేవునకు మాత్ర మామె సర్వదా వర్ణనాతీత ప్రేమ నిలయమైన తల్లి;

ఎల్లప్పుడును శాంతము, దయ, మాతృవాత్సల్యము వెల్లి విరియు శుభప్రదమైన దివ్యశక్తి. భక్తుల కెట్టిహానియు కలుగకుండ బహుప్రేమజాగరూకతలతో కాపాడు విశ్వమాత. అజ్ఞానాంధకారములోఁ బడియుండు లోకులకుఁ ద్రోవచూపువారామె దక్క నన్యులెవరును లేరని ఆయన విశ్వాసము.

ఆ కాలమున లౌక్యుల సంపర్కము శ్రీ గురుదేవునకు దుర్భరముగనుండెను. అపరాహ్ణకాలమంతయు నొంటిగాఁ గడపును. ఎల్లరును నిదురించు నర్ధరాత్రమున చప్పుడులేకుండ శయ్య విడిచి బయటకు పోవును. ఎక్కడికో ఎవరికిని తెలియదు. తెల్లవాఱినప్పుడే తిరిగి వచ్చుట. దీర్ఘకాలము ధ్యానము చేయుటచేతనో, యేడ్చుచుండుటచేతనో, కన్నులు వాఁచియుండును. రాత్రి యెచట నుండినది యెవ్వరడిగినను చెప్పక తప్పించుకొనును. హృదయుఁ డీ రహస్యమును కనుఁగొన నిశ్చయించెను.

శ్రీరామకృష్ణుని పెక్కేండ్ల గాఢతపోధ్యాననిష్ఠలకు నిలయమై, దేవాలయమున కుత్తరభాగమున వెలసి, యిప్పుడు పంచవటీనామమున సుప్రసిద్ధమగు ప్రదేశ మాకాలమున పగటివేళనైనను మనుష్యులకు చొరరాని ఘోరారణ్యము. దట్టముగాఁ బెరిగిన పొదలతోను, ముండ్లచెట్లతోను నిండిన ఎగుడుదిగుడు భూమి. ఎన్నఁడోకాని సూర్యరశ్మి ప్రవేశింపనందున నంధకారబంధురమైయుండెడిది. ఒకప్పుడది శ్మశానభూమియై యుండుటచే జనులెవ్వరు నచ్చటికేఁ బోవ సాహసింపరు. తన యాధ్యాత్మికసాధనలకు శ్రీరామకృష్ణుఁ డీ స్థలము నెన్నుకొని ఇచ్చటనుండిన పెద్ద యుసిరిక

చెట్టుక్రింద నపరాహ్ణకాలములలోను, రాత్రులలోను ధ్యాన నిమగ్నుఁడై యుండువాఁడు.

హృదయుని కాయనపై పరిపూర్ణ ప్రేమ. ఆయన సేవయందు మిక్కిలి యాసక్తి. ఆయనలోఁ జెలరేఁగుచుండిన దివ్యసంక్షోభము నతఁడు చూచాయగా మాత్రమే గ్రహించుటచే, నాయన యసాధారణచర్యలను భక్త్యావేశమున కారోపించి యూరకుండెను. కాని ఆహారపానీయములు మఱచి, శరీరసౌఖ్యములు లెక్కసేయక, యారోగ్యమును చెఱచుకొనుచుండుటయే గాక, యిప్పుడు రాత్రుల నిదురించుటకూడ మానుకొనుటచే హృదయుని యాకులపాటు దుర్భరమయ్యెను. అందుచే నొకరాత్రి యాయనను నిశ్శబ్దముగా వెంబడించి, యడవిలోఁ బ్రవేశించుటఁ జూచి దిగ్భ్రాంతుఁడై యచ్చటనే నిలిచి, భీతిలఁజేయుటకై రాళ్లు రువ్వి చూచెను. కాని యాయన చలింపలేదు. హృదయుఁడింటికి వచ్చెను. ఆ యడవిలో నేమిచేయుచుంటివని మఱునాఁడడిగెను. "అక్కడ నొక పెద్ద ఆమలకవృక్షము కలదు. దానిక్రింద కాళికాదేవిని ధ్యానింతును. అట్టి స్థలము ధ్యానమున కెంతయు నర్హము" అని యాయన శాంతముగా ప్రత్యుత్తరమిచ్చెను. హృదయుఁడీ సమాధానముతో తృప్తి నొందక శ్రీగురుదేవుఁడా చెట్టుక్రింద ధ్యానమునకు కూర్చుండినపుడెల్ల రాళ్లు విసరుచుండెను. కాని యాయన యతనితో నా ప్రస్తావమే చేయలేదు. కావున తెగించి యొకనాఁటి యర్ధరాత్రమున నడవిలోనికిఁ బోయెను. చెట్టుక్రింద దిగంబరుఁడై, యజ్ఞోపవీతమైనను లేక, గాఢధ్యాననిమగ్నుఁడై కూర్చుండి యుండుటఁజూచి నివ్వెఱఁగంది, "ఏల యిట్లు బట్టను, యజ్ఞోప

పీతమును దీసివైచితి’’ వని అడిగెను. కాని బదులు లేదు. బాహ్యస్మృతి వచ్చిన పిదప మరల నడుగఁగా, నాయన ఇట్లనెను: ‘‘బంధములనెల్ల విడనాడియే భగవంతుని ధ్యానింపవలసినది. మానవునకుఁ బుట్టుకనుండియు ద్వేషము, లజ్జ, కుటుంబగౌరవము, పాండిత్యగర్వము, భీతి, కీర్తి, కులము, అహంకారము, అను అష్టవిధబంధములు గలవు. ఈ యజ్ఞోపవీతమునకు నేను బ్రాహ్మణుఁడననియు, నందుచే నితరులకంటె నధికుఁడననియు నర్థము. దేవి నారాధించునప్పు డిట్టి యభిప్రాయములు త్యజింపవలెను. కావున యజ్ఞోపవీత మును తీసివేసితిని. ధ్యానానంతరము మరల ధరింతును.’’ ఈ మాటలు విని హృదయుఁ డచటినుండి వెళ్లిపోయెను.

దేవీసాక్షాత్కారము శ్రీ గురుదేవుని ఏకైకలక్ష్య మయ్యెను. ఆ మహాభక్తుని యారాధనవిధాన మపూర్వము. రామప్రసాదుఁడు, కమలాకాంతుఁడు మున్నగువారు రచించిన భక్తిపూరితకీర్తనలు పాడుటా యారాధనలో నొక ముఖ్యభాగము. అవి తన హృదయద్వారమును తెఱవఁగా నాయన దుర్భరవిషాదవేదనతోఁ దల్లినుండి యెడఁబాపఁబడిన బిడ్డవలె దీనుఁడై యేడ్చును. ‘‘అమ్మా, ఎక్కడనున్నావు? నాకు సాక్షాత్కరింపుము! రామప్రసాదుఁడు నిన్ను సందర్శించి నీ దివ్యకటాక్షముఁ బడసెను. నా కగపడకుండుటకు నేనంత పతితుఁడనా? సుఖము, ధనము, స్నేహితులు, భోగములు— ఇవేవియు నా కక్కఱలేదు. నిన్ను సందర్శించుటే నా కోరిక!’’ అని విన్నవించుకొనును. ఎడతెంపులేక ప్రవహించు దుఃఖాశ్రువులచే కన్నులు వాఁచిపోవును. ఇట్లే పగలంతయు జరిగిపోవును. దేవాలయములో సాయంకాల

పూజాసందర్భమున మ్రోఁగు ఘంటారావముచే నొక పగలు గడచిపోయినదని గ్రహించి యాయన పూర్వముకన్న నెక్కువ దీనతతో నిట్లు విలపించును. "అయ్యో! మఱియొక దినము గడచిపోయినది. అమ్మా, నీ సాక్షాత్కారము లేమిచే, నదియు వ్యర్థమైనదికదా. ఈ స్వల్పజీవితములో మఱియొక దినముకూడ గతించెను. సత్యస్వరూపిణివగు నిన్నింకను గాంచలేదు." హృదయవేదనచే ముఖమును నేలపై రుద్దుకొనును. చూపఱు లాయనచుట్టుమూఁగి "పాపము! ఈబాలునితల్లి చనిపోయెనుగాఁబోలు! ఎంత దీనముగా నేడ్చుచున్నాఁడు" అని తమ సానుభూతిని వెల్లడింతురు. వేఱొకస్థితిలో కాళికా విగ్రహమునెదుట కూర్చుండి ఇట్లు పల్కును: "తల్లీ, నీవుండుట నిజమా? ఇదంతయు మనోభ్రాంతియే నా కవితాకల్పనయా? ఉన్నచో నేనేల దర్శింపలేను? శాస్త్రోక్త సత్యము స్వప్నతుల్యమేనా? గాలిమేడయేనా?" కాని ఇట్టి సంశయము లొందియుండకముందే భగవంతుని దర్శించిన రామప్రసాదు మున్నగు భక్తుల జీవితములు స్ఫురింప, తిరిగి యిట్లు తర్కించును. "ఆమెను ప్రత్యక్షముగాఁ జూచినవారున్నారు. కావున నామెయునికి సత్యమే. అగుచో, నేను మాత్ర మేల దర్శింపరాదు? అయ్యో! జీవితము వ్యర్థమైపోవుచున్నదే! దినములు గతించుచున్నవి. ప్రతిదివసాంతముతో నామరణముకూడ సమీపించుచున్నది. కాని మాతల్లి యెక్కడ? ఈ జీవితములో సాధింపవలసినది భగవత్సాన్నిధ్య మొక్కటియేయని శాస్త్రములు వాకొనుచున్నవి. ఆ సిద్ధిని గాంచని జీవితము దుర్భరము, నిరర్థకము. భగవత్సందర్శనమైననే ఈ జీవితము సార్థకమగును, సుఖావాసమగు నుద్యాన

మగును. కావుననే భక్తులు భగవంతునికొఱకు ప్రపంచమును త్యజించి, జీవితములర్పింతురు. సచ్చిదానందనిలయము నెఱుఁగని యీ జీవితము నిష్ప్రయోజనముగదా?" ఇట్టి యూహలు తన హృదయకాంక్షను మఱింత తీవ్రపఱుప, నాయన తన యత్నములను ద్విగుణీకరించును.

ఈ తీవ్రవాంఛనుగూర్చి యాయన తన శిష్యులతో నిట్లు చెప్పువాఁడు: "ఆహా! దుర్భరవేదనా దినములెన్ని గడపితిని! నా మాతృవియోగబాధలు మీ రూహించుకొనఁ జాలరు.. ఒకగదిలో నొక పెద్ద వరహాలసంచియు, ప్రక్క గదిలో నొకదొంగయు, మధ్య పలుచనిగోడయు నున్నట్లు భావింపుఁడు. దొంగ నిశ్చింతగా నిద్రింపఁగలఁడా? ఎట్లో గోడను బ్రద్దలుగొట్టి వరహాల సంచిఁ దీసికొన యత్నింపఁడా? నాస్థితికూడ నిట్టిదే. అఖండానందపరిపూర్ణయగు జగన్మాత బహుసమీపమున నున్నదని, ఆ యానందముతోఁ బోల్చి చూచిన నైహికసంపదలెల్ల తుచ్ఛములని, నాకుఁ దెలియును. అట్టిస్థితిలో నా జగదేకమాతను జూడ యత్నింప కెట్లుండఁగలను? ఆ దర్శనవాంఛ నన్నున్మత్తుని చేసెను."

ఆహా! ఎంత గాఢ విశ్వాసము, భగవంతుఁడే యవ్యయానంద మహానిధానమని! ఘోరాతిఘోరములగు విషమ పరీక్షలను, కష్టములను ఎదుర్కొనుటకు, జయించుటకు, ఆయనకు శక్తినిచ్చిన దీవిశ్వాసమే. ఆయన భరించిన నిరతిశయ క్లేశముల నన్నిటిని భగవత్సాక్షాత్కారమను మహోజ్జ్వల కాంచనరూపమునకు మార్చిన పరశువేధి యీ విశ్వాసమే! ఆధ్యాత్మిక చరిత్రలోఁ బ్రపంచమందలి సర్వదేశములందును అలౌకికములును, అద్భుతములును, అగు మహాకార్యములను

సాధించిన దీ విశ్వాసమే. గురువులేక, యితరసహాయము లేక, శాస్త్రజ్ఞానములేక, విధ్యుక్త తపస్సాధనలైన లేక, అకుంఠితభగవద్విశ్వాసముచేతనే, తీవ్రసందర్శనకాంక్షచేతనే, యెల్ల యంతరాయముల నాయన దాఁటి, పరిపూర్ణవిజయము సాధింపఁగలిగెను.

ఇప్పటినుండి శ్రీ గురుదేవునికిఁ బూజ క్రమముగా చేయు టసాధ్యమయ్యెను. విగ్రహమునెదుట రాయివలె కూర్చుండును. ఒక క్షణము పిచ్చివానివలె ప్రవర్తించును. ఉత్తరక్షణమున పసిబిడ్డవలె నేడ్చును. పూజాకల్పములోని ధ్యానసందర్భమున తలపై నొక పుష్పముంచుకొని, రెండు గంటలకాలము నిశ్శబ్దముగ నట్లే కూర్చుండును. నైవేద్య మర్పించి, దేవి నిజముగాఁ దినుచుండిన ట్లామెపై పు తదేకదృష్టితో చూచుచుండును. ఉదయము పువ్వులుకోసి, మాలలు కట్టి, గంటలకొలఁది విగ్రహము నలంకరించును. సాయంసేవావేళ హారతినిచ్చుచు, ఎంతసేవు జరిగినదో తెలియక, హారతి ముగించుటే మఱచును. ఈ యపూర్వ చర్యలు కాళికాలయములోని యుద్యోగులకు తెలియఁ జొచ్చెను. వేళాకోళముచేయువారు కొందఱు, అపూర్వభక్తి పరుఁడనువారు కొందఱు, పిచ్చివాఁడనువారు కొందఱు! మథు రుఁడు మాత్ర మానందపరవశుఁడయ్యెను. శ్రీగురుదేవుఁడు జనుల యభిప్రాయము లేమాత్రముఁ బాటింపక యాదర్శ సిద్ధికై శక్తినెల్ల వినియోగించుచుండెను. ఆఁకలియు నిద్రయు తగ్గిపోయెను. భావోద్రేకముచే వక్షఃస్థలము, ముఖము, ఎల్లపుడు నెఱ్ఱబాఱియుండును; కన్నులు తఱచుగా బాష్ప పూరితములై యుండును. కాని ఈ యారాట మంతయుగు

వేళ సమీపించెను. ఒకనాఁ డిది దుర్భరమై జగజ్జనని నుద్దేశించి "అమ్మా! నే నెంతకాలము విలపించినను నీకు వినవచ్చుట లేదా? రామప్రసాదుని ధన్యుని చేసినావు. నన్నుకూడ ధన్యునిచేయవా?" అని భావపరవశత్వమున నేడ్చుచుండఁగా, నాయనకోర్కె యాకస్మికముగా ఫలించినది. ఈ దేవీ ప్రథమ సందర్శనమునుగూర్చి యాయన ఇట్లు చెప్పువాఁడు: "అమ్మ దర్శనముకై నే నప్పుడు దారుణవేదన నొందుచుంటిని. హృదయము నెవరో తడిబట్టవలె పిండుచుండినట్లుండెడిది. ఈ జన్మలో నామెను దర్శించు భాగ్యము పట్టదేమో యని మిగుల పరితపించుచుంటిని. వియోగతాపము భరింపలేక, బ్రదుకు నిష్ప్రయోజన మనుకొంటిని. ఈ తలంపు కలిగినవెంటనే నా దృష్టి హఠాత్తుగా దేవాలయములోని ఖడ్గముపైఁ బడినది. జీవితమును తుదముట్టించు నిశ్చయముతోఁ బిచ్చివానివలె నటకు దుమికి యాఖడ్గమును తీసికొంటిని. వెంటనే జగజ్జనని ప్రత్యక్షమైనది. దేహస్మృతితప్పి పడిపోయితిని. తర్వాత నేమిజరిగెనో, ఆదినమును మఱుసటి దినమును ఎట్లు గడచెనో నాకు తెలియదు. కాని ఎన్నఁడు నెఱుఁగని యపూర్వనిర్మలానందము ననుభవించితిని. జగజ్జనని నాకనులయెదుట ప్రత్యక్షముగా తోఁచినది." మఱి యొకప్పు డిందునుగూర్చియే యిట్లు చెప్పెను: "దేవాలయమును, ఇండ్లును, సర్వమును అంతర్ధానమై, వానిస్థానమున ననంతచైతన్యతేజస్సాగర మగపడెను. తేజోమయములగు మహాకల్లోలములు భయంకరారావముతో, నుద్రేకముతో, నన్ని వైపులనుండియు నన్ను మ్రింగివేయ సమీపించుచుండెను. ఱెప్పపాటులో నవి నాపైఁ బడి పూర్తిగాఁ జుట్టివేసెను.

ఊపిరాడక కొట్టుకొనుచు, నా తరంగములలోఁ జిక్కి, స్మృతిఁ దప్పి పడిపోయితిని.''

ఈ తేజస్సాగరములో నానందమయమైన దేవిరూపము కనిపించెనో లేదో స్పష్టముగాఁ జెప్పలేదు. బహుశః కనిపించియేయుండును. ఏలనఁగా స్మృతివచ్చినవెంటనే దీనస్వరముతో నాయన 'అమ్మా! అమ్మా!' యని గట్టిగాఁ బిలిచెను.

ఇప్పటినుండియు నీ సందర్శనభాగ్యము మరల లభింపవలెననుటయే యాయన యేకైకవాంఛ. ఒక్కొకప్పుడు వియోగవేదన దుస్సహమై భూమిపైఁ బొరలాడుచు దీనముగా ''అమ్మా! దయామయవై మఱొక్కసారి ప్రత్యక్షముకమ్ము'' అని వెక్కివెక్కి యేడ్చును. ఈ స్థితినిగూర్చి కాలాంతరమున నాయన ఇట్లు చెప్పువాఁడు: ''జనులు మూఁగిరను సంగతియే నే నెఱుఁగకుంటిని. వారు నిజమైన మనుష్యులవలెకాక నీడలవలెను, చిత్రించిన ప్రతిమలవలెను తోఁచుచుండిరి. వారియెదుట నిట్టిభావోద్రేక మగపఱచితినని నా కేమాత్రము సిగ్గు కలుగలేదు. కాని, మాతృవియోగవేదన తీవ్రమై బాహ్యస్మృతిఁ గోల్పోయిన తత్క్షణమే, జగజ్జనని తన నిరుపమాన తేజస్స్వరూపముతో, వరదాభయ ముద్రలతోఁ, బ్రత్యక్షమగును. అప్పుడామె నవ్వుచు నాతో మాటాడును, బుజ్జగించును, బోధించును.''



## దివ్యోన్మాదము

దేవీప్రథమదర్శనానంతరము శ్రీ గురుదేవునకు విచిత్రానుభూతు లెన్నియో కలిగినవి. అసాధారణదృశ్యము లగపడుచుండెను : కొన్ని పారవశ్యస్థితియందును, మఱికొన్ని సామాన్యవేళలందును. కాళికావిగ్రహముతో నొక్కొక సారి సంభాషించును. ఒంటరిగానుండియు, నెవరితోనో గుస గుసలాడును. కాళికాలయ జనమున కిది కేవలము వెఱ్ఱిగాఁ దోఁచెను. తీవ్రసాధనలవలన నరములు దుర్బలములై, మెదడు చెడెనని హృదయునకుఁగూడఁ దోఁచెను. భూకైలాసపాలకుని సంస్థానవైద్యుని చికిత్సలో కొంతకాలముంచిరి. కాని గుణము లేకపోయెను.

మనస్సు కొంచెము స్తిమితపడినప్పుడు దేవీపూజచేయఁ బ్రయత్నించినను, అది ఎప్పుడు నేదో యొక విచిత్రమార్గము పట్టును. అసామాన్యములైన దృశ్యములును, తలంపులును, పొడకట్టును. ధ్యానముచేయుట కుద్యుక్తుఁడగునప్పు డాలయమున కెదుటి మంటపపు పిట్టగోడపై నుండు భైరవశిలావిగ్రహమువలె నిశ్శబ్దముగను, నిశ్చలముగను కూర్చుందునని తీర్మానించుకొనును. పిమ్మట నేమి జరుగునది ఆయన కాలాంతరమున నిట్లు వివరించెను : ‘‘చీలమండలయొద్దనుండి పైకి కీళ్లలో నొకదానిపిమ్మట మఱొకదానికి తాళము వేయుచుండినట్లు చిత్రమైన శబ్దములు నాకు స్పష్టముగా వినిపించెడివి. ధ్యానము ముగియువఱకు కదలఁజాలను. ముగిసినపిదపఁ దల క్రిందువరుసలో కీళ్లకు వేయఁబడిన తాళము లొక్కొ

క్కటి తీయఁబడు శబ్దములు వినఁబడును. అప్పుడు మెదలఁ గలుగువాఁడను. ఒక్కొకప్పుడు వెలుతురు రేణువులు మిణుఁగురు గుంపులవలె కనఁబడుచుండును. మఱికొన్ని వేళల దేదీప్యమానమైన మంచుతెర నన్నావరించును. ఇంకొకప్పుడు కరఁగిన వెండివలె తేజోవంతములగు తరంగములు సర్వగతములై కనిపించును. కనులు మూసికొన్నప్పుడేగాక, తెఱచికొనియున్నప్పుడుఁగూడ నిట్లు జరుగును. వీని యర్థమేమో, ఇవి నా ఆధ్యాత్మికాభివృద్ధికి సాధకములో బాధకములో తెలియక, దేవి నిట్లు ప్రార్థించువాఁడను: 'అమ్మా, వీని యర్థమేమో యెఱుఁగను. నీ సాక్షాత్కారమునకు వలయుమంత్రాదులు నాకు తెలియవు. నిన్ను దర్శించుటెట్లో నాకు బోధింపుము. నీవుగాక నాకు దిక్కెవరు? గురువెవరు?' రేయుంబగల్లు నా ప్రార్థన యిదియే. దుఃఖము మితిమీఱినప్పుడు వెక్కివెక్కి యేడ్చువాఁడను.''

దేవీసాక్షాత్కార మవిచ్ఛిన్నముకాకపోవుటచే నాయన యానంద మసంపూర్ణముగా నుండెను. ''ధ్యానఫలముగనో, ఇతరప్రయత్నఫలముగనో గదా యిప్పుడిసుమంత గోచరించుచున్నది? ఇది నిజమైన సాక్షాత్కారము కాఁజాలదు. అప్రయత్నముగను, నిరంతరముగను, కానిపించుటే నిజమైన సాక్షాత్కారము. నా భగవద్దర్శన కాంక్షలో లోపముకలదనియే దీని కర్థము.'' ఇట్టి యూహలచే నాయన దేవిని వెనుకటికంటె నెక్కువగా ప్రార్థింపఁదొడఁగును.

ఇప్పటినుండి జగజ్జననియెడల నాయన భావము మార్పునొందెను. ఆమె తల్లి, తాను బిడ్డ. వినోదార్థము దాఁగుకొనుచున్నది. కోరినప్పుడెల్ల కనిపింపకపోవుట కిదియే

కారణము. త్వరలో తన్నామె చంక నెత్తుకొని, ఈ సంసారారణ్యమున మరల జిక్కుకొనకుండఁ గాపాడును. ఈ భావముతో నాయన తన యహంకార ప్రేరణల నణఁచివైచి, కేవల మామె సంకల్ప ప్రకారమే నడువనేర్చుకొనసాఁగెను. ఆయన యాత్మార్పణము సంపూర్ణమయ్యెను. "ఓ తల్లీ! నిన్నే దిక్కుగా నమ్మితిని. నే నేమి చేయవలెనో, యేమి మాటలాడవలెనో నేర్పుము. ఎల్ల యెడలను నీ సంకల్పము నిర్నిరోధశక్తిమంతమై నీబిడ్డల మేలుకొఱకే వినియోగపడుచుండును గదా. నా వ్యక్తిత్వము నీ సంకల్పములో లీనమైపోయి, నేను నీయుపకరణమాత్రుఁడనగునట్లొనర్పుము" అని యహోరాత్రము లాయన ప్రార్థించుచుండును. జను లాయనచర్యల నెంత యాక్షేపించినను, ఆయన సరకుకొనకుండెను. జగన్మాత తనను చేయిపట్టుకొని నడపించుచున్నది గదా. ఆయన కీ ప్రపంచ మసత్య వస్తువుగా కన్పింపసాఁగెను. లోకమాతృసాన్నిధ్య మొక్కటే ఆయన కిప్పుడక్కఱ.

పూర్వము ధ్యానవేళలందు, ఎంతో శ్రమపడిన, దేవి యొక్క రమణీయహస్తమునో, పాదపద్మములనో, ప్రేమపూరితముఖమునో యొకింత చూడఁ గలుగువాఁడు. ఇప్పుడామె సుందర దేదీప్యమానమూర్తి తనతో మాటలాడుచున్నట్లుకూడఁ గనుపట్టసాఁగెను. పూర్వము నైవేద్యకాలమున నామె కన్నులనుండి యొక కాంతిమయ కిరణము బయల్వెడలి ఆహారమును స్పృశించి యందలి సారముమాత్రము గ్రహించుచుండినట్లు గనిపించెడిది. ఇప్పుడన్ననో పూజాకాలమం దామె తన దివ్యసుందరరూపముతో నెదుట నిలిచి, వివ్యక్తసమర్పణకుఁ బూర్వమే

ఆరగించుటకు తొందరపడుచున్న ట్లాయన చూడఁగలిగెను. పూర్వము సచైతన్యశిలావిగ్రహము కానిపించెడిది. ఇప్పుడు శిలావిగ్రహ మంతర్ధానమై, దాని స్థానమున జగజ్జననియే ప్రత్యక్షముగా నిలిచి మందహాసముతోఁ దన్ను దీవించుచుం డెను. ఇందునుగూర్చి కాలాంతరమున నాయన ఇట్లు చెప్పు వాఁడు : "ఆమె శ్వాసము నాచేతిమీఁద పడు టెఱుఁగుదును. రాత్రి గదిలో దీపములు పెట్టిన పిదప నామె దివ్యరూపపు నీడయే గోడలపైఁ బడునదికాదు. అత్యుత్సాహముతో బాలికవలె నామె దేవాలయపు పైయంతస్తునకు పరుగిడు చుండఁగా, కాళ్లగజ్జల చప్పుడు నా గదిలోనికి వినిపించెడిది. భ్రమపడితినేమోయని బయటికివచ్చి చూచుసరికి బంధింపని కేశపాశములతో మొదటి అంతస్తు పంచలో నిలువఁబడి కలకత్తానో గంగానదినో చూచుచుండును."

ఈ విధముగా శ్రీరామకృష్ణుఁడు దివ్యానంద ప్రమత్తుఁ డయ్యెను. దేవీసాక్షాత్కార మిప్పు డవిచ్ఛిన్నము కాఁజొచ్చెను. ఇఁక విధ్యుక్తవిధానములు, ఆచారనియమ ములు ఆయనకేల? చనవుచూపు తల్లియొద్ద బిడ్డ కివన్నియు వలయునా? ఆమె కనిపింపకపోయినచో, మారము పెట్టును, నిష్ఠురములాడును, బలాత్కరించును. ఆలయములోనికి సా ష్టాంగప్రణామములతోఁ బ్రవేశింపఁడు. దూరదూరముగా నిలువఁడు. భయభయముగా సమీపింపఁడు. కన్న తల్లి యెదుట ని ట్లేబిడ్డచేయును? తల్లియొద్ద బిడ్డకు భయమా? భయంకరియని జడియువా రామెను ప్రేమస్వరూపిణియగు మాతృమూర్తిగా నెట్లు భావింపఁగలరు? లోకములోని యే తల్లిగాని అంత ప్రేమతో, అంత చనవుతో, అంతదయతో,

తనబిడ్డలను కాపాడునా? ప్రళయతాండవమాడు నా కరాళ మూర్తియే తన భక్తులయెదుట ప్రేమమూర్తియై దివ్యసుందరాకారముతోఁ బ్రత్యక్షమై, యాశీర్వదించి వారి హృదయములను వికసింపఁజేయును.

శ్రీరామకృష్ణునకు సాక్షాత్కరించిన దీ నిత్యమంగళస్వరూపిణియగు దేవి. ఆదినములనుగూర్చి హృదయుఁ డిట్లు చెప్పువాఁడు: "దేవాలయములోనికి—ముఖ్యముగా మా మేనమామ పూజచేయునప్పుడు—ప్రవేశించువారి కందులో సజీవదైవ ముండినట్లు తోఁచి, శరీరము పులకరించును. నే నెన్నియోసార్లచ్చట నిలిచి చూచువాఁడను. ఆయన యద్భుతపూజావిధానమునకు నే నత్యాశ్చర్యచకితుఁడ నగుదునుగాని, యాయనకుఁ బిచ్చిపట్టినదేమో యనికూడ సందేహించువాఁడను. ఆయన యశాస్త్రీయమార్గములు రాణి రాస్మణికిని మథురునకును దెలిసిన, వా రేమిచేయుదురో యని నాకు భీతి. కాని ఎవరేమన్నను ఆయన వినిపించుకోఁడు. ఆయనకు నా సంశయములు తెలుపఁగోరుదునుగాని, యేదో అనిర్వచనీయమగు నొక భయ మడ్డుపడుచుండును. ఆయనకును నాకును హస్తిమశకాంతర మున్నట్లు తోఁచును. అందుచే నాశక్తికొలఁది పరిచర్య చేయుచుంటినే గాని, ఆయన యసాధారణవైఖరివలన నేదియో ముప్పువచ్చుననిమాత్రము భయపడుచుంటిని."

శ్రీరామకృష్ణుని పూజాపద్ధతిని గూర్చి హృదయుఁ డిట్లు చెప్పువాఁడు: "ఆయన పుష్పాలు, మారేడాకులు, చేతఁ బట్టుకొని, తన తలకును, ముఖమునకును శరీరమున కంతకును

—చివరకు పాదములకుఁగూడ—నద్దుకొని, పిమ్మట వానిని కాళీపాదములకడ సమర్పించును. ఇతరవేళలం దెట్టి వాఱిన కనులతోను, ఱొమ్ముతోను, త్రాఁగియున్నవాని వలె తూలుచు, తనపీఠమునుండి దేవీ సింహాసనముకడకు పోయి, ప్రేమచిహ్నముగా నామెగడ్డము తాఁకి విగ్రహ మును చేతితోఁ బట్టుకొని పాడును; మాటాడును; పరియా చకములాడును; నవ్వును; నాట్యముచేయును. నైవేద్య వేళఁ జేతితో నొకకబళము పట్టుకొని, దానిని దేవిమూతిదగ్గఱ పెట్టి తినుమని బతిమాలును. పిమ్మట నిట్లు సంభాషణ జరుగును. 'నన్ను ముందు తినుమందువా? సరే తినె దను!' అని కొంత తాను తిని మిగిలినది దేవినోటఁబెట్టి, 'నేను తింటిని. ఇప్పుడు నీవంతు. తినుము' అనును. ఒక నాఁడు దేవికి నైవేద్యముపెట్టుచుండఁగా 'మ్యావుమ్యావు' మని అఱచుచు నొక పిల్లి వచ్చెను. దానిని ప్రేమపూర్వక ముగా 'అమ్మా! భోజనముకై త్వరపడుచున్నావా? అయిన నిదిగో తినుము!' అని ఆయన్నమును పిల్లికిఁబెట్టెను. ఒకొ్కక ప్పుడు సాయంకాలసేవ ముగిసినపిదప దేవిని పరుండఁబెట్టి నప్పుడు, 'నన్నుకూడ నీతో పరుండుమనెదవా? సరే కానీ' అని కొంతతడ వామె వెండిమంచముపై పరుండును. కొన్ని వేళల పూజకై కూర్చుండి, గాఢధ్యానమున మునిఁగిపోయి, బాహ్యస్మృతి లక్షణము లేమాత్రము కనుపఱుపకుండును. ప్రతి ఉదయమునను దేవి మాలలకై పూలు కోయునప్పుడు కూడ నెవరితోడనో సంభాషించును, ముద్దులాడును, నవ్వును, ఉల్లసించును. రాత్రులు కనులుమూయఁడు. నేనుమేలొ్కని చూచినప్పుడెల్ల నున్నతభావముతో నెవరితోడనో మాటాడు

చుండును, లేక పాడుచుండును, లేక ఇప్పుడు పంచవటియున్న చోటున గాఢధ్యానమున కూర్చుండియుండును.

ఆయనకు మతి పోయినదను స్థానికాధికారులనమ్మక మిప్పుడు దృఢపడినది. ఏడ్చుట, నవ్వుట, విగ్రహముతో మాటాడుట: ఇట్టి వికృతకార్యముల మాట యటుండఁగా, తన పాదముల కద్దుకొనిన పూలు దేవి కర్పించుట, నైవేద్యము చేయకముందే నివేదనాన్నమును తాను తినుట, దేవి మంచముపై పరుండుట: ఈ మహాపచారములుకూడ! అట్టివానిని దేవాలయములో నుండనిచ్చుట యుక్తముకాదని తలఁచి అచ్చటి యుద్యోగులు విషయమునంతయు సవివరముగా మథురాబాబునకు తెలిపిరి. కొలఁదికాలములోనే మథురుఁడు దేవాలయమున కాకస్మికముగావచ్చి శ్రీగురుదేవుని పూజాక్రమమునంతయుఁ బరికించి ఆశ్చర్యనిమగ్నుఁడయ్యెను. అనన్యసామాన్యమగు ప్రేమ భక్తిగలవారుగాని అట్లు పూజసలుపలేరని వెంటనే గ్రహించెను. ఆలయమును బ్రతిష్ఠించి, నిర్వహించుటలోఁగల ముఖ్యోద్దేశము విగ్రహములో దేవి ప్రత్యక్షమగుటయేకదా! ఆ యుద్దేశమిప్పు డత్యద్భుతముగా నెఱవేఱినదని యానందపరవశుఁడయ్యెను. శ్రీ గురుదేవుని పూజావిధానము నెవ్వరును నిరోధింపఁగూడదని దేవాలయ విచారణాధికారి కుత్తరువు నంపెను.

శాస్త్రములందు రెండువిధముల భక్తి పేర్కొనఁబడినది: వైధిభక్తి, ప్రేమభక్తి. వైధిభక్తిలో విధ్యుక్త నియమముల కెక్కువ ప్రాముఖ్యము. ప్రేమభక్తిపరులు భావోద్రేకపరవశులై విధులను, నియమములను, మఱచి, తమతమ హృదయప్రేరణల ననుసరించి చిత్రచిత్ర విధములఁ

ప్రవర్తింతురు. మొదటిరకపు భక్తి రెండవదానికి సోపానము వంటిది. శాస్త్రములలో విధింపఁబడిన కలాపముల నవలంబించి భగవద్విశ్వాసము దృఢపఱచుకొనినప్పుడుకాని ప్రేమ భక్తి లభింపదు. శ్రీ గురుదేవుని దృక్పథములోఁ గలిగిన యత్యద్భుత పరివర్తనము మతిభ్రమచేఁ గలిగినదని పామరులనుకొన్నను, అది యాయనయందు పొడచూపిన ప్రేమభక్తి వికాసమువలనఁ గలిగినది. ఈ పరిణామమత్యంతసహజముగా సంభవించినందున ఆవిషయ మాయనకు తెలియనే తెలియదు.

ఈశ్వరసాక్షాత్కారపు ఘాకచే శ్రీగురుదేవున కీకాలమున వివిధములైన శరీర బాధలు బయలుదేఱినవి. కారపుముద్ద నూఱి పూసినట్లు దేహమంతయు బగబగలాడుచుండుట ఇందొకటి. దీనినిగూర్చి శ్రీగురుదేవుఁ డిట్లు చెప్పవాఁడు: "శాస్త్ర నిర్దేశముల ప్రకారము పూజాకాలమందు నాలోని పాపము మండిపోవుచున్నదనియు, నేను నిర్మలుఁడను, పరిపూర్ణుఁడను, అనియు, భావింతును. నిజముగాఁ బ్రతి మానవునియందును, పాపము మూర్తీభవించియుండుననియు, దానిని నాశనముచేయవలెననియు, నాకప్పుడేమి తెలియును? సాధన ప్రారంభమునుండియు శరీరము మండుచున్నట్లు నాకు తోఁచుచుండెను. ఇది యేమై యుండునని తలఁచువాఁడను. ఎన్ని యౌషధములు సేవించినను ఫలము లేకపోయెను. ఒకనాఁడు పంచవటిలో సాధనచేయుచుండఁగా ఈశరీరములోనుండి చింతనిప్పులవంటి ఎఱ్ఱని కన్నులు గల ఒక నల్లనిమనుష్యుఁడు బయటకు వచ్చి, తప్పఁ ద్రాఁగినట్లు తూలుచు నాయెదుట తిరుగ నారంభించెను. మఱికొంత సేపటికి శాంతాకారుఁడై కాషాయవస్త్రములు ధరించి చేతిలో త్రిశూలము పట్టుకొని

యున్న మనుష్యుఁ డొకఁడు నాలోనుండి వచ్చెను. ఈ సన్న్యాసి మొదటివానిని తన త్రిశూలముతోఁ జంపివేసెను. ఆఱు నెలలనుండి నన్నుపీడించుచున్న యొడలిమంట లీదృశ్యము కనఁబడిన కొద్దినాళ్లలోఁ బోయినవి."

శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర నామకము లగు నైదు భక్తిభావములును శ్రీ గురుదేవుఁ డభ్యసించి ఒకటే పరమావధిని ప్రతిసాధనవలనను చేరఁగలిగెను. ప్రస్తుత విషయమాయన దాస్యభావసాధన. ఈ సాధన కాలమునఁ దాను హనుమంతుఁడనని భావించికొని, తుదకు శ్రీరామ చంద్రుని సతీతిలకమగు సీతామహాదేవిని దర్శించి ధన్యుఁ డయ్యెను. శ్రీరామదర్శనభాగ్య మొందుటకుఁ దద్భక్తుఁడగు హనుమంతునిలో మూర్తీభవించిన సేవకభావమును సాధింపఁబూనెను. ఆ సాధన విధానమును గూర్చియు, తత్ఫలిత మునుగూర్చియు నాయన ఇట్లు చెప్పెను: "హనుమంతుని యద్భుత శీలమును నిరంతరము ధ్యానించుటచే నా వ్యక్తిత్వమును పూర్తిగా మఱచిపోయితిని. నా దైనికజీవితము, భోజనపద్ధతి, చిత్రవిధమున హనుమంతుని మార్గములతో నేకీభవించెను. అందు అణుమాత్రము నటన లేదు. అవి స్వతస్సిద్ధములుగనే కలిగినవి. మొలబట్టను ధట్టిగాఁ జుట్టుకొని, దానిలో కొంతభాగము తోఁకగా వేలాడునట్లు వదలి, నడచుటకుమాఱు గంతులిడెడు వాఁడను. పండ్లు, కందమూలములే, యాహారము. వానినైన నొలవకయే తిన నిష్టము. చాలవఱకు చెట్లపైనఁ గాలముఁ గడపుచు, 'రఘువీరా!' యని భక్తిపూరితస్వరముతోఁ బిలుచువాఁడను. కనులుకూడ కోఁతికనులవలె చంచలములయ్యెను. మఱియు,

నాశ్చర్యముగా వెన్నెముకయొక్క కొన ఒక అంగుళము పెరిగి పైకి పొడుచుకొనివచ్చెను. 'ఆ సాధనవిధానము పూర్తియై, ఆ చిత్తవృత్తి పోయిన పిదప క్రమముగా నది యెప్పటి పరిమాణమునకు వచ్చెను. ఇంతేల, ప్రతివిషయము నను నేను కోఁతినే పోలియుంటిని.''

ఈ సాధనాంతమున శ్రీ గురుదేవున కొక అద్భుత దృశ్యము కనిపించెను. దానినిగూర్చి యాయన ఇట్లు చెప్పెను: ''ప్రస్తుతపు పంచవటిలో నే నొకనాఁడు సామాన్యస్థితిలోనే (ధ్యాననిమగ్నుఁడనుగాక) కూర్చుండియుంటిని. అకస్మాత్తుగా అనన్యసామాన్యసౌందర్యముగలిగిన స్త్రీరూపయగు నొక తేజోమూర్తి నాయెదుట కనఁబడి యాప్రదేశము నంతను తన కాంతితో ముంచివేసెను. అచ్చటి చెట్లు, గంగానది, ప్రతివస్తువు, యథాప్రకారమే కన్పించుచుండెను. ఆమె కసాధారణములగు దైవచిహ్నము లేమియు లేవు. సాధారణ మానవస్వరూపమే. కాని ప్రేమ దుఃఖ దయాస్థైర్యముల కాలవాలమైన యట్టిదివ్యాకారము దేవతాస్త్రీలలోనైనను అరుదు. దయావీక్షణములతో నామె యుత్తరదిక్కునుండి నావైపునకు వచ్చుచుండెను. నే నాశ్చర్యపడి యెవరా యని చూచుచుంటిని. అంతలో నాకస్మికముగా నొక కోఁతి అఱచుచు నామెప్రక్క దుమికి కూర్చుండెను. జీవితమునెల్ల శ్రీరామున కర్పించి దుఃఖమును మాత్రమే తాననుభవించిన సీతయై యుండవలెనను నూహ నా కప్పుడు స్ఫురించినది. 'అమ్మా' యని అఱచుచు భావోద్రేకముతో నామెపాదము లపైఁ బడబోఁగా నామె తన చిఱునగవును నా కిచ్చుచున్నా

వని పలికి నా శరీరములో లీనమైపోయెను. నేను భావపర వశుఁడనై స్మృతిదప్పి నేలపైఁ బడితిని. ధ్యానవేళలలోఁగాక సామాన్యస్థితిలో నీ చర్మచక్షువులతోనే నేను మొదట చూచిన యసాధారణదృశ్య మిదియే. దుఃఖభాజనయగు సీతను మొట్టమొదట చూచుటచేతనే కాఁబోలు నా పిమ్మటి జీవితము దుఃఖపూరితమైనది!"

ఈ వివిధసాధనలలో నొకదానియం దైనఁ బరిపూర్ణత గాంచుటకు సామాన్యుల కనేకజన్మములు పట్టును. అట్టిస్థితిలో వీనియన్నిటిలోఁగూడ పరిపూర్ణుఁడై ఈశ్వర సాక్షాత్కార మును జయప్రదముగాఁ బడయుటయం దీ మహనీయునకుఁ దోడ్పడిన రహస్యశక్తి యేది? ఇది యాయన యసమాన చిత్తశుద్ధి: తలఁపులకును చేఁతలకును గల పరిపూర్ణ సామ రస్యము. దేనిలోనైన సంపూర్ణ విజయముఁ గాంచుటకు మానవుఁ డాదర్శప్రకార మెప్పుడును వర్తించుచుండవలెనని యాయన తఱచు చెప్పువాఁడు.

శ్రీ గురుదేవునియెడ రాణిరాస్మణికిఁ గలిగిన గౌరవ భావము నిప్పటికే సూచించియుంటిమి. ఆయనకు దేవీదర్శన భాగ్యము కలిగినదనియు, నాయన అసామాన్యభక్తియే ఆయన విచిత్రప్రవర్తనకుఁగారణమనియు, నామె నమ్మకము. ఒకనాఁ డామె దక్షిణేశ్వరము వచ్చి గంగాస్నానానంతరము పూజాధ్యానములకై దేవాలయమున కేతెంచి దేవీసన్నిధిని కూర్చుండి, శ్రీ గురుదేవుని పాడుమనెను. అందుల కంగీక రించి యాయన తన గానామృతముచే నాస్థలమును నింపి వేసెను. కొంతతడవైన పిమ్మట రాణి పరధ్యానచిత్తయై యుండుటఁ గనుఁగొని 'ఇక్కడఁగూడ అదే గొడవా?' అని

కఠినముగాఁ బలికి, రెండు లెంపకాయలు వేసెను. దేవాలయ సేవకులు నివ్వెఱపడి నిశ్చేష్టులై నిలుచుండిరి. ఏమిచేయు టకుఁదోఁపక, శిక్షించుటకు సాహసింపక, ఊరకుండిరి. అచట నప్పుడు నిశ్చలమనస్కులై యున్నవారు శ్రీ గురుదేవుఁడును రాణిరాసమణియుమాత్రమే: తప్పుచేసిన బిడ్డను దండించు తండ్రివలె నాయనయు, ననుచితకార్యము చేయుచు పట్టు వడిన బిడ్డవలె సిగ్గుపడి యామెయు. ఆమె తలఁపు అప్పుడొక వ్యాజ్యముపైకి పోయియుండెను. ఈ యువకుఁడు తన తలఁపు నెట్లు కనుఁగొనఁగల్గెనని యామె యాశ్చర్యము! దేవాలయ సేవకులు శ్రీ గురుదేవునెడల దౌర్జన్యముపయోగింతురేమో యని భీతిలి, ఆయనతో నీ విషయమే ప్రస్తావింపకుండునట్లు వారికి కఠినశాసన మొసంగెను.

రాణి తన మందిరమునకు తిరిగివచ్చినపిదప, సేవ కులు గురుదేవుని ప్రవర్తనము నాక్షేపించి మాటలాడఁగా నామె యిట్లనెను: "విషయము మీకు బోధపడలేదు. దేవియే నన్ను శిక్షించి నా హృదయాంధకారమును పోఁ గొట్టినది."

శ్రీ గురుదేవుఁ డాధ్యాత్మిక సాధనలు సల్పిన పంచ వటి * నిదివఱకే పేర్కొనియుంటిమి. దీని సమీపమున నొక చిన్న చెఱువు కలదు. దానిని లోఁతుగా త్రవ్వించి

---

* ఈమాటకు పవిత్రములైన యైదుచెట్ల సముదాయమని అర్థము. అట్టిస్థలము ధ్యానముచేయుట కతిపవిత్రమనియు, సాహాయ్యకారి యనియు, నందురు. రావి, మారేడు, ఉసిరిక, అశోకము, మర్రి ఈ యైదును పంచవృక్షములు.

బాగుచేయించి ఆమట్టితో చుట్టుప్రక్కలనున్న గోతులు పూడ్చిరి. ఆసందర్భమున శ్రీ గురుదేవుని సాధనలచే బవిత్రతఁగన్న ఆమలకవృక్షము కొట్టివేయఁబడెను. అందుచేఁ దన యాధ్యాత్మికసాధనలకు తగిన స్థలము నొకదాని నేర్పాటు చేయుమని యాయన హృదయునితోఁ జెప్పెను. ఆ యాదేశానుసారము పూర్వసాధనస్థలమునకు సమీపమగు నొక చో టేర్పాటుచేయఁబడఁగా, నచ్చట శ్రీ గురుదేవుఁడు స్వయముగా నొక రావిమొక్క నుంచి, తక్కిన నాల్గుజాతుల మొక్కలను హృదయునిచే నాటించెను. స్థలము చుట్టును తులసిమొక్కలతోను, అపరాజితపు మొక్కలతోను కంచెవేయఁబడెను. ఇవి త్వరలో దట్టముగను పొడవుగను పెరిగి మంచి మఱుఁగు నేర్పఱచెను. కాని యీకంచె నొకనాఁడు పశువులు కొంత పాడుచేయుటచే, గట్టి కంచెచే దానిని కాపాడవలెనని శ్రీ గురుదేవుఁడు సంకల్పించెను. త్వరలోనే కంచెకుఁ గావలసినసామానంతయు — స్తంభములు, త్రాడు మొదలగునవి—ఒక కొడవలితోఁ గూడ, గంగాప్రవాహములో నెటనుండియోఁ గొట్టుకొనివచ్చి గట్టున పడినది!

శ్రీ గురుదేవుని తత్త్వమునుగ్రహించి పామరజనులచే నాయనకెట్టి హానియు కలుగకుండఁ జూచు మథురుఁడుఁగూడ నాయన కేమైనఁ గొంత చిత్తచాంచల్యము కలదేమో అని సంశయింపఁ దొడఁగెను. ఇతర వింతచర్యలటుండ, రాణిని చెంపపై కొట్టుట యీ యనుమానమును బలపఱచెను. ఒక సుప్రసిద్ధవైద్యుఁడు చికిత్స చేసెను గాని గుణము లేకపోయెను. ప్రపంచనియమముల నతిక్రమింపక ప్రవర్తించుట ముఖ్యమని

తానుకూడ బోధింపఁదలఁచి మథురుఁడొకనాఁడు, "భగవంతుఁడుకూడ తనశాసనములచే బద్ధుఁడు. వానినతిక్రమించుట కతనికైన నధికారములేదు" అనెను. "ఎంత యసంబద్ధసిద్ధాంతము! చట్టమును చేసినవాఁడు ఇష్టము వచ్చినపుడు దానిని రద్దుచేసి, మఱియొకచట్టము నిర్మింపఁగలఁడు," అని శ్రీ గురుదేవుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. "ఇది యెట్లు? ఎఱ్ఱపూలే పూయుమొక్క ప్రకృతివిధి నతిక్రమించి తెల్లపూలు పూయఁజాలదు! భగవంతుఁడుగూడ నట్లు చేయఁజాలఁడు" అని మథురుఁడనెను. "సులభముగా చేయఁగలఁడు. సకలప్రపంచ నియంత కాఁడా అతఁడు?" అని ఆయన మరల చెప్పెను. కాని మథురునకు నమ్మకము తోఁపలేదు. మఱునాఁడు గుడి తోఁటలోనే యొక మందారపుమొక్క కొక యెఱ్ఱపువ్వు, ఒక తెల్లపువ్వు పూచియుండెను. శ్రీ గురుదేవుఁ డా రెమ్మను గోసి తెచ్చి మథురునకు కనుపఱుప నతఁడు తనయోటమి నొప్పుకొనెను. ఈ విధముగా నాయనతో పరిచయ మెక్కువైన కొలఁది మథురుని సందేహములు తొలఁగిపోయి, యాయన పరిపూర్ణత్వమొందిన మహాపురుషుఁడనియు, నాయన సాంగత్యము సర్వశుభప్రదమనియు విశ్వసింపనాఁగెను. లోలోపల నాయనను గురువుగఁగూడ భావించుకోసాఁగెను.

ఈ దివ్యోన్మాదకాలమందు (1855–58) శ్రీ గురుదేవునకు లౌకికజనసాంగత్యము దుర్భరముగానుండెను. భక్తుల సాంగత్యమందుమాత్రము పరమప్రీతి. వారితోఁగూడ పూజా సంకీర్తనాదిక మొనర్చును. దశమహావిద్యాసందర్శనార్థము శారానగరునకును, కాళికాసందర్శనార్థము కాళీఘాటునకును పోవును. ప్రాయికముగా ప్రతిసంవత్సరమును పాణిహాటీ

గ్రామములో జరుగు మహోత్సవములో పాల్గొనును. వైష్ణవ భక్తులలో నగ్రగణ్యుఁడని పేరొందిన వైష్ణవచరణు నచ్చటనే ఆయన మొట్టమొదట (1858) కలసికొనెను. ఆయన హృదయునితో మణిమోహనసేనుని యాలయములోఁ గూర్చుండి యుండఁగా వైష్ణవచరణుఁడు చూచి, యసామాన్యతపస్సిద్ధి గల దివ్యపురుషునిఁగా గ్రహించెను. పిమ్మట నాయనచుట్టు చేరి, వారందఱును నృత్యముతో హరినామసంకీర్తన మారంభించిరి. శ్రీ గురుదేవుఁడు పారవశ్యస్థితి నందఁగా, వైష్ణవ చరణుఁడు నైవేద్యపదార్థముఁలోఁ గొంచె మాయననోట నుంచెను. కాని యాయన తినలేదు. మిగిలిన పదార్థమును వైష్ణవచరణాదులు ప్రసాదముగాఁ దీసికొనిరి. కలకత్తాకు తిరిగి పోవుచుండినప్పుడు వైష్ణవచరణుఁడు శ్రీ గురుదేవుని నివాసస్థలము తెలిసికొని దక్షిణేశ్వరములో దిగెను. కాని ఆయన లేఁడు.

శ్రీ గురుదేవుని యారోగ్యము నానాఁటికి చెడుచున్నందున రాణిరాస్మణియు మథురుఁడును మిక్కిలి భీతిలి, కఠిన బ్రహ్మచర్యము నించుక సడలించినచో నారోగ్యము చక్కపడునని తలఁచి, ఈ యుద్దేశము తెలిసినచో నిరసింపఁబడునని, దుర్వృత్తివలన జీవించు నిద్దఱు స్త్రీల నీ పనికి రహస్యముగా నియమించిరి. జగన్మాతృపుత్రునిఁ దమ వలలో వైచుకొన నా యువతు లొకనాఁ డాయనగదిలోఁ బ్రవేశించిరి. కాని వారిని జూచినవెంటనే ఆయన శ్రీ భగవతీ నామమును దీనస్వరమున స్మరింప నారంభించెను. ఆ స్త్రీలు సిగ్గుపడి తమ యపచారమునకుఁ బశ్చాత్తప్తలైరి. ఇంతటితోనైన తన యవివేక ప్రయత్నమును విడనాడక మథురుఁడు

కొందఱు పడుపుఁగత్తెలతోఁ గుట్రచేసి, యొకనాఁడు వినోద విహారమని మిష పెట్టి, శ్రీగురుదేవుని కలకత్తాకు తన గుఱ్ఱపు బండిలోఁ దీసికొనిపోయి, మేఛువా బజారులో నొకయింటఁ బ్రవేశించి, సౌందర్యవతులగు యువతులు చాలమంది సానఁ బట్టిన మరుకటారులవలె ధగధగలాడుచుండిన యొకగదిలో నాయనను విడిచిపెట్టి చల్లగ బయటికి వెడలిపోయెను. వెంటనే ఆయన కేవలశిశుప్రాయుఁడై, సకలమహాపాతకహార మును, భక్తజనరక్షాపటిష్ఠమును, అగు శ్రీభువనేశ్వరీదివ్యనామ మును స్మరించుచు శరీరస్మృతిని గోల్పోయి జితేంద్రియత్వ మును, చిత్తశుద్ధియు, మూర్తీభవించినరీతి నొప్పుచుండెను. ఆస్వైరిణుల మనస్సులలో నప్పుడు కలిగిన సంచలనము వర్ణ నాతీతము. తమ యవివేకమును గ్రహించి, అట్టి పరమ సాధువును జెఱుపఁ బ్రయత్నించినందున నేమి ముప్పు వాటిల్లునో యని భయపడి క్షమాపణ వేఁడుకొనిరి. ఈ యలజడి విని మథురుఁడు వచ్చి, ఆశ్చర్యపడి, యా తరుణులు కసితీఱఁ దిట్టిపోయుచుండ, లజ్జచేఁ దలవంచికొని, శ్రీ గురు దేవునియందు ద్విగుణీకృత భక్తితో నాయన నటనుండి తీసి కొనిపోయెను.



## హాలధారి

శ్రీగురుదేవునితో నెనిమిదిసంవత్సరములపాటు (1858-66) వసించిన మఱియొక వ్యక్తినిగూర్చి ఇప్పుడు ముచ్చటించెదము. ఇతఁడు శ్రీ గురుదేవుని పినతండ్రి కుమారుఁడు. పేరు రామతారకుఁడు. కాని హాలధారి యనుపేరే యెక్కువ వాడుక. ఉద్యోగార్థమై దక్షిణేశ్వరము వచ్చి, విష్ణుభక్తుఁడైనను, మథురుని కోరికపై కాళీపూజ చేయ సమ్మతించెను. కాని, కాళికాలయములోని జంతుబలు లతని కిష్టములేదు. ఒకనెల పిమ్మట ధ్యానమున దేవి భయంకరస్వరూపముతోఁ గనఁబడి "నాకు నీపూజ అక్కఱలేదు. నన్ను హృదయపూర్వకముగా పూజింపనందున నీకుమారుఁడు మరణించును!" అని శపించెను. విషయమునెల్ల శ్రీగురుదేవునకుఁ దెలిపి, కాళీపూజ మానుకొని, యతఁడు రాధాకృష్ణపూజ చేయ మొదలిడెను.

హాలధారి ధ్యానమార్గమునఁ గాక, వాస్తవముగనే స్త్రీతోడనో రహస్యసంబంధ మేర్పఱచుకొని, మధురభావసాధనచేయు నొక తుచ్ఛవైష్ణవసంప్రదాయమునకు చేరినవాఁడు. ఈవిషయము కొలఁదికాలములో వెల్లడియై, లోకులు గుసగుస లాడుకొన నారంభించిరి. అతని శాపములమోఘములను నమ్మకముచే, బహిరంగముగా నెవరును ఆక్షేపింప సాహసింపకున్నను, శ్రీగురుదేవుఁడు తన సహజ నిష్కపట ధోరణిలో నొకనాఁడు హాలధారితో నాతని విపరీత

సాధనపద్ధతినిగూర్చి జను లేమేమో చెప్పుకొనుచున్న సంగతి తెలుపఁగా, నాతఁడు కోపపూరితుఁడై "నీవు నాకు సోదరుఁడ వవుదువు, చిన్నవాఁడవుకూడ. అయినను నన్నీవిధమున నవ మానింప సాహసించితివి! ఇందుకు శిక్షగా నీ నోట రక్తము కాఱుఁగాక" అని శపించెను. జనాపవాదమునుండి తప్పించు టకే ఇట్లు హెచ్చరించితినని యెంత చెప్పినను తన శాపము నాతఁ డుపసంహరించుకోలేదు.

కొలఁదికాలమున నొక సాయంసమయమున శ్రీగురు దేవుని అంగిటిలో హఠాత్తుగా మంటకలిగి, రక్తము కాఱ నారంభించెను. దీనినిగూర్చి శ్రీ గురుదేవుఁ డిట్లు తెలిపెను : "రక్తము చిక్కడాకురసమువలె నల్లఁగా నుండెను. మిక్కిలి చిక్కనగుటచేఁ గొంచెమమాత్రమే నేలపైఁబడి మిగిలినది పేరుకొని పలువరుసనుండి త్రాడువలె వ్రేలాడు చుండెను. రక్తము కాఱకుండ నా యంగిటిని బట్టకొంగుతో నొత్తితిని. కాని లాభము లేకపోయెను. చాల భయపడితిని. పెక్కం్రదు నాచుట్టు మూఁగిరి. హాలధారికూడ సాయంకా లపుసేవ ముగించి వచ్చెను. 'దాదా! చూచితివా? నీ శాపము నన్నేమిచేసినదో' అని ఏడ్చుచు చెప్పితిని. నన్నట్టి దుఃస్థి తిలో చూచి అతఁడుకూడ నేడువ నారంభించెను. అదృష్ట వశమున నాసమయమున కాళికాలయములో నొక సాధు వుండెను. అతఁడువచ్చి రక్తపురంగును, అది వచ్చుచోటును, చూచి 'భయపడనక్కఱలేదు. ఈ రక్తస్రావమువలన చాల మేలుకలిగినది. హఠయోగాభ్యాసకారణమున నీ సుషుమ్నా నాడి తెఱచుకొని రక్తము తలలోనికెక్కుచుండెను. మెదడు లోనికి పోక అంగిటిలో మార్గ మేర్పఱచుకొని బయటికి

వచ్చుట మిగుల మేలైనది. లేనిచో నీవు జడసమాధి నందియుందువు. అందుండి సాధారణశరీరస్మృతికి రాలేక పోయెడివాఁడవు. శ్రీ లోకేశ్వరి నీచే నేదియో మహాకార్యము చేయింపఁదలఁచి ఈ విధమున నీ శరీరమును రక్షించియుండును.' అనెను. ఆ మాటలవలన నాకు చాల ధైర్యమును, శాంతియుఁ గలిగినవి.''

హాలధారికి శ్రీగురుదేవుని వింత పోకడలు నచ్చకుండెను. ఆయన మహోన్నతాధ్యాత్మికస్థితి నతఁడు గ్రహింపలేదు. అప్పుడప్పుడు హృదయునితో నతఁ డిట్లు చెప్పును: ''హృదయా! జందెముతీసివేయుట రామకృష్ణుని శీలమునకు కళంకము, ఇంతేకాక నలుగురిలో దిగంబరుఁడై యుండుట రోఁతగదా! బ్రాహ్మణజన్మ మసామాన్య పురాకృత పుణ్యఫలితము. ఇట్టి దుర్లభజన్మము నితఁ డెంత చులకనచేయుచున్నాఁడో చూచితివా? అత్యుత్తమమైన ఆధ్యాత్మికస్థితికి వచ్చితిననుకొని జాతినియమములను తృణీకరించుట ఎవ్వరికైనను తగునా? నీమాట నతఁడు పాటించును. కావున నిట్టి చర్యలు మానివేయునట్లు చేయుము.''

హాలధారి గ్రంథపాండిత్యము కలవాఁడేకాని దివ్యస్థితి నెన్నఁడును అనుభవించి యెఱుఁగఁడు. శ్రీగురుదేవుని నిట్టి స్థితియందుఁ జూచి హృదయునితో నతఁడు ''రామకృష్ణునియందేవో దివ్యలక్షణములు కనుఁగొని యుందువు. లేనిచో నీ వతని నిట్లేల సేవింతువు?'' అని చెప్పుచుండును. హృదయుఁడుకూడ నప్పటికి కొంతవఱకు మాఱినవాఁడగుటచే, 'ఔను. నీవు చెప్పునది నిజమే. నీచసేవకునివలె నే నావిధ

మున నితరులకుఁ బరిచర్య చేయుదునా?' అని ప్రత్యుత్తర మిచ్చును.

ఈరీతిగా హాలధారి శ్రీగురుదేవుని చిత్తవృత్తినిగూర్చి సందేహ విశ్వాసముల మధ్య నూఁగులాడుచుండును. ఈవిషయమై శ్రీగురుదేవుఁ డిట్లు చెప్పువాఁడు :—"చాలసార్లు నాభక్తిని, ఆధ్యాత్మికోత్సాహమును జూచి 'రామకృష్ణా, నిన్నిప్పుడు కనుఁగొంటిని' అని హాలధారి సంతోషమును వెలిపుచ్చును. 'అట్లయిన మరల భ్రాంతిలో పడకుము' అని నేను బదులుచెప్పుదును. ఇందుల కతఁడు 'నీవు నన్నింక మోసపుచ్చఁజాలవు. భగవంతుఁడు నీ యందు నిజముగా ప్రత్యక్షమగుచున్నాఁడు' అని ప్రత్యుత్తర మిచ్చును. నేను నవ్వుచు, 'అట్లే యగుఁగాక. నిలకడమీఁదఁగదా మనుష్యుని కెఱుక కలుగును' అని చెప్పుదును. కాని మరల కొన్ని సమయములలో నతఁడు తాను మహాపండితుఁడ నని గర్వించుచు, తన యభిప్రాయములే స్థాపించుకొనఁజూచును. అట్టిసమయములందు నే నతనికడకు వెళ్లి, 'నీవు శాస్త్రములలోఁ జదివిన దంతయు నా కనుభవైక వేద్యము. కనుక శాస్త్రముల తాత్పర్యమును నేనును గ్రహింపఁగలను' అని చెప్పఁగా, హాలధారి మండిపడుచు భయంకరస్వరముతో 'చాలిఁకపో. నీవు కేవల మూఢుఁడవు. నాకలోక మెక్కడ, నక్క ఎక్కడ?' అని కసరివేయును. ఇందులకు నేను 'నాలోనున్నట్లు నీ వొప్పుకొనిన దేవుఁడు నాకు సర్వమును బోధించును. ఇది నిజమని నమ్ముము.' అని బదులు చెప్పుదును. అంత హాలధారి క్రోధోద్దీపితుఁడై, 'ఎంత అవివేకము! ఈ కలియుగములో కల్క్యవతారముగాక వేఱొక యవతారము కలుగునని ఏ శాస్త్రము

చెప్పుచున్నది? నీకు పిచ్చియెత్తినది; లేనిచో నీకిట్టి వెఱ్ఱి యూహాలు కలుగవు' అని గర్జించును. అంత నేను మందహాస ముతో, 'నీవు కొలఁదిగంటలక్రిందటనే కదా, నన్నుఁగూర్చి నీకిఁక ఎట్టి భ్రమయు కలుగదని చెప్పితివి' అని జ్ఞప్తి చేయుదును. కాని హలధారి దానిని వినిపించుకొను స్థితిలో నుండఁడు! ఈ ప్రహసనమే చాలసారులు జరిగినది. ఒకనాఁడు పంచవటిలో మఱ్ఱిచెట్టుకొమ్మపై నేను దిసమొలతోఁ గూర్చుండియుండఁగా చూచి నాకు బ్రహ్మరాక్షసుఁడు పట్టె నని అతఁడు పూర్ణముగా విశ్వసించెను!''

హలధారి వైష్ణవుఁడు. కాళికాశాపమునఁ గుమారుఁడు మరణించినప్పటినుండి, ఆ దేవిని తామసికమూర్తిగా భావించు చుండెను. ''తామసికమూర్తిని గొలుచుటవలన నెవరికైన ఆధ్యాత్మికఘనత కలుగునా? కాళికారాధనకు నీవింత శ్రద్ధతో నేల పాటుపడెదవు?'' అని అతఁ డొకనాఁడు శ్రీ గురుదేవు నాక్షేపించెను. ఆయన ప్రత్యుత్తరమీయలేదు. కాని చాల నొచ్చుకొని, వెంటనే కాళికాలయమునకు పోయి కన్నుల నీరు నించి ''అమ్మా హలధారి శాస్త్రవేత్త, నీవు తామ సికమూర్తివనుచున్నాఁడు. నిజముగా నీ వట్టిదానవా?'' అని యడిగెను. విశ్వమాత తన సందేహమును దీర్పఁగాఁ బట్టరాని ఆనందముతో హృదయముప్పొంగుచుండ, శ్రీగురు దేవుఁడు, రాధాకృష్ణపూజచేయుచుండిన హలధారికడకు పరుగెత్తికొనివచ్చి భావోద్రేకముతో నతని భుజములపై నెక్కి, ''ఏమీ! మా తల్లి తామసికురాలని చెప్ప సాహ సింతువుగా! ఆమె అట్టిదియా? కాదుకాదు. సర్వము నామెయే. ఆమె త్రిగుణాత్మిక. కేవల సత్త్వస్వరూపిణికూడ

నామెయే'' అని మరల మరల బిగ్గరగా నఱచెను. శ్రీ గురుదేవుని దివ్యస్పర్శవలన హాలధారి హృదయాంధకారము విరిసిపోవ నతఁడు తన యవివేకమును, అల్పత్వమును, తెలిసికొనెను. శ్రీ గురుదేవుని జగన్మాతృరూపముగా గ్రహించి వినయముతోఁ దలవంచుకొని పుష్పగంధాదికము నాయన పవిత్రపాదములకు సమర్పించెను. కొంతసేపైన పిదప హృదయుఁ డతనియొద్దకు పోయి, భ్రాంతుఁడు, పిశాచగ్రస్తుఁడు, అని నమ్ముచుండికూడ నతని నర్చించుట కెటులు పాల్పడితివని యడుగఁగా "ఏమో నాకు తెలియదు. కాళికాలయమునుండి తిరిగి వచ్చుచు నన్నతఁడు పూర్తిగా వివశునిఁ జేసెను. నేను సకలమును మఱచి ఆతనియందు దేవతాంశమును స్పష్టముగాఁ జూచితిని. అతనిని కాళికాలయములోఁ జూచినప్పుడెల్ల నాకిదే యనుభవము. నాకిదంతయు నగ్రాహ్యముగా నున్నది'' అని హాలధారి చెప్పెను. ఈ రీతిని జ్ఞానవికాసము కలిగిన యేకొలఁదిసార్లో హాలధారి శ్రీ గురుదేవునియందుఁ గల దేవతాంశమును గనిపట్టఁజాలును. తిరిగి తన పుస్తకములకడఁ గూర్చుండిన వెంటనే ఆ సంగతినెల్ల మఱచిపోవును.

గ్రంథములు హృదయగ్రంథులనియు, మానవునికి నైజమగు భగవత్సందర్శనోత్సుకత నవి యణఁచివేయుననియు, శ్రీ గురుదేవుఁడు చెప్పుమాటకు హాలధారి ప్రవర్తనము నిదర్శనము. దరిద్రజనులను ప్రత్యక్షదైవములుగా భావించు శ్రీ గురుదేవుఁ డొకనాఁడు కాళికాలయములో జరిగిన భిక్షుకసమారాధనసందర్భమున నెంగిలియాకులలోని యుచ్ఛిష్టము నొకింత తినెను. హాలధారి ఇదిచూచి "ఏమి

చేయుచున్నావు? కులభ్రష్టుఁడవైతివి. నీ కొమార్తలకు వివాహ మెట్లగును?'' అని ఆక్షేపించెను. ఈ అసందర్భపు మాటలు వేదాంతినని చెప్పుకొను హాలధారినోట విని శ్రీ గురుదేవుఁ డుద్రేకపూరితుఁడై, ''మూర్ఖుఁడా! లోకము మాయయనియు, ఈశ్వరుఁడే సత్యమనియు, శాస్త్రములలోనుండి చదివి చెప్పుచు, సర్వజీవులను పరమాత్మునిగా భావింపుఁడని మెట్ట వేదాంతములు బోధించుచుందువే! జగత్తు మిథ్య యని బోధించుచు నీవలె నేనుకూడ బిడ్డలు కందునా? ఛీ, నీ శాస్త్రజ్ఞానము తగులఁబడినట్లేయున్నది!'' అని తీవ్రముగా మందలించెను.

భగవంతుఁడు మానవుల మనస్సున కతీతుఁడను శాస్త్రప్రమాణముల నుదాహరించి, అందుచే శ్రీ గురుదేవుని దివ్యానుభూతులు యథార్థములు కాఁజాలవని హాలధారి యొకనాఁడు చెప్పఁగా, నాయన మనస్సు తీవ్రసందేహము లచేఁ గలవరపడెను. అప్పుడు కలిగిన భావములను గుఱించియు, తదనంతరము కలిగిన యనుభూతిని గుఱించియు నాయన యిట్లు చెప్పెను: ''నాకుఁ గలిగిన వివిధదివ్యానుభూతులును, జగన్మాత నోట విన్న మాటలును, అబద్ధము లేనా? అవి కేవలము చిత్తభ్రమజనితములే యగునా? ఆమె నన్నిట్లు మోసపుచ్చియుండునా? అట్టి యూహయే నాకు మిగుల బాధాకరమై, అపచారప్రాయముగాఁ దోఁచెను. కన్నీరు కాల్వలై కాఱ, దేవియొద్దకేగి 'అమ్మా, మూర్ఖుఁడ నగు నన్నిట్లు వంచించుటకు పాల్పడితివా?' అని ప్రార్థించితిని. అప్పుడు భూమిపైనుండి మంచుమొత్తముఁవంటి దేదో బయలు దేఱి నా యెదుటి స్థలమునంతయు నావరించుచున్నట్లు కనఁ

బడినది. దానిమధ్య శాంతమై దివ్యకళ యుట్టిపడుచుండిన సుందరవదన మొకటి పొడవైన గడ్డముతోఁ గనఁబడి తెప్ప వాల్పక చూచుచు నిట్లు గంభీరముగఁ బలికెను: 'ద్వంద్వ ప్రపంచపు పొలిమేరయందే యుండుము!' మూఁడుసారు లిట్లుచ్చరించి ఆ వదనము మెల్లగా మంచులో మాయ మయ్యెను. కొంతసేపటి కా మంచుకూడ విరిసిపోయెను. ఈ దృశ్యమువలన నాకు నా యనుభవములలో నమ్మకము కలిగినది."

మఱియొకనాఁడుఁగూడ హాలధారివాదములవలన శ్రీ గురుదేవుఁ డిట్లే కలవరపడి మరల దేవిని ప్రార్థించెను. అప్పుడొక పరిచిత స్త్రీరూపముతో నామె ప్రత్యక్షమై పైమాటలనే మరలఁ జెప్పెను. మఱియొక సారికూడ నిర్వికల్పసమాధిస్థితినుండి సామాన్య మానసికస్థితికి వచ్చిన పిమ్మట నాయన ఇదేవాక్యమును వినెను.



# వి వా హ ము

తగిలినకాలికే దెబ్బ తగులుచుండును. పెద్ద కొడుకు మరణమువలని విచార మింకను పూర్తిగాఁ బోకమునుపే, చిన్నికొమరుఁడైన గదాధరుఁడు పూజాదులన్నిటిని మాని, పిచ్చివానివలె తిరుగుచున్నాఁడని చంద్రాదేవికిఁ దెలిసెను. ఆమెయు రామేశ్వరుఁడును మిక్కిలి భీతిలిరి. కామార్పుకుర్ వచ్చినచో నచటి పరిశుభ్రమైన గాలివలనను, మాతృపోషణ వలనను, ఆరోగ్యము కలుగఁగలదని చంద్రాదేవి దక్షిణేశ్వరమున కెన్నియో ఉత్తరములు వ్రాయింపఁగా శ్రీరామకృష్ణుఁడచటికిఁ బోయెను. పూర్వ ముల్లాసవంతమై కలకలలాడుచుండిన తన చిన్నికొమరుని మోమున విచారదైన్యము లలమియుండుట కామె మిక్కిలి పరితపించెను. ఆయన చిత్తవ్యథకును, పల్మాఱు విలపించుచు 'అమ్మా, అమ్మా' యని దీనముగాఁ బిలుచుచుంటకును కారణమామెకు బోధపడలేదు. దక్షిణేశ్వర ములోవలె నపారభావోద్రేకమును, ఒడలి మంటలును, మరల నారంభించెను. అన్నిచికిత్సలును నిష్ఫలములగుటచే దిక్కుతోఁపక చంద్రాదేవి మంత్రశాస్త్రజ్ఞులను పిలిపించెను. వారావాహనచేసిన పిశాచ మాయనకెట్టి భూతమును పట్టలేదనియు, ఎట్టిజబ్బును లేదనియుఁ జెప్పుటయేగాక, శ్రీగురుదేవు నుద్దేశించి సాధువుగా నుండఁగోరువారు పోఁక చెక్కలు విశేషముగా తినఁగూడదని హెచ్చరించెను. ఈ యలవాటాయన కప్పటి కెక్కువగనే ఉండెను. ఈ మందలింపు విన్నప్పటినుండియు దానిని మానివైచెను.

భారతదేశమున శ్మశానభూములు పవిత్రములుగ భావింపఁబడును. ధ్యానమునకు మిక్కిలి యనుకూలములని తాంత్రికసాధకుల యభిప్రాయము. సర్వభౌతికబంధనిర్మూలిని యగు శ్రీ కాళికాదేవి కివి యభిమానస్థలములు. కావున శ్రీరామకృష్ణుఁ డొక శ్మశానభూమిలోఁ బగలంతయును, రాత్రులు చాలభాగముకూడ, కఠినతపస్సు చేయసాగెను.

కామార్పుకుర్‌లో కొలఁదినెల లుండిన పిదప శ్రీగురుదేవుని యారోగ్యము చాలవఱకు చక్కఁబడినది. సహజ చిత్తవృత్తి తిరిగి వచ్చెను. మనస్సులోని యలజడి పోయి, యేడ్చుట మానివైచెను. కఠినతపఃఫలితముగా నాయనకు దేవీదర్శనభాగ్యము మరల నబ్బుటయే యీ మార్పునకుఁ గారణమని యూహింపఁదగును.

జబ్బుకుదిరినందున చంద్రాదేవియు, నితర బంధుజనులును చాల సంతోషించిరి. శ్మశానమునందు విశేషకాలము గడపుట, ప్రార్థనలందు విఘ్నములు సైఁపకుండుట, ఆధ్యాత్మికకృషియందు ప్రబలాభిమానము, ఇట్టి యసామాన్యలక్షణము లింకను ఉండినను, నివి యాయనయందుఁ జిన్నతనము నుండియుఁ గానవచ్చుచుండినవేకదా!

శ్రీరామకృష్ణునకిప్పుడు ఇరువదిమూఁడేండ్లు. ఇప్పటికిని ప్రాపంచికవిషయములం దుపేక్ష చూపుచుండుటచే, ననుకూలపత్నియం దనురాగము కుదిరినయెడల మనస్సంతగ పైకిపోక సాంసారికబాధ్యతలలోఁ దగుల్కొని యాతనిని సరియైన త్రోవకు తీసికొనిరాఁగలదని తీర్మానించుకొని వివాహబంధముచే నాయనను గట్టివేయఁ దలపెట్టిరి.

గదాధరున కీ ప్రయత్నము తెలిసినచో సర్వము పాడు చేయునేమో యను భయముచేఁ బ్రయత్నములు రహస్యముగా సాఁగుచుండెను. కాని యతనికెట్లో అంతయు తెలిసి, వివాహమున కొప్పుకొనినట్లుకూడ నగపడెను. సామాన్య బాలురవలె నందుత్సాహముకూడ చూపనారంభించెను.

తగినసంబంధము దొరకనందున తల్లియు, అన్నయు, చింతాక్రాంతులై యుండుట గ్రహించి, అతీంద్రియ దృష్టితోఁ జూచి "ఎక్కడెక్కడనో ప్రయత్నముచేయుట నిష్ప్రయోజనము. జయరాంబాటి (జయరామవాటి) గ్రామమున రామచంద్రముఖోపాధ్యాయునింట నాకై నిర్ణయింపఁ బడిన వధువు కలదు" అని ఆయన చెప్పెను. వారా మాట నమ్మకపోయినను, ఒకరి నచటకుఁ బంపిరి. అతఁడు తిరిగివచ్చి, రామచంద్రునకు కొమార్తయున్న మాట నిజమేయైనను, సంబంధము చాలమంచిదికూడనైనను, బాలిక యైదేండ్లదే యగుటచే నీడు తక్కువగునేమో యని చెప్పెను. కాని తగిన కన్య ఇంకెచ్చటను దొరకునట్లు లేనందున చంద్రాదేవి ఈ సంబంధమునకే యొప్పుకొనెను. తలవనితలంపుగా కుదిరినందున దైవసంకల్పితమనికూడ భావించెను. కొలఁదినాళ్లలో నొక శుభముహూర్తమున శారదామణి యని పేరుగల ఆ కన్యకును శ్రీ రామకృష్ణునకును పెండ్లి జరిగెను. కార్యమంతయు సక్రమముగనే జరిగెను కాని పిమ్మట నొక చిన్నచిక్కు కలిగెను. తాను పేదరాలగుటచే చంద్రాదేవి లాహాకుటుంబమువారి నగలను ఎరువుతెచ్చి పెండ్లికూఁతునకు పెట్టియుండెను. అవి మరల నిచ్చివేయవలసిన వేళ వచ్చినప్పు డా యమాయిక బాలిక యొద్దనుండి

పృచ్ఛకొనుట కామెకు మనసు రాలేదు. శ్రీరామ కృష్ణుఁడిది గ్రహించి బాలిక నిద్రపోవుచుండ నతి నిపుణతతో వానిని తీసివైచెను. పిల్ల మేల్కొనిన పిదప నగలుపోయిన వని యందఱతో చెప్పనారంభించెను. చంద్రాదేవి యామెను కౌఁగిలించికొని "తల్లీ, విచారపడకుము. మా అబ్బాయి గదాధరుఁడు నీ కింతకన్న మంచినగలు చేయించియిచ్చునులే" యని యూఱడించెను. పిల్లపినతండ్రి కోపించి వెంటనే యామె నింటికి పిలుచుకొనిపోయెను. ఇది యంతయు చంద్రాదేవిని చాల వ్యాకులపఱచెను. కాని శ్రీరామకృష్ణుఁడు తన చతురోక్తులతో నామె నూఱడించి "ఇప్పుడేమైనను పెండ్లి మాత్రము రద్దుచేయలేరుగదా" యనెను.

శ్రీరామకృష్ణుఁడు వివాహానంతరము సుమారొకటిన్నఱ సంవత్సర మింటనుండి పూర్ణారోగ్యము నొందెను. అప్పటిలో నొకసారి యాయన తన మామగారియింటికిపోయి, భార్యతోకూడ నింటికి వచ్చెను. ఇఁక దక్షిణేశ్వరము పోయి పనిలో ప్రవేశింపవలెనను కోరిక కలిగి, యాయన దక్షిణేశ్వరమునకు బయలుదేఱెను.



## దక్షిణేశ్వరమునకు తిరిగివచ్చుట

శ్రీరామకృష్ణుఁడు దక్షిణేశ్వరమున కాళీపూజయందు మరలఁ బ్రవేశించెను. కొలఁదినాళ్లలో జగన్మాతృపునర్దర్శన తీవ్రవాంఛ మరల రేకెత్త, నాయన తన ముదుసలి తల్లిని, సంసారభారమున తికమకలాడు సోదరుని, చిన్నిభార్యను, కుటుంబదారిద్ర్యమును, మఱచెను. రేయుంబవళ్లు, ఒకటే ధ్యానము, ఒకటే ప్రార్థన! వక్షఃస్థలమున రక్తపుపోటు, శరీరమందంతటను మంటలు, ప్రాపంచికవిషయములందు వైముఖ్యము : ఈ లక్షణములెల్ల మరల కనఁబడఁజొచ్చెను.

వ్యాధి తిరుగఁబెట్టినదని చికిత్సలు చేయించిరిగాని నిరుపయోగమయ్యెను. ఒకనాఁడొక క్రొత్తవైద్యుఁడు చూచుట తటస్థించెను. ఆయన వ్యాధిలక్షణములు విచారించి, "ఇవి దివ్యోన్మాదలక్షణములవలె నున్నవి. యోగసాధనలవలన కలిగియుండవచ్చును" అని చెప్పెను. నిజముఁగనుఁగొనిన మొదటివైద్యుఁ డితఁడే యని శ్రీ రామకృష్ణుఁడు చెప్పువాఁడు. కాని దేహవ్యాధి చికిత్సలే చేయింపఁబడెను. వ్యాధియు ముదురుచుండెను. చంద్రాదేవి కిందుచేఁ గలిగిన దుఃఖము వర్ణనాతీతము. వేఱుత్రోవ లేక గాఢవ్రత నియమములచే భగవత్ప్రీతినొంది కుమారుని పునరారోగ్యమును సాధించుకొనఁ జూచెను. కామార్పుకుర్‌లోని శివుఁడు భక్తాభీష్టప్రదాతయని ప్రఖ్యాతి. చంద్రాదేవి యాదేవునికడ సంకల్పము సిద్ధించువఱకు నిరశనదీక్ష ప్రారంభించెను. కాని యొక స్వప్నాదేశముచే నామె ముకుందపుర శివునికడకేగి.

యచట తన దీక్షసాఁగించెను. రెండునాళ్ల పిమ్మట మహా దేవుఁడు ప్రత్యక్షమై "భయపడకుము! నీ కుమారునకు పిచ్చి కాదు. అతఁడీశ్వరసాక్షాత్కారమార్గమున నున్నాఁడు" అని చెప్పెను. చంద్రాదేవి యూఱడిల్లి ఇంటికివచ్చెను.

నిరంతరదేవీసాక్షాత్కారతృష్ణచే శ్రీ గురుదేవుని హృదయ మాఱుకొని పోవుచుండెను. "అమ్మా, ఎంత యయోగ్యుఁడైనను, ఈ పుత్రుని కనికరించి, వీనికి దర్శన మిమ్ము. సౌఖ్యము కాని, భాగ్యముకాని, ప్రతిష్ఠకాని నా కక్కఱలేదు. నీవే నాకుఁగావలసినది. ఇంకేమియు వలదు" ఇదియే యాయన నిరంతర విలాపము. ఈస్థితినిగూర్చి యా యన ఇట్లు చెప్పువాఁడు: "ఒకస్థితి కడచినవెంటనే మఱియొక స్థితి వచ్చుచుండెను. ఆ ఝంఝామారుతముముందు యజ్ఞోప వీతముకూడ ఎగిరిపోయినది. కట్టుకొన్న బట్టయైన సరిగా నిలువకుండెను. పల్లెవాండ్రు వల వెడల్పుగాఁబన్ని చేఁపలను పట్టి లాఁగుకొనునట్లుగా లోకమాతను నేను పట్టుకొనవలె నని దవడలు పైన నాకాశమును, క్రిందఁ బాతాళమును దాఁకు చుండెనో యనునట్లు నోరు పూర్తిగాఁదెఱచి, 'అమ్మా!' యని బిగ్గరగా నఱచి పిలుచువాఁడను. ఆహా! ఆదినములలో నే నెట్టి చిత్తవృత్తు లనుభవించితిని! అందఱు నేను పిచ్చి వాఁడ ననుకొనిరి. అత్యల్పకారణముచేఁగూడ నా యాధ్యా త్మికచైతన్యసాగర మామూలాగ్రసంచలన మొందును. తుదకు వీథిని బోవు సాధారణబాలికకూడ విజయాభిరాముఁ డైన తన భర్తను సమ్మానించుటకుఁ బోవుచుండిన సీతవలె నా కగపడును. ఒకనాఁ డొక యాంగ్లేయ బాలుఁడు కాలిపై కా లడ్డముగా నొక చెట్టు నానుకొని నిలువఁబడియుండ,

వెంటనే శ్రీకృష్ణుఁడు స్ఫురణకు వచ్చి యగాధధ్యాననిమగ్నుఁడనై మైమఱచితిని. ఒకప్పుడొక కుక్కకన్నము పెట్టి, మిగిలిన యెంగిలియన్నమును తింటిని. కులము అను మాట కర్థముకూడ మఱచితిని. ఒక హీనజాతిపురుషుఁడు తన భార్య వండిన కూరను పంపఁగా నెంతో యభిరుచితో భుజించితిని. ప్రపంచస్మృతిఁ గోల్పోయి నిశ్చలశరీరముతో గాఢధ్యాననిమగ్నుఁడనై పంచవటిలో కూర్చుందును. తల జడలు కట్టుకొనిపోయెను. పక్షులు తలపై వ్రాలి యచటి పూజాక్షతలు గఱచికొనిపోవును. కొయ్యవలెనుండిన నా నిశ్చలశరీరముపై పాములు ప్రాఁకును. అది నాకు తెలియదు; ఆ పాములకును తెలియదు. నా కండ్లయెదుట నెన్నెన్నియో దివ్యదృశ్యము లగపడుచుండెను.''

అప్పటి విచిత్రానుభవములనుగుఱించి యాయన ఇట్లు చెప్పువాఁడు: "నేను ధ్యానమునకు కూర్చుండినపుడు నాలోనుండి త్రిశూలహస్తుఁడగు నొక సన్న్యాసివచ్చి, 'ఆలోచనలన్నిటినివిడిచి, భగవంతునియందే మనస్సునిలుపు' మని యాజ్ఞాపించును. అట్లు చేయనిచో నా త్రిశూలముతోఁ బొడుతునని బెదరించును. నాలోనుండి వచ్చిన పాపపురుషుని జంపిన దీ సన్న్యాసియే. దూరస్థులగు దేవతలను జూడఁ గోరినకాని, అట్టి సంకీర్తనములలో పాల్గొనఁగోరినకాని ఈ తేజోమూర్తియే నాలోనుండి వచ్చి తేజోమయమార్గమున నాస్థలమునకు పోయి, నాకోరిక తీఱిన పిదప మరల నాలో ప్రవేశించును.

మఱియొకసమయమున నిట్లు చెప్పెను: "నావలెనే యుండు నొక బాలసన్న్యాసి నాలోనుండి వచ్చి సర్వవిషయ

ములను నాకు బోధించును. ఒక్కొకప్పుడు శరీరస్మృతి కొంచెముండినను, తఱచా చిత్రమనుష్యుని చేష్టలందే లీన మగును, అతఁడు మరల నాలో ప్రవేశించినపిమ్మట నే యథాస్థితికి వత్తును. అట్టి తీవ్రోత్సాహములో లేశమైనను సాధారణ మనుష్యుఁడు భరింపఁజాలఁడు. దానిలో నాల్గవవంతున కే శరీరము తుత్తునియలై పోవును. అహోరాత్రము లేవో రూప మున దేవీదర్శనము లభించిన నే కాని యా దుర్భరసంతాప మును మఱవఁజాలకుందును! అట్లు లభింపకున్న చో నీ శరీరము నిలిచియే యుండదు. ఆ తేండ్లీ కన్నులొకసారియైన నిద్ర నెఱుఁగవు. ఎల్లప్పుడును తెఱచుకొనియే యుండినవి. ఎంత ప్రయత్నించినను ఱెప్పలు మూయఁజాలకుంటిని. కాలస్మృతి కాని, శరీరస్మృతికాని యెంతమాత్రము లేదు. కొన్ని యరిది వేళల నా మనస్సు కొంచెము క్రింది మెట్టునకు దిగి, శరీరమునూట కొంచెము జ్ఞప్తికివచ్చి, అపార పరితాపముతో గడగడ వణఁకుచు, పిచ్చివాఁడ నై పోవుచున్నానని తలఁతును. అద్దమునెదుట నిలిచి ఱెప్పలు మూఁతపడునేమో యని కన్ను లను వ్రేళ్లతో పొడుచుకొందును. కాని యవి మూసికొనవు. అప్పుడు అపరిమితభయాక్రాంతుఁడనై 'అమ్మా! నీకు నా సర్వము సమర్పించి నిన్ను ప్రార్థించినందులకా యీ ఫలము? అయ్యో! నన్ని ఘోరవ్యాధిపాలు చేసితివా?' అని యేడ్చువాఁడను. కాని యా యుత్తరక్షణముననే, 'నీ సంక ల్పమే జరుగనిమ్ము! శరీరము ముక్కముక్కలైనను సరే, నీవుమాత్రము నన్ను విడిచిపెట్టకుము! అమ్మా! దిక్కులేని యీ బిడ్డయందు దయయుంచి ప్రత్యక్షమగుము! నీ పాదపద్మ ములే నమ్ముకొనియున్నాను. నాకు వేఱుగతి లేదు.' అని

తలపోసి శాంతి నొందుదును. ఇట్లు ప్రార్థించినప్పుడు మరల నుత్సాహము కలిగి శరీరము గడ్డిపరకవలె కనఁబడును. ఆనందరూపిణియగు లోకమాత నాయెదుట కనఁబడి దయామయవాక్కులతో నన్నూఱడించును.''

ఆధ్యాత్మికసాధనల ఫలముగా సాధకుని మనస్సు తగుపాటి వినిర్మలస్థితికి వచ్చినప్పు డదియే గురువుగ వర్తించు నని శ్రీ గురుదేవుఁడు చెప్పువాఁడు. ఈ మాటలనుబట్టి చూచినయెడల, తనలోనుండి తన్నుబోలు పురుషుఁడు వచ్చి బోధించినట్లు కనఁబడిన యసాధారణదృశ్యముయొక్క యర్థము కొంతవఱకు బోధపడును. ఇది బహుతీవ్రమైన ధ్యానస్థితిని సూచించును. ఆ స్థితిలో మనస్సునందున్న యూహలు స్థూలాకారముదాల్చి సశరీరజీవులవలెనే మెలఁగును.

ధనాసక్తిని పూర్తిగఁ బెకలించివైచుకొనుటకు శ్రీ గురుదేవుఁ డొక తీవ్రసాధన నొనరించెను. గంగాతీరమున కూర్చుండి ఒకచేత నొక మట్టిపెళ్లను, మఱియొకచేత కొన్ని రూపాయలను పుచ్చుకొని, వానివిలువను మనస్సులో నెంచుకొనుచు, నొకచేతినుండి మఱొకచేతిలోనికి మార్చుకొనును. పిమ్మట నిట్లు వితర్కించుకొనును. ''ధనమువలన సుఖజీవనమును, దానధర్మములకుఁ గొన్నియవకాశములునుమాత్రమే గదా కలుగును; మానవజీవితములో సాధింపఁదగిన పరమార్థమీశ్వరసాక్షాత్కారమొక్కటే; అది ధనముచేత సాధింపఁబడదు; కావున నిజమునకీ గుప్పెఁడు మట్టికంటె ఈ ధనమునకేమి ఎక్కువ విలువకలదు ?'' ఈ నిజము మనస్సులో నాటుకొన్నపిదప రెంటిని గంగలో పాఱవైచును. ఇఁక తన యాధిక్యభావమును నిర్మూలించుకొనుటకై, సర్వపదార్థములు జడ

ప్రకృతియొక్క భిన్నరూపములే గనుక నన్నియు సమములే యను భావమును కార్యరూపమునం బెట్టుటకై యపరిశుభ్ర స్థలములను సామాన్యనీచసేవకునివలె కడిగి శుభ్రపఱచును. చందనమును మలమును అభేదబుద్ధితో చూచునట్లు మనస్సు నలవఱచుకొని రెంటిని ఒకటేభావమున తాఁకును.

శ్రీ గురుదేవునిపట్ల మథురుని గౌరవము నానాఁటి కధికమై యాయన శరీరసౌఖ్యముల విషయమై యతఁడిప్పుడు బహుజాగరూకుఁడై వర్తించుచుండెను. ఒకనాఁడు శ్రీరామకృష్ణుఁడు దక్షిణేశ్వర శివాలయములలో నొకదానికడ "శివమహిమ్నస్తోత్రము"ను పారాయణముచేయుచుండెను. అనంతమగు నా మహాదేవుని ప్రాభవము తలఁపునకురాఁగా నతఁడు భక్తిభావోద్రేకపరవశుఁడయ్యెను. ఈశ్వరుని మహిమలు కేవలము వర్ణనాతీతములని చెప్పు "అసితగిరిసమంస్యాత్కజ్జలం..." అను నత్యంత రమణీయ శ్లోకమును * బఠించు సమయమున భావోద్రేక ముచ్ఛస్థితినంది తాను మహాదేవుని ముఖాముఖి చూచుచుండినట్లయ్యెను. పాదముల వరుసయు, శ్లోకములవరుసయు, మఱచిపోయెను. శ్లోకమునందలి మాటలు కూడ జ్ఞప్తికిరాక "ఓ పరాత్పరా! నీ అనంతమహిమాతిశయము నెట్లు వర్ణింపఁగలను?" అనుమాటలు మాత్రము నోటినుండి వెలువడెను. ఆనందబాష్పములు కాలువలై

---

* "అసితగిరిసమం స్యాత్కజ్జలం సింధుపాత్రం
సురతరువరశాఖా లేఖనీ పత్రముర్వీ
లిఖతియది గృహీత్వా శారదా సర్వకాలం
తదపి తవగుణానా మీశపారం నయాతి."

ప్రవహింపఁజొచ్చెను. ఈ చిత్రప్రవర్తన త్వరలో చాలమంది జనుల నచ్చటి కాకర్షించెను గాని, యాయనకు శరీరస్మృతియే లేదు. మథురుఁ డిది విని యచ్చటికివచ్చి ఆశ్చర్యచకితుఁడై చూచుచుండెను. అప్పుడు దేవాలయోద్యోగి యొకఁడు "ఈ పిచ్చివానిని బయటికి నెట్టివేయవలయు"నని చెప్పఁగా, ప్రాణములపై నాశలేనిచోఁ దాఁకవచ్చునని మథురుఁడు మందలించెను. అంతటితో నచ్చటి జనులు నిశ్శబ్దులైరి. శ్రీరామకృష్ణుఁడు సహజమానసికస్థితికి వచ్చిన పిమ్మట నా జనసమూహమును, మథురుని యునికిని, చూచి మైమఱపులో నేదైన యకార్యము చేసితినేమో యని సంశయించి యడిగెను. "లేదు, మీరొక స్తోత్రము పఠించుచుండిరి. మీ ప్రార్థన కెవ్వరును భంగము కలిగింపకుండుటకై నే నిచ్చట నున్నా" నని మథురుఁడు ప్రత్యుత్తరమిచ్చెను.

పిదప కొన్నాళ్లకు మథురున కొక యద్భుతానుభవము కలిగెను. శ్రీ గురుదేవుఁ డాయనగదికి తూర్పుననుండు పొడుగుపాటి వసారాలో నొకనాఁడు గాఢాలోచనాతత్పరుఁడై పచారుచేయుచుండెను. అప్పుడు మథురుఁడు తనగదియందొంటిగఁ గూర్చుండి యాయనవంకనే చూచుచుండెను. ఈ విషయము శ్రీరామకృష్ణునకు తెలియదు. హఠాత్తుగ నొక చిత్రము జరిగెను. మథురుఁడు పరుగెత్తివచ్చి యాయన పాదములపైఁ బడి పసిబిడ్డవలె నేడువసాఁగెను. "ఇదియేమి? నీవు రాణి రాస్మణి యల్లుఁడవు. నీ ప్రవర్తన చూచినచో నితరు లేమనుకొందురు? లెమ్ము!" అని యాయన యాశ్చర్యముతోఁ జెప్పెను, కాని మథురుఁ డింకను స్తిమితపడఁడయ్యెను. కొంచెము మనస్సు కుదుటపఱుచుకొని

యాతఁ డిట్లు చెప్పెను: "మీరు వసారాలో పచారుచేయు చున్నప్పుడు ముందుకు వచ్చుచో జగన్మాతవలెను, వెనుకకు పోవుచో మహాదేవునివలెను కనఁబడితిరి. భ్రమయేమో యని కన్నులు నులుముకొని మరల చూచితిని. కాని యట్లే యగపడితిరి" అని చెప్పుచు భావోద్రేకమున మథురుఁడు విలపింప నారంభించెను. కాని యాయన తన సహజ రీతిని "నాకేమియు తెలియదు" అని రెట్టించి చెప్పెను. ఈ విషయమునుగూర్చి శ్రీ గురుదేవుఁ డిట్లు చెప్పవాఁడు: "మథురుఁ డూఁబడిల్లఁడయ్యెను. ఈ సంగతి రాణి రాస్మణికి తెలిసి నే నేమైన మాయమంత్రము చేసితినని తలఁచు నేమో యని చాల భయపడితిని." ఈ మాటలు చెప్పి మథురునకు తనయం దంత విశ్వాసముండుటకుఁ గల వాస్తవ కారణము నిట్లు తెల్పువాఁడు: "మథురుఁ డీ శరీరముపట్ల నంతగౌరవమును, దీని సౌఖ్యములపట్ల నంతజాగరూకతయు, నూరకే కలిగియుండెనా? జగన్మాత యతనికి చాలసార్లు అనేక దివ్యానుభవము లనుగ్రహించెను. అతని జాతకమందు కూడ ఇష్టదైవ మెప్పుడును దయగలిగి, మనుష్యాకారమున తనతోఁ గలసిమెలసి తిరుగుచుండునని వ్రాయఁబడియున్నది." అప్పటినుండియు శ్రీ గురుదేవునెడల మథురుని భక్తిగౌరవ ములు వేయిరెట్లధికమయ్యెను.

శ్రీరామకృష్ణుని జీవితనాటకమున రాణిరాస్మణి పాత్రము నిష్క్రమింపవలసినకాలము వచ్చెను. ఆమె 1861–వ సం॥ ఫెబ్రువరినెల 19–వ తేదీని కాలధర్మము నొందెను. ఒకనాఁ డామెకు కడుపునొప్పియు, జ్వరమును వచ్చి అపాయకరమగు రక్తగ్రహిణిగపరిణమించెను. ప్రాణములుపోవుటకు కొన్నినిమిష

ములుముండా మెను గంగాతీరమునకు తీసికొనిపోయిరి. అప్పుడు తనయెదుట వెలిగింపఁబడియున్న దీపములనుచూచి యామె "వీనిని తీసివేయుఁడు. ఇప్పుడివి యెంత వెలవెలఁబోవు చున్నవో! ఆహా! మాతల్లి వచ్చుచున్నది! శతకోటి సూర్య సమానమగు నామె కాంతిచే నీస్థల మంతయు ప్రకాశవంత మైపోయినది" అని చెప్పి, మరల కొంతసేపటికి "అమ్మా! వచ్చితివా? పద్మ సంతకము చేయనందున ధర్మాదాయము నకు హానికలుగునా? అమ్మా!" యని దీనముగా శ్రీ పరా శక్తిని సంబోధించి బహుశాంతముగా ప్రాణములు వదలెను.

రాస్మణి యాస్తికంతటికిని మథురుఁ డిప్పుడు విచారణ కర్తయై, సర్వవిధముల శ్రీ గురుదేవునికి వశవర్తియై నడచు కొనుచుండఁ బ్రయత్నించెను. శ్రీ గురుదేవుని సాధనకాల మున, నాయా సాధనలకు వలయు సామగ్రిని చేకూర్పఁగల ధనికుఁ డవసరమయ్యెను. ఇందుకై దేవినికూడ నాయన ప్రార్థించెను. తనకొఱకు కామెచే నియమింపఁబడిన యైదుగురు రసద్దారులలో (సరఫరాదారులు) మథురుఁడు మొదటివాఁడని ఆయన చెప్పువాఁడు. చెప్పుటయే తడవుగ నతఁ డాయన కోరికలను సంతోషపూర్వకముగ నెఱవేర్చుచు వచ్చెను. ఆయనయు మథురునెడ మిక్కిలి దయగలిగి యుండెను. కాని, ముఖ్యవిషయములందును, ధర్మము చెడనున్నప్పుడును, ఎంత మాత్రమును లొంగఁడు. న్యాయ్యమును చెప్పుటకు వెను దీయఁడు. జగన్మాతయే తన కోరికల నన్నిటిని నెఱవేర్చునని నమ్మియుండుటచే నాయన మథురుని దయ సంపాదింపఁ బూనుకొననే లేదు. ఒకనాఁడు రాధాకాంతాలయములో నగలుపోయెను. మథురుఁ డాయనయెదుట ఆ దేవతల నుద్దే

శించి "మీ నగలు కాపాడుకొను శక్తి కూడ మీకు లేకపోయె" ననెను. వెంటనే ఆయన "ఏమి యవ్యక్తప్రసంగము! సకల భాగ్యాధిదేవతయగు శ్రీ మహాలక్ష్మినే పాదదాసిఁగాఁ గల యా భగవంతుఁడు మీరు నగ లనుకొను యీ మట్టిముద్దలను తృణముగాఁ జూచును" అని చెప్పెను.

ఒకనాఁడు మథురుఁడు శ్రీ రామకృష్ణుని పేర పెద్ద యాస్తి వ్రాసిపెట్టెద నని చెప్పెను. అందులకాయన "నన్ను లౌక్యునిగ చేయఁదలఁచుచున్నావా" అని గద్దించెను. ఆయనను మథురుఁడు తఱచుగా జాన్‌బజాఱునందలి తన భవనమునకు పిలిచికొనిపోయి యచ్చట కొన్నాళ్లాయనతో సుఖముగఁ గడపును. సాయంకాలము వారు గుఱ్ఱపుబండిలో విహారార్థముకూడ పోవుదురు. ఆయనకొఱకతఁడు బంగారు వెండి పాత్రలు చేయించెను. వెలగల దుస్తులు కుట్టించెను. కాని, యాయన మాత్రము సంపూర్ణ వైరాగ్యసంపత్తికి నిలయమై మెలఁగుచుండెను. ఒకనాఁడు మథురుఁడొక వెల గల సాలువును తెచ్చి యాయన కిచ్చెను. మొట్టమొదట దానిని సంతోషపూర్వకముగ గ్రహించి, బాలునివలె నితరులకుఁ జూపి, యానందించెను. కాని వెంటనే తన మనస్సులో "ఇందులో నేమున్నది, గొఱ్ఱెల ఉన్ని తప్ప? ఇదికూడ ప్రకృతి యొక్క మార్పులలో నొక్కటియే. చలినుండి కాపాడఁగలదు నిజమే, కాని ఆ విషయమున నిది సామాన్యమైన కంబడి కన్న నేమి హెచ్చు? ఇతర ఐహికవస్తువులవలెనే ఇదియును భగవత్సాక్షాత్కారమున కనుపయుక్తము. అంతేకాక దీనిచే గొప్పవాఁడనను అహంకారము బయలుదేఱి మనుష్యుని భగవంతునుండి వేఱుపఱచును" అని తర్కించుకొనుచుండ,

నాయన భావము ఉద్రేకించెను. వెంటనే దానిని క్రిందపడవేసి త్రొక్కి దానిపై నుమ్మివేయ నారంభించెను. కాల్చుటకుఁగూడ సిద్ధపడుచుండఁగా, నెవరో వచ్చి దానిని తీసికొనిపోయిరి. ఇది విని మథురుఁడు సంతసించెను.

కాళీఘాట్ దేవాలయమున మథురుని కుటుంబపురోహితుఁడు చంద్ర హాలదార్ అనునతఁ డుండెను. శ్రీ రామకృష్ణునియెడ మథురునికిఁగల భక్త్యతిశయములు చూచి, ఈ పోటీ నెట్లయినను భగ్నపఱుప నిశ్చయించెను. ఒకనాఁడాయన జాన్ బజారు గృహమందు వెలుపలిగదిలో నసంపూర్ణ శరీరస్మృతితో ధ్యానమగ్నుఁడై యుండఁగా నతఁడు గదిలో నకస్మాత్తుగా ప్రవేశించి, యితరులెవ్వరును లేకుండుట గ్రహించి, యాయనను చాలసారులు గుంజిగుంజి "ఏమంత్రము చే మథురాబాబును వశపఱచుకొన్నావో చెప్పు" అని అడిగెను. ఆయనకప్పుడు మాటాడుటకుఁగూడ శక్తిలేకుండెను. ఎన్నిసార్లకు నుత్తరమీయనందున నతఁడు కోపోద్దీపితుఁడై కాలితో తన్ని వెళ్లిపోయెను. ఈ విషయము మథురునకు తెలిసినచో విపత్తు వాటిల్లునని యెఱిఁగి శ్రీ గురుదేవుఁ డతనితో చెప్పలేదు.

ఈ విధముగా నాయన నిష్కళంకపవిత్రతకును నమాయికత్వమునకును మథురుఁడు దాసుఁడైపోయి, కామినీ కాంచనముల కతీతుఁడని గ్రహించి, ఆయన దివ్యపాదముల కాత్మార్పణముచేసికొను స్థితికి వచ్చెను.



## భైరవీ బ్రాహ్మణి

ఒక యుదయము దక్షిణేశ్వరాలయపుష్పవనములో శ్రీరామకృష్ణుఁడు పూలుకోయుచుండి, దేవాలయపు చిన్న స్నానఘట్టమువైపున కొక నాటుపడవ వచ్చుట చూచెను. పడవనుండి చేతిలో నొక చిన్నమూట పట్టుకొని యొక స్త్రీ దిగెను. నడివయస్సుఁగలిగి, సౌందర్యవతియై, యామె కాషాయవస్త్రములు ధరించి, విరియఁబోసికొనియున్న పెద్ద తలకట్టుగలిగి, సన్న్యాసిని (భైరవి) వలె నుండెను. నలువది యేండ్లుండును గాని అంత వయస్సుకలదిగాఁ గనఁబడదు. ఆమెను చూచుటతోడనే యాయన తనగదిలోనికి వచ్చి, హృదయునిబిలిచి యామెను తోడ్కొనిరమ్మనెను. ఆయనకు క్రొత్తస్త్రీలతో మాటాడు నలవాటులేదు గావున, హృదయుఁడాశ్చర్యపడి, "రమ్మనుటతోడనే ఆమె ఏల వచ్చును?" అని యడిగెను. "వెళ్ళి నా విషయము చెప్పుము. ఆమెయే వచ్చును" అని యాయన అనెను. మాటాడక హృదయుఁడు ముఖద్వారముకడకేగి, అచ్చట కూర్చుండియుండిన సన్న్యాసినితోఁ దన మేనమామయొక్క సందేశము తెలిపెను. ఆమెయు వెంటనే వచ్చుట కంగీకరించెను. హృదయునకు మరల నాశ్చర్యము కలిగెను.

సన్న్యాసిని యాయనను చూడగనే ఆనందబాష్పపూరితనేత్రయై మిగుల మృదువైన ప్రేమస్వరముతో "నాయనా, నీవిక్కడ నున్నావా? గంగాతీరమందెక్కడనో యున్నావని తెలిసి, నీకొఱ కెంతోకాలముగా వెదకుచున్నాను.

చివర కిప్పటికిఁ గనఁబడితివి!" అని పలికెను. "అమ్మా, నా విషయమై నీవెట్లు తెలిసికొనఁగలిగితివి?" అని యాయన యడిగెను. "మిమ్మును ముగ్గురను కలసికొనవలసియున్నదని శ్రీ విశ్వేశ్వరీ కృపచే నాకుఁ దెలిసినది. తూర్పుబంగాళాదేశములో నిద్దఱ నిప్పటికే కలసికొంటిని. నేఁడు నీవగపడితివి" అనెను. ఎప్పుడో కోల్పోయిన మహానిధానము మరల దొరకినటు లామె సంతోషవివశురాలాయెను. ఆయనకును గనుల నీరు గ్రమ్మెను.

కొంతసేపటి కామె స్వవిషయమును తెలిపెను. 'యశోహార్ జిల్లాలో నొక బ్రాహ్మణకుటుంబమున నామె జన్మించెను. బంగాళాదేశములో అసాధారణప్రభావముగల ముువ్వురకుఁ దానొక సందేశము తెలుపవలసియున్నదని యోగదృష్టివలన నామెకు తెలిసెను. వారిలో, నిదివఱ కామె చంద్ర, గిరిజ అను ఇరువురను చూచెను.' శ్రీ గురుదేవుఁ డామెప్రక్కను గూర్చుండి తల్లితో హృదయరహస్యములు దెలుపు బాలునివలె, తన సాధనలో జరిగిన ప్రతివిషయము, తనకుఁ గలిగిన అద్భుత దివ్యానుభూతులు, భగవద్ధ్యానమునందు తాను పూర్తిగ శరీరస్మృతి తప్పియుండుట, శరీరమందంతట మంటలు, నిద్రలేమి, మఱి ఇతరలక్షణములు తెలిపి, తనచేష్టలన్నియు సామాన్యజనుల చేష్టలకు భిన్నముగా నున్నందున, అందఱును తన్ను పిచ్చివానిగఁ జూచుచుందురనికూడఁ జెప్పెను. "ఈ లక్షణముల కర్థమేమో మీరు చెప్పఁగలరా? ఇది పిచ్చియేనా? అగుచో అహోరాత్రములు విశ్వేశ్వరిని ప్రార్థించినందులకు నాకుఁ గలిగిన దీ ఫలమేనా?" అని మరల మరల ప్రశ్నించెను.

ఆనందాశ్చర్యములతో నామె ఈకథనెల్ల విని, మాతృ వాత్సల్య ముట్టిపడ నిట్లనెను. "నాయనా! నీ స్థితియే శాస్త్ర ములలో 'మహాభావ' మని చెప్పఁబడియున్నది. ఈ దివ్యస్థితిని గ్రహింపలేక జనులు నిన్ను పిచ్చివాఁడనుచున్నారు. శ్రీ రాధా దేవికిని, శ్రీ గౌరాంగస్వామికిని ఇట్టి స్థితి లభించినది. నాయొద్దనున్న భక్తిగ్రంథములవలన నిదంతయు దృఢపఱుపఁ గలను. భగవద్దర్శనముకై త్రికరణశుద్ధిగా శ్రమపడినవారెల్ల ఇట్టి స్థితిని పొంది, దీని నధిగమింపవలసినవారే." ఈ మాటల వలన నాయనకుఁ జాల ధైర్యము కలిగినది.

అప్పటికే చాల ప్రొద్దెక్కినందున శ్రీ గురుదేవుఁ డామెకు కాళికాలయ ప్రసాదము తెచ్చియిచ్చెను. ఆమె దేవాలయములన్నిటిని దర్శించి, ప్రసాదము తీసికొని, పిదప కొంతసేపటికి ఇష్టదైవమగు రఘువీరునకు అన్ననైవేద్యము చేసికొనుటకు వంటసామగ్రితో పంచవటికి వచ్చెను. రఘువీర సాలగ్రామమొకటి ఆమెయొద్ద నెప్పుడు నుండెడిది.

రఘువీరునియెదుట నన్నముంచి నివేదనచేసి, కన్నులు మూసికొని ధ్యానముచేయుచుండఁగా నామె కొక దివ్యాను భూతి కలిగెను. అందుచే నామె బాహ్యస్మృతి కోల్పోయెను. చెక్కిళ్లపై ఆనందబాష్పములు కాఱుచుండెను. ఆలోనఁ బంచవటికి పోవలెనను గాఢభావముగలిగి, శ్రీ గురుదేవుఁ డసంపూర్ణ బాహ్యస్మృతితో నచ్చటికివచ్చి, ధ్యాననిమ గ్నయై బ్రాహ్మణి కూర్చుండిన స్థలమును సమీపించి, నిద్రా మత్తునివలె నివేదితాన్నమును తిననారంభించెను. కొంచెము సేపటి కామె కనులు తెఱచి తన నైవేద్యము నాయన యారగించుట చూచి అపరిమితానందమొందెను. తన దివ్యాను

భూతికిని కనులయెదుటి దృశ్యమునకును చిత్రమైన సామ్యముండుటచే నామె తన కన్నులనే నమ్మఁజాలకపోయెను. ఆయనయును సాధారణ మానసస్థితికి వచ్చి తన కార్యమునకు లజ్జించి "శరీరస్మృతి లేనిస్థితిలో నేనిట్టి పనులేల చేయుదునో నాకు నిజముగా తెలియదు" అని చెప్పి బ్రాహ్మణిని క్షమింప వేఁడుకొనెను. ఆమెయు "నాయనా! నీవు మంచిపనినే చేసితివి. ఇది చేసినది నీలో నున్న వాఁడు కాని నీవు కాదు. వాఁడెప్పుడు నిట్లే చేయును. ఇది ఎవరు చేసినది, ఏల చేసినది, నాకు ధ్యానములో స్పష్టముగా విశదమైనది. నా దీర్ఘకాలపూజ కిప్పుడు ఫలము సిద్ధించుటచే, నీఁక నదిచేయ నక్కఱలేదని తెలిసినది" అని యాయన నూఱడించి, పిదప నిస్సందేహబుద్ధితో ఆ భుక్తశేషమును మహాప్రసాదముగ తినెను. మఱియు, తన యిష్టదైవము శ్రీరామకృష్ణరూపమున సశరీరుఁడై సాక్షాత్కరించుటచే, నెంతకాలమునుండియో భక్తితో పూజించుచుండిన సాలగ్రామమును గంగలో పాఱవేసెను.

"అమ్మా, నాకు నీవే జ్ఞానబోధ చేయవలయు"నని శ్రీ గురుదేవుఁడు విశ్వేశ్వరిని ప్రార్థించియుండెను. ఈ సన్న్యాసినిని (శ్రీ గురుదేవుఁ డామెను బ్రాహ్మణి యని వ్యవహరించుచుండెను) కలిసికొనుటచే నా ప్రార్థనము నెఱవేఱినది. తన వివిధదివ్యానుభవములు బుద్ధిజాడ్యలక్షణములని జనులు పరిహాసించుచుండఁగా, నవి జాడ్యలక్షణములు కావని శాస్త్రప్రమాణములతో నీమెగదా నిర్ణయించినది. మఱియు ఆ నిర్ణయముచేఁగదా లోకమాత నిరంతరము తోడునీడయై తన్ను రక్షించుచున్నదనికూడ నాయనకు స్పష్టపడినది.

ప్రథమసమావేశముననే వారికిఁ గలిగిన మాతృపుత్త్ర సంబంధము కాలక్రమమున నెక్కువ గాఢమయ్యెను. ఇరువురును పగటిపూఁట చాలసేపు పంచవటిలో నాధ్యాత్మికప్రసంగములు చేయువారు. తన వివిధదివ్యానుభవములనుగూర్చి యాయన వేయు ప్రశ్నల కామె శాస్త్రప్రమాణము లుదాహరించుచు సదుత్తరము లిచ్చుచుండును.

శ్రీ గురుదేవుని ఆధ్యాత్మికానుభవము లాయన నిరుపమానభగవద్భక్తిఫలితము లని బ్రాహ్మణి నిశ్చయించెను. ఆధ్యాత్మికప్రసంగకాలముల నాయనకుఁ గలుగు సమాధినిమగ్నత, ధ్యానవేళలయందలి శరీరవిస్మృతి, సంకీర్తనకాలపు పరమానందానుభూతి ఇవన్నియు కనులారఁ జూచి యాయన అపరోక్షజ్ఞానపరమావధి నొందిన మహనీయుఁడని గ్రహించెను. జనుల నజ్ఞానదుఃఖమునుండి విముక్తులఁ జేయుటకు భగవంతుఁడు మరల నవతరించు నని శ్రీ గౌరాంగజీవితచరిత్రలో నామె చదివియుండెను. శ్రీ చైతన్య రామకృష్ణుల జీవితములందుఁ గొన్ని యద్భుతసామ్యము లామెను తఱచు స్ఫురించుచుండెను. ఈశ్వరసాక్షాత్కారము కొఱకైన యున్మాద మిరువురకును కలదు. ఒకే విధమైన అసాధారణలక్షణము లిద్దఱియందును బొడసూపుచుండును. అతీంద్రియానందసమయముల స్పర్శమాత్రమున నితరుల కాధ్యాత్మికోత్సాహ మిరువురును కలిగింపఁగలరు. ఇట్టి సామ్యము లనేకములనుబట్టి భగవంతుఁ డీ రూపమున మరల నవతరించెనని యామె నిర్ధారణచేసికొనెను.

బ్రాహ్మణి యాగమనానంతరము శ్రీ గురుదేవునకు పూర్వపు మంటలబాధ మరల బహుతీవ్రముగఁ గలిగెను.

సూర్యోదయమున ప్రారంభమై మధ్యాహ్నమున కది దుస్సహమగుచుండును. నిపుణులగు వైద్యు లెంద ఱెన్ని చికిత్సలు చేసినను గుణము కనఁబడదయ్యెను. కాని బ్రాహ్మణి ఈ తాపమునకు నిజమైన కారణమును గ్రహించెను. తీవ్రభక్తి భావపరవశులై యుండునప్పుడు పూర్వము శ్రీ రాధాదేవికిని ఇటీవల శ్రీ చైతన్యునకు నిట్టి దుస్సహ శరీరతాపమే కలిగిన దని భక్తిగ్రంథములందు చదివియుండుటచే, నీ బాధకూడ నట్టిదేయని నిశ్చయించి, దీనికి శాస్త్రచోదితచికిత్స చందనము పూసికొని పరిమళ పుష్పమాల ధరించుటే యని వచించెను. ఈ యపూర్వచికిత్సచే బాధ మూఁడునాళ్లలో నిశ్శేషమయ్యెను. బ్రాహ్మణికి గోచరించుచుండిన సామ్యముల కీ క్రొత్తసామ్యము తోడుపడెను. శ్రీ గురుదేవుఁడు శిహోరునకుఁ బోవుచుండఁగా శరీరములోనుండి ఇద్దఱు బాలురు బయటికివచ్చిన సంఘటనము విన్నపిమ్మట నామె నమ్మకము మఱింత దృఢపడి శ్రీ చైతన్యుఁ డీసారి తననిత్య సహవాసియగు నిత్యానందుని మూర్తితో నవతరించెనని నిశ్చయించి శ్రీ గురుదేవునకుఁ దెలిపెను.

కొలఁదినాళ్లకు మఱియొక యపూర్వలక్షణము శ్రీ గురుదేవుని బాధింపఁదొడఁగెను. దీనినిగూర్చి ఆయన ఇట్లు చెప్పువాఁడు: "ఎంత తినినను తనివితీఱని దారుణమైన ఆఁకలి! తినిన యుత్తరక్షణముననే తిరిగి ఆఁకలి! ఏమి తిందునా అను తలంపుతప్ప రేయుంబవళ్లు వేఱు తలంపే లేదు. ఈ క్రొత్త జబ్బేమియుండు నని మిక్కిలి కలవరపడితిని. తుదకు బ్రాహ్మణికిఁ దెలుప, ఆధ్యాత్మిక మార్గమున నభివృద్ధిగాంచువా రిట్టియసాధారణస్థితుల నెదు

రోగుని యధిగమించు టాచారమేయనియు, దీనిని తాను కుదుర్పఁగలననియు ధైర్యము చెప్పి, పలు తెఱఁగులైన తిను బండారములను సమృద్ధిగ నొకగదిలో నాయితపఱుపింపుమని మథురునితోఁ జెప్పెను. సర్వము సిద్ధమైనపిదప, నే నాగదిలోనే యహర్నిశములుండి యెప్పుడు దేనిపై నిష్టముపోవునో, అప్పుడు దానిని కొంచెము తినుచుండవలసిన యేర్పాటు చేసెను. మూఁడునాళ్లవిధముగఁ గడచిన పిదప నాక్షుద్బాధ నివారణమయ్యెను.''

ఈ నిదర్శనము లన్నిటినిబట్టి శ్రీగురుదేవుని వాస్తవిక తత్త్వమునుగూర్చి తాను చేసిన సాహససిద్ధాంతము నిఁక శంకింపఁబనిలేదని బ్రాహ్మణి నిశ్చయించికొనెను. ఇంతటి నుండి యాయన సాధారణభక్తమాత్రుఁడు కాఁడనియు, ఉన్నతాధ్యాత్మికానుభవములు పడసిన మానవాతీతుఁడుకూడ కాఁడనియు, దురూహ్యమైన ఏదో మహాకార్యమును సాధింప ప్రపంచములోని కేతెంచిన కేవల భగవదవతారమేయనియు, బహిరంగముగా చెప్పఁజొచ్చెను. తనసిద్ధాంతములు సరియైనవని నమ్మకము కలుగుటతోడనే, వాని నాయనకును హృదయునకును మాత్రమే కాక ఎల్లరకుఁగూడ ధారాళముగా ప్రకటింప మొదలిడెను.

ఒకనాఁడు శ్రీగురుదేవుఁడు పంచవటిలో హృదయునితోడను, మథురునితోడను కూర్చుండియుండి, ప్రసంగవశమున, క్రొత్తగావచ్చిన యొక బ్రాహ్మణస్త్రీ తన్ను భగవదవతారముగాఁ బ్రకటించుచున్నదని మథురునితో నుడివెను. "శాస్త్రములలో పదియవతారములే కదా చెప్పఁబడి యున్నవి, పదునొకటవ యవతారమునకు చోటెక్కడ? కాని

మీఁకు కాళికాదేవి యనుగ్రహము లభించినదనిమాత్రము నే నంగీకరింతును" అని మథురుఁడు ప్రత్యుత్తర మిచ్చెను. ఇంతలో నర్ధనిమీలితనేత్రయై, తన ముద్దుబిడ్డఁడగు శ్రీకృష్ణునిచే భక్ష్యములు తినిపింపఁబోవు యశోదవలె, పళ్లెరమును చేతఁబట్టుకొని తనకడకు వచ్చుచుండిన స్త్రీని కనుపఱచి, ఆమెయే తాను జెప్పిన స్త్రీ యని యాయన మథురునకు తెలిపెను. ఆమెయు సమీపించి మథురుఁడుండుటచే కొంచెము వెనుకకు తగ్గి, శ్రీ గురుదేవునకుఁ బెట్టుమని తన చేతిలోని పళ్లెరమును హృదయునకిచ్చెను. అప్పుడు శ్రీగురుదేవుఁడు "నీయభిప్రాయమును నే నిప్పుడితనితో (మథురుని జూపి) చెప్పుచుంటిని. ఇతఁడు శాస్త్రములలోఁ బదియవతారములే చెప్పఁబడియున్నవనుచున్నాఁడు." అని బ్రాహ్మణితోఁ జెప్పెను. మథురుఁడు వినయపూర్వకముగ నమస్కరించి ప్రత్యుత్తరముకై నిరీక్షించుచుండెను. వెంటనే యామె "అది ఎట్లు? భాగవత మిరువదిరెండవతారములను జేర్కొని, ఇంక నెన్నియో యుండుననికూడ చెప్పుచున్నది. ఇంతేకాక వైష్ణవశాస్త్రములలో శ్రీ గౌరాంగుఁడు మరల నవతరించునని చెప్పఁబడినది. అతనికిని ఇతనికిని విస్పష్టము లగు పోలిక లనేకము లున్నవి. ఏ వైష్ణవపండితుఁడైన ఈ విషయమును పరిష్కరింపఁగలఁడు. అట్టివానికడ నా వాదమును దృఢపఱుపఁగలను" అని సమాధాన మిచ్చెను. మథురుఁడేమియు బదులాడలేదు.

ఈ బ్రాహ్మణీసిద్ధాంతము దక్షిణేశ్వరాలయములో మిగుల నలజడి కలిగించెను. ఇంతవఱకు పిచ్చివాఁడుగాఁ జూడఁబడుచుండినవాఁడు భగవదవతారమఁట! ఈ వాదము

నకు శాస్త్రప్రమాణము లాధారమఁట! ఎల్లరిచే పరిహసింపఁబడి, నిరసింపఁబడుచుండినవాఁడు శ్రీకృష్ణునితోడను, శ్రీరామచంద్రునితోడను బుద్ధునితోడను సమానుఁడు కానున్నాఁడు! ఎక్కడ చూచినను దక్షిణేశ్వరములో నిదే ప్రసంగము. మధురున కేమియుఁ బాలుపోకుండెను. ఒకక్షణమున విశ్వాసమును, తదుత్తరక్షణముననే సందేహమును, ఆతని మనస్సు నుయ్యాలలూఁపఁజొచ్చెను. శ్రీ గురుదేవుఁడమానుషశక్తిసంపన్నుఁడగు మహనీయుఁడు నిజమే కాని భగవంతుఁడా? కాని బ్రాహ్మణి ఏల బొంకులాడును? శాస్త్రప్రమాణములుకూడ చూపుదుననుచున్నది! శ్రీ గురుదేవుఁడును సభకై బాలునివలె నాత్రపడుచుండెను. కావున తన సందేహము పావుకొనుటకును, బ్రాహ్మణివాదములు పండితులచే సహేతుకముగ ఖండింపఁబడునెడల శ్రీగురుదేవునకుఁ గల కొన్ని విపరీతభావములు తొలఁగిపోవుననియు, మధురుఁడు సుప్రసిద్ధపండితులను బిలిపించి సభ సమావేశపఱచుటకు నిశ్చయించెను.

ఆ కాలమున మహాప్రఖ్యాతపండితోత్తములగు వైష్ణవచరణుని (92 వ పుట చూడుఁడు) గౌరీకాంత తర్కభూషణుని రావింప నిర్ణయింపఁబడెను. మహాభక్తుఁడగు వైష్ణవచరణుఁ డాకాలపు స్వసంఘనాయకులలో నొకఁడు; వివిధదర్శనములందును శాస్త్రములందును ముఖ్యముగా భక్తిశాస్త్రములందును, నిధియని పేరొందినవాఁడు. సాధకుఁడుకూడ నగుటచే నతని సంప్రదాయమునకుఁ జెందిన వారెప్పుడును తమతమ సాధనవిధానములం దతనిసలహాకై కొనసుత్సుకించువారు.

కొలఁదినాళ్లలో వైష్ణవచరణుఁడు, మఱికొందఱు పండితులతోడను, భక్తులతోడను, దక్షిణేశ్వరము వచ్చెను. సభ సమావేశమయ్యెను. బ్రాహ్మణి, మథురుఁడు, శ్రీ గురుదేవుఁడుకూడ సభలో నుండిరి. బ్రాహ్మణి పండితులను సంబోధించి తాను శ్రీ గురుదేవుని యాధ్యాత్మికస్థితినిగూర్చి విన్నదియు, స్వయముగాఁ జూచినదియు, ఆవిషయమున శాస్త్రముల సిద్ధాంతములను, విశదీకరించి, చివరకు తన అభిప్రాయము నిట్లు తెలిపెను. "శాస్త్రప్రమాణములపైనే నీదివ్యపురుషుని భగవదవతారమని త్రికరణశుద్ధిగా నమ్ముచున్నాను. భిన్నాభిప్రాయు లైనచో మీ హేతువులు దెలుపుఁడు." అంత వీరమాతవలె నామె ఆక్షేపణలనెల్ల నెదుర్కొన సంసిద్ధురాలై యుండెను. కాని, ఈమహాట్టహాసమున కంతటికిని మూలమగు మహానుభావుఁడు శ్రీ రామకృష్ణుఁడప్పుడెట్లుండెను? చర్చ తన కెంతమాత్రము సంబంధింపనట్లు కేవల ముదాసీనుఁడై, వినోదమునుచూచి యానందించు బాలునివలె, నొకప్పుడు నవ్వుచు, మఱొకప్పుడు సహజదివ్యానందసాగరమునఁ దేలుచు, కొండొకతఱి చెంతనున్న సంచిలోనుండి చిటికెఁడు సుగంధద్రవ్యములను నోటవైచికొనుచు, నింకొకసమయమున వైష్ణవచరణుని మెల్లగా చేతితోఁ తాఁకి 'ఇటు చూడుఁడు! నా కొకప్పు డిట్లుండును. మఱొకప్పుడీ విధముగ నుండును' అని హెచ్చరించుచు కూర్చుండి యుండెను. చిట్టచివరకు వైష్ణవచరణుఁడు బ్రాహ్మణియభిప్రాయములను తాను మనఃపూర్తిగ నంగీకరించుచున్నాననియు, మహాభావమని చెప్పఁబడు అత్యున్నతస్థితిని సూచించు లక్షణములలో నే యొకటో రెండో. కొలఁదిమంది అసాధారణ

వ్యక్తులందు ప్రకటితములైయుండ, శ్రీరామకృష్ణునియం దవియెల్ల పూర్ణముగ నొప్పుచుండు టత్యాశ్చర్యకరమనియుఁ జెప్పెను. మథురుఁడును, ఇతరులును, నివ్వెఱఁగందిరి. శ్రీగురుదేవుఁడుకూడ బాలునివలె, "వైష్ణవచరణుఁడే ఇట్లు చెప్పుచున్నాఁడు గనుక నిది వ్యాధి కాదని యేర్పడ్డది. అందుచే నాకు సంతస మగుచున్నది" అని మథురునితోఁ బలికెను.

వైష్ణవచరణుఁ డప్పటినుండియు శ్రీగురుదేవునెడల నత్యంత గౌరవము చూపుచుండెను. తఱచుగ దక్షిణేశ్వరమునకు తన సంప్రదాయపు ఇతరభక్తులతోఁగూడ వచ్చి, వివిధసాధనలవిషయమై యాయన హితబోధఁ గైకొను వాఁడు. ఇతఁడు వైష్ణవమతములోని కర్తాభజాశాఖకు * చెందినవాఁడు. కలకత్తా కుత్తరమున కొలఁదిమైళ్ల దూరమున నొక గ్రామములో నితని శిక్షణమున సాధనలొనర్చు కొందఱు స్త్రీ పురుష శిష్యులుండిరి. అతఁ డచ్చటికి శ్రీగురుదేవు నప్పుడప్పుడు తీసికొనివెళ్లువాఁడు. ఈ తెగలో స్త్రీ పురుషుల కొండొరులకుఁ గల చన వాయనకు దుస్సహముగ నుండెడిది. కాని ఆ సాధకులలోకూడ కొందఱు నిజమగుభక్తు లుండుటచే నాయన పిదప తన యభిప్రాయమును మార్చుకొనెను. ఆక్షేపణీయములగు సాధనవిధానములుకూడ మనఃపూర్తిగా, విధ్యుక్తములను పూర్ణవిశ్వాసముతో, భక్తిశ్రద్ధలతో, నాచరింపఁబడెనేని, సాధకుఁడు క్రమముగ ఆధ్యాత్మికాభివృద్ధిని గాంచి తుదకు పర

* ఇది వంగదేశములోని యొక చిన్న మతశాఖ. ఈ శాఖవారు తమ గురువును భగవంతునిగా భావింతురు.

మావధినికూడఁ జేరునని యాయన నిశ్చయించెను. కాల క్రమమున శ్రీ గురుదేవుని నిష్కళంకము, మహాద్భుతము, నైన ఆధ్యాత్మికజీవితమునుచూచి వైష్ణవచరణుఁడు ముగ్ధుఁడై యాయన యవతారమూర్తియని బహిరంగముగ ప్రకటింప సాఁగెను.

ఈసభ జరిగిన కొలఁదినాళ్లలో బాంకురాజిల్లాయందలి ఇందేశగ్రామమునుండి పండిత గౌరీకాంతతర్కభూషణుఁడు వచ్చెను. ఇతఁడు సుప్రసిద్ధ తాంత్రిక సాధకుఁడు. ప్రతిసంవత్సరము దుర్గాపూజాదినములలో తన భార్యను దేవీస్వరూపిణిగా నారాధించువాఁడు. లోకసామాన్యవిధమున నేలపై సమిధలు పేర్చి హోమముచేయుటకు మాఱు ఇతఁడు తనయెడమ అఱచేయి చాఁపి దానిపై రమారమి ఎనుబదిపౌండ్లు (27 వీసెలు) బరువుగల కట్టెలు పేర్చి, కుడిచేతితో వానికి నిప్పంటించి, పూజ ముగియువఱకు చేతి నట్లే యుంచి హోమము చేయువాఁడఁట! శ్రీ గురుదేవుఁడు దీనిని స్వయముగఁ జూచి, గౌరికిఁ గల అసాధారణశక్తులలో నిదియొకటని చెప్పువాఁడు.

గౌరి దక్షిణేశ్వరమునకు వచ్చినప్పుడు జరిగిన చిత్రమును శ్రీ గురుదేవుఁడు తఱచు చెప్పువాఁడు. దేవి యనుగ్రహముచే నితనికిఁ గొన్ని అమానుషశక్తు లలవడెననియు, అందుచే నితనియెదుట వాదములో నే పండితుఁడును నిలువఁజాలకుండెననియు, జనులు చెప్పుకొనువారు. వాదముకై ఏ పండితసభకైనను పిలువఁబడినపు డితఁడు దేవీస్తవము లోని యొకశ్లోకపాదమునకు భయావహములగు కొన్ని బీజాక్షరములఁజేర్చి మేఘగర్జారావముతోఁ బఠించుచుఁ ప్రవేశించువాఁడఁట! దీనివలన ప్రతిపక్షులు భయవిహ్వలు లగు.

టయేకాక ఇతనియందొక అద్భుతశక్తికూడ నుత్పన్నమయ్యెడిదఁట! దక్షిణేశ్వరాలయములోనికిఁగూడ నతఁడిట్టి గర్జారావముచేయుచునే ప్రవేశించెను. గౌరి కిట్టి అసాధారణశక్తు లున్నవని తెలియకపోయినను, ఆ మాటలు గౌరికంటె నెక్కువ బిగ్గరగ నఱవ నేదో ప్రేరణకలిగి ఆయన యట్లొనర్చెను. ఇంతకంటె బిగ్గరగ గౌరి యఱచెను. అతనికంటె బిగ్గరగ శ్రీగురుదేవుఁడు మరల ఘోషించెను. ఈ గావుకేకలు విని దొంగలు పడిరని తలఁచి దేవాలయరక్షకభటులు దుడ్డుకఱ్ఱలతో పరుగెత్తుకొనివచ్చి 'పిచ్చిపూజారి'యును పండితుఁడును నెవరిది పెద్దగొంతో పరీక్షించుకొను తీరున నఱచుచుండుటఁజూచి ఆనందించుచు నిలుచుండిరి. చివరకు శ్రీగురుదేవునికంటె నెక్కువ బిగ్గరగ నఱవలేక గౌరి ధుమధుమలాడు మొగముతో దేవాలయావరణములోనికి ప్రవేశించెను. ఇంతవఱకు గౌరి కీశ్వరసాక్షాత్కారము కాకుండ నడ్డుపడుచుండిన అసాధారణశక్తుల నతని మేలుకొఱకే దేవి తీసి తన కను గ్రహించెనని శ్రీగురుదేవుఁడు పిదపఁ దెలిపెను. కొలఁది నాళ్లలో గౌరి ఆయన అద్భుతశీలమును గుర్తించి పూర్తిగ నాయనకు వశుఁడయ్యెను.

గౌరి వచ్చుటచే మథురుఁడు మఱియొక పండితసభ సమావేశపఱచి వైష్ణవచరణునిగూడ నాహ్వానించెను. వైష్ణవచరణుఁడు వచ్చుటాలస్యమైనందున గౌరియు, శ్రీగురుదేవుఁడును, సభామండపముకై వెడలిరి. దారిలో శ్రీగురుదేవుఁడు కాళికాలయమునకుఁ బోయి దేవిని సేవించికొని దివ్యభావపరవశత్వమున బయటికి వచ్చుచుండ, అప్పుడే చనుదెంచిన వైష్ణవచరణుఁడు భక్తిపూర్వకముగ నాయనపాద

ముల నంటెను. అప్పుడే ఆయనయు సమాధినిమగ్నుఁ డయ్యెను. ఆ పవిత్రస్పర్శచే వైష్ణవచరణుఁడు పులకాంకురితగాత్రుఁడును, ఆనందకందళిత హృదయుఁడునై యొక సంస్కృతశ్లోకము నాశువుగా రచించి యాయనను స్తుతించెను. పరమసుఖాతిశయమున మృదుమధురగానము చేయుచు ముకుళితహస్తుఁడై యుండిన వైష్ణవచరణుని, దివ్యతేజోవిరాజితమై వెల్గొందుచుండిన శ్రీ గురుదేవుని ముఖమును చూచి మధురుఁడు మున్నగు ప్రేక్షకులు నివ్వెఱఁగందిరి. కొంతసేపటికి శ్రీ గురుదేవుఁడు సాధారణస్థితికి వచ్చెను. అందఱును సభాస్థలి కేగిరి.

సభ ప్రారంభ మయ్యెను. గౌరి అచ్చటి పండితులను సంబోధించి "వైష్ణవచరణుఁడు ధన్యుఁడు. నేఁ డతఁడు దైవానుగ్రహమును బడసెను. కావున నే నతనితో వాదింపను. వాదించినను ఓడిపోవుట నిశ్చయము. ఇంతేకాక నేఁటి చర్చావిషయమున మా యిరువుర నిర్ణయ మొక్కటియే. అందుచే వాద మనావశ్యకము" అని పలికెను. ప్రతివాదులు భయపడికాదు గౌరి ఇట్లు చెప్పినది. తన ఆధ్యాత్మిక దృష్టిచే నతఁడుఁగూడ శ్రీ గురుదేవుఁడు సామాన్య సాధువు కాఁడని గ్రహించియుండెను. ఒకనాఁడతనిని పరీక్షింపనెంచి, "వైష్ణవచరణుఁ డందఱతోఁడను భగవంతుఁ డీ శరీరమున నవతరించెనని చెప్పుచున్నాఁడు. ఇది ఎట్లు సాధ్యము? మీ యభిప్రాయ మేమి" అని యాయన ప్రశ్నించెను. ఈ ప్రపంచమునం దప్పుడప్పు డుద్భవించు నవతారమూర్తులే దివ్యశక్తియందు శతాంశములో, ఆ యనంతదివ్యశక్తియే మీరని నా నిశ్చితాభిప్రాయమని యతఁ డుత్తరమిచ్చి యిట్లు

నేను : "ఇది నాహృదయమునకు తోఁచిన సత్యము. శాస్త్రములుకూడ దీనిని సమర్థించుచున్నవి. ఆక్షేపించువారెవరైన నున్నచో నా వాదమును ధ్రువపఱచుకొనఁగలను."

బ్రాహ్మణి వచ్చిన పిదప శ్రీరామకృష్ణుని జీవితములో తటస్థించిన ముఖ్యవిషయ మిదియే. రానురాను వారి పవిత్రసంబంధ మత్యంతసన్నిహితమై తుదకాయన యామె నొక గురువుగా స్వీకరించి ఆమె యుపదేశముల ననుసరించి తాంత్రికసాధన మభ్యసించెను.

'కామినీకాంచనములను విడిచిపెట్టుఁడు' అని ప్రతివారికిని బోధించుచుండిన ఈ మహానుభావుఁడు తానొక స్త్రీని గురువుగ నేల గ్రహించెను? స్త్రీసాంగత్యము సాధకులకు మిక్కిలి యపాయకరమని పురుషులకు తాను చేసిన బోధకు లోకు లపార్థమును కల్పించుకొనకుండ తానే ఒక స్త్రీని గురువుగ నంగీకరించి తాంత్రికసాధన నభ్యసించినట్లు కనఁబడుచున్నది. పురుషుని ఆధ్యాత్మికాభివృద్ధికి ఆటంకము కలిగించునదేదియు స్వతస్సిద్ధముగా స్త్రీలో లేకుండుటయే కాక, పురుషుఁ డెట్టిభావముతో స్త్రీని జూచునో ఆ దృక్పథము పైననే అతని ఆత్మవికాసముగాని, వినాశముగాని, ఆధారపడి యుండునని శ్రీగురుదేవుఁడు స్వయముగ నిదర్శనపూర్వకముగ నిరూపించెను. మన నాకర్షించునది స్త్రీయొక్క అంగసౌష్ఠవమునందలి మోహమైనచో, నామె మన నుద్ధరించుటకుమాఱు అధోగతిపాలుచేయును. కాని మన నాకర్షించునది ఆమె తత్త్వములోని దివ్యత్వమైనచో, నామెరూపమున వ్యక్తమైన జగన్మాతను మనము చూచినచో, ప్రాపంచిక బంధవిమోచనకు తోడ్పడి, చివర కవాఙ్మానసగోచరమగు బ్రహ్మానందస్థితికి

త్రోవచూపును. ప్రపంచమున నుండువారు స్త్రీని తప్పించుకొని జీవింపఁజాలరు. స్త్రీపురుషవిభేదము మనస్సులోనున్నంత కాలము, స్త్రీ సర్వత్ర తోఁచుచునే యుండును. ఆమెను తప్పించుకొను మార్గమొకటియే : పవిత్రభావముతో నామెను చూడుము. అనఁగాఁ దల్లిగనో, సోదరిగనో, పుత్త్రికగనో. ఇట్లుకాక, అపవిత్రభావముతోఁ జూచితివేని, తుచ్ఛసుఖదాయినిగాఁ జూచితివేని, యామె కోపానలము దుర్వారమై భస్మీకరించును. ఈ విధముగ స్త్రీపురుషుల కుండవలసిన అన్యోన్యపవిత్రభావసంబంధమును తనజీవితముననే వ్యక్తీకరించి శ్రీ గురుదేవుఁడు మానవకోటి కమూల్యవరమునుఁ బ్రసాదించెను.

ఇఁక రెండవ విషయము. ఇంతవఱకును ప్రాయికముగ గురుసాహాయ్యములేకయే శ్రీ గురుదేవుఁడు భగవత్ సాక్షాత్కారముకొఱకు ప్రయత్నించెను. తన హృదయసింహాసనమున వెలుఁగుచుండిన నిత్యజాగరూకుఁడగు జగద్గురునిపైననే ఆధారపడి, అనేకజన్మల తపఃఫలముగ సంభవించు మానవచిత్తపరిపాకమును తిన వజ్రసంకల్పబలముచే, కఠినతపోనియతిచే, నిరంతరప్రవిమలభక్తిచే, సర్వసంగపరిత్యాగప్రభావాతిశయముచే, కొలఁదియేండ్లలోనే సాధించి, నామరూపదేశకాలనిబద్ధమైన చంచలజీవితబంధములనెల్ల నతిక్రమించి, అఖండసచ్చిదానందపదార్థముతోఁ దనకుఁ గల సంబంధమును గ్రహించి, అనుభవైకవేద్యము గావించుకొనెను. దీనివలన మనము నేర్చుకొనఁదగిన గుణపాఠమేమి? ఈశ్వరసాక్షాత్కారముకొఱకు కృషిచేయునపుడు మనలోనున్న సొంత వస్తువును బడయుటకొఱకే యత్నించుచున్నాము కాని

ఏదియో ఇతరవస్తువుకొఱకు కాదు. వాస్తవముగ మనది కానిది మన కెన్నఁటికిని లభింపదు. మన ప్రయత్నములు నెఱవేఱుటకు మొట్టమొదటఁ గావలసినది శ్రద్ధ. ఇది లేని యెడల, నితరు లెన్నిమణుఁగుల బోధ మన తలకెక్కించినను, శాస్త్రజ్ఞాన మెంతయున్నను, యాత్ర లెన్ని చేసినను, భక్తుల సాంగత్య మెంతయుండినను, ఎందఱు దేవుళ్లకు మ్రొక్కినను, లాభము లేదు. ఐహికవిషయబద్ధమైన ఆత్మ లోకాతీతస్థితికిఁ బోవుట కివి అణుమాత్రమేని పనికిరావు. సామాన్యజనుల కీ ఆశయ మందని మ్రానిఫలమువంటిది. కనుకనే సాధకుని క్రమక్రమముగ పరమావధికిఁ గొంపోవుటకు మన పెద్దలు లెక్కలేని శాస్త్రగ్రంథములను రచించిరి; అంతములేని వివిధసాధనవిధానముల నేర్పఱచిరి. శ్రీరామకృష్ణుఁ డిప్పుడు మనుష్యరూపగురువు నాశ్రయించి, స్వయంకృషివలన తా నిదివఱకు అనుభవవేద్యము చేసికొనిన సత్యమునే బ్రాహ్మణీ నిర్దేశమున మరలఁ గాంచెను.

మూఁడవ విషయము. నిర్మలహృదయముతో, నిజమగు భక్తిశ్రద్ధలతో, పరమేశ్వరుని ప్రార్థించువానికి సకాలమునఁ గావలసిన తోడ్పాటు నెల్ల భగవంతుఁడే సమకూర్చును. తొందరపడుట నిరుపయోగమగుటేకాక, శాంతిసౌఖ్యభంగకరముకూడ.

బ్రాహ్మణిరాకవలనఁ గలిగిన బహుముఖ్యమైన చివరి ఫలిత మింకను చెప్పవలసియేయున్నది. ఇంతవఱకు లోకులు శ్రీ గురుదేవుని తమ తమ స్వబుద్ధిప్రమాణములనుబట్టి గ్రహించుచుండిరి. కొందఱు మహాత్ముఁడనిరి; కొందఱు పిచ్చివాఁడనిరి; కొందఱు యోగియనిరి; మఱికొందరు రోగియనిరి;

కొందఱు పరిహసించిరి; ఇంకఁ గొందఱు జాలిపడిరి. ఈ విధముగ భారతవర్ష నవయుగావతారపురుషుని దివ్యానుభవములు పరస్పరవిరుద్ధములైన విమర్శలకు గుఱియగుచుండ బ్రాహ్మణివచ్చి తన యభిప్రాయప్రకటనవలన, పండితసార్వభౌములచేత దానిని దృఢపఱపించుటవలన, లోకుల మనోవైఖరిని శ్రీ గురుదేవు కనుకూలముగావించి, ఆయన మహనీయత్వమును లోకమునకు బహిరంగపఱచినది.

ఈ సాధ్వీమణి అజ్ఞాతస్థితినుండి ఒక్కసారిగ లేవనెత్తి విశ్వమానవారాధనతో ముంచివైచిన పురుషోత్తమునిగూర్చి యొకమాట చెప్పవలసియున్నది. ఎల్లరియొక్క పరిహాసములకు గుఱియైన యున్మత్తుఁ డెక్కడ, భగవదవతారమూర్తి యెక్కడ? ఊరుపేరులేని సామాన్యస్థితినుండి కనులు మిఱుమిట్లుగొలుపు దిగంతకీర్తిలోకమున నొక్కగంతున నీ రీతి నెగయుచో ఏ మానవమాత్రునకు తలతిరుగకుండును? కాని లోకుల భూషణ దూషణాలకు నణుమాత్రము చలింపని క్రీడాసక్తుఁడగు బాలునివలె శ్రీ గురుదేవుఁడు తన మనస్సును జగన్మాతయొక్క పాదపద్మములనుండి యొక్కక్షణమైనను మరల్పఁడయ్యెను. విబుధబృందము తనచేతికందిచ్చిన యశఃకిరీటమును నిరాడంబరముగ నిరాకరించెను. మహాపురుషుల స్వభావమిట్టిదేకదా! ఎల్లప్పుడును శాశ్వతసత్యానందనిమగ్నహృదయుఁడై విలసిల్లువానికి నిందాస్తవములు, ఆదరణనిరాదరణలు, మాయావికారములే కాని వేఱొండు కాఁజాలవు కదా!



## తాంత్రిక సాధన

సహజముగ మానవుని మనస్సు త్యాగముపైఁగాక భోగముపైఁ బోవుచుండును. కేవలము నిర్మలమును, నిరాడంబరమును అగు మార్గముననే భగవంతు నారాధించుట శ్రేష్ఠమని గ్రహించి, అతఁడు పవిత్రతాదీక్షవహించియు, హృదయమున నొకింత అపవిత్రతకుఁ దావొసఁగు చున్నాఁడు; కామకాంచనములను విడిచిపెట్టునప్పుడుఁగూడ, వినోదార్థము వానివై పొకచూడ్కిని విసరఁ గోరును. ఇది మానవుల నైజము కనుకనే సాధ్యమైనంత నిర్మలవిధమున దేవి నారాధింపవలెనని శాస్త్రములు స్పష్టముగా తెలుపుచున్నను, ఆమెకుఁ బ్రీతికరములుగా నుండునను మిషతో నందులో నింద్రియలోలతను సూచించు పాటలకు చోటిచ్చియున్నారు. విశ్వేశ్వరి తన జంతుజాలము నెంత బలిష్ఠములైన ఇంద్రియ పాశములచే బంధించెనో, దీనివలన మనము గ్రహింప వచ్చును. ఆమె యనుగ్రహ భాగ్యమునఁ దప్ప, మన మీ పద్మవ్యూహమునుండి బయటపడఁజాలము.

తాంత్రికారాధన వేదకాలమునఁ బుట్టినది. ఆ కాలమున ప్రార్థనలవలనను, క్రతువులవలనను దేవతలను తృప్తి పఱచి తన్మూలమున నియమబద్ధవిషయభోగమును బడయుటే జీవితపరమావధియైనట్లు కనఁబడుచున్నది. వేదములందలి కర్మకాండను జూచినచో ఇట్టి భోగత్యాగసమ్మేళనము విశదమగును. చిత్త మీ విధముగ కొంత పవిత్రమై తుచ్ఛవాంఛలు కొంత సమసినపిమ్మట, ఉపనిషత్తులలోని ఆధ్యాత్మిక

శిక్షణవిధానము అనుసరణీయమగుచుండెను. ఈ స్థితి బౌద్ధ యుగప్రారంభమున మాఱిపోయెను. చిత్తశుద్ధిగల సన్న్యాసులకుమాత్ర మర్హమైన ఆరాధనవిధానములు సామాన్యగృహస్థులకుఁగూడ ఆచరణీయములు గావింపఁబడెను. ఇందుచే వైదికయజ్ఞాదుల స్థానమున భోగత్యాగసమ్మేళనము గల యీ తాంత్రికారాధనలను రహస్యముగాఁ జేయసాఁగిరి. భగవంతునిఁ దల్లిగా భావించి యారాధించు టిందొక విశేషము.

మానవుల నెల్లప్పుడును మోహపెట్టుచు, వారలను అనంతజననమరణబంధములచే బిగియఁగట్టి, భగవత్ సాక్షాత్కారదూరులనొనర్చు ఇంద్రియవిషయములకు దివ్యత్వమును, పూజ్యతను, ఆపాదించి ఈశ్వరుని ప్రత్యక్షస్వరూపములుగ వానిని భావించునట్లు సాధకుని శిక్షితునిఁ జేయుటయే తంత్రములయొక్క ముఖ్యోద్దేశము. జితేంద్రియత్వ మీ విధానమున కత్యంతముఖ్యమగుట స్పష్టము. కాని సామాన్య మానవుల కిది యసాధ్యమగుటచేఁ దాంత్రికారాధన కాల క్రమమున దూష్యమార్గములుపట్టి యప్రతిష్ఠపాలైనది.

ఇందువలన తంత్రములనుగుఱించిగాని, చెడుత్రోవలలోఁబడిన ఏ యితరసాధననుగుఱించికాని, చేయఁబడు నిందలకు మానవనైజమగు నింద్రియాసక్తియే కారణముగాని, స్వతస్సిద్ధముగా ఆయా సాధనపద్ధతులు మాత్రము కావనుట స్పష్టము. ఈ కాలమున కొన్నివిధముల తాంత్రికారాధనలను గలుషితమొనర్చుచుండు స్త్రీస్పర్శగాని, సురాస్పర్శగాని, లేకుండ తాంత్రికకర్మల నత్యంతపవిత్రమైన విధమున నభ్యసింపవచ్చును. ఈ విషయమును శ్రీ గురుదేవుని జీవితము

నిరాఘాటముగా ఋజువుచేయుచున్నది. నవయుగమహాగురు పదవి కర్హునిగఁ జేయుటకే లోకేశ్వరి యాయనచే బ్రాహ్మణి శిక్షణమునఁ దాంత్రికసాధనలు నిర్మలమార్గమున నాచరింపఁ జేసియుండనోపును.

బ్రాహ్మణి మొట్టమొదటినుండియు శ్రీ గురుదేవు నెడ మాతృప్రేమకలిగియుండెనని ఇంతకుమున్నే చెప్పియుంటిమి. ఆయన దివ్యత్వము నెఱిఁగియు, మాతృప్రేమ మా మహోన్నతతనుమఱపింపఁగాఁ, దనబిడ్డవలెనేఆయననుచూచు కొనుచుండెను. కాని భగవదాజ్ఞానుసారముగఁ దా నాయన కొనర్పవలసిన విధాయకధర్మమునుమాత్ర మామె యెన్నఁడును మఱవలేదు. అందుచే శ్రీరామకృష్ణునకామె గురు పదవినొంది నిర్వహింపవలసిన కర్తవ్యమున కిప్పుడు కడంగెను.

శ్రీ గురుదేవుఁడు జగన్మాతయొద్ద సెలవుపొందియే ఈ నూతన సాధనయందుఁ బ్రవేశించి, తన సహజవ్రజ సంకల్ప దీక్షతో దానినిఁ గొనసాఁగించెను. పంచవటిలో నొక యాసనమును, తోఁటకుత్తరపుకొనయొద్ద బిల్వవృక్షము క్రింద మఱియొక ఆసనమును ఏర్పాటుచేయఁబడెను. ఈ సాధనవిషయమై శ్రీ గురుదేవుఁ డిట్లు చెప్పువాఁడు :—

"పగలంతయు బ్రాహ్మణి దక్షిణేశ్వరమునకు దూరముగా నెచ్చటెచ్చటికో పోయి, తాంత్రికగ్రంథములలో చెప్పఁబడిన వివిధములగు నరుదైన వస్తువులు తెచ్చి చీఁకటిపడు వేళ న న్నాయాసనములలో నొకదానికడకు రమ్మనును. నేను పోయి కాళికాదేవి నర్చించిన పిదప, బ్రాహ్మణి చెప్పినచొప్పున ధ్యానముచేయ నారంభింతును. కాని జప ప్రారంభమునందే దివ్యభావపరవశుఁడనై గాఢసమాధినిమ

గ్నుఁడనగుదును. అప్పుడు నా కగపడుచుండిన అద్భుతదివ్య దృశ్యముల నెల్ల నే నిపుడు వర్ణింపఁజాలను. ముఖ్యములైన అఱువదినాలుగు తంత్రగ్రంథములలోఁ జెప్పఁబడిన సాధనల నెల్ల బ్రాహ్మణి నాచే జయప్రదముగఁ జేయించినది. వీనిలో నెన్నియో అత్యంత కష్టసాధ్యములు. సాధకున కెల్లప్పుడును, నీతిబాహ్యుఁడై, భ్రంశమునొంది, పతితుఁడై, యధోగతిపాలగు నపాయము కలిగియే యుండును. కాని శ్రీలోకేశ్వరి దయవలన నెట్టి యపాయము లేకుండ వానియన్నిటియందుఁ గడతేఱితిని.''

ఈ కాలమున శ్రీ గురుదేవుఁడు విజయముతో నెదుర్కొనిన అగ్నిపరీక్షలెల్ల ఆయన పరిపూర్ణజితేంద్రియత్వమును వేనోళ్లఁ జాటును. కామక్రోధాద్యరిషడ్వర్గమును గెలిచి, శాశ్వతసత్యమునందు సుప్రతిష్ఠితుఁడైన యాయన చిత్తమును క్షణికములగు ప్రాపంచికభోగములేవియును విశ్వేశ్వరీపాదపద్మముల నుండి అణుమాత్రమును మరల్పఁజాలవని స్పష్టమయ్యెను. ఇట్టి మహోన్నతావస్థయందెల్లప్పుడును విహరించుచుండిన ఆ మహాతపస్వి మనస్సునకు లోకమునం దెట్టి పాపమాలిన్యము కానరాకుండెను. ఈ సాధనవిధానము నభ్యసించుచుండినప్పు డాయన సకలస్త్రీల యెడ తనకుఁగల మాతృభావాదర్శము నెన్నఁడును వీడలేదు; మద్య మొకబొట్టుకూడఁ ద్రాఁగలేదు. ప్రతిస్త్రీని లోకేశ్వరీ స్వరూపిణిగనే భావించుచుండెను. మద్యమునకు సాంకేతిక పదమగు 'కారణము' అనుమాటచేతనే జగదాదికారణమైన మహాశక్తి మానసవీథిని స్ఫురింప, దివ్యానందమున నాయన ఈ ప్రపంచమునెల్ల మఱచి తన్మయతనొందును. ఇంతేల?

ఈ కేవలాద్వైతపరబ్రహ్మస్వరూపునకు పవిత్రతాపవిత్రతా విచక్షణయే నశించి, సర్వమును నిఖిలభూతాంతర్గతవిశుద్ధ మూర్తియగు మహాశక్తిగనే కనుపడుచుండెను. చివరకు జాతి నీతులు విడనాడి నడివీథిని బడిన పడుపుకత్తెకూడ జగన్మాతనే యాయన జ్ఞప్తికిఁ దెచ్చుచుండెను. సామాన్యమానవులకుఁ గర్ణకఠోరములుగ నుండు బండబూతులుకూడ నాయనకు శ్రీ విశ్వేశ్వరీనామచిహ్నములగు వర్ణసముదాయములై పరమానందమయమగు సమాధిస్థితి నందించును. ఇట్లు పెక్కు సార్లాయన జీవితములో జరిగెనఁట. ఇట్లిప్పుడును తాను బహిరంతరవ్యాప్తజ్ఞానజ్వాలలలో నుండిన ట్లాయనకు తోఁచెడిది. ఈ సాధనకాలమునఁ దనలోని కుండలినీశక్తి మేల్కొని ఊర్ధ్వముఖముగా సహస్రారములోనికిఁ బోవు ట్లాయనకుఁ దెలియుచుండెను.

కుండలినీశక్తి సహస్రారమునకుఁ జేరు నైదు విధములును—చీమలబారు నడక, కప్పగంతుల నడక, పాము నడక, పక్షి నడక, కోఁతి నడక—తన కనుభవసిద్ధములని సవివరముగా నాయన తెలుపువాఁడు. ఈయోగశాస్త్రోదిత మార్గములేకాక, వేదాంతశాస్త్రోదిత సప్తస్థానములుగూడ నాయన కనుభవవేద్యములే.

ఈకాలముననే శ్రీ గురుదేవుఁడు జగత్తుయొక్క మూలకారణమును చూచెను. ప్రతిక్షణము ననంతలోకములఁ బుట్టించుచున్న తేజోమయమగు నొకపెద్ద త్రికోణరూపమున నది కనుపట్టెను. లోకములోఁ గల నానావిధధ్వనుల సమ్మేళనవలన స్వతస్సిద్ధముగ నుత్పన్నమై, యనాహతనామమునఁ

బరగు ('ఓం' కారమువంటి) ఒక గంభీరనాదమును గూడ నాయన వినుచుండువాఁడు. ఇంతేకాక జంతువులయొక్కయు, పక్షులయొక్కయు, భాషకూడ బోధపడు చుండెడిదఁట.

మానవుని సర్వశక్తిసంపన్నునిగఁ జేయు నణిమాద్యష్టసిద్ధులుకూడ తన ఆధ్యాత్మిక సాధనల ఫలితముగ శ్రీ గురుదేవునకు లభించెను. కాని కలలో దేవి కనఁబడి నిజమగు భక్తున కీ శక్తులు తుచ్ఛములని తెలిపినందున నాయన వానిని మిక్కిలి హేయముగఁ జూచుచుండును. వానికై ప్రాఁకులాడ వలదని భక్తులనుకూడ హెచ్చరించువాఁడు.

ఈ తరుణమందే శ్రీ గురుదేవుఁ డీశ్వరుని మాయాశక్తిని—అనఁగా లోకసృష్టిస్థితిలయములను భగవంతుఁడు నిర్వహించునట్టి దురవగాహవిధమును—గూడఁ గాంచెను. నిరుపమానసౌందర్యవతియగు నొక స్త్రీ గంగానదిలోనుండి పైకి లేచి పంచవటివైపునకు మెల్లగ వచ్చుచుండినట్లును, ఇంతలో నామెకుఁ బ్రసవచిహ్నములు కనిపించినట్లును, మఱి కొలఁదికాలమున కొక చక్కని శిశువును గని ఆ శిశువునకు బహుప్రేమతో పాలిచ్చుచుండినట్లును, కనఁబడెను. ఇఁక నొక క్షణమైన పిదపఁ దన ప్రేమస్వరూపమును విడనాడి భయంకరాకారమును దాల్చి ఆ శిశువును తన నోటిలో వేసికొని ముక్కలు ముక్కలుగా నమలివేయుచు గంగానదిలోనికిఁ బోయెను.

ఇంతేకాక నిరుపమానసౌందర్యవతులగు ననేక దేవతలుకూడ నాయన కీకాలమున ప్రత్యక్షమైరి. శ్రీ రాజరాజేశ్వరి (షోడశి) వీరందఱికన్న సౌందర్యవతియనియు,

ఆమె రూపరేఖాలావణ్యములు వర్ణనాతీతములనియు, నాయన చెప్పువాఁడు.

తాంత్రికసాధనలలోఁ గలిగిన సంపూర్ణవిజయఫలితముగా శ్రీగురుదేవుఁడు కేవలశిశుస్వభావముగలవాఁడయ్యెను. శరీరముపై బట్టను, తుదకు జందెమునుకూడ, నాయన యుంచుకొనలేకుండెను. ఎంత ప్రయత్నించినను తెలియకుండఁగనే అవి జాఱిపోవును. ఇప్పటినుండి కొన్నిసంవత్సరములవఱ కాయన మేనిచాయ బంగారువలె దేదీప్యమానముగ వెలిఁగిపోవుచుండెడిది. జనులు తన మోహనాకారమును తెప్పవాల్పక చూడమొదలుపెట్టినందున నాయన దేవిని, ఆమె బాహ్యసౌందర్యమును తీసికొని ఆమె అంతరంగిక సౌందర్యమును ఆత్మనిర్మలతనుమాత్ర మనుగ్రహింపుమని, ప్రార్థించి అప్పుడప్పుడు తనశరీరమును మెల్లగఁ జేతితో నిమిరికొనుచు "లోనికి పొమ్ము" అని చెప్పువాఁడఁట. చాల కాలమైన పిమ్మట నాయన బాహ్యరూపము చామనచాయగా మాఱినది. మునుముం దనేకభక్తు లాధ్యాత్మికబోధల నందుటకై తనకడకు వత్తురనియు నాయన కీకాలముననే ఎఱుకపడెను.



## సాధు, పండిత సాంగత్యము

బ్రాహ్మణిచే నిప్పటికే దివ్యసందేశమందిన యిరువురు భక్తులలో నొకఁడగు 'చంద్ర' అరియాదహా గ్రామములో బ్రాహ్మణి నివసించు చోటికి వచ్చెను. అతనిరాక నెఱుక పఱుపక శ్రీ గురుదేవుని కామె కబురుపంపెను. ఆయన వచ్చినపు డామెయు, చంద్రుఁడును మాటలాడుచుండిరి. కొంతసేపటి కాయన పారవశ్యస్థితి నంది, 'ఆహా! చంద్రుఁడు వచ్చినాఁడే! ఇతఁడు చంద్రుఁడు కాఁడా!' అని యఱచి, చేష్టలుతక్కి నిలుచుండెను. చంద్రుఁ డాయన రెండు చేతులు పట్టుకొని మూఁడునాలుగుసారులు బిగ్గరగా పేరుపెట్టి పిలువ, నాయన సామాన్యస్థితికి వచ్చెను. "నీవు నన్నెఱిఁగి నట్లున్నావే, ఇంతకాల మేల మఱచితివి?" అను ప్రశ్నకు "అది భగవత్సంకల్పము" అని శ్రీ గురుదేవుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. చంద్రుఁడు గొప్పభక్తుఁడు. ఆయనకడ శ్రీవిష్ణుదేవుని శక్తి కొంత కలదనియు, నందుచేతనే తనను సమాధిస్థితిలోనుండి అంతసులభముగ మరల్పఁగలిగెననియు శ్రీ గురుదేవుఁ డనెను. ఈతఁడు సాధించిన యద్భుతశక్తులలో నదృశ్యతనొందు విద్యయొకటి.

బ్రాహ్మణిచే సందేశమందిన రెండవవాఁడగు "గిరిజ" కూడ నొకనాఁడు దక్షిణేశ్వరమునకు వచ్చెను. ఒక సాయంకాల మాతనితో శ్రీ గురుదేవుఁడు శంభుచరణమల్లికుఁడను భక్తునికడకేగెను. తిరిగివచ్చుసరికి చిమ్మచీఁకటిగ్రమ్మెను. శ్రీ గురుదేవుఁడు దారి తెలియక తడబడుటఁ జూచి గిరిజుఁడు

"సోదరా, ఒక్కక్షణముండుము. వెలుతురు చూపెదను" అని చెప్పుచు తనవీఁపును త్రిప్పఁగనే అందుండి పెద్ద కాంతి బయలువెడలి కాళికాలయద్వారమువఱకు ప్రసరించెను. చంద్రుఁడును, గిరిజుఁడునుకూడ తమశక్తులను కోలుపోయిరనియు, తనతో నివసించుచుండిన కాలమున దేవి యాశక్తులను హరించె* ననియు, నందుచే వారు తమ యావచ్ఛక్తిని భగవత్సాక్షాత్కారార్థము వినియోగింప ననువుపడెననియు, శ్రీ గురుదేవుఁడు చెప్పువాఁడు.

ఆ కాలమున దక్షిణేశ్వరాలయమునకు వచ్చుచుండిన సాధువులనుగూర్చియు, భక్తులనుగూర్చియు మాటాడుచు

---

* 1899-వ సంవత్సరములో శ్రీ వివేకానందస్వామి రెండవ సారి పశ్చిమఖండములకు వెళ్లిన కొలఁదిదినములకు బేలూరుమఠమున కొకపురుషుఁడు వచ్చి తన పేరు 'చంద్ర' అని చెప్పుకొనెను. మఠాధిపతి శ్రీ బ్రహ్మానందస్వామి అప్పుడచ్చట నుండెను. తనభవిష్యత్తునుగూర్చి శ్రీ గురుదేవుఁడు చెప్పినవెల్ల నిజమయ్యెననియు, మరణకాలమునఁ దన కడకు వత్తునన్న వాగ్దాన మొకటిమాత్ర మింకను చెల్లవలసియున్నదనియు, నతఁడు చెప్పెను. పూజామందిరమున చాలకాల మతఁడు ధ్యానప్రార్థనలయందుఁ గడపును. అప్పుడతని చెక్కిళ్లపై కన్నీరు ప్రవహించుచుండును. మొదటిసారి యతఁడు పూజామందిరములోనికి వచ్చి శ్రీ గురుదేవుని ఛాయాపటమును చూచి, 'సోదరా! సోదరా!' యని పలుమఱు సంబోధించి మిగుల విలపించెను. శ్రీ గురుదేవుని జీవితములో తనకు తెలిసిన విషయముల నతఁ డుత్సాహముతో వివరించును. శ్రీ బ్రహ్మానందస్వామి యతనిని శాశ్వతముగా మఠములో నుండుమనెను. కాని ఏదియో పనియున్నదని చెప్పి ఇంటికివెళ్లి మరలఁ గనఁబడలేదు. పైన చెప్పఁబడిన 'చంద్ర' బహుశః ఈతఁడే యైయుండవచ్చును.

శ్రీగురుదేవుఁ డొకసారి ఇట్లు చెప్పెను: "ఆకాలమున నెందఱో బైరాగులును, భక్తులును, పూరి గంగాసాగర యాత్రల కేగుచు, నిచ్చట కొన్నాళ్లుండువారు. అప్పటికి రైళ్లు లేవు కదా! ఒక్కొక్కసారి యొక్కొక్క తెగ సాధువులు వత్తురు. ఇందు రామాయతశాఖవా రొకరు. ఆ శాఖవారి నిశ్చలభక్తి నిష్ఠలు వర్ణనాతీతములు. వారిలో నొకరియొద్ద నుండియే 'రామ లాలా' † (విగ్రహము) ను నేను సంపాదించితిని. భగవ న్నామమం దపారవిశ్వాసముగల మఱియొక సాధుపుంగవుఁ డొకసారి వచ్చెను. ఆతనియొద్ద నొక కమండలువు, నొక పుస్తకము, మాత్రమే కలవు. ఆ పుస్తకము నతఁడు ప్రతి దినము పూలతో పూజించుచు మహానిక్షేపముగాఁ జూచు కొనుచుండును. ఆ పుస్తకములో ప్రతి పుటయందును 'ఓం రామ' అను రెండుమాటలు మాత్రమే పెద్ద ఎఱ్ఱని యక్షర ములతో వ్రాయఁబడియుండెను. 'బీరువాలకొలఁది గ్రంథ ములు చదివిన నేమి ప్రయోజనము? వేదములకును, పురాణ ములకును, తదితర శాస్త్రములకును భగవంతుఁడే మూలము. భగవంతునకును ఆయన నామమునకును భేదమేమియు లేదు. చతుర్వేదములందును, అష్టాదశపురాణములందును, యావ దితరగ్రంథములందును, గలిగిన దెల్ల భగవన్నామములలో నొక్కొక్కదానియందును ఇమిడియుండును. కనుక నాకీ రామనామ మొక్కటియే చాలు' నని ఆ భక్తాగ్రేసరుఁడు చెప్పెను. భగవన్నామమం దతనికిఁ గల ప్రబలవిశ్వాసమంత టిది! ఈ రామాయతులు వెళ్లిన పిమ్మట మఱియొక శాఖ వారు రా నారంభించిరి. వీరికి పరమహంసలని పేరు. ఈ

† "రామలాలా" విషయములు పిమ్మటి యధ్యాయములోఁ గలవు.

గదిలో వారహర్నిశము పరబ్రహ్మము, మాయ, ఇట్టి విషయములపై వేదాంతప్రసంగములు చేయువారు. నేనప్పుడు గ్రహణితో తీవ్రబాధపడుచుండినను వారి వాదప్రతివాదములు వినుచుండువాఁడను. ఏదియైన నొక వివాదాంశముపై వారికి సమాధానము కుదురనప్పుడు ఇందులో (తనశరీరమును జూపుచు) నుండి తేటమాటలతో నెవరో సమాధానము సూచింప వారందఱుఁ దృప్తిపడువారు". ఇంక నెన్నెన్నియో తెగలవారుకూడ వచ్చిరి కాని, వారి వివరములు గ్రంథవిస్తరభీతిచే విడుచుచున్నాము.

శ్రీ గురుదేవుని కోరికపై మథురుఁడు దక్షిణేశ్వ రాలయమునకు వచ్చు సాధువులకు సాధనార్థము కావలసిన వివిధ వస్తువులను సమృద్ధిగా సేకరించి యుంచుటచే, వారు గుంపులు గుంపులుగావచ్చి శాంతముగా నచట సాధనలు సలుపుకొను చుండువారు. భోజనపదార్థములే కాక, కంబళ్లు, కమండలువులు, కొందఱువాడు మత్తుపదార్థములు కూడ, నా యుగ్రాణములో నుండును. వీనిని శ్రీ గురుదేవుఁడు స్వేచ్ఛగా పంచిపెట్టుచుండును. తాంత్రికసాధకు లొకానొకసారి శ్రీ గురుదేవుని నాయకునిగాఁ జేసికొని సాధనలు గావించెడివారు. కాని వారెంతప్రార్థించినను మద్యమును మాత్ర మాయన తాఁకడు.

వివిధ సంప్రదాయసాధకు లిట్లు శ్రీ గురుదేవునిఁగూడుటలో నెంతయో గంభీరార్థ మిమిడియున్నది. వాస్తవముగు నాధ్యాత్మికావేశము సులభముగా వ్యాపించుస్వభావముకలది. శ్రీ గురుదేవుఁ డేసాధనను బూర్తిచేయునో, ఆ తెగ సాధకు లప్పటినుండి దక్షిణేశ్వరమునకు రానారంభింతురు. ఆయన

దివ్యానుభూతులు తాముకూడ సాధింపఁగోరి యాయన నాశ్రయించి, బోధలందుచురు. తామిట్లు నేర్చిన యనుష్ఠాన విధానములు తమ శిష్యులకును, అనుగతులకును గఱపుదురు. ఈ విధమున శ్రీ గురుదేవుని సాధనవిధానములు దేశమంత టిని ఉద్దీప్త మొనరింప నారంభించెను. ఆయనచే గురువు లుగ గ్రహింపఁబడిన భాగ్యజీవులు కూడ తాము గ్రంథముఖ మున నేర్చుకొనిన కొన్ని సూత్ముృవిషయములను ఆయన సాంగత్యభాగ్యమున అనుభవైకవేద్యములు కావించుకొనుటే గాక ఇతరవిధములఁగూడ విశాలహృదయులైరి.

శ్రీ గురుదేవునివంటి ఆధ్యాత్మికప్రతిభాశాలిజననము భారతవర్ష భావిసముద్ధరణమున కెంతయు శుభసూచకము. గతశతాబ్దమధ్యమున హిందూదేశమునకుఁ బ్రాప్తింపఁ బోయినంతటి మహోత్పాత మీదేశచరిత్రలో మఱియేయుగ మందును గానరాదు. వివిధములైన ప్రతికూలశక్తులు భారత దేశవిజ్ఞానమును, నాగరకతను, సమూలముగాఁ బెల్లగింప నుండినవి. సాంఘిక రాజకీయార్థికాది సర్వవిషయములలో క్షీణత సామాన్యమైపోయినది.

“ఈ సాధుజనుఁడు హిందూమతగాంభీర్యమునకును, మాధురీగరిమకును, సజీవనిదర్శనము. ఇతఁడు శరీరమును పూర్ణముగ వశపఱచుకొనిన జితేంద్రియుఁడు. ఆపాదమస్తక మును ఆత్మయే, మతవాస్తవికతయే, ఆనందమే, దివ్య నైర్మల్యమే. సర్వసంగపరిత్యాగియగు నీ సిద్ధపురుషుని జీవి తమే ఈ జగత్తు మిథ్య యనియు నిస్సారమనియు స్థాపించు తార్కాణమైయున్నది. ఈయన ఋజువర్తనకాంతిచే వికసిం పని హైందవహృదయమే లేదు. ఈయన కెల్లప్పుడును భగవం

తుఁడుతప్ప వేఱుతలంపు, వేఱువ్యాపారము, వేఱుబంధువు, వేఱు స్నేహితుఁడు, కలుగరు. ఆ పరమాత్ముఁడే ఈయనకు సమస్తము. నిష్కళంకపవిత్రవర్తనము : అగాధమై, వర్ణనాతీతమై యొప్పు నానందము : అశిక్షితము, అపారమై యొప్పు విజ్ఞానము : శిశుసహజమైన ప్రశాంతత : సర్వమానవప్రేమ : నిఖిలమనోవ్యాపారముల కతీతమైన 'తదేకభగవద్భక్తి: ఇవియే ఈమహానుభావుని అనన్యసామాన్య తపఃఫలములు!" అని ముద్దులుమూటకట్టు మాటలతో శ్రీ రామకృష్ణదేవుని అవతారౌన్నత్యమునుగూర్చి యొక బ్రాహ్మమతప్రచారకుఁడు వ్రాసెను. ఈవిధముగ భారతదేశమునకు మహావిపత్తు వాటిల్లనుండిన సమయమున, జగత్కల్యాణమునకు ఆర్యవిజ్ఞాన సముద్ధరణము ముఖ్యమగుటచే భగవన్నియుక్తుఁడై యీ పురుషోత్తముఁ డవతరించెను.

దక్షిణేశ్వరమున నాధ్యాత్మికవిజ్ఞానామృతనిధి వెల్లివిరియుచున్నదని యెట్లెటిఁగిరోకాని, వందలకొలఁది త్యాగశీలు రటకు వచ్చి కృతార్థులైరి. ఆయనకడకు వివిధకాలములందు వచ్చిన భక్తులలోను, పండితులలోను, వైష్ణవచరణుని, గౌరిని, ఇప్పటికే పేర్కొంటిమి. 1870–వ సంవత్సర ప్రాంతమున గౌరి మరల దక్షిణేశ్వరమునకు వచ్చి శ్రీ రామకృష్ణపాదారవిందసన్నిధిని శిష్యార్థమై నివసించి, తీవ్రవైరాగ్యభావపరవశుఁడయ్యెను. శుష్కపాండిత్యము, జనసన్మానము, క్షుద్రశక్తులు, కేవలము నిష్ప్రయోజనములనియు, భగవద్భక్తియొక్కటియే మనుష్యజీవిత పరమార్థమనియు, గ్రహించెను. జీవితమును భగవదర్పితముఁ గావింప నిశ్చయించి కొన్నాళ్లు గడవునప్పటికి స్వజనము భీతిల్లి ఇంటికి రప్పించు

కొనఁజూచిరి. తనయభీష్టము భగ్నమగునను భయమున నతఁడొకనాఁడు శ్రీ గురుదేవునికడకు వచ్చి ప్రణమిల్లి కన్నుల నీరునించి పోవ సెలవిండని వేఁడెను. "ఇదియేమి గౌరీ, ఎచ్చటికి పోదువు?" అని శ్రీ గురుదేవుఁ డడుగ, గౌరి చేతులు జోడించి "నాకోరిక సఫలమగునట్లును, ఈశ్వర సాక్షాత్కారముఁ బడయక నే నీప్రపంచములోనికి మరల రాకుండు నట్లును ఆశీర్వదింపుఁడు" అని వేడుకొనెను. అప్పటినుండి యతని జాడ ఎవరికిని తెలియదు. పిమ్మట నారాయణశాస్త్రి యను మహాపండితుఁడొకఁడు శ్రీ గురుదేవునికడకు వచ్చెను. దీర్ఘగురుకులవాసముచేసి, సర్వశాస్త్రములందును కూలంకష ప్రజ్ఞ గడించియు నితఁడు నిర్మలభక్తిసంపన్నుఁడును, నిష్కపట వర్తనుఁడునై, కేవల పుస్తకజ్ఞానముతోఁ దృప్తినందక, శాస్త్రబోధితసర్వమతలక్ష్యమగుపరమసత్యము ననుభవవేద్య మొనర్చుకొనఁ గృతనిశ్చయుఁడై, భాగ్యవశమున శ్రీ గురుదేవునికడకు వచ్చెను. ఆతని శాస్త్రపరిజ్ఞానము, వినయశీలము, శ్రద్ధాభక్తులు, సత్యాన్వేషణనిష్ఠ, శ్రీగురుదేవుని మిక్కిలి యాకర్షించెను. తాను శాస్త్రములలో చదువుటే కాని, యెన్నఁడు ననుభవించి యెఱుఁగని అతీంద్రియజ్ఞానము, సమాధి, మొదలగు మహోన్నతస్థితులను నిరంతరానుభవము లుగాఁ జేసికొనిన శ్రీ గురుదేవునియం దతని కత్యంతప్రేమ గౌరవములు కలుగసాగెను. ఆయనను శుశ్రూషించి జీవిత పరమార్థమును సాధించుకొనఁ గృతనిశ్చయుఁడై, తన్నాయన శిష్యునిగాఁ గ్రహించునాయని సంశయించుచుండెను.

ఇట్లుండగా, న్యాయవాదియు, వంగదేశకవివర్యుఁడును, అగు మైకేలుమధుసూదనదత్తు కార్యాంతరమున దక్షి

ణేశ్వరమునకువచ్చి శ్రీ గురుదేవుని దర్శింపఁగోరెను. శ్రీగురుదేవుఁడు నారాయణశాస్త్రితోకూడ మధుసూదనుఁడున్న జమీందారీబంగళాకుఁ బోయెను. శాస్త్రి కవితో సంస్కృతమున సంభాషించుచు, క్రైస్తవమతము నేల స్వీకరించితివని యడిగెను. దారిద్ర్యబాధచే నని మధుసూదనుఁడు బదులు చెప్పెను. అంతట శాస్త్రి యసహ్యతతో "ఏమి! క్షణభంగురమైన ఈ జీవితముకొఱ కమూల్యమైన స్వమతమును విడనాడితివా? ఎంత తెలివిమాలినపని! ఎప్పుడో యొకనాఁడు మరణింపవలసినవాఁడవే. స్వధర్మమును వదలిపెట్టుటకంటె తిండిలేక పస్తుండినచో బాగుండెడిది" అని మందలించి, మిగుల నేవగించుకొని అటుపై నతనితో మాటలాడలేదు. పిమ్మట కవి తన కేమైన బోధచేయుఁడని శ్రీ గురుదేవుని బతిమాలుకొనెను. "ఎవరో నానోరుమూయుచున్నందున నే నొక్కమాటైన పలుకఁజాలకున్నాను" అని శ్రీ గురుదేవుఁ డాతనికి ప్రత్యుత్తర మిచ్చెను. మధుసూదనుని మనస్సు చిన్నవోయెనుగాని శ్రీ గురుదేవుఁడు కొన్నిపాటలుపాడి యాయనను తృప్తునొనర్చెను.

నారాయణశాస్త్రి యొకనాఁడు తనకు సన్న్యాస మిమ్మని శ్రీ గురుదేవుని ప్రార్థించెను. ఆ ప్రార్థన మంగీకరించి యొక శుభముహూర్తమున శ్రీ గురుదేవుఁ డాతనికి సన్న్యాస మిచ్చెను. పిమ్మట నతఁడు దక్షిణేశ్వరమువిడిచి వెళ్లెను.

తన దర్శనముకొఱకు నానాస్థలములనుండి వచ్చు ననేక సాధువులను భక్తులను చూచుటయేగాక, సుప్రసిద్ధ సత్యాన్వేషకులఁ గొందఱను చూచుటకు శ్రీ గురుదేవుఁడు

తాను స్వయముగఁగూడఁ బోవువాఁడు. ఈ కాలమున నిట్లాయన దర్శించినవారిఁ గొందఱ నిటఁ బేర్కొందుము.

పద్మలోచనుఁడు సర్వశాస్త్రపారంగతుఁడగు మహా విద్వాంసుఁడు, పరమ సాధుశీలుఁడు, భగవద్భక్తిసంపన్నుఁడు, నిష్ఠాపరుఁడు. శ్రీ గురుదేవుఁడు తఱచు సమాధిస్థితుఁడగుటఁ జూచి, అట్టి భక్తాగ్రేసరుని దర్శనము మహాభాగ్యముగ భావించి, "బండ్లకొలఁది పుస్తకములు చదివియు నేను సంపాదింపలేని పరమార్థ మీాయన యొక పుటయైనను చదువకయే పడయఁ గలిగెను" అని ఆయన చెప్పెను.

తన ఇష్టదైవము నాజ్ఞచేఁ బద్మలోచనుఁ డెల్లప్పుడు నొక పాత్రతో జలము, నొక అంగవస్త్రము, నుంచుకొని, పాదములలోఁ బాల్గొనుమున్న కొన్ని యడుగులు నడచి, వానితో మొగము కడిగి తుడిచికొనువాఁడు. అతఁడప్పుడు పాదములో దుర్జయుఁడు. ఇది పరమరహస్యమే కాని, శ్రీగురుదేవునకుఁ దెలిసి, వానినొకసారి దాఁచెను. పద్మలోచనుఁడు నివ్వెఱఁగంది యాయనలోఁ దన ఇష్టదైవమును గుర్తించి యాత్మార్పణ మొనర్చుకొనెను.

ఆర్యసమాజమును (పిదప) స్థాపించిన దయానంద సరస్వతిని శ్రీగురుదేవుఁ డొకసారి దర్శించి "సింథీగ్రామములో నొకతోఁటయం దాయన నివసించుచుండినప్పుడు సందర్శించితిని. ఆయనకుఁగొన్ని స్వల్పసిద్ధు లున్నట్లు కనఁబడెను. రక్తముబుకుటచే వక్షఃస్థల మెప్పుడు నెఱ్ఱగ నుండును. రేయుం బవళ్లు తఁడు శాస్త్రచర్చ చేయుచు, వ్యాకరణ సాహాయ్యమున శాస్త్రములకు విపరీతార్థములు గల్పించును. ఏదో యొక

అపూర్వకార్యము చేయవలెననియు, నొక క్రొత్త మతము స్థాపింపవలెననియు సంకల్పించినట్లు తోఁచెను” అని తన శిష్యులతోఁ జెప్పెను.

అరియాదహ గ్రామనివాసియు శ్రీరామభక్తుఁడు నగు కృష్ణకిశోరునికడకు శ్రీ గురుదేవుఁడు తఱచు వెళ్లి అధ్యాత్మ రామాయణకీర్తనలు వినువాఁడు. భగవన్నామమహిమ యందు కృష్ణకిశోరున కపార విశ్వాసము కలదని యాయన చెప్పువాఁడు.

గోవిందుఁడు, గోపాలుఁడు, అను ఇరువురు బాలభక్తులనుగూర్చి శ్రీ గురుదేవుఁడు చాలసార్లు ప్రస్తావించువాఁడు. గోవిందుఁడు గాండ్లబాలుఁడు. ఇతనిది వరాహనగరము. భక్తిపూరితుఁడై శ్రీ గురుదేవునొద్ద చాలకాలము గడపువాఁడు. ఇతనిపై శ్రీ గురుదేవునకును మిక్కిలి ప్రేమ. గోపాలుఁడతని మిత్రుఁడు. ఆధ్యాత్మికవిషయచర్చలు విననప్పు డతఁడు పారవశ్యస్థితి నందువాఁడు. లోకము తనకు దుస్సహముగా నున్నదనియు, అందుచే తాను దానిని వీడుచున్నాననియుఁ జెప్పి శ్రీ గురుదేవుని పాదములనంటి యా బాలుఁడు సెలవు తీసికొనెను. కొన్నాళ్లకతఁడును, ఆ పిమ్మట గోవిందుఁడును, మరణించిరి.



## రా మ లా లా

భగవంతుఁడు మానవులను కష్టపెట్టి పనిగొను క్రూర ప్రభువు కాఁడు. ఎంత ప్రయత్నించినను అందని దూర గతుఁడును కాఁడు. అందఱకును అత్యంత సన్నిహితుఁడు, భక్తజన సులభుఁడు, ఆయన నందుకొన నొక చేయి మనము చాఁపినచో, రెండు చేతులతో మన నందుకొను దయాసము ద్రుఁడును, ప్రేమైకరాశియు. రామలాలా చరిత్రము స్థాపించు సత్య మిది.

జటాధారియను సాధువు ఊరూరు తిరుగుచు, 1864 ప్రాంతమున దక్షిణేశ్వరమువచ్చి శ్రీ గురుదేవునితో నెక్కువ చనవుగ మెలఁగుచు నాయనకు వివిధములగు ఉపాసనా మార్గములలోఁ దోడ్పడెను. ఆయన భగవత్ప్రేమయు, ఆసక్తియు నసమానములని శ్రీ గురుదేవుఁడు చెప్పువాఁడు. చిరకాలో పాసనచే నతనికి శ్రీరాముఁడు ప్రత్యక్షమై బాలరూపమున వెంట తిరుగుచుండెను. జటాధారియు బాలరాముని తన యనుంగుబిడ్డవలె ప్రేమించుచుండెను. రామలాలా ఆ బాల రాము విగ్రహము. కాని యతనికది విగ్రహమాత్రముకాదు. ప్రత్యక్షదైవము. రేయుంబవళ్లు తదేకసేవా తత్పరుఁడై, అన్నము పెట్టును, ఆడుకొనును, ప్రక్కన పరుండపెట్టు కొనును. శ్రీరామచంద్రుఁడు తనకు ప్రత్యక్షమని యతఁ డెవ్వరితోను చెప్పఁడు. కాని యీరహస్యమును శ్రీ గురు దేవుఁడు కనుఁగొని, సౌకర్యముల నెల్ల నేర్పఱచి, యాతనిని దక్షిణేశ్వరమున నిలుపుకొనెను. పిమ్మటి విషయము నాయన

వాక్యములతోనే చెప్పెదము. "బాబాజీ రామలాలాకు యావజ్జీవభక్తుఁడు. అతని నెప్పుడును వెంటతీసికొని పోవును. బిచ్చమెత్తి తెచ్చిన గింజలు వండి యర్పించును. ఆ నైవేద్యము రామలాలా తినుచు, ఇతరపదార్థములకై వేధించుచున్నట్లతని కగపడును. జటాధారి రేయుంబగల్లా విగ్రహము నిట్లు సేవించుచు దివ్యసుఖపరవశుఁ డగుచుండును. రామలాలాచేష్టలెల్ల నాకుమాత్రము కనుపడుచుండును. అందుచే పగలంతయు బాబాజీతో గడపుచు రామలాలాను గనిపట్టుచుందును. కొన్నాళ్లకు రామలాలా నాకెక్కువ చనవయ్యెను. నేను జటాధారితో నుండువఱకు కాడుకొనుచుండి, పిమ్మట నాతో నాగదిలోనికి వచ్చును. రావలదని యెంత చెప్పినను వినఁడు. మొట్టమొదట నిది భ్రమమనుకొంటిని. జీవితమంతయు తన సేవకై ధారవోసిన జటాధారికంటె నాయందభిమాన మెక్కువయుండునా? కాని, ఒకతడవా, రెండుతడవలా? ప్రతిదినమిదేదృశ్యము! మిమ్మెట్లు చూచుచున్నానో రామలాలానుగూడ నట్లు చూచువాఁడను. అతఁ డొకప్పుడు ముచ్చటగా నృత్యమాడును. మఱొకప్పుడు నా భుజముమీఁది కుఱుకును. ఇంకొకప్పు డెత్తుకొనుమని పట్టుపట్టును. ఒక్కొకవేళ నతనిని నాతోడపై కూర్చుండఁబెట్టుకొందును. కాని యతఁ డక్కడనుండునా? పొలములలోనికి పరుగెత్తును. ముండ్లపొదలలో పువ్వులు గోయును. గంగానదిలోని కుఱుకును. 'ఎండలో పరుగెత్తకు, పాదములు బొబ్బలు పోవును. నీటిలో నానకు, జలుబుచేసి జ్వరము వచ్చును' అని నే నెంత చెప్పినను వినఁడు. తన సుందరనేత్రములు నాపై నిగిడించి నవ్వును. లేనిచో నల్లే యాటలాడుచు,

బుడ్డమూతిపెట్టును, లేక వెక్కిరించును. ఒక్కొకప్పుడు కోపము వచ్చి 'ఆలాగా, చూడు నిన్నేమిచేసెదనో!' అని బెదరించును. నీటిలోనుండి పైకి లాగి బొమ్మలిచ్చి మఱపించి, గదిలో నాడుకొమ్మందును. లేక కోపము పట్టఁజాలక యొకటిరెండు లెంపకాయలుకూడ వేయుదును. అంతనతఁడు కనుల నీరుకాఱ, వణఁకెడు పెదవులతో నావైపు చూచును. నేనప్పు డెంతో జాలితో తొడపై కూర్చుండఁబెట్టుకొని యూఱడింతును. ఇవన్నియు వాస్తవముగా జరిగినవి.

ఒకనాఁడు రామలాలా నాతోఁగూడ స్నానమునకు వచ్చెను. ఎన్నివిధములఁ జెప్పినను నీటిలోనుండి వెడల నందున విసిగి నీళ్లలో గట్టిగా నదిమిపట్టి, 'ఏదీ! ఇపుడు నీ యిష్టమువచ్చినట్లాడుము!' అని గద్దించితిని. పాప, మూ శాలుఁ దూపిరాడక కొట్టుకొనసాఁగెను. పశ్చాత్తాపపడి యెత్తుకొని బుజ్జగించితిని. మఱియొక విషయమునకుఁగూడ నేను మిగుల నొచ్చుకొంటిని. నాయొద్దలేని వస్తువేదో తెమ్మని యొకనాఁడు పట్టుపట్టెను. మఱపించుటకు చక్కఁగా దంచని యటుకు లిచ్చితిని. వానిని నమలుచో పాప మతని కోమలజిహ్వ గీఱుకొనిపోయెను. ఇది సహింపలేక నాతొడపై కూర్చుండఁ బెట్టుకొని, 'కౌసల్యామాత వెన్నమీఁగడలు పెట్టి నిన్నెంతో గారాబముతో పెంచినది. ఎంత తెలివిమాలి నీకీ మోటుపదార్థమిచ్చితిని!' అని విలపించితిని.'' ఇది చెప్పుచు నాయన మరల విలపించెను.

శ్రీ గురుదేవుఁడు మఱియు నిట్లు చెప్పెను: ''వంటచేసి, రామలాలా కనఁబడనందున నాయాసపడి బాబాజీ నాగది లోనికి వచ్చి, యతఁడు నాతో నాడుకొనుచుండుట చూచి,

చిన్నవుచ్చుకొన్న మొగముతో బాలునితో నిట్లనును: 'వంట చేసి నిన్ను వెదకుచున్నాను. నీ విట నాడుకొనుచున్నావు! నిన్నననేల? ఇది నీనైజము. నిర్దయుఁడవై తలిదండ్రులను విడిచి యడవులకుఁ బోయిన నీ కితరుల కష్టసుఖములతో పని యేమి? గుండెపగిలి తండ్రి మరణించుచుండఁ గడచూపుకైన నీవు తిరిగిరాలేదు' ఇట్లు చెప్పుచు రామలాలాను తీసికొని పోయి యన్నము తినిపించును. రామలాలాకు నన్ను విడిచి వెళ్లుట కిష్టములేనందున బాబాజీ దక్షిణేశ్వరములో చిర కాల ముండెను.

ఒకనాఁడు జటాధారి నాకడ కేడ్చుచు వచ్చి యిట్లు చెప్పెను: "రామలాలా తన యనంతదయావిశేషమున నా కోరిక నీడేర్చి ప్రియతమమైన రూపమునఁ బ్రత్యక్షమయ్యెను. కాని మిమ్ము విడిచి రాఁజాలనని చెప్పెను. అతనిని మీ కప్పగించి వెళ్లెదను. అతనినిగూర్చి నా కిఁక నెట్టిచింతయు లేదు. అతఁడు మీతో సుఖముగానున్నాఁ డనుతలంపే నా హృదయమున కానంద మీయఁగలదు." ఈ మాటలతో నాతఁడు రామలాలాను నాయొద్ద దిగవిడిచి దక్షిణేశ్వరము నుండి వెళ్లెను.

ఇదియే శ్రీరామకృష్ణుఁడు వాత్సల్యరూప భక్తితో శ్రీరామునారాధించిన యద్భుతకథ. మానవప్రేమ మాదివ్య ప్రేమలో శతాంశమునైన ప్రతిబింబింపఁజాలదు. ఈశ్వర సాక్షాత్కారముకై తదేకధ్యానాయత్తచిత్తముతోఁ గృషి సల్పితినిగాని, రామలాలా శ్రీరామకృష్ణునితో మాటలాడి నట్లు భగవంతుఁడు నాతో మాటలాడలేదని మనలో నొకఁ డైనను చెప్పఁగలఁడా? అద్భుతశమదమశ్రద్ధావైరాగ్యాది

సుగుణసంపత్తితో, తదేకనిష్ఠతోఁ, గృషిచేసెను కనుకనే శ్రీ రామకృష్ణుఁడు లోకములో నిదివఱ కెవరును గని వినియుండ నంత స్వల్పకాలములో సర్వసాధనలందును జయముగాంచెను.

తాంత్రిక సాధనానంతరము శ్రీ గురుదేవునకిట్లు వైష్ణవారాధనపద్ధతులం దభిరుచి కలుగుటకు పెక్కు కారణములు కలవు. అతఁడు కఠినతపోనియతిగల జ్ఞానియేకాక, భావోత్సాహ పూరితుఁడగు భక్తాగ్రేసరుఁడుఁగూడ. శిక్షణ విషయమున చండశాసనుఁడే కాని భక్తుల యోగక్షేమముల నరయునపుడు మృదుహృదయయగు తల్లి. ఈ లక్షణములు పరస్పర విరుద్ధములుగఁ గన్పడినను, ఒకేసత్యముయొక్క వేర్వేఱుముఖములు. సామాన్యసాధకులు భగవత్సాక్షాత్కార మందుట కేదో యొక్క భావముపైననే ఆధారపడుదురు. శ్రీరామకృష్ణుఁ డట్లుగాక సకల సద్భావమార్గముల నభ్యసింపఁగోరెను. పారమార్థికకృషియం దా వజ్రసంకల్పదీక్షాపరున కలసట, విసుగు, లేవు. ఒకపద్ధతి పిమ్మట మఱొక్కటారంభించుచుండును. ఇఁక రెండవకారణము. రఘువీరుఁడు కులదైవముగాఁగల వైష్ణవకుటుంబములో నాయన జన్మించెను, వైష్ణవ వాతావరణములోఁ బెరిగెను. చివరికారణము, తాంత్రికసాధనయం దాయనకు గురువైన బ్రాహ్మణికూడ గొప్ప వైష్ణవభక్తురాలు.

సాధనకాలములో మొదటి నాలుగేండ్లు శాంతదాస్య భావముల నవలంబించెను. ఆంజనేయుని సేవామార్గము ననుసరించి సీతాసాక్షాత్కారము వడసి ధన్యుఁడయ్యెనుగదా! కొన్నివేళల శ్రీదామకుచేలాది శ్రీకృష్ణమిత్రుల సఖ్యభావము ననుసరించెను. త్రివిధములైన ఈ వైష్ణవసాధన

పద్ధతులలో పరిపూర్ణత నొందిన పిమ్మట నాయన తక్కిన రెండుభావములను సాధింప సంకల్పించెను. అవి వాత్సల్య భావము, మధురభావము. ఇందు వాత్సల్యసాధన మొదట ననుసరించెను. తాను తల్లియైనఁ గదా బిడ్డపైఁ బూర్ణ వాత్సల్యము చూపుటకు? అందుకై తన పురుషత్వమును పూర్తిగ మఱచి స్త్రీగనే భావించుకొనుచు, మాటలందును, చేష్టలందును స్త్రీవలె ప్రవర్తించుచుండెను. అందుచే మధురుని కుటుంబస్త్రీ లాయనను తమలో నొకరినిగనే చూచుకొనుచుండిరి. ఆయనయు లోకేశ్వరికి చెలికత్తెయై సకలోపచారములు చేయుచుండెను. ఆ సమయముననే జటాధారి సాంగత్యమాయనకు లభించి వాత్సల్యసాధనకు తోడ్పడెను. జటాధారి యొద్ద వాత్సల్యవిధానమంత్రోపదేశ మొంది తదేకనిష్ఠతోఁ గృషిచేసి యచిరకాలముననే బాలరూపుఁడగు శ్రీరాముని నిరంతర సాక్షాత్కృతిని సాధించెనుగదా! అట్లు దశరథ కుమారరూపమున బాలాకృతితో తనకు సాక్షాత్కరించిన యతఁడే సర్వాంతర్యామియు, సర్వగతుఁడును, సృష్టికర్తయు, నామరూపగుణరహిత కేవలపరబ్రహ్మమును, అని యాయన కెఱుకపడెను. ఇట్లు వాత్సల్యసాధనను శాస్త్రోక్తమార్గమున నవలంబించి, కేవలస్వయంకృషివలనఁ దా నింతకుమున్ను సాధించియుండిన పరమార్థమునే మరల సాధించెను.



## దివ్యప్రేమ

ఇఁక మిగిలినది వైష్ణవసాధనలలో నగ్రస్థానము వహించు మధురభావసాధన యొక్కటే. మధురభావ మనఁగా, భార్య భర్తను, ప్రేయసి ప్రియుని, ప్రేమించునట్లు భగవంతుని ప్రాణనాయకునిగ ప్రేమించుట. వైష్ణవారాధన విధానము లైదును మానవజీవితాధారమగు ప్రేమ యను నొక మహాగుణము నాశ్రయించియున్నవి. వీనిలో నొక్కొక్కటె మెట్టెక్కుకొలఁది భగవంతునెడ సాధకున కెక్కువ చనవు లభించును. తన హృదయము నపహరించిన ప్రియుని గూడి మనోరథము తీర్చుకొనువఱకు కాంత యహర్నిశ మెట్లు తదేకదీక్షతోఁ గృషిసల్పునో, యట్లే భక్తుఁడుగూడ తన హృదయేశ్వరుఁడగు పరమేశ్వరునిగూడి తన్మయుఁడగువఱకు శాంతి నొందఁడు. ఈ సాధనపద్ధతిని శ్రీచైతన్యుఁడును తచ్ఛిష్యులును ప్రాముఖ్యమునకుఁ దెచ్చిరి. పురాణయుగమున నిది బృందావనగోపికలు శ్రీకృష్ణునెడలఁ జూపిన ప్రేమాతిశయమునఁ గాననగును.

శ్రీరామకృష్ణుఁ డీసాధనక్రమము నుపక్రమించినను, తత్సంబంధభావములందే నిమగ్నుఁడగుట వాడుక. మధురభావసాధనపై కోరిక పోఁగానే యాయన మధురునడిగి స్త్రీదుస్తుల నాయితపఱచుకొనెను. ఆ దుస్తులతో నాయన శ్రీకృష్ణవిరహార్తిచే పరితపించు బృందావన గోపికాస్త్రీగ మాఱిపోయెను. ప్రతిమాటయు, ప్రతిచేష్టయు, వర్ణనాతీతమగు

దుర్భరవిరహతాపమును, ప్రియుని పునస్సమాగమముకొఱకగు తహతహను, వేగిరపాటును, సూచించుచుండెను. శ్రీ గురుదేవుఁ డీ తదేకనిష్ఠయం దాఱునెలలు గడపెను. అందొక్క నిమిష మైనను సామాన్యావస్థ నెఱుఁగఁడు.

శ్రీకృష్ణుఁడు తమ భర్తయగునట్లు వర మిమ్మని బృందావనగోపికలు కాత్యాయనీదేవి నుపాసించువారు. అట్లే శ్రీరామకృష్ణుఁడును శ్రీకృష్ణసాక్షాత్కారముకై లోకేశ్వరిని పరిచారికాభావముతో సేవింపసాఁగెను. కాని అంతకన్న తఱచుగ రాధాకృష్ణులను సేవించువాఁడు.

ఆ సంవత్సరము దుర్గాపూజోత్సవముల కాయనను మథురుఁ డాహ్వానించెను. మొదటినాఁటి సాయంకాలసేవ వేళకు శ్రీ గురుదేవుఁడు పట్టుచీరకట్టుకొని, దేవీపరిచారికాభావ నిమగ్నుఁడై పారవశ్యస్థితియందుండెను. మథురుని భార్య ఆయన నాస్థితిలో వదలి యొంటరిగాఁ బూజకెట్లు పోఁగలదు? అంతకుఁ గొన్నినాళ్ల క్రిందటనే యిట్టిస్థితిలో నాయన నిప్పుల పళ్లెరముపైఁబడి యొడలు కాల్చుకొనెను. ఏమిచేయుటకును దోఁపక, యామె తన యాభరణములు తెచ్చి యాయనకుఁ బెట్టుచు "హారతివేళ యైనది, మీరు వచ్చి దేవికి చామరము వేయరా?" అని హెచ్చరింప నారంభించెను. అప్పటి తన ధ్యానస్థితి కత్యంత ప్రసక్తములగు నా పలుకులచే నాయన కొంత స్మృతినంది పూజావేదికకడకు వెళ్ళి దేవికి చామరము వేయుచుండెను. ఇంతలో ఆ మంటపపు రెండవచివరఁ గొందఱు పురుషులతో నిలిచియుండిన మథురుఁడు తనభార్య ప్రక్క నిలిచి దేవికి చామరము

వేయుచున్న స్త్రీనిచూచి, గుర్తింపఁజాలక, పూజానంతరము తనభార్య నడిగి నిజము తెలిసికొని, "ఆహా! అత్యల్ప విషయములలోఁగూడ బాబాను మన మెఱుఁగఁజాలము గదా, ఆయనయే వ్యక్తపఱచుకొనినఁ దప్ప!" అని ఆశ్చర్య వివశుఁడయ్యెను.

శ్రీ గురుదేవుని స్త్రీరూపమునుగూర్చి హృదయుఁడిట్లు చెప్పువాఁడు: "నన్నొకనాఁడు మథురాబాబు తన జనానాలోనికి తీసికొనిపోయి మా మేనమామను చూపు మనెను. ఎన్నోయేండ్లాయనతో నుండియు వెంటనే గుర్తుపట్టఁజాలనైతిని." ఈ కాలమునుగూర్చి యతఁడింకను ఇట్లు చెప్పెను: "దక్షిణేశ్వరములో నుదయవేళల మా మేనమామ పూసజ్జ చేతనిడుకొని పూజకు పుష్పములు కోయఁబోవునప్పుడు పెక్కుసారులు కనిపట్టితిని. ఆఁడువారి వలె నెడమపాదమును ముందుపెట్టియే నడచును. పూలు కోయునప్పుడు పలుమాఱు శ్రీ రాధాదేవివలెఁ దోఁచెనని భైరవియు చెప్పుచుండెడిది."

దేవీప్రార్థనానంతర మాయన శ్రీ రాధాకృష్ణ ప్రార్థనమందు వ్యగ్రుఁడయ్యెను. కృష్ణసాన్నిధ్యము లేనిచో ప్రాణమే పోవునట్లు వేదనపడసాఁగెను. విరహవేదన దుస్సహమయ్యెను. శ్రీకృష్ణసందర్శనమే నిమిషమున లభించునో యను మహోత్కంఠతో దినములు, నెలలు, గడపుచుండెను. సందేహముగాని, నిరాశగాని యాప్రేమ భక్తిజ్వాల నణుమాత్ర మణఁపఁజాలకుండెను. అన్నపానములు మఱచి దినమంతయు విలపించును. ఆ యుత్సుకత క్రమక్రమముగా

నున్మాదావేశములోనికి మాఱెను. రెండుసారులు మున్ను కానిపించిన శరీరతాపము మరల నారంభించెను. రోమద్వారములనుండి సూక్ష్మరక్తబిందువు లుబుకఁజొచ్చెను. కొన్ని వేళలందు కీళ్లసంధులు పట్టుతప్పిపోవుచున్నట్లుండును. విషాద వేదన దుర్భరమగుటచే నొకొ్కకసారి ఇంద్రియవ్యాపార మాఁగిపోయి యాయన శవాకృతిని దాల్చును.

శ్రీకృష్ణునికి ప్రాణసమానయగు రాధాదేవి కృప సంపాదించినచో తన శ్రీకృష్ణసందర్శనాపేక్ష సులభమగు నని తోఁప నాయన తదేకభక్తితో నామెను ప్రార్థింప నారంభించెను. కొలఁదికాలములో దివ్యప్రేమస్వరూపిణియగు రాధ ప్రత్యక్షమయ్యెను. ఇట్టి యితరానుభవములందువలెనే ఆమె మూర్తియుఁ దనశరీరములోఁ జొచ్చి లీనమైన ట్లాయనకు తోఁచెను. ఈ విషయమై శ్రీ గురుదేవుఁడు "రాధాదేవి నిరుపమానసౌందర్యము వర్ణనాతీతము. శ్రీకృష్ణునందలి గాఢానురాగముచే నామె స్వచింతనెల్ల పూర్తిగా మఱచినదని యామె యాకారమే తెలుపును. ఆమె చాయ లేఁతపసుపు రంగు" అని చెప్పువాఁడు.

అప్పటినుండియు నాయన రాధ నని భావింప నారంభించెను. నిరంతర మామె మూర్తిమత్త్వమునే తలపోయుచు స్వీయవ్యక్తిత్వమును గోల్పోయి మఱియొక రాధగా మాఱెను. రాధాదేవికిఁ గల తీవ్రానురాగమును, భావోద్రేకమును ఆయనయం దిప్పుడు పరిపూర్ణప్రకటితములై మహాభావపు మూర్తీభావముగా నొప్పుచుండెను. బ్రాహ్మణియు, వైష్ణవచరణాదివిద్వద్భక్తులును, శ్రీ గురుదేవుని యాదివ్య స్థితిని జూచి యాశ్చర్యపడి, పురాణవర్ణితమగు రాధాదేవి

స్థితియును, అనేకశతాబ్దముల పిమ్మట చైతన్యునియందు వ్యక్తమైన స్థితియును కేవల మిట్టిదే యని నిశ్చయించిరి. ఈ సాధనకాలమునుగూర్చి కాలాంతరమున శ్రీ గురుదేవుఁ డిట్లు చెప్పెను: "వివిధములైన పందొమ్మిది భక్తిభావము లొకరియందే వ్యక్తమగుట భక్తిగ్రంథములలో మహాభావ మని చెప్పఁబడియున్నది. వీనిలో నొకదాని నొందుటకే సామాన్యునకు యావజ్జీవము పట్టును. కాని (తన్నుద్దేశించుచు) యీ శరీరమందు పందొమ్మిది భావములును పూర్తిగా వ్యక్తమైనవి."

ఈ విధముగా తాను సాధనను పరిపూర్ణభావముతో, తదేకప్రేమోత్సాహములతో, శ్రీకృష్ణుని ధ్యానించుచు శ్రీ గురుదేవుఁ డచిరకాలముననే సాధనఫలము నందఁ గలిగెను. నిరుపమానసుందరాకారముతో శ్రీకృష్ణుఁడు ప్రత్యక్షమై మనోరథము నీడేర్చి యతని శరీరమున లీనమయ్యెను. రెండు మూఁడు నెలలు శ్రీ గురుదేవుఁడు నిజ మనోహరానుసంధానదివ్యానందమును గ్రోలెను. తన వ్యక్తిత్వమునే మఱచి తాను శ్రీకృష్ణుఁడనను భావముతోనే మెలఁగువాఁడు. సర్వచరాచరములందు పరమాత్మునే కాంచువాఁడు. ఒకసారి యొక నీలవర్ణ పుష్పమును జూపి "ఆ సాధనకాలమున నాకగపడిన శ్రీకృష్ణుని మేనిచాయ యిట్లుండెడిది" అని శిష్యులతో చెప్పెను.



## నిర్వికల్ప సమాధి

అద్వైత వేదాంతములో నిర్వికల్పసమాధి తుదిమెట్టు. అది చేకూఱినప్పుడుగాని పరమసత్యముయొక్క వాస్తవికత సాధకునకు బోధపడదు. అట్టిస్థితి సాధించిన సిద్ధునందు జ్ఞాన జ్యోతి నిశ్చలముగా నుండును, ఆనంద మవిచ్ఛిన్నమై యొప్పును, దృశ్యప్రపంచము విస్మృతమగును. అనంతభేద మయమగు నీ ప్రపంచమందలి ప్రతివస్తువును సమభావముతోఁ జూచుచు నతఁడు సుఖదుఃఖభూయిష్ఠములగు లోకవ్యవస్థలకు చలింపఁడు. తానును అద్వితీయశాశ్వతపరబ్రహ్మమును ఒక్కటియేయని అనుభవపూర్వకముగ గ్రహించి, మర్త్యుఁడననియు, ప్రపంచాధీనుఁడననియు, నిన్నాళ్లు తలంచు చుండినందులకు భ్రాంతియు, నజ్ఞానమును కారణములని గ్రహించును. ఈ మహోన్నతావస్థనుండి సాధారణస్థితికి సామాన్య సాధకుఁడు తిరిగి రాఁజాలఁడు. కొలఁదినాళ్ల కాతని మనశ్శరీరములకును ఆత్మకును సంబంధము పూర్తిగ విడిపోయి, శరీరము నిర్జీవమగును. లోకములో నేదియో మహాకార్యము సాధించుటకై పుట్టినవారుమాత్రమే ఈ సమాధిస్థితినుండి తిరిగి మనలోకమునకు—ఎట్లో నిగూఢముగా—రాఁగలుగు దురు. అట్టివారు లోకసంగ్రహణార్థము జీవించుచు నిరుప మానమైన యాధ్యాత్మికశక్తితోఁ దేజరిల్లుచుందురు. అట్టి మహనీయులు స్పర్శమాత్రమున, చూపుమాత్రమున, మాట మాత్రమున, తుదకు సంకల్పమాత్రమున, నితరులకుఁ బవిత్ర తను, ప్రభావమును, చేకూర్పఁగలరు.

సర్వవిధముల నద్వైతానుభూతికర్హ్వుఁడగు నీ శిష్యునికై దక్షిణేశ్వరమున కొక యద్భుతపురుషుఁ డేతెంచెను. అద్వైతానుభూతినంది, దానిని స్వజీవితముననే వ్యక్తపఱుచు నా మహానుభావుని పేరు తోతాపురి. బ్రహ్మమే సత్యమని యపరోక్షముగా గ్రహించి, ప్రపంచమును స్వప్నమాత్ర ముగఁ జూచుచు, నొక ఇంటి పంచ నెన్నఁడు నిలువక, భిక్షముచే లభించు స్వల్పార్జనతో శరీరము పోషించుకొనుచు, ఎండవానలలో నొకేరీతిని విశాలాకాశముక్రింద జీవితము గడపుచు, నూరూరు తిరుగు సాధువులలో నీతఁ డొకఁడు. నిర్జనారణ్యమున నలువదేండ్లు కఠినతపస్సుచేసి ఇతఁడు నిర్వికల్పసమాధిస్థితిని బడసెనఁట. ఈ ముక్తజీవి చెఱ నుండి విడివడిన సింహమువలె తనయిచ్ఛవచ్చినట్లు దేశమెల్ల తిరిగి తీర్థయాత్రలుచేయుచు, జగన్నాథ గంగాసాగర క్షేత్రములు దర్శించి గంగాస్రవంతిమీఁదుగా తిరిగిపోవుచు, మార్గమధ్యమున దక్షిణేశ్వరములో నిలిచెను. మానవదురవగాహమగు దైవసంకల్ప మొక మహాకార్యసిద్ధికై తన్నిటకుఁ దోడ్కొనివచ్చెనని యాయన కప్పటికి తెలియదు.

కాళికాలయ ముఖద్వారము నెదుటి 'చాందిని' లో తోతాపురి యాఁగెను. శ్రీ గురుదేవుఁ డచ్చట నంతర్ముఖుఁడై కూర్చుండియుండెను. ముఖవర్చస్సును జూచియే తోతాపురి ఆయన ప్రభావశాలి యని గ్రహించెను. చూచు కొలఁది గాఢముగా సమ్మోహితుఁడై చిట్టచివర కాయనను సమీపించి, "నీవు సత్యాన్వేషణయందు దున్నతస్థితిని గాంచినట్లున్నావు. వేదాంతవిద్య నభ్యసింతువా?" అని యడిగెను. "అదంతయు మా యమ్మ ఇష్టము. ఆమె యొప్పుకొన్న నే

నే నది నేర్చుకొనఁగలను” అని యాయన చెప్పెను. “మంచిది. పోయి మీ యమ్మ నడిగిరమ్ము. నేనిచ్చట చాలకాలము ఉండను” అని తోతాపురి చెప్పెను. శ్రీ గురుదేవుఁడు మాఱుమాటాడకపోయి జగన్మాత నడిగెను. “వెళ్లి, నేర్చుకొనుము, అందుకొఱకే యతని రాక” అను నామె ప్రత్యుత్తర మాయన అతీంద్రియావస్థలో వీని, యసంపూర్ణ శరీరస్మృతితో, తేజోమయముఖారవిందముతో, తిరిగి వచ్చి తనతల్లి సెలవైనదని తోతాపురితోఁ జెప్పెను. దేవాలయములోని విగ్రహము నమ్మా యని పిలుచు నా బాలుని యమాయికత్వమునకు తోతాపురి నవ్వుకొని యుండును. ఈ అద్వైత వేదాంతి దృష్టిలో సగుణపర బ్రహ్మము కర్మాధిష్ఠానదేవతామాత్రుఁడే యగుటచే, ఆత్మ జ్ఞానముకొఱకు ప్రయత్నించు సాధకుఁ డట్టిదేవుని ప్రార్థించు టయు, అతనియందు భక్తిగలిగియుండుటయు, కేవల నిష్ప్ర యోజనమేకదా! మాయ, శక్తి, యను పేళ్లుగల పరబ్రహ్మము యొక్క సక్రియాస్థితి యీ వేదాంతి యభిప్రాయమున కేవల భ్రాంతియే కాని వేఱొండుకాదు. అందుచే అజ్ఞానబంధముల నుండి ముక్తుఁడగుట కామె నేల యారాధింపవలెను? అజ్ఞానమే మానవుని బంధకారణమనియు, దానిని నిర్మూ లింప స్వయంకృషియే మార్గమనియు, నాయన నమ్మకము.

వేదాంతవిద్యాభ్యాసము చేయుటకును, తదనుగుణ శిక్షణము లందుటకును అర్హత సన్న్యాసాశ్రమ స్వీకార మొందినవారికి మాత్రమే కలదని తోతాపురి చెప్పెను. ఇందుకై తాను బ్రాహ్మణుఁడనియు, గృహస్థుఁడనియు తెలుపు

శిఖాయజ్ఞోపవీతములు విసర్జించి నూతన జీవిత మారంభింప వలెను. సన్న్యాస స్వీకారమునకు తన కేమియు నాక్షేపము లేదనియు, కాని యది రహస్యముగా జరుగ నిచ్ఛగింతు ననియు (శ్రీ) గురుదేవుఁడు చెప్పెను. ఇందుకుఁగారణ మచ్చటనే నివసించుచుండిన తన ముదుసలి తల్లికి మార్పు దుస్సహముగా నుండుననియే. ఈ కోర్కెను తోతాపురి యంగీకరించెను.

శుభదినము ప్రవేశించినది. పితృదేవతల కిటుపైని శ్రాద్ధాదులు చేయుటకు వీలుండదు. కావున వారికిని, ఇంత నుండి ప్రపంచభావమున మరణించు తనకును, శ్రాద్ధము లొనర్పుమని తోతాపురి (శ్రీ)రామకృష్ణునితోఁ జెప్పెను. అట్లు చేసి యాయన తన పంచవటీధ్యానకుటీరములో వలయు పరికరముల నాయితపఱచి, ఉపవసించి, సిద్ధముగా నుండెను. రాత్రి చాలభాగము గడచిపోయినది. ప్రశాంతమైన యుషఃకాల మీయుపదేశమునకు బహుశుభప్రదమగుటచే నా ముహూర్తమున గురుశిష్యు లిరువురును ధ్యానమందిరము ప్రవేశించిరి. గురువు మంత్రము లుచ్చరించుచుండ శిష్యుఁడు వానిననువదించుచు, నాహుతులర్పించుచు, అందుతో ఇహపరభోగవాంఛల నెల్ల పరిత్యజించుచున్నాననియు, తన కాత్మస్వరూపులే యగు సకలప్రాణులకు నభయ మిచ్చుచున్నాననియు ప్రమాణముచేసి, శిఖాయజ్ఞోపవీతములను హోమాగ్ని కర్పించి, గురు విచ్చిన కాషాయవస్త్రమును స్వీకరించెను.

సూర్యోదయ మైనది. భారతదేశమున కేకాక ప్రపంచమున కంతకునుగూడ దివ్యతేజోవికాసవంతమగు మహా

దయదిన మది. పురాతనవేదాంతమతమున కొక నూతన ప్రవర్తమై, శ్రీ బుద్ధభగవానుని విశ్వజనీనప్రేమను, శ్రీ శంకరభగవత్పాదుల కుశాగ్రబుద్ధిని మేళవించిన జగదుద్ధరణ మహాకార్యనిర్వాహధుర్యుఁడగు లోకోత్తరమహాపురుషుఁ డుదయించిన దివ్యవాసర మదియే. ప్రాచ్యపాశ్చాత్య ప్రపంచముల రెంటిని సమరసపఱచి, సనాతనమతబోధను భవిష్యత్పరిణామముల కనురూపపఱుపఁజాలు సర్వజ్ఞ మూర్తి జన్మించిన దానాఁడే!

గురువునకు సాష్టాంగప్రణామముచేసి ఉపదేశము నొందుటకు శ్రీరామకృష్ణుఁ డాసీనుఁ డయ్యెను. తనకును పరమాత్మకును గల యైక్యమును శిష్యుఁడు నిరంతరము జ్ఞప్తియుంచుకొనుటకై తోతాపురి అద్వైత వేదాంత ప్రధానసూత్రము లాయనకు బోధింప నారంభించెను. "బ్రహ్మమొక్కటియే సత్యము. అదియే నిత్యశుద్ధము, నిత్యబుద్ధము, నిత్యముక్తము, దేశకాలనిమిత్తముల కతీతము. దురవగాహమైన స్వకీయమాయాశక్తిచే నామరూపాది భేదములతో నొప్పుచున్నట్లగపడినను, బ్రహ్మమెప్పుడు నఖండమే. సమాధిసుఖనిమగ్నుఁడైన సాధకునకు మాయా కల్పితములగు దేశకాలములుగాని, నామరూపములుగాని ఎంతమాత్రము గోచరింపవు. మాయాశక్తివశమైన దెల్ల ననిత్యము. దానిని పరిత్యజింపుము. నామరూపమయమైన మాయావ్యూహమును భేదించుకొని సింహమువలె వెలికి దుమికి రమ్ము. ఆత్మాన్వేషణకార్యమందు నినుగు చెందక సమాధిమార్గమున స్థిరముగ ఆత్మారూఢుఁడవు కమ్ము. అప్పుడు నామరూపమయమగు నీ ప్రపంచ మంతర్ధానమై,

తుచ్ఛమగు నీ 'అహము' మహత్తరమైన విశ్వచైతన్యములో లీనమగును. అఖండసచ్చిదానందపదార్థమగు పరబ్రహ్మముతో నీ ఐక్య మప్పుడు నీకు గోచరించును. మన మితరము నొకటిఁ జూడఁగలుగు, వినఁగలుగు, తెలిసికొనఁగలుగు, జ్ఞానము నిస్సారము, నిరుపయోగము. అది మన కెన్నఁడును పరమసుఖము నీయఁజాలదు. ఇతరముకనఁబడక, వినఁబడక, తెలిసికొనఁబడకయుండు ద్వంద్వాతీతజ్ఞానమే ఉత్తమము. దాని మూలముననే పరమానందస్థితి సిద్ధించును. సర్వజీవహృదయాంతరాళమున వెల్గొందు నిత్యసాక్షిని మనస్సు, ఇంద్రియములు, ఎట్లు గ్రహింపఁగలవు?" ఈ విధముగ వాదించుచు, శాస్త్ర ప్రమాణము లుదాహరించుచు తోతాపురి యానాఁడు శ్రీ గురుదేవుని చిత్తమును కేవల బ్రహ్మపదార్థస్థితమగునట్లు చేయ యత్నించెను. ఈ విషయమై, "సన్న్యాస స్వీకారానంతరము న్యాంటా * అద్వైతవేదాంతసిద్ధాంతములు నాకు బోధింప మొదలిడెను. మనస్సును సర్వ వస్తువులనుండి పూర్తిగ మరలించి ఆత్మలో మునిఁగిపొమ్మని చెప్పెను. కాని నే నెంత ప్రయత్నించినను నామరూపప్రపంచమును దాఁటి సర్వతంత్రస్వతంత్రస్థితికి మనస్సును తీసికొని పోఁజాలకపోయితిని. తక్కిన సర్వవస్తువులనుండి సులభముగనే మరల్పఁగలిగితినికాని, కేవలచైతన్యసారమై తేజోమయమై ప్రకాశించుచు, నాకు నిరంతర పరిచితమగు, శ్రీ లోకేశ్వరీరూపముమాత్రము సరూపసత్య

* శ్రీరామకృష్ణుఁడు తన గురువుపైఁగల మర్యాదచే నాయనను పేరుతో సూచింపక "న్యాంటా" అనువాఁడు. ఈ శబ్దమునకు దిగంబరియని యర్థము. తోతాపురి దిగంబర సంప్రదాయ సన్న్యాసి.

ముగాఁ దోఁచుచు, నామరూపప్రపంచమునుండి మనస్సును దాఁటనీయకుండెను. అద్వైతసిద్ధాంతములపై మనస్సును నిలుప నెన్నిసార్లు యత్నించినను, ఆ మెరూప మడ్డువచ్చు చుండెను. తుదకు నిరాశుఁడనై, 'నాకిది యసాధ్యము. నా మనస్సు బంధరహితస్థితికిపోయి ఆత్మను ముఖాముఖిని చూడ లేకున్నది' అని చెప్పితిని. న్యాంటా యించుక కోపముతో 'ఏమి! చూడలేకున్నదిగా! ఎట్లు చూడకపోవునో చూతము' అని నిష్ఠురముగఁ బలికి యచటఁబడియున్న యొక గాజు పెంకును నా కనుబొమలనడుమ గ్రుచ్చి, 'దీనిపై మనస్సును నిలుపుము' అని ఆజ్ఞాపించెను. అప్పుడు కృతనిశ్చయుఁడనై శ్రీ జగజ్జననీదివ్యరూపము మరలఁదోఁచిన వెంటనే, వివేక ఖడ్గముతో దానిని ఖండించివైచితిని. నా మనస్సున కింక నంతరాయమేమియు లేకపోవుటచే అది ఈ భేదమయ ప్రపంచము నతిక్రమించి పైకెగసిపోవ, సమాధి నిమగ్నుఁడనైతిని'' అని శ్రీ గురుదేవుఁడు చెప్పెను.

ఆ స్థితిలో నింద్రియములును మనస్సును నిజవ్యాపారములు దక్కి స్తంభించిపోయెను. శరీరము శవమువలె నిశ్చల మయ్యెను. విశ్వము దృష్టినుండి నిర్గమించెను. ఆకాశముకూడ నదృశ్యమయ్యెను. సర్వమును భావములుగ మాఱి, ఆ యనంతమానససాగరముపై నీడలవలె తేలుచుండెను. 'నేను' అను తలంపుమాత్ర మెక్కడనో నిలిచి యప్పు డప్పుడు కొంచెముగాఁ దోఁచుచుండెను. కొంతసేపటి కివ న్నియు మాయమై, కేవలము చైతన్యము మిగిలెను. జీవాత్మ పరమాత్మలో లీనమయ్యెను. జ్ఞాని, జ్ఞేయము, మున్నగు ద్వంద్వభావములు పూర్తిగ నశించెను. మాటలకు, నింద్రి

యములకు అతీతమైన పరబ్రహ్మానుభూతి శ్రీరామకృష్ణునకుం గల్గెను. కాదు, శ్రీ రామకృష్ణుండే పరబ్రహ్మమయ్యెను.

శిష్యునిఁజూచుచు తోతాపురి నిశ్శబ్దముగా చాలకాలము కూర్చుండెను. చలన మేమాత్రము లేకుండుటఁజూచి బయటకు వచ్చి, గదిలోని కితరు లెవరును పోకుండ తలుపు తాళము వేసి, పిలుపుకై ఎదురుచూచుచుండెను. పగలంతయు గడచినది. రాత్రికూడ. మఱియొక దినము గడచినది. ఇంకొకదినముకూడ. ఇట్లు మూఁడునాళ్లైనను పిలుపు లేదు. తోతాపురి ఆశ్చర్యపడి ఘోరమేదియో జరిగెనను సంశయముతో తలుపు తెఱచిచూచెను. శ్రీ రామకృష్ణుఁడు అట్లే — మొదటిస్థితిలోనే — కూర్చుండియుండెను. శరీరములో ప్రాణసూచన లేమియు లేవు. కాని ముఖముమాత్రము ప్రశాంతముగను, గంభీరముగను, తేజోవంతముగను, ఉండెను. శిష్యుఁడింకను సాధారణవస్తుప్రపంచమునకు మృతప్రాయుఁడై, యాత్మనిమగ్నుఁడై యుంట గ్రహించి, తోతాపురి నివ్వెఱఁగంది, 'ఇది నిజమా! నలువదిసంవత్సరములు నే నెంతో కష్టపడి సంపాదింపఁగలిగిన పరమార్థము నీతఁడొక్కదినములో సాధించెనా?' అని సంశయప్రేరితుఁడై శిష్యుని శరీరలక్షణములు మరల బహుజాగ్రత్తతోఁ బరిశీలించెను. హృదయము కొట్టుకొనుచున్నదా, అణుమాత్రమైన నూపిరియాడుచున్నదా, అని శవప్రాయమైయున్న శిష్యుని శరీరమును మరలమరల తాఁకిచూచెను. ప్రాణముగాని, స్మృతిగాని, యున్న సూచన లేమియు కనుపడవయ్యెను. ఆశ్చర్యచకితుఁడై 'ఏమిది! మహేంద్రజాలమువలె నున్నదే!'

అని విస్మయమును వెలిపుచ్చెను. నిస్సంశయముగా నద్వైత సాధనకుఁ బరమావధియగు నిర్వికల్పసమాధియే అది!

శిష్యుని మనస్సును మరల భౌతికప్రపంచమునకు దింపుటకై తోతాపురి వెంటనే యాగదిని 'హరిః ఓం, హరిః ఓం' అను గంభీరపవిత్రమంత్రనాదముతో మాఱు మ్రోఁగింపనారంభించెను. క్రొంచెక్రొంచెముగా శ్రీగురుదేవునకు బాహ్యప్రపంచస్మృతి కలిగెను. కనులు దెఱచి తనపై ప్రేమాదరదృష్టి నిగిడించుచుండిన గురునకు సాష్టాంగప్రణామ మాచరించెను. తోతాపురియు గాఢాలింగనరూపమున తన యత్యద్భుత శిష్యుని సత్కరించెను.

మూఁడునాళ్ల కెక్కువగా నెక్కడ నుండని తోతా పురి యా యపూర్వమహిమాన్వితశిష్యుని ప్రభావముచే ముగ్ధుఁడై, యాతని నద్వైతశిఖరమున సుస్థిరునిచేయఁదలఁచి ఆతనితో నాధ్యాత్మికప్రసంగములు చేయుచు దక్షిణేశ్వర ములో పదునొకండు నెలలు గడపెను!



## శ్రీ రామకృష్ణుని గురువులు

సిద్ధపురుషుఁడైనను తోతాపురి ధ్యానమందు చాల కాలము గడపువాఁడు. 'నాగ'సంప్రదాయపు సాధువు లందఱవలె నితఁడుకూడ నగ్నిని మహాపవిత్రముగఁ జూచుచు, అగ్నిప్రక్కఁ గూర్చుండియే ధ్యానస్థితుఁడగును. ఆతని యొద్ద నొక ఇత్తడి కమండలువు, ఇనుప పటుకాఱు, కృష్ణాజినము ఉండెడివి. కమండలువు నతఁడు ప్రతిదినము శుభ్రముగ తోముకొనుచుండును. అనుదినము ధ్యానము చేయుట చూచి "ఉత్తమజ్ఞానమును సాధించిన మీ రింతగా నేల ధ్యానము చేయుదురు?" అని శ్రీ గురుదేవుఁ డొకనాఁ డడిగెను. అందుపై నతఁడు తన కమండలువును చూపి, "చూచితివా, ఇదెంత ధగధగలాడుచున్నదో! ప్రతిదినము తోమనియెడల దాని మెఱుఁగు తగ్గిపోదా? మనస్సుకూడ నిట్టిదే. ధ్యానముతో దానిని ప్రతిదినము మెఱుఁగుపెట్టనిచో అదికూడ నపరిశుభ్రమగును" అని ప్రత్యుత్తరమిచ్చెను. ఆతనిమాట యథార్థమని యొప్పుకొనుచు, "నిజమే, కాని అది బంగారుపాత్రయైనచో ననుదినము తోమనక్కఱలేదు కదా!" అని శ్రీ గురుదేవుఁడు మరల నడిగెను. "ఔనౌను! నీవు చెప్పినది నిజము" అని తోతాపురి చిఱునవ్వుతో నొప్పుకొనెను. గురూదితమైన యీ సత్యమును శ్రీరామకృష్ణుఁడు బాగుగ జ్ఞప్తినుంచుకొని, ప్రతిదినము తప్పక యథావిధిగ ధ్యానముచేయుటవలన కలుగు లాభమును గూర్చి మున్ముందు తన శిష్యులతో తఱచు చెప్పువాఁడు. తోతాపురికూడ మేలిమిబంగారమువంటి శీలమును, మానసిక

ప్రవృత్తియుఁ గల తన శిష్యుని యాక్షేపమునుగూడ నిశ్లేష్టింపనుంచుకొనెనేమో!

తోతాపురి యుత్తమసంస్కారములతో జన్మించినవాఁడు. విశేషగురుభక్తితో సాధనలభ్యసించి కాలక్రమమున నిర్వికల్పసమాధిఁ బడసెను. అందుచే స్వయంకృషి వలననే మానవుఁడు తరింపఁగలఁడను దృఢవిశ్వాస మతనికిఁ గలిగెను. బ్రహ్మముతో నభేదప్రతిపత్తి కలిగి, యాయనకు నిత్యసహచారిణియై, యీ ప్రపంచమునంతయుఁ గీలుబొమ్మవలె నాడించు మాయయొక్క నిరంకుశప్రభావ మాయన కిసుమంతయైనఁ దెలియదు. శ్రీ గురుదేవుని సాంగత్యము వలన నీలోపము తొలఁగిపోయినది. మాయాప్రభావము నంగీకరించియే తీరవలెననియు, మాయయు, బ్రహ్మమును వాస్తవముగ నొకటేయనియు, నతఁడు గ్రహించెను.

సూర్యోదయసూర్యాస్తమయములందు చప్పట్లు చఱచుచు, నొక్కొకసారి యానందపారవశ్యమున నాట్యము చేయుచు, భగవన్నామసంకీర్తన మొనర్చుట శ్రీ గురుదేవునికి చిన్ననాఁటినుండియు నలవాటు. మఱియు 'హరియనరా, హరియనరా, హరియె గురుఁడురా, గురుఁడే హరిరా'— ఇట్టి కీర్తనలు బిగ్గరగా పాడువాఁడు. మహోన్నతకైవల్య సిద్ధి కలిగిన తరువాతకూడ నతఁ డిది విడువలేదు. ఒకనాఁడు తోతాపురితో నాధ్యాత్మికప్రసంగము చేయుచుండి, సాయంకాలముకాఁగానే వాడుకచొప్పున నాయన చప్పట్లుచఱచుచు, సంకీర్తనము చేయనారంభించెను. ముక్తజీవుఁడైన శ్రీ గురుదేవుఁ డిట్లొనర్చుటఁ జూచి తోతాపురి యాశ్చర్యపడి వికటముగా నవ్వుచు, 'ఏమిది? చెపాతీలు చఱచుచున్నావా?'

అని గేలిచేసెను. అందుపై శ్రీరామకృష్ణుఁడును నవ్వుచు 'ఏమి యవివేకము! భగవన్నామసంకీర్తనమును చెపాతీలు చేయుటతోనా పోల్చుట!' అని యాక్షేపించెను.

మఱియొకనాఁటి సాయంకాలము శ్రీ గురుదేవుఁడు అగ్నిప్రక్కనఁ గూర్చుండి గురువుతో వేదాంతచర్చ చేయుచుండఁగా తోఁటకాపరి యొకఁ డాయగ్నిలోనుండి హుక్కాకై యొక నిప్పు కణికను తీసికోఁబోయెను. తోతాపురి కోపోద్దీపితుఁడై, తిట్టిపోయుచు, పటుకాఱుతో కొట్టుదునని బెదరించెను. శ్రీ గురుదేవుఁ డసంపూర్ణశరీరస్మృతిలోనుండి, పట్టరాని నవ్వుతో, 'ఏమి చిత్ర, మేమిచిత్రము!' అని పలుసారులు పలికెను. శిష్యుని విపరీతప్రవర్తన కాశ్చర్యపడి, తోతాపురి 'ఏల నవ్వుచున్నావు? వీని ప్రవర్తనము మిక్కిలి నింద్యముకాదా' అని ప్రశ్నించెను. అందులకు శ్రీ గురుదేవుఁడు నవ్వుచు 'ఔను, గాని మీ జ్ఞానవికాసమునుకూడ పరికించుచుంటిని. బ్రహ్మ మొక్కఁడే సత్యమనియు, విశ్వమందలి సర్వమును ఆతని వ్యక్తస్వరూపమేయనియు, ఇప్పుడే చెప్పితిరి. ఉత్తరక్షణముననే అదెల్ల మఱచి యొకనినిఁ గొట్టఁబోయితిరి. మాయయొక్క అమోఘశక్తికి నవ్వుచున్నాను' అని బదులుచెప్పెను. ఈ మాటలనువిని తోతాపురి యాలోచనానిమగ్నుఁడై కొలఁదినిమిషము లూరకుండి "ఔను, నీవుచెప్పినది నిజమే. కోపవివశుఁడనై సర్వమును మఱచితిని. కోపము నిజముగ మానవునకు ప్రబలశత్రువు. ఇఁక నెప్పుడును కోపమునకు తావీయను" అనెను.

దురవగాహమాయాశక్తినిగూర్చి ప్రసంగించుచు "మాయవలలోఁ బడినయెడల బ్రహ్మముకైనను దుఃఖము

తప్పదు. కన్నులు మూసికొని 'ముల్లు అనునది లేదు, కావున గ్రుచ్చుకొనునదేదియులేదు' అని లోలోన తర్కించుకొనుట సులభమే. కాని చేతికి ముల్లు గ్రుచ్చుకొన్నచో, వెంటనే 'అమ్మా' యని బాధతో నఱతువు. ఇట్లే జననమరణములు, పాపపుణ్యములు, కష్టసుఖములు, క్షుత్పిపాసలు, మున్నగున వేవియు లేవనియు, నఖండసచ్చిదానందబ్రహ్మపదార్థమ వనియు భావించుకొనవచ్చును. కాని శరీరమున కేదైన బాధ కలుగనిమ్ము, లేక మనస్సు దురాశాగ్రస్తము కానిమ్ము, తత్ క్షణమే నీ యున్నతవేదాంతమునెల్ల మఱచి భ్రమలో పడి, తత్ఫలము లనుభవింతువు" అని ఆయన చెప్పవాఁడు.

ఈ సత్యమునే యాయన ఈ క్రింది దృష్టాంతమూలమున బోధించువాఁడు:—"సీతారామలక్ష్మణు లడవిలోఁ బోవుచుండిరి. ఆ కాలిబాట మిగుల నిఱుకు. ఒకరివెనుక నొకరే పోవలయును. రాముఁడు ధనుష్పాణియై ముందు, ఆయనవెనుక సీతామహాదేవి, ఆమెవెనుక ధనుష్పాణి లక్ష్మణుఁడు, నడచుచుండిరి. లక్ష్మణుఁడు శ్రీరామునందలి గాఢభక్తిచే నతని నెల్లప్పుడు చూచుచుండఁగోరును. సీత యడ్డుచే నతని హృదయము పరితపించును. ఇది యెఱిఁగి యామె జాలిపడి 'ఇప్పుడు చూడుము' అని అప్పుడప్పుడు ప్రక్కకు తొలఁగును. అప్పుడాయనకు శ్రీరామదర్శనము కలుగును. ఇట్లే జీవునకును భగవంతునకును నడుమ మాయాశక్తి, జగజ్జనని, కలదు. ఆమె దయతలఁచి తొలఁగినఁదప్ప జీవుఁడు భగవంతుని చూడలేఁడు. కావున నామెకృప లేనిచో, నిత్యానిత్యవస్తువివేచన మెంతచేసినను, లాభములేదు."

వజ్రకాయుఁడగు తోతాపురి వ్యాధియన నేమో యెన్నఁడు నెఱుఁగఁడు. కాని వంగదేశనివాసముచే నతనికి తీవ్రగ్రహణివ్యాధి సంభవించెను. రేయుంబవళ్లు కడుపులో నొకే దుర్భరబాధ. నిత్యానందస్థితి కలవడిన యతనిమనస్సు శాంతిఁ గోల్పోఁజొచ్చెను. కాని శరీరారోగ్యముకై శ్రీగురు దేవుని సహవాసభాగ్యమును గోల్పోవ నిష్టపడఁడయ్యెను. క్రమముగ వ్యాధి ముదిరి శరీరబాధ ఎక్కువయ్యెను. అందుచే వెళ్లవలెనను కోరికకూడ ప్రబలమయ్యెను. కాని శ్రీరామకృష్ణున కిది తెలుపుట కేవేవియో అంతరాయములు కలుగుచుండెను. శ్రీ గురుదేవుని కోరికపై మథురుఁ డాతనికి ఘనవైద్యులచే చికిత్సచేయించెను, గాని గుణము లేకపోయెను. ఇంత శరీరబాధలోఁగూడ సంకల్పమాత్రమునో నాముక్తపురుషుని మనస్సు నిర్వికల్పసమాధినొంది, బాధ నెల్ల మఱచి, సుఖముగ నుండెడిది.

ఇట్లుండ నొకనాఁటిరాత్రి బాధ బహుదుర్భరమై, పరుండినను, గూర్చుండిననుగూడ, నుపశాంతి లేకుండెను. అప్పుడతఁడు మనస్సును దేహమునుండి విడివడఁజేసి పరబ్రహ్మముపై నిలుప యత్నించెను. కాని దేహబాధ ఆ యున్నత స్థితికి మనస్సును బోనీయకుండెను. ఎన్నిసారులో యత్నించి, తుదకు దేహముపై రోఁతపుట్టి, "ఛీ, ఈ తుచ్ఛమైనట్టి దేహమువలననేకదా మనస్సుకూడ స్వాధీనము తప్పినది! నే నీ దేహమును కానను నిశ్చయజ్ఞానము కలిగియు, యీ తుచ్ఛవస్తువును బట్టుకొని వ్రేలాడుచు బాధపడనేల? దీనిని గంగలోఁ గలిపివైచి బాధ పాపుకొనెద"నని మనస్సును జాగ్రత్తగా పరబ్రహ్మస్థితము గావించి మెల్లగ నీటిలోనికి

దిగెను. కాని చిత్రము! ఆ రేయి గంగానది నిజముగ నెండి పోయెనా, మనోభ్రమమా? ఎంత లోపలికి పోయినను, తుదకు అవలియొడ్డుకూడ కనఁబడుచుండినను, మునుఁగు నంతటి నీరు లేదు! ఆ చీఁకటిలో నావలియొడ్డు చెట్లును, ఇండ్లును నీడలవలె గనఁబడుచుండెను. ఆతఁ డంతట నివ్వెఱ పాటుతో "ఏమి ఈ మాయ! నేఁడు నదిలో నేను మునిఁగి పోఁజాలినంత నీరుకూడ లేదే! ఏమి ఈ యద్భుత భగవ ద్విలాసము!" అని తలపోయ నారంభించెను. హఠాత్తుగా మనోనేత్రమునుండి యొక పొర యూడినట్లయ్యెను. మహా వైభవోపేతమగు దివ్యసాన్నిధ్య మతనికి ప్రత్యక్షమయ్యెను. ఈ యపూర్వ తేజము నెదుట నతని బుద్ధి మిఱుమిట్లుగొనెను. ఏవైపుచూచినను సర్వశక్తియగు జగన్మాతయే! నీటిలో నామె, నేలపై నామె; శరీర మామె, మానస మామె; దుఃఖ మామె, సుఖ మామె; జ్ఞాన మామె, అజ్ఞాన మామె; ఆమెయే జీవము, ఆమెయే మృతి. చూచు, విను, తలంచు, నూహించు, సర్వమున నాతఁ డామెనే కాంచెను. ఆవరణ విక్షేపము లామెయే. ఆమె కరుణించినఁగాని యే జీవియు నామె గీచిన గిఱిని దాఁటఁజాలఁడు. చివరకు మరణించుటకు కూడ స్వాతంత్ర్యము లేదు. ఇంతే కాదు. మనశ్శరీరముల నతిక్రమించుపిమ్మటకూడ నామెయే: ఆమె సర్వాతీత, నిత్య, భావమే యావజ్జీవము తా నెవరి నారాధించుచుండెనో, ఎవరికి తన పరిపూర్ణహృదయము సమర్పించెనో, ఆ పర బ్రహ్మముకూడ! బ్రహ్మమును శక్తియు నభిన్నము. ఒకే సత్పదార్థముయొక్క రెండు భావములు!

ఆ మహాప్రశాంతగంభీరనిశ్శాసమయమున తోతాపురి

భక్తిపూరితహృదయుఁడై శ్రీలోకేశ్వరియొక్క విశ్వవ్యాప్తిని గ్రహించి మరలమరల నామె పవిత్రనామమును స్మరింపఁ దొడఁగెను. ప్రేమమయమనస్సుతో నతఁ డామె పాద సన్నిధిని పరిపూర్ణాత్మార్పణము గావించికొని నీటిని దాఁటి దక్షిణేశ్వరము వచ్చెను. శరీరమం దింకను బాధ కలదు కాని, యది తోఁపకుండెను. పరాశక్తి సాక్షాత్కార మును మరలమరలఁ దలంచుకొనుచు, పులకితగాత్రుఁడై, మహానందముతో నతఁ డగ్నియొద్దఁ గూర్చుండి దేవీనామో చ్చారణధ్యానములతో మిగిలినరేయి గడపెను.

మఱునటి ప్రొద్దున శ్రీగురుదేవుఁ డతనిని విచారింప వచ్చినప్పు డాతఁడు పూర్తిగా మాఱిపోయియుండెను. మోమున నానందము తాండవించుచుండెను. శరీరమున వ్యాధిలక్షణమే లేదు. శ్రీగురుదేవుని తనప్రక్కఁ గూర్చుండఁ బనిచి, యాయన రాత్రిటి యుదంతము నంతయుఁ జెప్పి, "ఈ వ్యాధి నా కెంతయు నుపకరించినది. శ్రీ జగదీశ్వరి దర్శనభాగ్యము కలుగుటయే కాక, ఆమె కటాక్షముచే రోగముకూడ నివారణమైనది. అహా! ఎట్టి అజ్ఞానాంధకార ములో మునిఁగియుంటిని! ఇఁక వెళ్లుటకు మీ యమ్మగారి సెలవిప్పింపుము. ఈ సత్యము బోధించుటకే నన్నింతకాల మిచ్చట నుంచెనని నాకిప్పుడు తెలిసినది. పలుసారులు వెళ్లఁదలఁచి నీకడకుఁగూడ వచ్చితిని. కాని ప్రతిసారియు ఎవరో వచ్చి నిరోధించి, నా మనస్సు నితరవిషయములపై మరల్చినట్లుండెడిది" అని తనహృదయమును వెలిపుచ్చెను. అంతట శ్రీ గురుదేవుఁడు చిఱునవ్వుతో "అయ్యో, నే నెంత చెప్పినను మా తల్లిని నమ్మక, ఆమె మిథ్య యని

వాదించుచుంటిరే! ఆమె సత్యమని మీ కిప్పటికి బోధపడినది! అగ్నియు, దాని దహనశక్తియుఁ, బోలె బ్రహ్మమును, శక్తియు, నభేద్యములని శ్రీ విశ్వేశ్వరి నాకు చాలకాలము క్రిందటనే బోధించెను" అని చెప్పెను.

ప్రభాతార్చనా మధురగానప్రవాహము వాద్యమండపమునుండి బయల్వెడలుచుండఁగా, ఈ సాధుపుంగవులిరువురు శ్రీ కాళికాలయమునకు పోయి సాష్టాంగముగ దేవికి ప్రణమిల్లిరి. ఆ సమయమున నామె తోతాపురి ప్రయాణమును మనఃపూర్వకముగా అనుమతించినట్లు వారికిఁ దోఁచెను. కొలఁదినాళ్లలో తోతాపురి శ్రీ గురుదేవునికడ సెలవు తీసికొని దక్షిణేశ్వరము విడిచి వెళ్లెను.

శ్రీరామకృష్ణదేవుని యీ క్రిందిపలుకులలోఁ దోతాపురి దక్షిణేశ్వరములో నేర్చుకొనిన సత్యమిమిడియున్నది. "సృష్టి, స్థితి, లయ, రహితమగు నిష్క్రియాస్థితియందు భావించునప్పుడు పరమపురుషుని నేను బ్రహ్మమని, పురుషుఁడని, నిర్గుణుఁడని, చెప్పుదును. సృష్టి, స్థితి, లయ సహితమగు సక్రియావృత్తియందు భావించునప్పుడు శక్తి యని, మాయ యని, ప్రకృతి యని, సగుణుఁడని, చెప్పుదును. కాని, నిజమునకు, బ్రహ్మమునకును శక్తికిని, సగుణునకును నిర్గుణునకును భేదమే లేదు. ఇరువురు నొకరే. పాలు, పాలతెల్లదనమువలె: తెలుపును విడిచిపాలను తలంపఁజాలము. వజ్రము, వజ్రకాంతి వలె: వజ్రకాంతిని వదలి వజ్రమును తలంపఁజాలము. పాము, పాము వక్రగతివలె: ఈవిధముననే బ్రహ్మము, శక్తియు."

తాంత్రికసాధనాభ్యాసమున శ్రీరామకృష్ణుని గురువగు భైరవీబ్రాహ్మణి దక్షిణేశ్వరములో నున్నప్పుడే యాయన

సన్న్యాసాశ్రమ స్వీకారము. ద్వైతమతావలంబినియగు నా భక్తురాలి కద్వైతవేదాంతము, తత్సంబంధసాధనలు, నసమ్మతములు. శ్రీ గురుదేవుఁడు తోతాపురితో చనవుగా నుండుట గిట్టక, "నీ వాసాధువుతో తిరుగకుము; ఆతనిది శుష్కజ్ఞానపద్ధతి. ఆతని సహవాసముచే నీ భగవద్భక్తియు, ప్రేమయు, నశించును" అని యామె హితము చెప్పెను. కాని శ్రీ గురుదేవుఁడు పాటింపలేదు.

తోతాపురి వెళ్లిన పిమ్మట శ్రీ గురుదేవుఁడు బ్రహ్మైక్యానంద స్థితిలోఁ గొంతకాలముండ సంకల్పించి, తదనుగుణముగాఁ గార్యకలాపము నేర్పఱచుకొనెను. అప్పటి యాయన మానసస్థితి వర్ణనాతీతము. శరీరముగాని, తత్పోషణము గాని జ్ఞప్తిలో లేవు. 'నేను', 'నాది': 'నీవు', 'నీది': అను భేదజ్ఞానమే లేదు. ఆ యఖండతానుభూతిలో ఏకానేకభావములు నశించిపోయెను. ద్వంద్వ ప్రపంచమును దాఁటినందున బంధము లేదు, బంధవిమోచనకాంక్ష లేదు. మహత్తరమైన యా పరమసత్యమునందే నివసించుచుండి నందున మనస్సు యొక్కయు, నింద్రియముల యొక్కయు, ప్రేరణలు పూర్తిగ నిలిచిపోయినవి. అది అనిర్వచనీయమైన మహానంద స్థితి. అఖండబ్రహ్మ మొక్కటియే నిలిచినది. వ్యక్తిత్వమే లేదు. అయ్యది ఆత్మ పరమాత్మయందు లీనమై యుండుపట్టి అనంతనిశ్చలత్వము. శ్రీరామకృష్ణదేవుఁడు మహోన్నతాధ్యాత్మిక పరమావధిని జేరెను. అద్వితీయ పరబ్రహ్మముయొక్క అఖండవైభవస్వరూపము మానవులకుఁ గనఁబడకుండఁ గప్పియుంచు నాద్యంతసహితవస్తుజాలములు తనకు భిన్నములని గ్రహించి, వానితో సంబం

ధము లేకుండుట కాయన వినిర్మలచిత్త మప్పటికే అలవడి యుండుటచే, అద్వైతసిద్ధి యాయనకు నిరాయాసముగ లభించెను. ఆ స్థితిలో నాయన యాఱునెలలుండెను. ఈ కాలమునుగూర్చి ఆయన ఇట్లు చెప్పువాఁడు:—"ఆస్థితిలో నొక్కపట్టున నాఱునెల లుంటిని. మూఁడు వారములకే సామాన్యమానవుల శరీరములు నిర్జీవములగును. రేయుంబవళ్లు ఎఱుకయే లేదు. శవకళేబరమునందువలె నోటిలోను, నాసికారంధ్రములలోను ఈఁగలు దూఱుచుండెను. కాని ఆసంగతియే నాకు తెలియదు. తలలో ముఱికి పేరుకొని వెంట్రుకలు జడలుకట్టెను. దక్షిణేశ్వరములో నప్పుడు యాదృచ్ఛికముగా నుండిన యొక సాధువు దయతలఁచి పరిచర్యచేసియుండనియెడల ఈ శరీరము నశించియుండవలసినదే! ఆయన నా చిత్తవృత్తిని గనిపట్టి, ప్రపంచ మహోపకారముకై యీ శరీర ముద్దేశింపఁబడినదనియు, దీని నెట్లైన సజీవముగ నుంపవలెననియు, గ్రహించి వేళకు భోజనము తెచ్చి, నా మనస్సును ప్రపంచస్మృతికి దింపుట కనేక విధములఁ బ్రయత్నించువాఁడు. చివరకు కఱ్ఱతోఁగూడఁ గొట్టును. కొంచెము స్మృతివచ్చునట్లు కనఁబడిన వెంటనే కొంచె మాహారము నోటిలో గ్రుక్కును. అందు బహు స్వల్పభాగముమాత్రమే కడుపులోనికిఁ బోవును. ప్రయత్నములన్నియు విఫలములైన దినములుకూడఁ గలవు. ఈవిధముగ నాఱునెలలు గడచినవి. తుదకు 'లోకోపకారముకొఱకు ద్వంద్వప్రపంచద్వారమున నిలిచియుండు'మని జగన్మాత యాజ్ఞయైనది. పిమ్మట దారుణ గ్రహణిబాధతో మంచము పట్టి రేయుంబవళ్లు భరింపరాని కడుపునొప్పితో బాధపడితిని.

ఆ వ్యాధి ఆఱునెలలుండెను. దానిచే నా మనస్సు క్రమ క్రమముగా దిగివచ్చి శరీరస్మృతినిఁ బడసెను. నేనంతట సాధారణ మానవుఁడనైతిని. అంతవఱకు ప్రతిస్వల్పావకాశ మునకును మనస్సు ఱివ్వున నెగసి నిర్వికల్పసమాధినిమగ్న మవుచుండెడిది.''

ఈ కాలముననే మథురుని భార్య జగదంబదాసికి తీవ్రరక్తగ్రహణివ్యాధి కలిగి, యది యసాధ్యమని తీర్మా నింపఁబడెను. మథురుని మనోవ్యథకు మేర లేదు. ప్రియసతినిఁ గోల్పోవుటయుండఁగా, రాస్మణియొక్క యాస్తిపైఁ దనకుఁ గల పెత్తనముకూడ నంతరించు స్థితి దాపురింపఁబోయెను. ఇట్టి మనస్సంక్షోభముతో నతఁ డొకనాఁడు దక్షిణేశ్వరము వచ్చెను. శ్రీ గురుదేవుఁ డతనిని తనప్రక్కను కూర్చుండఁ బనిచి ప్రేమతో విచారకారణ మడిగెను. మథురుఁడు విషయముఁ దెలిపి ''నాకు రానున్న భార్యావియోగ కష్ట మటుండ, మిమ్ము సేవించు మహాభాగ్యముగూడ దీఱిపోవును'' అని విలపించెను. ఆతని దీనస్థితి కాయన మిగుల జాలిపడి, పారవశ్యావస్థలో ''విచారింపకుము, నీ భార్యకు వ్యాధి కుదురును'' అని అభయమిచ్చెను. ఈ మాటలతో నధీరత సమసిపోయి యాతఁ డిల్లుచేరెను. అప్పటికే జాడ్యము తిరుగు మొగము పెట్టియుండెను! గండము గడచెనని మథురుఁ డూఱడిల్లెను. కాలాంతరమున శ్రీ గురుదేవుఁ డీ విషయ మిట్లు చెప్పెను:—''ఆనాఁటినుండి జగదంబ మెల్లమెల్లగ నారోగ్యవతియయ్యెను. ఆ వ్యాధి ఈ శరీరమునకు (తన్నుద్దే శించుకొనుచు) మాఱినది. ఆమె రోగనివారణ ఫలితముగ నేను గ్రహణితోడను, ఇతరవ్యాధులతోడను, ఆఱునెలలు

బాధపడితిని. ఊరకే పదునాల్గుసంవత్సరములపాటు మథురుఁడంత మహా విశ్వాసముతో సేవించెనా? ఈ శరీర ముఖమున లోకేశ్వరి యాతని కిట్టి మహాద్భుతము లెన్నియో చూపెను.''

ఆఱునెలలకు శ్రీ గురుదేవుఁడు క్రమముగ ఆరోగ్య స్థితికి వచ్చెను. ఆ దివ్యమానస మిప్పుడు ద్వంద్వ ప్రపంచమునకును, ఇంద్రియాతీతస్థితికిని, గూడ ననుగుణముగఁ బ్రవర్తించు శక్తిని సంపాదించి, అద్వైతసిద్ధి ఫలితముగ నద్భుత వైశాల్యము నందెను. సర్వమతములును మానవహృదయ వికాసపరిపూర్ణతకొఱ కేర్పడిన వివిధమార్గములని అంగీకరింపఁజాలిన మహోదారస్థితికి వచ్చెను. దీనికొక నిదర్శన మాయన యీ కాలమున మహమ్మదీయమతసాధనకు పూనుకొనుట. దక్షిణేశ్వరమున కప్పుడొక మహమ్మదీయ ఫకీరు వచ్చియుండెను. ఇతని పేరు గోవిందరాయి. మొదట నితఁడు హైందవుఁడు, క్షత్రియుఁడు. తురుష్కమతములోఁ గల విశ్వ మానవసౌభ్రాత్రముచే నాకర్షింపఁబడి ఆ మతమును స్వీకరించిన భగవద్భక్తుఁడు. సుఫీశాఖకు చెందినవాఁడు కానోపును. విశాలహృదయయగు రాణిరాస్మణియొక్క ధర్మవిధానమున మహమ్మదీయభక్తులకుకూడ స్థానముండి నందున గోవిందునకు దక్షిణేశ్వరాలయోద్యానమున నివసింప సాధ్యమయ్యెను. ఆతని భక్తిశ్రద్ధలు శ్రీ గురుదేవుని శీఘ్రముగనే యాకర్షించెను. ఆతనితోఁ గలసిమెలసి తిరుగుచు, భగవంతునెడల నాతనికిఁ గల యసామాన్యభక్తిప్రేమల కానందించెను. ఇతరమతములవలెనే మహమ్మదీయమతము కూడ భగవత్సాక్షాత్కారము పడయుట కొక సాధనమని

యాయన విశ్వసింపసాఁగెను. ఆ సాధనయందు భగవంతుఁడు తనభక్తుల నెట్లు కృతకృత్యుల నొనర్చునో స్వయముగఁ జూడఁగోరి గోవిందునొద్ద నుపదేశమొందెను. ఈ విషయమునుగూర్చి యాయన ఇట్లు చెప్పువాఁడు:—"అప్పుడు నేను మహమ్మదీయులవలె బట్టకట్టుకొని 'అల్లా' నామస్మరణము చేయుచు, నియమముగ 'నమాజు' చేయువాఁడను. హిందూ మతసంబంధభావము లన్నియును మనస్సునుండి పూర్ణముగ తొలఁగిపోవుటయేకాక, హైందవ దేవతలకు నమస్కరించుటటుండ, వారిని జూచుటకుఁగూడ, నాకిష్టములేకుండెను. ఈ విధముగ మూఁడునాళ్లు గడచినతరువాత నేను మహమ్మదీయమతాదర్శానుభూతినిఁ బడసితిని. మొట్టమొదట పెద్ద గడ్డము, గంభీరమైన చూపులు, గల యొక తేజోమయ మానవమూర్తి కనిపించెను. అంత మనస్సు సగుణబ్రహ్మ సాక్షాత్కారద్వారమున నిర్గుణబ్రహ్మములో లీనమయ్యెను."

ఈ సాధనకాలమున శ్రీ గురుదేవుఁడు గోమాంసముతోఁగూడ. మహమ్మదీయులు తిను సకలభోజనపదార్థములు తినుటకు సంసిద్ధుఁడై యుండెననియు, మథురుని ప్రార్థనలవలన విరమించెననియు, హృదయుఁడు చెప్పువాఁడు. శిశుస్వభావుఁడగు నాయన తన కోరిక కొంతవఱకైనను తీరినఁగాని సంతృప్తినొందఁడని, మథురుఁడు పలురకముల భోజ్యము లొక తురుష్కుని సలహాప్రకారము బ్రాహ్మణులచేఁ జేయించి పంపువాఁడు. మహమ్మదీయ మతసాధనకాలమున నాయన దేవాలయావరణములో నెన్నఁడు నడుగు పెట్టలేదు! వెలుపలనున్న మథురుని గృహములో నివసించుచుండెను.

మహమ్మదీయమతసాధనమూలమున శ్రీ గురుదేవునకుఁ గలిగిన భగవత్ సాక్షాత్కారము హిందూదేశమున కత్యంత లాభకారి కావచ్చును. అద్వైతమతసాధనలో పరిపూర్ణతఁ గాంచిన పిమ్మటనే యాయన ఈ సాధనఁ బూనుకొనుటనుబట్టి, సకలమతమూలాధారమగు నద్వైత సిద్ధాంతమందు విశ్వాసము కుదిరినప్పుడే హిందూమహమ్మదీయుల కైకమత్యము కుదురుననుట స్పష్టము. వీరిరువుర కునుఁగల వివిధభేదముల కాయన మిక్కిలి చింతించువాఁడు. మహమ్మదీయమతసాధనయం దాయన విజయమొందుటచే నీ యుభయజాతులకుఁగల విభేదము లెప్పటికైన నంతరించి, సౌదర్యమును, ప్రేమసఖ్యభావములును, కలుగఁగలవను నాశ నిరాధారము కాదేమో!

గ్రహణివ్యాధివలనఁ గలిగిన శరీరదౌర్బల్య మింకను మిగిలియుండుటచే కొన్నాళ్లు స్వగ్రామములోఁ గడపఁదలఁచి శ్రీ గురుదేవుఁడు ప్రయాణసన్నాహములు చేసెను. సర్వ సౌకర్యములు మథురుఁడును అతని భార్యయు సమకూర్పఁగా, 1867–వ సంవత్సరము మేనెలలో నాయన హృదయుని తోడను, భైరవీ బ్రాహ్మణితోడను కామార్పుకుర్ కు బయలుదేఱెను. చంద్రాదేవి గంగా తీరమును విడిచివెళ్లుట కిష్టపడక దక్షిణేశ్వరములోనే మథురుని సంరక్షణక్రింద నివసించుచుండెను.

ఎనిమిదేండ్లైనతరువాత రానున్న శ్రీ గురుదేవునికై బంధువులును, స్నేహితులును, అపరిమితోత్సాహముతో నెదురుచూచుచుండిరి. ఒకప్పు డాయన శ్రీ వేదమూర్తి హరి నామ ముచ్చరించుచు నేడ్చుననియు, మఱొకప్పుడు సన్న్యాసి

వలె జీవించుచుండుననియు, మఱికొన్ని వేళల 'అల్లా' నామ స్మరణఁజేయుచు మహమ్మదీయునివలె నుండుననియు, పలు రకముల వార్తలనువిన్న ఆ గ్రామజను లాయనమానసికస్థితి విషయమై మిగులఁ గలవరపడియుండిరి. కాని శ్రీగురు దేవుఁడువచ్చి తమతో నివసింప నారంభించిన తరువాత, ఆయన మాటలలోఁగాని, చేష్టలలోఁగాని యున్మాదలక్షణము లెంతమాత్రము కనఁబడక పోవుటచే మనశ్శాంతినొందిరి. వారికి శ్రీ గురుదేవుఁడు పూర్వపు బాలగదాధరునివలెనే కనఁబడెను. అదే నిష్కాపట్యము, అదే ఉల్లాసస్వభావము, అదేసత్యసంధత, భగవన్నామస్మరణమాత్రముననే శరీరస్మృతిని గోల్పోవునదే పరిపూర్ణభక్తి! ఈ గుణము లెల్ల నెప్పటివలెనే చెక్కుచెదరక ప్రకాశించుచుండెను. కాని పూర్వమువలె జనులు చనవుగావచ్చి లౌక్యవిషయప్రసంగములు చేయుటను నిరోధించు నేదోయొక యసాధారణ దివ్యశక్తి మాత్ర మాయనయం దిప్పుడు క్రొత్తగా గోచరించెను. ఆ శక్తి వారి మనఃక్లేశములనెల్లఁ బాఱఁద్రోలి నిర్మలశాంతి సుఖములఁ జేకూర్పఁజాలియుండెను. ఏదియో యదృశ్యాకర్షణశక్తివలన వారాయన సాంగత్య మపేక్షించి యాయనకడ కెక్కువగ రానారంభించిరి. సూర్యోదయమునుండి రాత్రి చాలసేపువఱకు శ్రద్ధాళువులగు స్త్రీ పురుషప్రేక్షకులతో రామేశ్వరుని ఇల్లు నిండిపోవుచుండెను.

కామార్పుకర్‌లో నీవిధముగ నాఱేడునెలలు గడచెను. దక్షిణేశ్వరములోని తీవ్రతపఃక్లేశము పిమ్మట కామార్పుకర్‌లోని గ్రామజనుల సుఖదుఃఖములలోఁ బాల్గొనుటాయనకుఁగూడ నుపశాంతికరముగనుండెను. ఇప్పుడాయన

తన పూర్వస్నేహితులను, బరిచితులను, మానవజీవిత పరమావధి మార్గమునం బెట్టుచు, వారి కాత్మనిగ్రహమును, భగవదాయత్తబుద్ధిని నేర్పుచుండెను.

తన యాధ్యాత్మికానుభవముల యౌన్నత్యమును గ్రహింపఁగలవారు కొంద ఱా గ్రామస్థులలోనుండుటకు శ్రీ గురుదేవుఁ డాశ్చర్యపడెను. ఒకనాఁడు మధ్యాహ్నభోజనమైనతరువాత తనగదిలో కొందఱు స్త్రీలతో నాయన సంభాషించుచు సమాధిస్థితి నందెను. ఇట్టిస్థితిని వా రాయన బాల్యమునందే ఎఱిగియుండినవా రగుటచే ఇదియొక విశేషముగ గణింపక వారు యథాప్రకారము మాటాడుకొనుచునే యుండిరి. కాని, అందొక స్త్రీ "ఇప్పుడీమహనీయుఁడు బ్రహ్మానందసాగరములో మత్స్యమువలె నీఁదుచున్నాఁడు. మీ రాయన యానందమును భంగపఱుపకుఁడు" అని తన తోడివారల నెచ్చరించెను. ఆ మాటలు నమ్మకపోయినను వారు కొంతతడవు తమ ప్రసంగములు కట్టిపెట్టి యూరకుండిరి. మరల నాయనకు స్మృతివచ్చినపిదప నా స్త్రీ చెప్పినది నిజమా యని యడిగిరి. "ఔను. అంతయు నిజమే. కాని యామె కిది తెలియుట నా కాశ్చర్యముగనున్నది" అని యాయన చెప్పెను. కపటమెఱుఁగని యా గ్రామజను లాయనయెడ యథార్థప్రేమకలిగియుండిరి. స్త్రీలలోఁ జాల మంది మిఠాయీలర్పించువారు. ఇంటిపనులలో మునిఁగి యుండు స్త్రీలుకూడఁ గొన్ని నిమిషములు తీఱికచేసికొని వచ్చి యాయన సాన్నిధ్యభాగ్యము నొందువారు.

అప్పుడు శ్రీ గురుదేవుని భార్య శ్రీ శారదాదేవి (శ్రీరామకృష్ణ భక్తకోటిలో నామెకు 'మాతృదేవి'—

Holy Mother—అని పేరు) ఆమె పుట్టినిల్లగు జయరాం బాటిలో నివసించుచుండెను. ఇప్పుడామెకు పదునాలుగేండ్లు. భర్త నామె కడసారి చూచి యేడేండ్లైనది. అప్పుడామెకు చక్కఁగా బుద్ధి తెలియదు. ఇప్పుడామెను మరలతీసికొని వచ్చిరి. తీసికొనివచ్చు విషయ మెఱిఁగియు నాయన యూరకుండెను. వివేకవతియగు నా బాలిక భర్త చిత్తవృత్తిని త్వరలోనే గ్రహించి, యాయనను పరిపూర్ణభక్తిప్రేమలతో సేవింపఁ గుతూహలపడుచుండెను. త్రికరణశుద్ధిగా నాయన కాత్మార్పణము గావించికొని తన ఇహపరక్షేమముల కాయననే మార్గదర్శిగా నమ్మికొనెను. ఇట్టి దివ్యపురుషునితోఁ దన కభేద్య బంధము కల్పించిన దైవసంకల్పమున కామెనిష్కలంకబుద్ధి యెంతయు సంతసించెను. ఆయనకూడ తన మాత్నబాధ్యతను మనఃపూర్వకముగ గుర్తించి యామెకు సముచితశిక్షణ మిచ్చుటకారంభించెను. వివాహితుఁడనని గురువుతో నాయన చెప్పినప్పుడా గురు విట్లు బదులుపల్కియుండెను : "ఐననేమి? భార్యతో నివసించుచున్నను ఎవఁడు తన వివేకవైరాగ్యములను చెక్కు చెదరకుండ కాపాడుకొనునో, అతఁడే శాశ్వత బ్రహ్మజ్ఞాననిష్ఠుఁడు. ఎవఁడు, స్త్రీపురుషుల నిరువురను ఆత్మగనే భావించి, తదనుగుణముగ వారితోఁ బ్రవర్తించునో, అతఁడే పరిపూర్ణజ్ఞాని. స్త్రీపురుషభేదభావముగలవాఁ డుత్తమ సాధకుఁడు కావచ్చును కాని, పరమావధి కింకను దూరస్థుఁడే." తన సిద్ధత్వమును పరీక్షించుకొను నవకాశ మాయన కిప్పుడు దొరకెను. ధర్మబద్ధుఁడగు భర్త జీవితమున భార్యకుఁగల సుస్థిరపదవి నామె

యధీనముచేసి ప్రచండమగు నగ్నిపరీక్షకు లోనై, యందుఁ బరిపూర్ణ విజయము సాధించెను.

విధ్యుక్తధర్మముగఁ దోఁచిన కార్యములయెడ శ్రీ గురుదేవుఁ డెన్నఁడును జాగుచేయఁడు, వాని నసంపూర్ణముగను చేయఁడు. ఈ సందర్భమునకూడ నట్లే ప్రవర్తించెను. గృహము నిర్వహించుట, ధనము సద్వినియోగముచేయుట, సర్వావస్థలందును దైవమునే నమ్మి సందర్భోచితముగాఁ బ్రవర్తించుచుండుట, ఇట్టి యన్నివిషయములందు నామెకు సర్వతోముఖశిక్షణమీయ నారంభించెను. సాధుపుంగవుఁడైన భర్త తనకుఁగఱపిన వినిర్మల, స్వార్థరహిత, దివ్య ప్రేమాదర్శ మామెకు మిక్కిలి మనోరంజకముగా నుండెను. ఇష్టదైవముగా నాయనను పూజించుచు, ఆయన యడుగుజాడల ననుసరించి తన శీలము నాదర్శప్రాయముగాఁ జేసికొనుట తోనే యామె తృప్తివహించెను.

భైరవీబ్రాహ్మణి రామేశ్వరుని కుటుంబమువారితోఁ జనవుగ మెలఁగుచు నెల్లరిచే గౌరవింపఁబడుచుండెను. ఆధ్యాత్మికముగఁ జాల యౌన్నత్యము నొందినది నిజమేకాని, యామె ఇంకను పరిపూర్ణతనొందలేదు. తోతాపురి యొద్ద నద్వైతమతసాధన మభ్యసింపవలదని శ్రీ గురుదేవు నామె నిరుత్సాహపఱచుట కిదియే కారణము. తాంత్రికారాధకులలో నామె ఇంకను అగ్రతమమగు దివ్యసాధికాస్థానము నందలేదు. ఈర్ష్య, కోపము, మొదలగు క్షుద్రభావము లింకను కలవు. శ్రీ గురుదేవుఁ డితరభక్తునితోఁగాని, గురుపుత్రోఁగాని, మెలఁగుట నామె సైఁపఁజాలదు. బ్రాహ్మణి వంటి మహాభక్తురా లిట్టి యల్పభావములకు వశ్యురాలగుట

మిగుల చిత్రము. ఆయన ప్రేమాదరములు సుస్థిరములనియు, సామాన్య మానవులందువలె నవి యాటుపోటులొందవనియు, నామె యెఱుఁగును. కాని ప్రియునికి స్వేచ్ఛనీయని ప్రేమ స్వార్థపరమైనదని యెఱుఁగదు. యథార్థప్రేమ ప్రియుని హృదయమున శాశ్వతస్థానము నాక్రమించుకొనుటయే కాక, తన బంధములను, ప్రియుని బంధములనుగూడఁ, ద్రెంచివైచి, చివరకు భగవత్సాక్షాత్కారముగూడఁ జేకూర్చును.

నానాఁటికి బ్రాహ్మణి యహంకారము మెండగుచుండెను. శ్రీ గురుదేవునకు తానొక గురువుగనుండిన కారణమున తనకు మహోత్కృష్టత కలిగినదనియు తనమాట నందఱును తలఁదాల్పవలెననియు తలంచుచుండెను. శ్రీ గురుదేవుఁడు భార్యయెడల విధ్యుక్తధర్మములు నిర్వహించుట యామెకు గిట్టలేదు. ఇందువలన నాయన బ్రహ్మచర్య వ్రతమునకు భంగము కలుగునేమోయని యామె భయపడియుండవచ్చును. కాని యాయన ఆమె మాటను పెడచెవిని పెట్టెను. ఇది యామె కవమానకరముగ తోఁచుటయే గాక, యామె యహంభావమునుకూడ ప్రజ్వలింపఁజేసెను. ఇందుచే నామె యాయనను నిరసనభావముతోఁ జూడ నారంభించెను. తనసమక్షమున నెవరైన నొక యాధ్యాత్మిక విషయము చర్చించి దానిపై నాయన యభిప్రాయము గోరిన యెడల, "అతని నేల యడుగవలెను? ఆతని కన్నులు దెఱచినది నేనే కదా!" అని తనకోపమును వెలిగ్రక్కుచుండును. క్రమముగ నామె ముంగోపియై చీటికిమాటికి నింటిస్త్రీలను దూషింప మొదలిడెను. ఐన నాయన ఈ ప్రవర్తనచే నినుమంతయు చలింపక యామెను వెనుకటివలెనే గౌరవించు

చుండెను. ఆయన హితోపదేశముప్రకారము శ్రీ మాతృదేవి కూడ నామెన త్తగారుగనేభావించుచు, ప్రేమ గౌరవములతో సకలోపచారములుచేయుచు,నామెయాజ్ఞ నెఱవేర్చుచుండెను.

అహంకారము మితిమీఱినచో, బుద్ధినైర్మల్యము చెడి, ఎప్పుడును తప్పులకే దారితీయును. ఎన్నిసుగుణము లున్నను బ్రాహ్మణికి ఆత్మనిగ్రహము లేదు. ఒకనాఁ డామె హృదయునితో నిష్కారణముగ జగడము వేసికొనెను. శ్రీ గురుదేవుని బంధువులు కొందఱు చేరి యది పరిష్కరింప వలసివచ్చినది. మొట్టమొదట నామె యీ యవమానము నకు ఖేదపడెను గాని, కొంచెముసేపటికి తన తప్పు గ్రహించి లజ్జించెను. ఆ పశ్చాత్తాపస్థితిలో తా నిటీవలచేసిన తప్పులెల్ల గోచరింప, నాకుటుంబములో నిఁక నివసింపరాదని నిశ్చయించు కొనెను. శ్రీ గురుదేవునెడల తన కేర్పడిన యాసక్తి స్వర్ణ పాశమువంటిదనియు దానిని విడఁగొట్టుకొనవలెననియుఁగూడ గ్రహించెను. కొలఁదినాళ్లలోనే ఆమె మిక్కిలి శ్రద్ధాభక్తు లతో పుష్పమాలికలు కట్టి, వానితోడను చందనము తోడను శ్రీ గురుదేవుని గౌరాంగావతారముగా నలంక రించి, భక్తి వినయములతో క్షమాపణవేఁడికొని కామా ర్పుకుర్ విడిచివెళ్లెను. శ్రీ గురుదేవునిసన్నిధియం దామె యాఱు సంవత్సరములు నివసించెను. ఆ సాంగత్యమువలన నామె నేర్చుకొనిన గుణపాఠ మెన్నటికిని మఱవరానిది. ఆమె అచిరకాలముననే నుద్ధృతమనస్కయై, తన జీవిత శేషమును ప్రబలతర సత్యాన్వేషణమునఁ గడపెను.

కామార్పుకుర్‌లో నివసించుచుండిన కాలమున శ్రీ గురుదేవుఁ డప్పుడప్పుడు హృదయుని జన్మప్రదేశమగు శిహో

రునకు పోవుచుండెను. అట్టిసమయములందు హృదయుఁడు సుప్రసిద్ధవైష్ణవభక్తుల నాహ్వానించువాఁడు. వారాయనతో మతప్రసంగములు చేయుచుండువారు. హృదయునితల్లి హేమాంగినీదేవి యాయనను తన ఇష్టదైవముగ నెంచి, తత్పాదపద్మములను పుష్పములతో నెప్పుడును పూజించుచుండెడిది. ఒకనాఁడామె కాశీక్షేత్రమరణ మర్థించి వేఁడుకొనెను. అతీంద్రియ స్థితిలోనుండిన యాయనయు నావరమనుగ్రహించెను. ఆమె తుదివఱకు ప్రజ్ఞనుగలిగి కాశీలోనే మరణించెను!

కామార్పుకుర్ లో నించుమించుగ నాఱునెల లుండి పూర్ణారోగ్యముతో శ్రీ గురుదేవుఁడు దక్షిణేశ్వరమునకు తిరిగివచ్చెను. బర్ద్వాన్ సమీపమున నాయన రైలెక్క వలసియుండెను. కాని అచ్చట శివ ప్రీతికరములగు పత్ర పుష్పములుగల యొకజాతి చిన్నమొక్కల నొక వరిపొల మందుఁజూచి, ఆస్థల మపరిశుభ్రముగానున్నను అచ్చటనే కూర్చుండి, ఆ పత్రపుష్పములు తలపై నిడికొని శివధ్యానారూఢుఁడై ప్రయాణవుమాటను పూర్తిగ మఱచి, గాఢ సమాధి నిమగ్నుఁడయ్యెను. రైలుకు వేళ యగుటచే హృదయుఁడాయన నెత్తుకొని తొందరగఁబోయి బండినందుకొనెను. శుభ్రత, అపరిశుభ్రత, యను తారతమ్యమున కతీతుఁడైనప్పుడే సాధకుఁడు భగవత్సాక్షాత్కారము పడయఁగలఁడని శ్రీ గురుదేవుఁడు చెప్పువాఁడు. ఆ బోధ నాచరణ పూర్వకముగ నిట ఋజువుచేసెను.



## మథురానాథుని వ్యక్తివిశేషములు

"హృదయా! నా భార్య, బిడ్డలు, భాగ్యము, పదవి, తదితరమైన సర్వము నసత్యములు. రామకృష్ణుఁడొకఁడే సత్యము," ఈ మాటలలో మథురుఁడు తన హృదయప్రభు నెడల తనకుఁగల యగాధమహాభక్తిని వెల్లడించెను.

ఒక సంవత్సరము దుర్గాపూజాకాలమున విజయదశమి నాఁడు దేవి నుద్వాసనచేయు సమయమున కడసారి నమస్కారముచేసి పొమ్మని మథురునకు పురోహితుఁడు వార్తపంపెను. కాని యతఁడు మిన్నకుండెను. మరల మరల వార్త రాఁగా నతఁడు మండిపడి "ఇచ్చటినుండి దేవిని తీసికొనిపోనీయను. ఇచ్చటనే పూజ జరుగుచుండవలెను. ఇందుకు భిన్నముగ నెవరైనఁ బ్రవర్తింతురేమో, జాగ్రత్త" అని గద్దించెను. తుద కతనిభార్య శ్రీ గురుదేవుని కీ విషయము తెలిపెను. ఆయన వచ్చిచూచుసరికి మథురుఁడు వసారాలో నుద్రేకముతోఁ దిరుగుచు అమ్మ లేని బ్రతుకు దుస్సహము గావున నామెను గంగలోఁ గలపనీయ లేదని విన్నవించుకొనెను. ఆయనయుఁ జేతితో మథురుని ఱొమ్ము నిమురుచు "ఓహో! ఇదియా నీ భయము? కాని అమ్మను విడిచియుండవలెనని నీకెవరు చెప్పిరి? నీవు విగ్రహమును గంగలో కలిపినమాత్రమున నామె నిన్ను విడిచి పోవుననుకొంటివా? అమ్మ బిడ్డను విడిచి యుండఁగలదా? ఈ మూఁడునాళ్లు నిచట నీ బాహ్యారాధన నంగీకరించినది. ఇటుపై నింకను సన్నిహితయై, నీ హృదయ మందేయుండి, నీ పూజ నంగీకరించును" అని చెప్పెను.

ఆ దివ్యస్పర్శవలనను, భావగర్భితమైన యా మాటల వలనను, మథురుఁడు క్రమముగా స్తిమితపడెను. హృదయమున దేవి భాసిల్లుట గోచరించెనేమో, ఎవరికి తెలియును? ఎట్లైన నుద్వాసనమునకు సమ్మతించెను. గురుదేవుని ఈ యద్భుత హస్తస్పర్శశక్తి కాలాంతరమున పలుమాఱు విదితమయ్యెను. దీర్ఘవాదములు సాధింపఁజాలని పని నాయన చేతిస్పర్శ యొక్కటియే తెప్పపాటున సాధింపఁగలిగియుండెను. దానిచే శిష్యుని మనస్సునందలి యపరిశుద్ధత తొలఁగిపోయి, ఆ వినిర్మలదృష్టికి సత్యము గోచరించునని యాయన చెప్పెడువాఁడు.

మథురునకు శ్రీ గురుదేవునందుఁ గల ప్రబలవిశ్వాసమునకీ క్రింది సంఘటనము నిదర్శనము. అతఁడొకసారి తీవ్ర వ్రణముతో బాధపడుచు జాన్‌బజాఱులోని తనయింటిలో మంచముపట్టియుండెను. అతని కోర్కెపై శ్రీ గురుదేవుఁడు వచ్చి మంచముప్రక్క నిలుచుండెను. మథురుఁడు మిక్కిలి కష్టముతో లేచి కూర్చుండి, యాయన పాదధూళి నర్థించెను. "దానితో నీవేమిచేయుదువు? అది నీ వ్యాధిని కుదుర్చునా?" అని యాయన ప్రశ్నింప, "వ్రణమునకు వైద్యుఁడున్నాఁడు. ఈప్రపంచము విడిచి వెళ్లుముందు నారక్షకునియాశీర్వాదములు కావలయును" అని యతఁడు బదులుచెప్పెను. శ్రీ గురుదేవుఁడు వెంటనే అతీంద్రియస్థితి నొందఁగా, మథురుఁడు కన్నీళ్లు కాల్వలై పాఱ, తనశిరము నాయన చరణారవిందములపైఁ బరమభక్తితో నుంచెను. కొలఁదికాలముననే వ్యాధి నివారణమయ్యెను.

మథురునెడ తనకుఁగల దయార్ద్రదృష్టిని శ్రీగురుదేవుఁడతని కుమారునిపైఁగూడఁ బ్రసరింపఁజేసెను. ఒకనాఁడతీంద్రియానందస్థితిలో నతఁడు "నీవు జీవించునంతకాలము నేనిచ్చటనే యుందును" అని మథురునితోఁ జెప్పెను. ఈ భాగ్యము తన కుమారుఁడగు ద్వారకానాథున కెక్కడ లేకపోవునో యని భయపడి యతఁడు "బాబా! ద్వారికూడ మీయెడ పరమభక్తిభావము కలవాఁడేకదా!" అనెను. "మంచిది, అతఁడు బ్రతికియున్నంతకాలముకూడ నేనిచటనే ఉందును" అని యాయన మరలఁ జెప్పెను. వాస్తవముగా నాయన ద్వారకానాథుని మరణానంతరముననే దక్షిణేశ్వరము విడిచి వెళ్లెను.

శ్రీ గురుదేవునితో తన ప్రతి రహస్యము మథురుఁడెట్లు చెప్పుకొనువాఁడో, అట్లే ఆయనయు సమాధిస్థితిలో తప్ప ప్రతివిషయమునను బాలునివలె మథురుని సలహాను దీసికొనును. వారిరువురకును గల సంబంధము పరస్పర విశ్వాసముతో కూడుకొనినది. తన సాధనకాలమునందును, పిమ్మటను, తనకేమి కావలసినను ఆయన మథురునితోఁ జెప్పును. తన యున్నతధ్యానస్థితులలోఁ గలిగిన యనాధారణానుభూతుల నతనికిఁ దెలిపి, యతని యభిప్రాయము తీసికొనును. ఇంతేకాక, మథురుని ధనము సద్వినియోగమగునట్లుకూడఁ జూచుచుండెను. సర్వజ్ఞత్వముచే మహనీయుఁడు, నిష్కపటత్వముచే శిశుతుల్యుఁడు, నగు శ్రీ గురుదేవుని శరీరక్షేమభారము మథురుఁడు వహించి, తన యాధ్యాత్మికక్షేమభార మాయనపై వైచియుండెను. కాని ప్రాపంచికకష్టము లెదుర్కొనినప్పుడుఁగూడ, తన్నివారణకొఱ

కతఁ డాయన నాశ్రయించుచుండును. ఒకనాఁ డతఁడు తన కెదిరిపక్షపు జమీందారుని యనుచరులతోఁ దనపక్షమువారిని యథేచ్ఛగాఁ బోరాడ నాజ్ఞయిచ్చెను. ఈ పోరాటములోఁ గొందఱు మరణించిరి. దీనివలని యపాయము నెఱిఁగి యతఁడు శ్రీ గురుదేవునికడకు తొందరగాఁ బరుగెత్తికొని వచ్చి, యభయ మర్థించెను. మొదట నాయన యతనిని తీవ్రముగా మందలించి "దుర్మార్గుఁడా! ప్రతిదినము నేదో కష్టము తెచ్చిపెట్టుకొని సాయముకొఱకు నాకడకు వచ్చుచుందువు! నే నేమి చేయఁగలను?" అని పలికెను. కాని మథురుఁడు విడువలేదు. చివరకు "అమ్మ సంకల్ప మెట్లున్నదో అట్లగును" అని శ్రీ గురుదేవుఁ డానతిచ్చెను. మథురుఁడు తప్పించుకొనెను.

శ్రీ గురుదేవుఁడు సంకల్పమాత్రమున నెట్టి మహాద్భుత కార్యమైనఁ జేయఁగలఁడని మథురున కిప్పటికి సంపూర్ణ విశ్వాసము కలుగుటచే సమాధి సుఖానుభూతిఁ బ్రసాదింపుఁ డని ప్రార్థించెను. "కాలక్రమమున నీ యంతట నీవే యాస్థితి ననుభవింపఁ గలవు; ఇప్పుడు నీ విహపరసుఖములను రెండింటి ననుభవించుచున్నావు. నీ కా స్థితి వచ్చెనేని నీ జమీందారీని చక్కఁగా నిర్వహించుకొనఁ జాలవు. సర్వమును తాఱుమాఱగును" అని యాయన బదులుచెప్పెను. కాని మథురుఁడు పట్టుపట్టెను. అందుపై నాయన "సరే! అమ్మనడిగెదను. ఆమె యిష్టము వచ్చినట్లు చేయును." అని చెప్పెను. కొన్నాళ్లకు మథురుఁడు తన జాన్‌బజారు గృహములో భావ సమాధిస్థితిని బడసి, తన జమీందారీవ్యవహారములు చూచుకొనఁజాలక పోయెను. ఆ కారణముగ నతఁ డొకప్పుడు

పాడును, మఱొకప్పుడాడును. ఒకప్పుడు నవ్వును, మఱొకప్పు డేడ్చును. అతని బంధువు లీమార్పునకు కారణ మూహింపలేక, వైద్యులకుఁజూపిరి. కాని చికిత్స నిష్ప్రయోజనమయ్యెను. తుదకు మథురుఁడది వ్యాధికాదనియు, శ్రీగురుదేవునకు వర్తమాన మంపినచో సర్వమును చక్కఁబడుననియుఁ జెప్పెను. శ్రీగురుదేవుఁడు వచ్చెను. ఈ విషయమును గుఱించి యాయన ఇట్లు చెప్పువాఁడు: "నాకొఱకు కబురంపిరి. నేను పోయి చూడఁగా మథురుఁడు విచిత్రస్థితిలో నుండెను. కన్ను లెఱ్ఱవాఱియుండెను. భగవంతుని గూర్చి మాటాడునప్పుడు చెక్కిళ్లపై కన్నీరు ప్రవహించుచుండెను. ఱొమ్ము దడదడలాడు చుండెను. నా పాదములు గట్టిగాఁ బట్టుకొని అతఁడు 'బాబా! క్షమింపుఁడు. మూనాళ్లనుండి యీస్థితిలో నున్నాను. ఎంత ప్రయత్నించినను వ్యవహారములపైకి మనస్సుపోదు. సర్వమును తాఱుమాఱైనది. దయచేసి మీభావమును మీరే తీసికొనుఁడు. నా కిఁక వలదు' అని వేఁడుకొనెను. 'నేను ముందే చెప్పలేదా? నీవేకదా బలవంతపెట్టినది?' అని నేనంటిని. 'నిజమే. కాని, ఇది పిశాచమువలె నిట్లావేశించి వివశు నొనర్చునని నా కప్పు డెట్లు తెలియును?' అని యతఁడు బదులు చెప్పెను. అంత చేతితో నతని ఱొమ్ము నిమురఁగా నతఁడు స్తిమితపడెను."

ఆధ్యాత్మికస్థితుల ఢాకకుఁ దాళుటకు సాధకుఁడు కొంత శిక్షణ మొందియుండవలెను. నిర్మలహృదయుఁడై, స్వార్థవాంఛారహితుఁడై యుండవలెను. కానిచో నవి నిలుకడగా నుండవు, అనర్థములనుగూడఁ గలిగించును. కనుక నత్యా

వశ్యకములైన మనోనిగ్రహ పవిత్రశీలాదులందు సత్యా న్వేషణపరుఁడు జాగరూకుఁడై యుండవలెను.

మథురుఁడు శ్రీగురుదేవుని సుఖజీవనమున కేదైన శాశ్వ తాధారముకల్పింపఁగోరెను. కాని యాయన యపార వైరాగ్య మీ సంకల్పమున కడ్డువచ్చెను. చంద్రాదేవి దక్షిణేశ్వర మున నున్నప్పుడది యాడేఱఁగలదని తలఁచి, యొకనాఁ డా మెను మీ ఇష్టము వచ్చినదేదైన కోరుఁడని బలవంతపెట్టెను. ఆమె యాశ్చర్యపడి, కోరఁదగిన దేదియు తోఁపక, "నాయనా! నీ విదివఱకే నాకెట్టిలోటును లేకుండ చేసితివి. ఇంకను ఏమైన కావలసియున్నప్పుడు చెప్పెదను. నాకు చాలి నన్ని బట్టలిచ్చితివి. కావలసినంత భోజనమున కేర్పాటు చేసితివి. నా కింకేమి కావలసియుండును?" అని చెప్పెను. కాని యేదేని పుచ్చుకొనవలెనని యతఁడు పట్టుపట్టెను. ఆమె మరల నాలోచించి, చిట్టచివరకు "ఏమైన నీయక తప్పనిచో, ఒకయణాపెట్టి పొగాకు తీసికొనిరమ్ము. పండ్లు పొడి చేసికొందును" అని చెప్పెను. ఈ యత్యద్భుత విస్పృహతఁ జూచి, మథురుఁడు కన్నీటితో నామెకు నమస్క రించి 'శ్రీరామకృష్ణునివంటి సర్వసంగపరిత్యాగి నిటువంటి తల్లికాక మఱెవ్వరు కనఁగలరు?' అని తలఁచెను.

మథురునితోఁగూడి శ్రీరామకృష్ణుఁ డిద్దఱు భక్తులను దర్శించెను. వారిలో ఆదిబ్రాహ్మసమాజస్థాపకుఁడగు దేవేం ద్రనాథఠాకూ రొకఁడు. "దేవేంద్రనాథఠాకూరు భగవ ద్ధ్యానశీలుఁడఁట! అతనిని చూడఁగోరుదును" అని యాయన మథురునితోఁ జెప్పెను. మథురుఁడు, దేవేంద్ర నాథుని సహాధ్యాయి గనుక నాతనియొద్ద కేగుట కతఁడు

నిరభ్యంతరముగా సమ్మతించెను. ఒకనాఁడు హృదయునితో వారిరువురును ఠాకూరుకడ కేగిరి. అతనికిఁ బారమార్థికానుభూతి లక్షణము లెంతమాత్రము కలవోయని శ్రీగురుదేవుఁడతని యంగీపై కెత్తించిచూడఁగా, వక్షఃస్థలము రక్తవర్ణముతో దీపించుచుండెను. ఈ సమావేశమును గుఱించి శ్రీ గురుదేవుఁ డిట్లు చెప్పువాఁడు: "మొదట నతఁడు కొంచెము గర్విగా కనిపించెను. భాగ్యపాండిత్యములు, పరువు ప్రతిష్ఠలు, నపారముగాఁగల యతనికది సహజమేకదా! అట్లు తలపోయుచు మథురునితో నిట్లంటిని: 'అహంకారమునకు మూలమేది? విద్యయా, అవిద్యయా? బ్రహ్మసాక్షాత్కారమును బడసినవాఁడు తన భాగ్యపాండిత్యాదులకై గర్వించునా? దేవేంద్రునితోడి ప్రసంగమధ్యమున, మనుష్యహృదయాంతరాళమును బ్రత్యక్షముగాఁ జూడఁగల యొక యద్భుత మనఃస్థితి నన్నున్నట్లుండి యావేశించినది. ఆ మనఃస్థితిలో మహాపండితులుకూడ, వివేక వైరాగ్యరహితులైన యెడల, నా కంటికి గడ్డిపరకలవలెఁ గనుపడుదురు. నాలో పట్టరాని నవ్వు పొంగిపొరలుచుండెను. అతఁడు ప్రాపంచికసుఖముల ననుభవించుచు పారమార్థికపథము ననుసరించుచుండుటఁ జూచితిని. చాలసంది లేఁబ్రాయపు బిడ్డలు కలవాఁడగుటచే నతఁడు మహాజ్ఞానియయ్యును, లౌకిక ప్రవర్తనము నంగీకరింపవలసిన వాఁడయ్యెను. "నీవు కలియుగ జనకుఁడవు. ఆయనవలెనే నీవును ప్రాపంచికసుఖములనుభవించుచునే మనస్సు నెల్లప్పుడును భగవంతునిపై నిలిపియుంతువని విని నిన్ను చూడవచ్చితిని. ఈశ్వరుని గుఱించి యేమైన చెప్పుము" అంటిని. అంత నతఁడు వేద

ములలోఁ గొన్నిపన్నములు చదివి, ఇట్లనెను : "ఈ ప్రపంచము వేయివత్తుల దీపస్తంభమువంటిది. ఇందుఁగల ప్రతి జీవియు నొకదీపమువంటివాఁడు." పంచవటిలో ధ్యానము చేయుచుండి నేను నొకసారి ఇట్టిదృశ్యమునే చూచియుంటిని. అతనిమాట నా యనుభవమునకు సరిపోవుటచే నతఁడు మిక్కిలి మహనీయుఁడని యూహించి, దానిని విపులముగా బోధింపుమని యడిగితిని. అందుపై నతఁడు 'ఈ ప్రపంచము నెవరు తెలిసికొనఁగలరు ? భగవంతుఁడు తన మహత్త్వమును లోకమునకుఁ బ్రకటించుటకై మానవుని సృజించెను. దీపస్తంభములో దీపములు లేనిచో సర్వమును నంధకారబంధురమై యుండును. దీపస్తంభముకూడ కనఁబడదు!' అని చెప్పెను. మేము చాలసేపు మాటాడితిమి. అతఁడును సంతసించి తమసమాజవార్షికోత్సవమునకు నన్నాహ్వానించెను. 'అదియెల్ల దైవసంకల్పమునుబట్టియుండును. మీరు నాస్థితి చూచుచున్నారుకదా! అతఁడు నన్నేకాలమున నెట్టి స్థితిలో నుంచునో తెలియదు' అని నేను చెప్పఁగా 'అట్లు కాదు. మీరు తప్పక రావలెను. కాని దోవతి కట్టుకొని ఉత్తరీయము గప్పుకొని రావేడెదను. మీ వేషము నెవరైన నాక్షేపించినచో నాకు కష్టముగా నుండును' అని ప్రత్యుత్తరమిచ్చెను. 'అది యసంభవము. నేను బాబువేషము ధరింతునా' అని యంటిని."



## తీర్థ యాత్ర

మథురుఁడును, అతనిభార్యయు నుత్తరహిందూస్థానమున తీర్థయాత్ర కేర్పాట్లుచేసికొని తమతో శ్రీగురుదేవుని గూడఁ దీసికొనిపోయిరి. వెంటవచ్చిన శతాధికపరివారములో హృదయుఁడొకఁడు. వైద్యనాథసందర్శనార్థము దేవఘరులో మొదట నాఁగిరి. చేరువనున్నయొక గ్రామమునఁ బోవుచు శ్రీగురుదేవుఁ డా గ్రామజనుల దుఃస్థితినిజూచి చాల విచారించి మథురునితో నిట్లు చెప్పెను: 'నీవు అమ్మ రసద్దారువు. ఈ బీదల కొకనాఁడు బాగుగా నన్నము పెట్టి వారి కొక్కొక్కరి కొక బట్ట నిమ్ము'. ఇంతమంది కన్నము పెట్టి బట్టలిచ్చినచో ప్రయాణమునకే ధనము చాలకపోవునని మథురుఁడు చెప్పెను గాని యా దయానిధి వారి ఘోరదారిద్ర్యమును జూచి సహింపఁజాలక కన్నీరు విడుచుచు, "ఛీ! నేను కాశికి రాను! వీరితో నిచటనే యుండెదను" అని యల్లరిబాలునివలె మథురునివిడిచి వెళ్లి వారి నడుమ కూర్చుండెను. ఆ కరుణాతిశయము చూచి మథురుఁడు కలకత్తానుండి వెంటనే బట్టలు తెప్పించి వారందఱికిని సంతర్పణచేసి, బట్టలు పంచిపెట్టెను. శ్రీ గురుదేవుఁడంతట సంతోషముగా కాశికి పయనమయ్యెను.

శివునకు నిత్యనిలయమును, భారతదేశమందలి పవిత్ర క్షేత్రములన్నిటికన్న పవిత్రమైనదియు, నగు కాశికాక్షేత్రము శ్రీ గురుదేవునకు దృగ్గోచరమయ్యెను. అప్పుడాయన గంగానదిలో పడవమీఁదనుండెను. శాస్త్రములలోఁ జెప్పఁబడిన

ట్లాపుణ్యక్షేత్ర మాయనకంటికి బంగారముతోఁ గట్టఁబడి నట్లె యుండెను. అనాదిగా నచ్చటి కేతెంచుచుండిన సాధువులయొక్కయు, భక్తులయొక్కయు, అమూల్య దివ్య భావము లచ్చట కరుడుకట్టి దానిని దేవతావాసయోగ్య ముగఁ జేసిన ట్లాయనకు గోచరించెను. నిజమైన కాశి ఘనీభవించిన యాధ్యాత్మికసారము. చర్మచక్షువులకుఁ గనఁబడు కాశి దాని నీడమాత్రమే. ఈ దివ్యదృశ్య మాయన మనస్సున గాఢముగా నాటినందున శాస్త్రీయముగ కాశీనగరి పొలిమేరలలో నొకటగు అసీనదిని దాటి గాని ఆయన మొదట కొన్నినాళ్లు మలమూత్ర విసర్జనము చేయకుండెను.

శ్రీ గురుదేవుఁ డనుదినమును హృదయునితోఁగూడి విశ్వనాథేశుని సందర్శించుచుండెను. స్వామిసన్నిధినే కాక, దారిలోకూడ నాయన సమాధిస్థితుఁడగుచుండును. కేదారనాథుని యాలయములో నాయన సమాధి బహుగాఢముగా నుండెడిదఁట.

శ్రీ గురుదేవుఁడు కాశిలో సుప్రసిద్ధులైన యనేక సాధువులను సందర్శించెను. నానక్ పంథీల మఠమునకు వెళ్లి వారి విశేషభక్తికి సంతసించెను. మఱియొకనాఁ డాయన సుప్రసిద్ధుఁడగు త్రైలింగస్వామిని దర్శించెను. ఆయన మౌనవ్రతము పూనియున్నందున శ్రీ గురుదేవుని గూర్చుండుమని సంజ్ఞ చేసి, స్వాగతచిహ్నముగ తన పొడుముపెట్టె నిచ్చెను. ఈ సందర్శనమునుగుఱించి శ్రీ గురుదేవుఁ డిట్లు చెప్పువాఁడు: "ఆయనయందు శ్రీ విశ్వనాథుఁడు సజీవముగ ప్రత్యక్షమైనట్లు నాకుఁ దోఁచెను. ఆయనయునికిచే కాశి పవిత్రమైనది.

ఆయన శరీరభావ మినుమంతయు లేని మహోన్నతప్రజ్ఞాస్థితి యందుండెను. అప్పు డాయన యెండలో మాడిపోవుచున్న యిసుకపై ననాయాసముగఁ బరుండియుండెను. భగవంతుఁ డొకఁడా, పలువురా యని నేను సంజ్ఞచేసి యడుగ, నాయనకూడ నభినయముల మూలముగా సమాధిస్థితిలోఁ జూచినప్పు డొక్కఁడనియును, ద్వంద్వతాదృష్టిలోఁ జూచి నప్పుడు పలువురనియును, ప్రత్యుత్తరమిచ్చెను. ఆయనను హృదయునకుఁజూపి "ఇదియే నిజమగు పరమహంస స్థితి" యని చెప్పితిని. త్రైలింగస్వామి అప్పుడు మణికర్ణికయొద్ద నొక స్నానఘట్టము గట్టించుచుండెను. శ్రీ గురుదేవుని యాజ్ఞచే హృదయుఁ డా కట్టడపుపనికై కొన్నివారల మన్ను త్రవ్వెను. ఇందుల కా స్వామి మిగుల సంతసించెను. ఒక నాఁడు శ్రీ గురుదేవుఁడు స్వామిని మఠపురునింటికిఁ బిలిపించి యధికభక్తిశ్రద్ధలతో నాదరించెను.

కాశిలోఁ దాను చూచిన యొక యద్భుతదృశ్యమును గూర్చి శ్రీ గురుదేవుఁడు తన శిష్యులతోఁ దఱచు చెప్పు వాఁడు. ఒకనాఁ డాయన పడవపై మణికర్ణికమీఁదుగాఁ బోవుచుండెను. అచ్చట ననేకశవములు దహింపఁబడు చుండఁగా చూచి యాయన యానందపారవశ్యమునఁ బడవ యంచుకు వచ్చి సమాధినిమగ్నుఁడయ్యెను. త్రోవచూప వచ్చిన పురోహితుఁడును, పడవవాండ్రును ఆయన నదిలో పడిపోవునేమోయని ముందుకువచ్చి భద్రముగాఁ జూచు చుండిరి. కాని, ఆయన కేవలము నిశ్చేష్టుఁడై దివ్యదరహాస కాంతులు వెదచల్లు మోముతో నిలుచుండియుండినందున, వారు చేయవలసినదేమియు లేక అట్లే చూచుచుండిరి.

మథురుఁడును, హృదయుఁడును, సిద్ధముగా ప్రక్కను నిలువఁబడియుండిరి. కొన్నినిమిషము లీరీతిని గడచిన తరువాత శ్రీ గురుదేవుఁడు క్రమక్రమముగా సామాన్యశరీరస్మృతికి వచ్చెను. అప్పుడాయన తనకు కనఁబడిన దృశ్యమునుగుఱించి ఇట్లు చెప్పెను: "పొడవరియు, పల్లవారుణజటాధారియు, శ్వేతవర్ణుఁడు, నైన యొక పురుషుఁడు ప్రతిచితి కడకునుఁబోయి నెమ్మదిగా నందలి జీవునిఁ బైకెత్తి, చెవిలో మహామంత్రము నుపదేశించుచుండినట్లు నాకుఁ గనఁబడెను. దయాస్వరూపిణి యైన శ్రీ విశ్వేశ్వరి కాష్ఠమున కావలిప్రక్కఁ గూర్చుండి, యా జీవుని బంధముల నొక్కొక్కటిగా నన్నిటిని తీసివేసి, స్వయముగా నిర్వాణద్వారమును దెఱచి యా భాగ్యజీవుని కైవల్యస్థితి కంపుచుండెను. ఎన్నోయుగముల ధ్యానతపస్సులచే సాధింపఁదగు అద్వైతానుభూతి, శివుని యనంతదయా విశేషమువలన కాశిలో మరణించువారికి సులభముగఁ గల్గుచుండును." అందఱు నిది విని యాశ్చర్యపడిరి. మథురునితో వచ్చిన పండితులు "కాశిలో మరణించినవారికి శివుఁడు నిర్వాణపదవి నిచ్చునని కాశీఖండమందున్నది గాని ఇచ్చువిధ మచ్చట స్పష్టపఱుపఁబడలేదు. మీ దృశ్యము దాని నిప్పుడు విశదపఱచినది. శాస్త్రములలోఁగూడ స్పష్టపఱుపఁబడని వివరములు మీకుఁ బ్రత్యక్షానుభూతములగుట ఆశ్చర్యకరము" అని పలికిరి.

కాశిలో నొకవారముండి వారందఱును ప్రయాగకుఁ బోయి యచ్చటి పవిత్రమైన గంగాయమునాసంగములో స్నానముచేసిరి. మథురుఁడును, తదితరులును, ఆ క్షేత్రపు సంప్రదాయమున కనుగుణముగా వపనము గావించుకొనిరి.

శ్రీ గురుదేవుఁడుమాత్రము తనకది అనావశ్యకమని చెప్పెను. ప్రయాగలో మూఁడునాళ్లుండి అందఱును కాశికి తిరిగివచ్చిరి.

కాశిలో నొకపక్షముండి, బృందావనము వెళ్లిరి. శ్రీకృష్ణలీలలచేఁ బునీతమైన యీ దివ్యక్షేత్రమందు శ్రీ గురుదేవుఁ డెంతయు నుత్సాహముగ నుండెను. అచ్చట తనకుఁ గలిగిన యనుభవముల నిట్లు చెప్పువాఁడు: "బంకువిహారిని (శ్రీకృష్ణుని కొకపేరు) జూచినవెంటనే నేను భక్తిపరవశుఁడనై యాతనిని గాఁగిలించుకొనుటకు పరుగెత్తితిని. గోవిందుని చూచి యంతగా పరవశుఁడను గాలేదు. కాళియదమన ఘట్టమును జూచినతోడనే పరమానందపరవశుఁడ నగుటచే, పసిబిడ్డనివలె హృదయునిచే స్నానముచేయించుకొనువాఁడను. సాయంకాలవేళల యమునానదీసైకతములపై నడయాడుదును. అచ్చట పెద్ద రేఁగుచెట్లును, మధ్యమధ్య పర్ణకుటీరములును గలవు. ఒక సాయంకాలము యమునానదిలో నీఁదుకొని ఆవు లిండ్లకు వచ్చుటను, వాని వెనుక గోపబాలకులు వచ్చుటను, చూచితిని. వెంటనే శ్రీకృష్ణుఁడు జ్ఞప్తికివచ్చి, భావపరవశుఁడనై 'ఆహా! కృష్ణుఁడేడీ! కృష్ణుఁడేడీ!' అని వెఱ్ఱిగా కేకలువేసితిని. శ్యామకుండమును, రాధాకుండమును, చూడవలెనని కోరిక గలిగి యొక నాఁడు పల్లకీలోఁ బోయితిని. త్రోవలో గోవర్ధనపర్వతము నొద్ద దిగి, అపరిమితోత్సాహముతో దాని శిఖరమునకుఁ బరుగిడిపోయి అచ్చట శరీరస్మృతిని గోల్పోయి నిలువఁబడితిని. అచ్చటి జనులు మరల నన్ను సామాన్య మానసికస్థితికిఁ గొనివచ్చిరి. శ్యామకుండమునకును, రాధాకుండమునకును, బోవు మార్గములో శ్రీకృష్ణుని బాల్యక్రీడలెన్నిటికో ఆటపట్టు

లగు పచ్చికబయళ్లలోని చెట్లను, మొక్కలను, పక్షులను, లేళ్లను, జూచి మనస్సు పట్టఁజాలకపోయితిని. కన్నీరు జలజల ప్రవహించి బట్ట తడిసిపోయెను. కృష్ణా! నీ సహవాసభాగ్యముచే పవిత్రమైన ప్రతిదియు నిచ్చట కలదు. నీవుమాత్రము కనఁబడకున్నావు! అను విషాదభావము నా మనస్సు నావహించెను. పల్లకీలోఁ గూర్చుంటిని కాని, యొక్కమాటైన పలుకు శక్తి లేదు. హృదయుఁడు పల్లకీ వెనుక వచ్చుచు కూలివాండ్రను బహుజాగరూకులై యుండుఁడని హెచ్చరించుచుండెను. నేను బోయీలతో పల్లకీ ఆఁపుఁడని చెప్పఁజాలని స్థితిలో నుంటిని. శ్యామకుండమునొద్దను, రాధాకుండము నొద్దను, సాధువులు పర్ణకుటీరముల నేర్పఱచుకొని వెలుపలి జనులు తమకగపడకుండుటకై ద్వారమువైపు వీపులుమరల్చి సాధనలోనుండుచుండిరి.

బృందావనములో గంగామాతయను నొక వైష్ణవ భక్తురాలిని శ్రీ గురుదేవుఁడు సందర్శించెను. ఈమె మహోన్నతాధ్యాత్మికసిద్ధు లొందినదని ప్రఖ్యాతి. శ్రీ రాధాదేవి కామె నెచ్చెలికత్తెయనియును, దివ్యప్రేమరహస్యములు జనులకు బోధింప మరల నవతరించెననియును, అచ్చటివారి నమ్మకము. అప్పటి కామె కఱువదేండ్లుండును. జీవితములో చాలభాగమామె రాధాజన్మస్థానమగు వర్షాణా గ్రామమందుఁ గడపెను. ప్రథమదర్శనముననే శ్రీ గురుదేవుని మహత్త్వమును గ్రహించి, యాయనదర్శనముచే ధన్యురాల నైతినని తలంచెను. ఆమెభక్తిని, పవిత్రతను, జూచి శ్రీ గురుదేవుఁడుకూడ నానందించెను. ఆమెను గూర్చి శ్రీ గురుదేవుఁ డిట్లు చెప్పువాఁడు: "గంగామాయి నన్నెంతో

శ్రద్ధతోఁ జూచుచుండెను. ఆమె కడు వృద్ధురాలు. నిధువన మునొద్ద నొక కుటీరములో నామె యొంటిగా నివసించుచుండెను. ఆమె నా స్థితిని, సమాధ్యవస్థలో నాశరీరవిస్మృతిని, జూచి 'నిస్సంశయముగా రాధయే మరల నిట్లవతరించినది' అని చెప్పెను. నన్ను దులాలి (రాధకు ముద్దుపేరు) యని పిలుచును. ఆమెతో నున్నంతకాలము నే నన్నపానములుగూడ మఱచుచుందును. కొన్ని దినములు హృదయుఁడచ్చటికే నా కన్నము దెచ్చి పెట్టును. గంగామాయికూడ నాకొఱ కనేకపదార్థములు చేయును. ఆమె పలుమాఱు సమాధిస్థితినందెడిది. ఆమెను విడిచిపెట్టి వచ్చుటకు నాకు మనస్సు రాకుండెను. నే నచ్చటనే యుండుటకు సర్వమును సిద్ధపఱుపఁబడెను. నా కుప్పుడుబియ్యము * వండునట్లేర్పాటు. గదిలో నొకచివరను గంగామాయియును, మఱియొకచివరను నేనును, పరుండవలె ననుకొంటిమి. ఈ ప్రకారము సర్వము సిద్ధమయ్యెను. అప్పుడు హృదయుఁడు "నీకు జీర్ణకోశవ్యాధులు వచ్చునప్పుడు నిన్ను చూచువా రెవరు?" అని యడిగెను. "అన్ని యుపచారములు నేనే చేసెదను" అని గంగామాయి చెప్పెను. ఈవిధముగ హృదయుఁ డొకచేతిని, గంగామాయి రెండవచేతిని, బట్టుకొని నన్నులాగిరి! ఆసమయమున దక్షిణేశ్వరమం దొంటిగ నివసించుచున్న మాతల్లిమాట జ్ఞప్తికివచ్చినది. నేను బృందావనములో నాఁగిపోయినయెడల నామెను జూచువారెవ్వరు? దీనితో సమస్యాపరిష్కారమైనది. తప్పక వెళ్లవలెనని చెప్పితిని."

---

* ఆయనకు జీర్ణశక్తి లోపించియుండెను. అందుచే పచ్చిబియ్యపుటన్న మఱుగదు.

బృందావనములో నుండినప్పుడు శ్రీ గురుదేవుఁడు వైష్ణవవేష మవలంబించెను. మథురలో ధ్రువఘట్టమును జూచినతోడనే యాయనకు వసుదేవుఁడు శిశుకృష్ణుని చేతులలో నెత్తుకొని యమునానది దాఁటుచుండిన ట్లొక దృశ్యము కనఁబడెను.

బృందావనములో నొకపక్షమునాళ్లుండి యందఱును కాశికి తిరిగివచ్చిరి. తన తాంత్రిక గురువగు భైరవీబ్రాహ్మణి నాయన యచ్చట దర్శించెను. ఆమె మఱియొక వృద్ధ స్త్రీతోఁగూడ నొక ఘట్టముకడ నివసించుచుండెను. శ్రీ గురుదేవుఁడు పలుసారు లామెకడకుఁ బోయి, యామె స్నేహితురాలి భక్తిని మెచ్చుకొని, జీవితాంతమువఱకును బ్రాహ్మణిని కాశిలో నుండుమని చెప్పెను. కొలఁదికాల మైన తరువాత నామె స్వర్గస్థురాలయ్యెను.

కాశిలో శ్రీ గురుదేవుఁడొకసారి వీణాగానము వినఁ గోరి మహేశచంద్రసర్కారను నొక వీణాగాన విశారదు నింటికిఁబోయి వీణాగానము చేయుమని కోరెను. కాని ప్రథమస్వరములు వినినంతనే సమాధిగతుఁడయ్యెను. కొంచెము స్మృతి వచ్చినతరువాత 'అమ్మా, వీణాగానము వినఁ గుతూహలముగానున్నది. నాస్మృతిని హరింపకుము' అని దేవిని ప్రార్థించెను. పిదప పరిపూర్ణస్మృతితో వినుచు, తానుగూడ నప్పుడప్పుడు పాడుచు, మూఁడుగంటలు సుఖముగాఁ గడపి ఫలాహారానంతర మింటికివచ్చెను. అప్పటి నుండి మహేశుఁడు ప్రతిదినము వచ్చి శ్రీ గురుదేవుని సందర్శించుచుండెను.

తిరుగు ప్రయాణములో మథురుఁడు గయాక్షేత్రము సందర్శింపఁ గోరెను గాని, శ్రీ గురుదేవుఁ డచ్చటికి రానను టచే నాయుద్దేశము వదలుకొనెను. తన జననసందర్భముల నెఱిఁగినవాఁ డగుటచే గయాక్షేత్రమును సందర్శించినయెడల తన చిత్త మచ్చటి దేవునియందు శాశ్వతముగా లీనమైపోవు ననియు, భౌతికప్రపంచమునకు దిగిరాఁజాలడనియు నాయన నమ్మకము. తాను జగన్మాత చేతిలోని సాధనమాత్రుఁడ ననియు, నామె సంకల్ప మీడేర్చుటకు తన శరీరమింకను ప్రపంచములో నుండవలసి యున్నదనియు, నాయనకు స్పష్టముగాఁ దెలియును. కనుక వా రందఱును కలకత్తాకు తిరిగి వచ్చిరి.

బృందావన పవిత్రధూళి నొక పిడికెడు శ్రీ గురుదేవుఁ డింటికిఁదెచ్చి కొంత పంచవటిలోఁ జల్లి తక్కినది తన సాధన కుటీరములో పాతిపెట్టి "ఇప్పటినుండి ఈస్థలము బృందావన మంత పవిత్రమైనది" అనెను. కొలఁదికాల మైనతరువాత ఆయనకోరికపైని మథురుఁడు వైష్ణవసమారాధన చేసి, సమృద్ధిగా దానములిచ్చెను.



## హృదయుఁడును, అక్షయుఁడును

హృదయుఁడు కేవలము లౌకికుఁడు. కుటుంబశ్రేయమును బెంపొందించికొని సాధ్యమైనంతవఱకు సుఖముగా జీవించుటే యతని పరమార్థము. దక్షిణేశ్వరములో శ్రీ గురుదేవునితోఁ గలసి యనేకసంవత్సరములుండి ఆ మహాద్భుత జీవితపరిణామములు కన్నులారఁ జూచియుఁ, బుట్టుకతో వచ్చిన లౌకికవిషయాసక్తతవలన వాని నవగాహన చేసికొనఁ బాటుపడలేదు. కాని తీర్థయాత్రనుండి మరలివచ్చిన పిదప భార్యావియోగముకలిగి, దృక్పథము మాఱి, మిగుల భక్తితో దేవిని పూజించుచు, పరమసత్యమును సాధించు శక్తి ననుగ్రహింపుమని శ్రీ గురుదేవుని బలవంతపెట్టసాఁగెను. ఇట్టి సాధన లేమియులేక కేవలము తన్ను సేవించుచుండిననే సర్వము సిద్ధించునని ఎంతచెప్పినను తృప్తినందలేదు. అంత నాయన "సరే, అమ్మ సంకల్ప మెట్లున్నచో అట్లు జరుగును" అని చెప్పవలసివచ్చెను.

అచిరకాలముననే హృదయునకు దివ్యదృశ్యానుభూతులు గలుగ నారంభించెను. ధ్యానార్చనల సమయములం దతఁడొకప్పుడు కొంతవఱకు శరీరస్మృతినికూడ వీడుచుండెను. ఈ విషయమై మథురుఁడడుగఁగా శ్రీ గురుదేవుఁడు "ఈ స్థితుల నతఁడు నటించుటలేదు. దివ్యదృశ్యానుభూతులిమ్మని పూర్ణహృదయముతో దేవిని ప్రార్థించినందున, అవి కలుగుచున్నవి. కొలఁదికాలములో దేవియే యాతని చక్కచేయును" అని చెప్పెను. "కాదు, బాబా! ఇదంతయు

మీ పనియే. నే నెఱుఁగుదును. మీ రిప్పు డితనిని సామాన్య స్థితికిఁ దీసికొని రావలెను. అట్లైన మే మిరువురమును మిమ్ము సేవింపవచ్చును. ఇట్టి యాధ్యాత్మిక స్థితులు మావంటివారికిఁగావు" అని మథురుఁడు నవ్వుచు ప్రత్యుత్తర మిచ్చెను.

ఇట్లు కొలఁదికాల మైనపిదప, ఒక సాయంకాలము శ్రీ గురుదేవుఁడు పంచవటివైపు పోవుచుండఁగా, తనసాయ మాయన కవసరమగునేమోయని హృదయుఁ డనుసరించెను. హఠాత్తుగా నతని కొక చిత్రదృశ్య మగపడెను. తన మేనమామ సామాన్యమనుష్యుఁడు కాక, దిశలఁ గ్రమ్ము తేజస్సుతో వెలుఁగు శరీరముతోను, భూమి నంటని పాద ములతోను, కనఁబడెను. భ్రమయని కనులు నులుముకొని మరలఁ జూచెను. గంగానదియును, ఇండ్లును, చెట్లును, ఎప్పటివే. కాని ఆయనమాత్ర మా దివ్యరూపముతో నొప్పు చుండెను. అంత నతఁడు తనలోఁగూడ నేదేని మార్పు కలదేమోయని చూచుకొఁగా, తనకును తేజోమయశరీర మున్నట్లును, ఇందుకుఁ గారణము తా నా దివ్యపురుషునకు శాశ్వతపరిచారకుఁ డై నందున తదంశమైన తా నాతని సేవకై వేఱురూపము ధరించియుండెనేమోయనియు, తోఁచి, యాశ్చర్యానందపరవశుఁడై, ఉద్రేకముతో "రామకృష్ణా! మనము మనుష్యులముకాము. ఏల యిచ్చటనున్నాము? లోకమెల్ల తిరిగి జనులను దుఃఖవిముక్తులఁ జేసి రక్షింతము. రమ్ము. నీవును నేనును అభిన్నులము!" అని మైమఱచి, బిగ్గ రగా మరలమరల నఱచుచుండెను. శ్రీ గురుదేవుఁ డా కేకలను విని, "ఊరుకో! మన కేమి విపత్తు సంభవించినదని నీ వట్లఱచు

చున్నావు? ఏదో విశేషము జరిగినదని తలఁచి, జనులు మూఁగెదరు" అని మందలించినను హృదయుఁ డూరకుండఁ డయ్యెను. అంత, శ్రీగురుదేవుఁ డతని జొమ్మును తాఁకి, "అమ్మా, ఈ మూఢుని నోరుమూయుము" అని ప్రార్థించెను. వెంటనే హృదయుని యానందమంతయు మాయము కాఁగా, నతఁడు నిస్తేజుఁడైన పతితదేవతవలెఁ బరితపించి యేడ్చుచు నాయనతో మొఱపెట్టుకొనెను. "ఒక స్వల్పదృశ్యమునకే ఇంత గందరగోళము చేసితివి. నే నెల్లప్పు డనేక దివ్యదృశ్యములు చూచుచుందును. ఈ విధముగ నట్టహాస మెన్నఁడైన చేసితినా? వానినిఁ జూచుటకు నీ కింకను అర్హత రాలేదు. ప్రస్తుత మూరకుండుము. సకాలమున నిట్టివాని ననేకములు చూతువు" అని యాయన యూరడించెను.

హృదయుఁడు తాత్కాలికముగా నుపశమిల్లినను, లోలోపలఁ జాల నొచ్చుకొని, తీవ్రకృషి వలన నిట్టి యనుభూతులు మరల సాధింప సంకల్పించి, ధ్యానప్రార్థనములం దెక్కువ కాలము గడపుచు, పూర్వము శ్రీరామకృష్ణుఁడు ధ్యానము చేయుచుండినచోటనే దేవిని ప్రార్థింపవలెనని తలఁచి, యొక నడిరేయి శయ్యవదలి పంచవటికిఁ బోయి ధ్యానార్థము శ్రీగురుదేవుని యాసనమధిష్ఠించెను. ఆ సమయముననే శ్రీగురుదేవునకుఁగూడ నచ్చటకుఁ బోవలెనని బుద్ధి పుట్టి, యటకుఁ బోవుచుండఁగా, "అయ్యో! మామా! కాలిపోవుచున్నాను. వచ్చి రక్షింపుము!" అను హృదయుని యార్తనాదము విని, తొందర తొందరగా నటకుఁ బోయి 'ఏమి జరిగిన'దని యడిగెను. "ధ్యానము చేయువాఁడనై

ఇచ్చటఁ గూర్చుండిన వెంటనే ఎవరో నా శరీరముపై నిప్పుల పళ్లెరమును గ్రుమ్మరించినట్లయ్యెను. అయ్యో! ఈ బాధ దుస్సహము!'' అని చాల వేదనతోఁ గొట్టుకొనుచుఁ బ్రత్యుత్తరమిచ్చెను. శ్రీ గురుదేవుఁడు చేతితో మెల్లగా నతని దేహమును తాఁకి, ''బాధ శమించును. కాని ఏల యిట్లు చేసితివి? నన్ను సేవించిన, సర్వమును లభించునని నేను చెప్పలేదా?'' అనెను. శ్రీ గురుదేవుని యద్భుతకరస్పర్శ వలన తన బాధయెల్ల తత్క్షణమే తొలఁగెనని హృదయుఁడు చెప్పువాఁడు. మేనమామ మాట దాఁటుట శ్రేయస్కరము కాదని యతని కిప్పటికి నమ్మకము గలిగెను. పిదప నతఁ డెన్నఁడును ధ్యానముకొఱకు పంచవటికిఁ బోలేదు.

1868-వ సంవత్సరములో హృదయుఁడు స్వగృహమున దుర్గాపూజ నడుపవలెనని తలపెట్టెను. శ్రీ గురుదేవుఁడు తాను రాఁజాలనని చెప్పి యిట్లనెను: ''విచారపడకుము. నేను సూక్ష్మశరీరమున ప్రతిదినమును నీ యింట నుండి, నీ పూజను చూచుచుందును. నీ వొకఁడవే నన్ను చూడఁ గలవు.'' హృదయుఁడు సంతోషముతో ఇంటికిఁ బోయెను. పూజ మూఁడునాళ్లును దేవీ విగ్రహముప్రక్కఁ దేజశ్శరీరముతో మేనమామ వచ్చి నిలిచియుండుటఁ జూచి అతఁ డెంతయు నానందించెను. పూజ పూర్తియైన పిమ్మట తిరిగి వచ్చి శ్రీ గురుదేవునితో జరిగినదంతయుఁ జెప్పఁగా, ఆయన, ''ఔను. సాయంకాలసేవాసమయములను, మరల 'సంధి' పూజాసమయమునను నీ పూజను చూడవలెనని కోరిక కలుగఁగా సమాధ్యవస్థలో నొక తేజోమయమార్గమున దేదీప్య

మానశరీరముతో నీ మంటపముకడకు తీసికొనిపోఁబడితిని”
అని చెప్పెను.

రామకుమారుని ఏకైకపుత్త్రుఁడగు నక్షయుఁడు పసినాఁడే తల్లిని కోల్పోవుటచే నింటిలో గారాబముగాఁ బెంపఁబడెనుగదా! అప్పుడు శ్రీగురుదేవుఁడుకూడ నతనిని మిగులఁ బ్రేమించి, ఎత్తుకొని ముద్దాడువాఁడు. క్రమక్రమముగా అక్షయుఁ డెదిగి, పెద్దవాఁడై, హలధారి స్థానమున దక్షిణేశ్వర రాధాకృష్ణాలయార్చకత్వములోఁ బ్రవేశించెను. బాల్యమునుండియు నతఁడు శ్రీరామచంద్రుని నపారభక్తితో గంటలకొలఁదియర్చించువాఁడు. కాన దక్షిణేశ్వరములోనిపని యతని కెంతయు ననుకూలముగ నుండెను. పూజాకాలమున నతఁడు ధ్యాననిమగ్నుఁడై ప్రేక్షకుల యునికిఁగూడ నెఱుంగఁజాలకుండెను. అత్యంతకఠోరసాధనకారణమున నొకొక్కప్పుడు కంఠమునుండియు, నంగిటినుండియు, రక్తము వెలిచిమ్మెడిది. ఈ గాఢభక్తివిశ్వాసములచే నతఁడు శ్రీగురుదేవున కెంతయుఁ బ్రియుఁడయ్యెను.

1869–వ సంవత్సరములో నతనికి వివాహమైనది. పిమ్మట నతఁ డత్తవారింటికిఁ బోయి యచ్చట మిక్కిలి జబ్బుపడి, కొన్నాళ్లకు కోలుకొనెను. కాని దక్షిణేశ్వరము నకు వచ్చిన పిదప జబ్బు తిరుగబెట్టెను. వైద్యు లది యపాయకరముకాదనిరి గాని, మూఁడునాలుగు నాళ్లైనను జ్వరము తగ్గకుండుటఁజూచి, శ్రీగురుదేవుఁడు “వైద్యులు పొరపడినారు. ఇది విషజ్వరము. నీ సంతృప్తికొఱకు మంచి వైద్యులకు చూపుము. కాని బాలుఁడు బ్రదుకఁడు” అని

హృదయునితోఁ జెప్పెను. "పాపము శమించుఁగాక! ఇట్టి యపశకునపు మాటలు పలుకుదురా మామా!" అని హృదయుఁడనెను. ఇందులకాయన, "అవి నా మాటలా? అమ్మయే నాచే నట్లు పలికించెను. అక్షయుఁడు మరణించుట నాకు మాత్ర మిష్టమా?" అని ప్రత్యుత్తర మిచ్చెను. హృదయుఁ డెంతి ప్రయత్నముచేసినను వ్యాధి ప్రబలమయ్యెను. మరణ కాలమున శ్రీ గురుదేవుఁ డతని శయ్యాప్రక్కను నిలువఁబడి రామనామ ముచ్చరింపు మనెను. ఆ ప్రకార మక్షయుఁడు రామనామమును మూఁడుసారు లుచ్చరించి ప్రాణములు వదలెను. ఈ విషయమును గుఱించి శ్రీ గురుదేవుఁ డిట్లు చెప్పెను: "అక్షయుఁడు నా కండ్లయెదుటనే మరణించెను. అందులకై నే నెంతమాత్రమును విచారింపలేదు. ప్రక్కను నిలిచి మనుష్యు లెట్లు మరణింతురో చూచితిని. ఒరలోనుండి కత్తిని పైకితీయునట్లుండినది. ఈ దృశ్యము చూచి నే నప్పుడానందమున నవ్వుచు, పాడుచు, నాట్యము చేసితిని. కాని మఱునాఁడు అక్షయుని మరణముకై నాకు చెప్పరాని దుఃఖము కలిగినది. నే నాశ్చర్యపడి విశ్వేశ్వరి నాకు బుద్ధిచెప్పుచున్నదని తలంచితిని. ఆ శరీరపతనము కాదు నన్నట్లు కలంచినది; సోదరుని కుమారుఁడగుటకూడ కానేకాదు. 'నాబోటివానికే ఇట్టి మరణము దుర్భరమైనచో బంధునష్టమునకు గృహస్థు లెంత దుఃఖింతురో కదా!' అను తలంపే నన్నంతగాఁ గలంచినది."



# మధురానుస్మరణము

కలకత్తాలో కలుటోలాయందు కాళీనాథదత్తుని యింటిలో వైష్ణవభక్తులు సమావేశమై హరినామ సంకీర్తనమందును, శాస్త్రపారాయణమందును, కాలము గడపువాఁడుక. అందు 'చైతన్యాసన' మను నొక పీఠముండును. వారి యిష్టదైవమగు చైతన్యదేవుఁ డా యాసనము నధిష్ఠించి, సభల నాశీర్వదించుచుండునని వారి విశ్వాసము. ఆ భక్తుల కోరికపై శ్రీ గురుదేవుఁ డచ్చట కొకపరి వెళ్లెను. అప్పుడట భాగవతపారాయణము జరుగుచుండెను. సభ్యులెల్లరు శ్రద్ధగ వినుచుండిరి. భక్త్యావేశకరములగు కొన్ని శ్లోకములు విని శ్రీ గురుదేవుఁడు చైతన్యాసనముకడకుఁ బరుగిడి గాఢసమాధిస్థితుఁడై దానిపై నిలువఁబడెను. చిత్తరువులలోఁ గానిపించు చైతన్యదేవునివలె నీయనయుఁ జేతులెత్తుకొని యాడెను. మనోహరమగు చిఱునగవు మోమునఁ దాండవించుచుండెను. ఆయన దేశకాల నిమిత్తముల కతీతమగు సమాధిస్థితియం దుండుటఁగాంచి వారును మంత్రముగ్ధులవలె చేష్టలుదక్కి యాయనను ఱెప్పవాల్పక చూచుచుండిరి. అతిఛాందసులుకూడ నది యపవిత్రకార్యమని యధిక్షేపింపలేరైరి. ఆనందాతిశయమున నెల్లరు నుచ్చైస్స్వరముతో హరినామసంకీర్తనము నారంభించిరి. ఆ గానామృతమహిమచే నాయన మనస్సు క్రమముగ బాహ్యస్మృతికి వచ్చె, తానుకూడ నొకొక్కప్పుడు బహురమణీయముగ నృత్యము చేయుచు, మఱొకప్పుడు దివ్యభావపరవశుఁడై చేష్టలుడిగి

నిలువఁబడుచు, నాసంకీర్తనములోఁ బాల్గొనెను. సభా సమాప్తి పిమ్మట కొంత కలవరము బయలుదేఱి, శ్రీ గురుదేవుని చర్యను కొందఱు ఖండించిరి.

అటుపిమ్మటఁ గొన్నాళ్లకు శ్రీ గురుదేవుఁడు చైతన్య జన్మస్థానమగు నవద్వీపమునకు మధురా హృదయులతో బయలుదేఱి దారిలో కాల్నాయొద్ద భగవాన్‌దాస్ బాబాజీ యను నొక విఖ్యాతవైష్ణవసాధకుని దర్శించుటకై ఆఁగెను. మధురుఁడు బసవిచారించుచుండఁగా శ్రీ గురుదేవుఁడు హృదయునితో బాబాజీకడకు వెళ్లెను. తనకపరిచితులగు సుప్రసిద్ధ పురుషులయెదుటఁ బడునప్పు డాయనకు శిశువువలె లజ్జించుటయు, జంకుటయు, నలవాటు. ఇప్పుడు నట్లే జరిగెను. ముందు హృదయునిఁ బంపి తాను శరీరమునిండ బట్టకప్పుకొని కొంత వెనుకగా వచ్చుచుండెను. బాబాజీదగ్గఱకుఁ బోయి హృదయుఁడు నమస్కరించి, తనమేనమామ భగవన్నామ శ్రవణ మాత్రమున భక్తిపరవశుఁ డగుననియును, బాబాజీ దర్శనార్థమాయన వచ్చెననియును జెప్పెను. ఏదియో తప్పు చేసిన యొకవైష్ణవుని నడవడికి బాబాజీ మిగులఁ గోపించి, యతనిని సంఘమునుండి వెలివేయుట కుత్తరువు చేయుచుండఁగా, శ్రీ గురుదేవుఁడు గదిలోనికిఁ బ్రవేశించి నమ్రతతో నమస్కరించి యొక మాఁటుమూలను గూర్చుండెను. బాబాజీ ప్రతినమస్కారముచేసి కుశలమడిగెను. భగవాన్‌దాసు జప మాలికను త్రిప్పుచుండుటచూచి, హృదయుఁడు "అయ్యా, మీరేల యిప్పటికిని జపముచేయుచున్నారు?" సిద్ధపురుషులైన మీకిఁక జప మక్కఱలేదు కదా" అని యడిగెను. "నామట్టు కనవసరమే. కాని, ఇతరులకు మార్గదర్శకముగా

నుండుటకు నే నిట్లు చేయుచుందును. అట్లు కానిచో వారు నన్ననుకరించి చెడిపోవుదురు'' అని బాబాజీ ప్రత్యుత్తర మిచ్చెను.

శ్రీ రామకృష్ణుఁ డీక నూరకుండలేకపోయెను. పసిబిడ్డవోలె సర్వమునకును దేవిపై నాధారపడువాఁడుగనుక, ఇతరులందుఁగూడ నహంభావ ప్రవర్తనము, అహంభావ సంభావణము నాయన సహింపఁజాలఁడు. స్వవిషయమునఁ గూడ భగవత్సేవకుఁడను నర్థమునఁ దప్ప నుత్తమపురుషము నే వాడఁడు. అందుచే నహంభావ పూరితములైన భగవాన్దాసు మాటల కలిగి, వెంటనే లేచి, ''ఏమీ! నీ కంత సాహసమా! తగుదునని యితరులకు బోధ చేయఁబూనితివా? సంఘమునుండి యొకరిని వెలివైతువా? విధ్యుక్త నియమములాచరించుటకుఁగాని విడుచుటకుఁగాని నీకు స్వాతంత్ర్యము కలదా? లోకమునకు బోధచేయ నీ వెవఁడవు? లోకప్రభువాజ్ఞాపించినఁదప్ప నాయనలోకమునకు బోధచేయ నీ వధికారివి కావు'' అని గంభీరముగఁ బలికి సమాధినిమగ్నుఁ డయ్యెను. కప్పుకొన్న బట్ట పడిపోయినది. కట్టుబట్టయు జాఱిపోయినది. ముఖమండలముచుట్టును దివ్య తేజము పరివేష్టించియుండెను. ఆగంభీరవిగ్రహముం జూచి యచటిజనులు నివ్వెఱఁగంది మాటలు దక్కి యూరకుండిరి. ఎల్లప్పుడును గౌరవపూర్వకసంబోధనల కలవాటుపడిన బాబాజీ యీ యాకస్మికవిజృంభణమును జూచి తెల్లఁబోయెను. అమోఘ శక్తిపూరితములగు నామాట లాతని హృదయమున సుస్థిరముగ నాటుకొని యతని కండ్లు తెఱచెను. పశ్చాత్తప్తుఁడై, తాను భగవంతునికి సేవకమాత్రుఁడనేయని వెంటనే

గ్రహించి, కోపమొందుటకుమాఱు, శ్రీ గురుదేవుని శాంతముగఁ బరిశీలించి, ఆయనయందలి యాధ్యాత్మికసిద్ధి లక్షణముల కానందించెను. పిమ్మట వారి ప్రసంగకాలమున శ్రీ గురుదేవుని సమాధ్యవస్థలను గాంచి యాయన యౌన్నత్య విషయమున నిస్సంశయుఁడయ్యెను. కలుటోలాలోని చైతన్యాసనము నధిష్ఠించిన దీయనయేయని తెలిసికొని, తాను ఆ చర్య నాక్షేపించినందులకు పశ్చాత్తాపమొంది, మరల మరల శ్రీ గురుదేవుని క్షమాపణ వేఁడుకొనెను.

కాల్నానుండి వారు నవద్వీపమునకు వెళ్లిరి. ఆ పట్టణపు ఇసుకగట్లప్రక్కగాఁ బడవ పోవుచుండినపుడు, శ్రీ గురుదేవుఁడు దివ్యభావోద్రేకపరవశుఁ డయ్యెను. నదిలోఁ బడిపోకుండ హృదయుఁడు గట్టిగఁ బట్టుకొనవలసివచ్చెను. గట్టు చేరినపిమ్మట స్తిమితపడెను. ఆ పట్టణములో నే దేవాలయమందును దివ్యతానిదర్శనమగుభావోన్నతికలుగమిచే నాయన యాశాభంగము నొందెను. తిరుగ పడవలోఁ గూర్చుండి వారు నదిలో కొంతదూర మేగిరి. అప్పు డాకస్మికముగాఁ గానిపించిన యద్భుతదృశ్యమునుగూర్చి యాయన ఇట్లు చెప్పవాఁడు. "తప్తకాంచనచ్ఛాయయు, శిరములచుట్టును తేజోగోళములును, గల ఇద్దరు బాలురు * నగుమోములతోఁ జేతులు పైకెత్తుకొని గాలిలో నావవైపునకు పరుగెత్తి వచ్చుచుండిరి. 'అదిగో, వచ్చుచున్నారు! వచ్చుచున్నారు!' అని నేను కేకవేసితిని. తెప్పపాటులో వారు వచ్చి ఈ శరీరములోఁ (తన్నుద్దేశించుచు) బ్రవేశించిరి. నేను స్మృతితప్పి

* చైతన్య నిత్యానందులు.

పడిపోయితిని. హృదయుఁడు పట్టుకొననిచో నీటిలో పడిపోయి యుందును'' ఈ విషయమై మథురుఁడడుగఁగా నాయన ఇట్లు చెప్పెను: "శ్రీగౌరాంగుఁడు జన్మించినచోటు వఱదలో కొట్టుకొని పోయెను. ఆ యిసుకగట్లు గల చోటే అది. * అందుచే నా కూరికేగాక ఆ స్థలమున నున్నతభావములు కలిగినవి.''

మథురుఁడు శ్రీ గురుదేవుని మొట్టమొదట చూచి యిప్పటికి పదునాఱేండ్లైనది. ఈ కాలమున నతని మనస్సులో మహాద్భుతపరివర్తన గలిగెను. 1871–వ సంవత్సరము జూలై నెలలో నతని కాకస్మికముగా విషజ్వరము వచ్చెను. అప్పుడే యతని జీవితనాటకము ముగియుచున్నదనియు, జగజ్జనని తన యొడిలోని కతనిని మరలఁ దీసికొనుచున్నదనియు, గ్రహించి శ్రీ గురుదేవుఁ డారోగ్యవిచారణమునకు స్వయముగాఁ బోక ప్రతిదినమును హృదయునిఁ బంపుచుండెను. చివరకు మరణ మాసన్నమయ్యెను: మథురుని కాళీఘట్టమునకుఁ దీసికొని పోయిరి. ఆనాఁడు శ్రీ గురుదేవుఁడు హృదయునిగూడ పంపక, యపరాహ్ణమున సమాధినిమగ్నుఁడై రెండుమూఁడుగంట లాస్థితిలోనే యుండెను. శరీరము దక్షిణేశ్వరములో నుండెనే కాని, ఆత్మ తనభక్తుని శ్రేయస్సుకొఱకై యవసానకాలమున నతనికడ నుండెను. సాయంకాల మైదుగంటలకు శరీరస్మృతి నంది "మథురుని యాత్మ దేవీలోకమునకుఁ బోయిన'' దని హృదయునితోఁ జెప్పెను. హృదయుఁ డేమియు మాటాడ

---

* పిమ్మట చారిత్రకపరిశోధన లీ యూహకుఁ గొంత యాధారము కల్పించినవి.

లేదు. మథురుఁడు సాయంకాల మైదుగంటలకు స్వర్గస్థుఁడయ్యెనని రాత్రి చాలసేపటికి దక్షిణేశ్వరమునకు వార్త వచ్చినది.

మథురుని యద్భుతవ్యక్తిత్వమునుగుఱించియు, తనతోనతనికిఁ గల యసామాన్య సంబంధమును గుఱించియు, శ్రీ గురుదేవుఁడు చెప్పుచుండ నొకభక్తుఁడు విని, "అయ్యా, మరణానంతర మతఁ డెట్టి స్థితికిఁ బోయెను? పునర్జన్మముండదనుకొందును" అనఁగా నాయన, "బహుశః రాజకుమారుఁడై మరల జన్మించియుండును. అతనికి భోగములపై వాంఛపోలేదు" అని ప్రత్యుత్తరమిచ్చెను.

శ్రీ రామకృష్ణదేవుని భూలోకజీవితనాటకములో నొక బహుముఖ్యఘట్టమున నాయనతో విశేషసన్నిహిత సంబంధముగలిగి వర్తించిన యొక పాత్ర మథురుని మరణముతో రంగమునుండి నిష్క్రమించెను. తన గాదిలిబిడ్డని యోగక్షేమముల నరయుచుండుకొఱకు శ్రీ విశ్వేశ్వరియే మథురుని నియమించెను.



## దక్షిణేశ్వరమున శ్రీ మాతృదేవి నివాసము

1867-వ సంవత్సరమున శ్రీ రామకృష్ణదేవుని పావన సన్నిధానమున తాను కామార్పుకుర్‌లోఁ గడపిన కాలమును గూర్చి శ్రీ మాతృదేవి "అప్పటినుండి నా హృదయములో దివ్యానందామృతకుంభ ముండినట్లు నాకెల్లపుడును తోఁచుచుండెడిది" అని చెప్పెను. ఈ దివ్యానందానుభూతిచే నామె స్వభావములోని శాంతతయు, జాగ్రత్తయు, స్వార్థరాహిత్యమును, అధికమయ్యెను. రూపెత్తిన దయాగుణమనఁదగి వర్తించుచుండెను. విసుఁగుకొనక పుట్టింటివారి పరిచర్య సేయుచు జయరాంబాటిలో కాలము వెళ్లఁబుచ్చుచుండినను, ఆమె హృదయము మాత్రము దక్షిణేశ్వరమున భర్తృ పాదారవిందములపైననే నిలిచియుండెను. ఆయనను చూడవలెననియును, ఆయన సాన్నిధ్యమున నుండవలెననియు, నప్పుడప్పుడు కోరిక కలుగును గాని సకాలమున నాయనయే తనయొద్దికిఁ బిలిపించుకొనునని యూఱట చెందుచుండెను. ఇట్లు నాలుగేండ్లు గడచినవి. ఆమెకిప్పుడు పదునెనిమిదేండ్లు. ఆనందపూరితమైన యామె మనస్సు సామాన్య సుఖదుఃఖముల కతీతమైయుండినను, తనభర్త వెఱ్ఱివాఁడని చెప్పుకొను గ్రామజనుల శుష్కప్రసంగము లామె నొకింత బాధించుచునే యుండెను. శరీరసౌఖ్యము నెంతమాత్రము పాటింపక, కాలమునంతయు భగవన్నామస్మరణయందును, ధ్యానమునందును గడపునది వెఱ్ఱివాఁడు గాక మఱెవ్వరని వారి యభిప్రాయము! ఆమె స్నేహితురాండ్రలోఁ గొందఱుకూడ

నామెను వెఱ్ఱివాని పెండ్లామని జాలితోను, నిరసనభావము తోను, చూచుచుండిరి. ఇదంతయు నామె యోర్పుతో సహించుచుండెను గాని, యామె హృదయము దారుణ వేదనతో తఱుగుకొనిపోయి, "ఆయన నిజముగ వెఱ్ఱివాఁడేనా? నేను కామార్పుకుర్‌లోఁ జూచిన పిమ్మట నాయన మాఱిపోయెనా? ఈ వార్తలే నిజమైనయెడల నే నింక నాయనను విడిచియుండరాదు. దగ్గఱనుండి నా శక్తికొలఁది సేవింపవలెను" అని యా మహాసాధ్వి చింతించుచుండెను. చాలదూర మాలోచించి యామె దక్షిణేశ్వరమునకుఁ బోవ సమకట్టెను.

డోలాపూర్ణిమ పండుగనాఁడు గంగాస్నానము చేయుటకై ఆమె దూరబంధువులు కొందఱు కలకత్తాకుఁ బోవుచుండ, నామెకూడ వారితోఁ బోవ నిశ్చయించుకొనెను. ఈ ప్రయాణమున కామెకుఁ గల యుద్దేశము గ్రహించి తండ్రి తానుకూడ నామెతో వెళ్లుట కేర్పాటుచేసికొనెను. కలకత్తాకుఁ బోవ రైలుమార్గములేమిచే వా రావెనుబది మైళ్లదూరమును కాలినడకనే వెళ్లవలసివచ్చెను. ఇట్టి దూర ప్రయాణములుచేసి యెఱుఁగదు గాన నామెకు మార్గమున తీవ్రజ్వరము వచ్చుటచే వారొక మజిలీయొద్ద నాఁగవలసి వచ్చెను. ఈ యాకస్మికకష్టమున కామె పరితపించుచుండెను, గాని యొక దివ్యదృశ్య మామెకుఁ గనఁబడి యామె నూఱట పఱచెను. ఈ విషయమై యామె యిట్లు చెప్పుచుండెడిది: "నేను జ్వరముతో స్మృతితప్పి పడియుండ, నొక లేఁబ్రాయపు బాలిక వచ్చి నా ప్రక్కనఁ గూర్చుండినట్లు కనఁబడెను. ఆమె నీలవర్ణ, అసదృశరూపవతి. తన మృదుహస్తములతో నా

శరీరమును నిమిరెను. ఆ చల్లని తాఁకుడుచే నా జ్వరతాప మంతయు క్షణమున మాయమైపోయినది. 'నీ వెక్కడనుండి వచ్చితివి?' అని నే నడుగఁగా, 'దక్షిణేశ్వరమునుండి' అని యామె బదులుచెప్పెను. 'ఏమి! దక్షిణేశ్వరమునుండియా! నేనును అచ్చటికే వెళ్లఁగోరియున్నాను—నా భర్తకడనుండి యాయనను సేవించుటకు; కాని యీ జ్వర మడ్డుతగిలినది' అని యాశ్చర్యముతో నంటిని. 'నీ దేహారోగ్యము చక్కఁబడిన తరువాత తప్పక నీవు దక్షిణేశ్వరమునకు వెళ్లెదవు. నీ కొఱకే యాయనను నేనచ్చట నుంచియున్నాను' అని యా బాలిక ధైర్యము చెప్పెను. 'ఎంత దయగలదానవు! నీవు ఎవరవమ్మా?' యని నే నడుగఁగా, 'నేను నీ సోదరిని' అని యామె సమాధానమిచ్చెను. 'హా! ఆలాగు చెప్పు. అందుచేతనే నీ విచ్చటికి వచ్చితివి' అని యంటిని. ఈ సంభాషణ యైనతరువాత నాకు నిద్రపట్టెను."

మఱుసటిరోయుదయ మామెకు జ్వరము వదలిపోయియుండుటచేఁ బయనము సాఁగింపఁబడెను. కొంచెముదూరములో నొకపల్లకీ దొరకఁగా, నది కుదుర్చుకొని వారు దక్షిణేశ్వరము 1872-వ సంవత్సరము మార్చి నెలలో నొకనాఁటి రాత్రి 9 గంటలకు చేరిరి.

శ్రీ గురుదేవుఁ డామె బలహీనస్థితినిఁజూచి మిక్కిలి చింతించి యామెకొఱకు తనగదిలో వేఱుశయ్య నేర్పాటు చేసి, "అయ్యో, కాలము మించిపోయిన పిమ్మట వచ్చితివి. నా మథురుఁ డిప్పుడు లేఁడుగదా—నీ సౌకర్యములను జూచుటకు" యని మరలమరల విచారముతోఁ బలికెను. శ్రీ గురుదేవుఁ డేర్పఱచిన సచ్చికిత్సాపోషణలవలన నామె మూఁడు

నాలుగునాళ్లలో నారోగ్యవంతురాలయ్యెను. అంతటఁ దన తల్లితో నుండుమని వాద్యమండపమున కంపెను.

శ్రీ గురుదేవుఁడు తొల్లిటివలెనే తనయెడ నాదరభావముతో నుండుట నామె గ్రహించి, ఆయనకును ఆయన తల్లికిని సేవచేయుచు దక్షిణేశ్వరమందే నివసింప నిశ్చయించెను. భర్తసన్నిధి నామె సుఖముగా నుండుటచే నామె తండ్రియుఁ దృప్తచిత్తముతో నింటికిఁ బోయెను.

నాలుగేండ్లనాఁడు తానసంపూర్తిగ విడిచిపెట్టిన శిక్షణమును శ్రీ గురుదేవుఁ డిప్పుడు మరల నందుకొనెను. ఇందుచేఁ దనభర్తృధర్మమును నిర్వహించుటేగాక, తానెంత వఱకుఁ దనసాధనలవలన సిద్ధత్వము నొందఁగలిగెనో కూడఁ బరిశోధించుకొనవచ్చునుగదా! కర్తృత్వ మెంతమాత్రమును తనపైఁ బెట్టుకొనక, జగజ్జనని యానతి జరుపుచుండుటే తన కర్తవ్యముగఁజూచు నా మహానుభావుఁ, డవకాశము వచ్చుటచే నప్పుడు కామార్పుకుర్లోను, ఇప్పు డిచ్చటను, ఈ కార్యమును పూనెనుగాని, తాను స్వతంత్రించి యవకాశముల నెన్నఁడును కల్పించుకొని యెఱుఁగఁడు; తమంతట వచ్చిన యవకాశములకు వెనుదీయుటయు నెఱుఁగడు.

అప్పు డాయన ఆమెకు బోధించిన ముఖ్య విషయములలో నొకటి: ''చంద్రుఁడు ప్రతిశిశువునకును ఎట్లు ప్రియుఁడో, అట్లే ఈశ్వరుఁ డెల్లరకును ప్రియుఁడు. ఈశ్వరుని ప్రార్థించుట కందఱకును సమానమైన హక్కు కలదు. ప్రార్థించినవారి కందఱకును ఆ దయామయుఁడు ప్రత్యక్షమగును. నీవు ప్రార్థింతువేని నీకును ప్రత్యక్ష

మగును.'' గృహనిర్వహణము మొదలు బ్రహ్మజ్ఞానమువఱకుఁ గల యెన్నో విషయము లాయన బోధించెను. బోధించుట తోడనే తృప్తిపడక, ఆమె యెంతవఱ కట్లునడచుకొను చుండెనో కూడ శ్రద్ధతోఁ గనిపట్టుచు తప్పులు ప్రేమ పూర్వకముగ దిద్దుచుండెను.

ఆమె వచ్చిన కొన్ని మాసములకు శ్రీ గురుదేవున కొక వింతకోర్కె కలుగఁగా దాని నాయన వెంటనే తీర్చు కొనెను. 1872-వ సంవత్సరము మే నెలలో కాళీపూజా యోగ్యమగు నొక యమావాస్యరాత్రి తనగదిలోఁ గొన్ని విశేషసన్నాహములుచేసి, పూజాసమయమం దచట నుండు మని యామెతోఁ జెప్పెను. పురోహితాసనమున నాయన కూర్చుండెను. ప్రారంభకలాపానంతరము, దేవీపీఠమున నామెను కూర్చుండఁజేసెను. అంతవఱకుఁ బూజావిధాన మును భక్త్యావిష్టయై చూచుచుండినందున, నప్పు డామె కసంపూర్ణశరీరస్మృతి మాత్రమే యుండెను. ఒక పూజారి సహాయముతో నాయన దేవీస్థానము నాక్రమించి యుండిన యామెను యథావిధిగ పూజించుచుండఁగా, నామె సమాధినిమగ్న యయ్యెను. మంత్రములు పూర్తి యైన పిమ్మట నాయనకూడ నతీంద్రియావస్థ నందెను. పురోహితుఁడును, దేవియు, నింద్రియాతీతమైన యాత్మలో నైక్యమైరి. కొన్నిగంట లిట్లు గడచిపోయెను. అర్ధరాత్ర మున నాయన యసంపూర్ణశరీరస్మృతినంది, సమంత్రక ముగా తనను, తన యావజ్జీవ సాధన ఫలములను, తన జపమాలతోఁగూడ, నామె పాదపద్మముల సన్నిధిని



మాతృశ్రీ శారదాదేవి

సమర్పణము గావించికొని యామెకు మ్రొక్కెను. తంత్రములలో షోడశీపూజయని చెప్పఁబడు ఈ కర్మముతో శ్రీరామకృష్ణదేవుని యాధ్యాత్మికసాధనలు పూర్తియైనవి. ఈ పరమోత్కృష్ట కర్మముచే నాయన శ్రీ శారదాదేవిరూపమునఁ బ్రత్యక్షమైన జగజ్జననికిఁ దన సర్వస్వము సమర్పించుకొనెను. ఆ మహనీయుని జ్ఞానోద్దీపితదృష్టికి విశ్వమున సర్వమును ఈశ్వరుని మూర్తిభావమే! సర్వగతమగు నా విశాలదృక్పథమున నఖండపరమాత్మయు విశ్వమూర్తియుఁగూడ నిమిడియుండెను. అందుచే నాయన పూర్వకాలపు టుపనిషదృషివలె, "నీవే స్త్రీవి, నీవే పురుషుఁడవు. నీవే బాలుఁడవు, నీవే బాలికవు. చంకకఱ్ఱలపై నానుకొని యీడ్చుకొనుచు నడచువృద్ధుఁడవును నీవే. అనంతరూపమయమగు విశ్వమం దెల్ల నీవు నిండియుందువు." * అని యనఁదగిన స్థితియం దుండెను.

శ్రీ గురుదేవుని దివ్యసాంగత్యభాగ్యమునను భవించుచు శ్రీ మాతృదేవి దక్షిణేశ్వరములోనే నివసించుచుండెను. ఈ సౌఖ్యదినములను గూర్చి, ఆమె యిట్లు చెప్పెను: "ఠాకూరు వివిధస్థితులు దర్శించుచు నే నెంతటి భావోన్నత్యము ననుభవించెడిదాననో వర్ణింపఁజాలను. దివ్యభావపరవశుఁడై ఒక్కొకప్పు డాయన దురవగాహ వేదాంతవిషయములనుగూర్చి ప్రసంగించును. ఒకప్పుడు నవ్వును, ఒకప్పు డేడ్చును, మఱొకప్పుడు గాఢసమాధినిమగ్నుఁడై నిశ్చలత్వమందును. రాత్రియంతయు నిట్లే జరుగుచుండును.

---

* శ్వేతాశ్వతరోపనిషత్తు IV—3.

ఆయనయందుఁ బ్రత్యక్షమగు నసాధారణదివ్యచైతన్యమును జూచి నేను భయముతో వణఁకుచు, రాత్రి యెట్లు గడచునాయని తత్తఱపడుచుదానను. అప్పటికి నాకుఁ బారవశ్య స్థితులనుగుఱించి యేమియు తెలియదు. ఒకనాఁ డాయన సమాధి ఎంతసేపటికిని ముగియకపోవుటచే, నేను మిగుల భయపడి యేడ్చుచు హృదయుని పిలిపించితిని. అతఁ డాయన చెవిలోఁ గొంతసేపు భగవన్నామ ముచ్చరింపఁగా నాయనకు స్మృతివచ్చెను. నే నట్లలజడిపడుచుండుటచూచి యేయే సమాధిస్థితియం దేయే భగవన్నామము లుచ్చరింపవలయునో, ఇతర స్థితులలో నేయే మంత్రము లుచ్చరింపవలయునో, నాకు బోధించెను. అటుపై ఆ పద్ధతు లనుసరించి యాయనను స్మృతికి తేఁగలిగియుండుటచే నాకు భయము తగ్గిపోయెను. ఈవిధముగఁ గొన్ని నెలలు గడచినవి. సమాధిస్థితి యేనిమిషము వచ్చునోయని నేను రాత్రియంతయు మేల్కొని యుండుట కనుఁగొని, యొకనాఁ డాయన నన్నిఁకమీఁద వాద్యమండపములో నిద్రించుచుండుమనెను.'' ఆదినములలో శ్రీ గురుదేవుఁ డామెకు దైనందినజీవితసంబంధములగు నతిస్వల్ప విషయములు (దీపపువత్తు లెట్లు కత్తిరింపవలసినది, కుటుంబములో నెవరితో నెట్లు వారివారి భిన్నస్వభావముల కనుగుణముగ మెలఁగవలసినది, యితరుల యిండ్లకు వెళ్లినపు డెట్లు నడచుకొనవలసినది: ఇట్టివి) మొదలుకొని ప్రార్థన, భగవన్నామసంకీర్తనము, ధ్యానము, సమాధి, తుదకు బ్రహ్మసాక్షాత్కారము, మున్నగు యత్యున్నతాధ్యాత్మిక రహస్యములవఱకు సర్వమును బోధించెనని యామె చెప్పుచుండెడిది.

ఒకనాఁ డామె యాయన పాదము లొత్తుచు, "నన్ను గుఱించి మీ భావమేమి?" అని యడిగెను. "దేవాలయములో పూజింపఁబడుచుండు దేవియే యీ (తన) శరీరమును కని, యిప్పుడు వాద్యమండపములో నివసించుచున్నది. మరల నామెయే ఇప్పుడు నా పాదము లొత్తుచున్నది. ఆనందమయి యగు నా జగజ్జననియొక్క ప్రత్యక్షమూర్తివనియే ని న్నెల్లప్పుడును భావింతును" అని వెంటనే ప్రత్యుత్తరమిచ్చెను. తనప్రక్కను పరుండి నిద్రించుచుండిన భార్య నొకనాఁడు చూచి యాయన తనలోఁ దా నిట్లు తలపోసికొనెను. "ఇదియే స్త్రీశరీరము. లోకమున కిది బహుప్రీతికరము. కాని దానిచేఁ బ్రీతుఁడగువాఁ డందే బంధింపఁబడి భగవంతునిఁ దెలిసికొన లేకపోవును. ఇఁక మర్మమువిడిచి నాతోఁ జెప్పుము: నీ కిది కావలెనా, భగవంతుఁడు కావలెనా? మొదటిదైనచో ఇదిగో సిద్ధముగా నిక్కడనే యున్నది." అత్యంతపవిత్రమైన యాయన మన స్సీ పరీక్షారూపకప్రశ్నమున కిచ్చినసమాధానము బహుగాఢసమాధినిమగ్నమై, ఆ స్థితియందు మఱుసటి యుదయము వఱకుండుటయే. భగవన్నామము చాలసేపు చెవిలో నుచ్చరించి, యెంతో కష్టముమీఁద నప్పు డాయనను తిరిగి శరీరస్మృతికిఁ దేఁగలిగిరి.

నెల లీవిధముగాఁ గడచినవి. కాని ఒక్కనాఁడైనను ఆ దివ్యదంపతుల మనస్సులు విషయవాంఛలకు దిగలేదు. ఇరువురిచిత్తములును అనంతపరబ్రహ్మమునందు లగ్నమైనవి గనుకనే యిది సాధ్యమైనది. "ఆమె మనస్సులో నుండి శరీరసుఖవాంఛను సమూలముగాఁ దీసివేయుమని

దేవిని నా వివాహానంతరము మనఃపూర్వకముగఁ బ్రార్థించితిని. అమ్మ నాప్రార్థన నీడేర్చినదని యీకాలమునందు గ్రహించితిని.” అని అర్ధాంగినిగూర్చి యాయన ప్రశంసించువాఁడు.

ఇట్లే యొక సంవత్సరముపైఁగాఁ గడచినను, అప్రయత్నముగనే ఆయనమన స్సెల్లప్పుడును ఉన్నతాధ్యాత్మికానుభవస్థితిలో సుస్థిరముగానుండ నారంభించుటచే, దేవికృపచే తాను సాధనాంతమునకు వచ్చెననియు, తన చిత్తము నిరంతర మామె పాదపద్మములందు నిమగ్నమై యున్నదనియు, నాయన గ్రహించెను. ప్రమాదవశముననైనను దేవీసంకల్ప విరుద్ధభావమేదియును తనచిత్తమునఁ బ్రవేశింపఁజాలకున్నదని కూడఁ గ్రహించెను.

ఒకసంవత్సరము నెనిమిది నెలలు దక్షిణేశ్వరమునఁ గడపి శ్రీమాతృదేవి 1873-వ సంవత్సరము నొవెంబర్ నెల ప్రాంతమున కామార్పుకుర్ కు తిరిగివెళ్లెను.



## సాధనాంతము

ఇంచుమించుగా నొక సంవత్సరము తర్వాత నింకొక మతమార్గమున శ్రీ లోకేశ్వరీనాక్షాత్కారమును బడయ వలయునని శ్రీ గురుదేవునకు బుద్ధిపుట్టెను. ఇది క్రైస్తవ మతసాధన. ఈ కోరిక యాయనకుఁగలిగిన వెంటనే, శ్రీ విశ్వేశ్వరి దానినొక వింతవిధమున నీడేర్చెను. ఒకనాఁ డాయన తనభక్తుఁడగు యదునాథమల్లిక్ యొక్క చావడిలోఁ గూరుచుండి మేరీకన్య తన దివ్యశిశువు నెత్తుకొని యుండు పటమును శ్రద్ధగఁ జూచుచు ఏసుప్రభుని యద్భుత జీవితమును తలపోయుచుండెను. అప్పు డా పటము సజీవమై తేజోమయమై ప్రకాశించుచుండినట్లును, ఆ దివ్యమాతా శిశువుల పవిత్రశరీరములనుండి కాంతికిరణములు బయలు దేఱి తనలో ప్రవేశించి, తన పూర్వచిత్తవృత్తిని పూర్తిగ మార్చివేసినట్లును, ఆయనకు తోఁచెను. క్రొత్తభావములు చొచ్చుకొని వచ్చి, తన హిందూమతాభిప్రాయముల నొక మూలకు త్రోసివేయుచుండుటఁగాంచి, యాయన తన మనస్సును స్వాధీనములో నుంచుకొనుటకై, "అమ్మా, నన్నేమి చేయుచున్నావు?" అని దేవిని హృదయ పూర్వకముగ ప్రార్థించెను. కాని ఫలము లేకపోయెను. ఈ ప్రచండ నూతనభావతరంగధాటి కాఁగలేక, హిందూ దేవతల యెడల నాయనకుఁ గల భక్తిగౌరవములు తుడుచుకొని పోయి, వాని స్థానమున క్రీస్తుప్రభునిపట్లను, క్రైస్తవులగుళ్ల పట్లను, విశేషభక్తి ప్రవేశించి, క్రైస్తవభక్తులు తమ

గుళ్లలో నా ప్రభుని విగ్రహము నెదుట ధూపదీపములతో తమ హృదయాంతరాళములనుండి ప్రార్థనల నర్పించు దృశ్యము లాయనకుఁ గనుపడెచెను. ఆలయమునకుఁ దిరిగి వచ్చిన తరువాతఁగూడ నా భావములయందే మునిఁగి, దేవీసందర్శనమునుగూడ పూర్తిగ మఱచిపోయెను. మనస్సు మూఁడునాళ్లిట్లు క్రైస్తవ మతభావపరవశమై యుండెను. నాల్గవనాఁడు పంచవటిలో నడచుచుండఁగా, తనకడకు సుందరాకారమును, దివ్యముఖవర్చస్సును, గల యొక విదేశీయ పురుషుఁడు గంభీరదృష్టితో వచ్చుచుండిన ట్లగపడెను. అతని నేత్రములు సుందరములు, విశాలములు. ముక్కుమాత్ర మొకింత చదును. ఆ ముఖమునందలి దివ్య కళచే నాకృష్టుఁడై యీాయన యెవరా యని వింతపడుచుండెను. ఆలో నాయన సమీపింపఁగా, "మానవలోకసముద్ధరణముకై తన హృదయరక్తము నర్పించి, వారికొఱకు నపరిమితవేదన నొందిన శ్రీ క్రీస్తుప్రభుఁ డితఁడే! యోగీశ్వరేశ్వరుఁడు, ప్రేమైక మూర్తియునగు క్రీస్తుప్రభువే కాని యితఁ డన్యుఁడు కాఁడు!" అను దివ్యభావము శ్రీ గురుదేవుని హృదయాంతరాళము నుండి వెలువడెను. పిమ్మట నా దివ్యరూపము శ్రీ గురుదేవునిఁ గౌఁగిలించికొని యాయన శరీరములో నైక్యమై పోయెను. శ్రీ గురుదేవుఁడును సగుణబ్రహ్మముతో తన యైక్యము ననుభవించుచు సమాధిస్థితుఁడై బాహ్యస్మృతిని గోల్పోయెను. ఏసుక్రీస్తు భగవదవతారమని శ్రీరామకృష్ణున కీవిధముగ నమ్మకము గలిగెను.

కాలాంతరమున నాయన తన దృశ్యవివరములను తెలిపి బైబిలులో క్రీస్తు రూపలక్షణము లెట్లువర్ణింపఁబడినవి,

అతఁ డెట్లుండెడివాఁడఁట, అని తనశిష్యులలో నింగ్లీషు చదివిన వారి నడుగఁగా, బైబిలులో నీ విషయ మెచ్చటను ఉదాహరింపఁబడలేదు గాని, యూదువంశమున జన్మించినందున నతఁడు విశాలనేత్రములతోను, మొనతేలిన నాసికతోను, సుందరరూపుఁడై యుండవచ్చునని వారు చెప్పిరి. శ్రీ గురుదేవుని నిర్యాణానంతర మాయనశిష్యులు క్రీస్తుప్రభుని రూప లక్షణములు మూఁడుచోట్ల వర్ణింపఁబడియున్నవనియు, నందొకదానిలో నతని ముక్కు చదునుగా నుండినట్లు చెప్పఁబడి యున్నదనియు, తెలిసికొనఁ గలిగిరి.

శ్రీ గురుదేవుఁడు బుద్ధభగవాను నవతారమూర్తిగా నమ్మి భక్తితో నారాధించువాఁడు. శ్రీ జగన్నాథమందలి విగ్రహత్రయరూపమున శ్రీ బుద్ధదేవుఁడే యిప్పటికిని అర్చింపఁ బడుచున్నాఁడని విశ్వసించి, గంగాజలమునకువలె జగన్నాథ ప్రసాదమునకుకూడ సర్వపాపవిధ్వంసక మహాశక్తి కలదని ప్రశంసించువాఁడు. శ్రీ జగన్నాథాలయములోఁ గల సర్వమత సహనమునుగూర్చి విని, సందర్శింపఁ జాలకుతూహలపడెను గాని, పూర్వమచ్చట నవతారమూర్తియగు శ్రీ చైతన్యుఁడు శరీరమును చాలించినందున, ఆ స్థలమహత్త్వపు ధాకకు తాళఁజాలక తనశరీరముకూడఁ బతనము కావచ్చునని యా కోరికను విడిచిపెట్టెను. మఱియొక సందర్భమున బుద్ధుని గుఱించి యాయన ఇట్లు చెప్పెను: "గౌతమబుద్ధుఁ డవతార పురుషుఁడనుటకు సందేహ మెంతమాత్రమును లేదు. అతని సిద్ధాంతమునకును, ఉపనిషద్జ్ఞానకాండకును నేమి యు భేదము లేదు." తన దివ్యదృష్టినిబట్టియే యాయన ఇట్లు చెప్పియుండును.

జైనమతస్థాపకులగు తీర్థంకరులనుగూర్చియు, సిక్కుమత గురుదశకమునుగూర్చియు, నాయా మతావలంబుల వలన శ్రీ గురుదేవుఁడు విని, యా మహానుభావులయెడల విశేషగౌరవము చూపువాఁడు. ఇతరవిగ్రహములతోపాటు తీర్థంకరమహావీరుని విగ్రహ మొకటియును, క్రీస్తుప్రభువు చిత్తరు వొకటియును, ఆయన గదియం దుండెడివి. వీనికి ప్రతిదిన ముదయసాయంకాలములందు ధూపార్చన జరుగుచుండెడిది. అయినను, తీర్థంకరులుగాని, సిక్కుగురువులుగాని, భగవదవతారములని ఆయన ఎన్నఁడును చెప్పినట్లు కనఁబడదు. సిక్కుగురువులనుగూర్చి యాయన యిట్లు చెప్పువాఁడు: "వారందఱును సాధుపుంగవుఁడగు జనకమహారాజుయొక్క అవతారములు. తాను ముక్తుఁడగుటకు పూర్వము, ప్రపంచమునకు మేలు చేయవలయునను భావము కలుగుటచే నతఁడు వరుసగా పదుగురు సిక్కుగురువులుగా నవతరించెననియు, సిక్కుమతమును స్థాపించి పరబ్రహ్మములో లీనమైపోయెననియు, చెప్పు నా మతస్థుల మాట నమ్మకుండుట కాధారము లేదు."

సాధనాంతమున శ్రీ గురుదేవుని దివ్యదృష్టి కనేక సత్యములు గోచరించెను. ఇవి యాయన యతీంద్రియదృష్టిచే గ్రహింపఁబడినను, హేతుబద్ధమగు మన సామాన్యభాషలో వ్యక్తపఱుప యత్నింపనగును.

తన్నుగూర్చి (శ్రీ) గురుదేవుఁ డీ క్రింది నిర్ణయములకు వచ్చెను:—తానొక దివ్యకార్యనిర్వహణార్థము భూలోకమున కేతెంచిన భగవదవతారమూర్తియనుటయు, తన

యాధ్యాత్మికసిద్ధులితరులమేలుకొఱకే పొందఁబడినవనుటయు, నిందు మొదటిది. తనజీవితమును సామాన్యసత్యాన్వేషణ పరుల జీవితములతో పోల్చి చూచుకొనఁగా తనకును వారికిని హస్తిమశకాంతరము గలదని యాయనకు వ్యక్తమయ్యెను. ఏలన, సాధారణ సాధకుఁడు భగవంతుని భావములలో నేదో యొకదానిని గ్రహింపఁగోరి, యావజ్జీవము పాటుపడి యా భావమున భగవత్సాక్షాత్కారము వడసి, తృప్తినొందును. ఇఁక తానన్నచో భగవంతుని సర్వభావములు గ్రహించినఁ గాని తృప్తిపడఁజాలకుండి, ప్రతి భావమునందును అత్యంత స్వల్పకాలమున భగవత్సాక్షాత్కారము గాంచఁగలిగెను. అందుచే సామాన్యసాధకులయొక్కయు, తనయొక్కయు, చిత్తవృత్తులలోనుండు నీ మూలభేదమునకుఁ గల కారణమును తన మహోన్నతాధ్యాత్మికస్థితిలో గ్రహించి పై నిర్ణయము నకు వచ్చెను. తాను భగవంతుని ప్రత్యేకావతారమగుటచే తినసందర్భ మసాధారణమనియును, అనన్యసామాన్యములైన తన యాధ్యాత్మికసాధనలును, సిద్ధులును, నాత్మజ్ఞానప్రద మగు నొకనూతనయుగమునునిర్మించి, భగవత్సాక్షాత్కార మార్గమున మానవకోటికిఁ గల్గు నంతరాయములనెల్ల తొలఁ గించుటకేకాని, స్వీయవాంఛాలాభమునకు కాదనియును, ఆయనకు విశదమయ్యెను.

రెండవది : తాను నిత్యముక్తుఁడగుటచే తన సాధ నలు నిజముగా తన కవసరములుకావనియు, ముక్తిశబ్దము తన యెడ నన్వయములేనిదనియు. మఱియొక దృక్పథమునుండి తనకెన్నటికిని ముక్తికలుగుటే సాధ్యము కాదనియు.

ఇదెట్లన, లోకమున బద్ధులమని తలఁచుకొనువారున్నంతవఱ కును, అవతారమూర్తి వచ్చి వారికి ముక్తిమార్గము చూపు చుండవలయునుగదా! శ్రీ గురుదేవుఁ డీ దృక్పథ మిట్లు వివరించువాఁడు: "జమీందారుని యుద్యోగస్థుఁ డా జమీందారీలోని యే భాగమున నెట్టికష్టము వచ్చినను నచ్చటికిఁ బరుగెత్తవలసియుండును." వాయవ్యదిశాభాగమునఁ దా నవతరింపవలసియుండుననికూడ శిష్యులతోఁ జెప్పువాఁడు. ఆ యవతారము రెండువందల సంవత్సరములపిదప ననికూడఁ జెప్పెనని కొందఱు శిష్యులు చెప్పుదురు. "అప్పు డనేకులు ముక్తులగుదురు: అప్పుడును ముక్తులు కానివారు, చాలకాలము వేచియుండవలసియుండును" అనికూడ చెప్పెనఁట.

మఱియొకనాఁడు: తన నిర్యాణకాల మాయనకు ముందుగనే తెలియును. ఒకనాఁడు పారవశ్యస్థితిలోనుండి, యీ విషయమై శ్రీ మాతృదేవితో నిట్లు చెప్పెను: "బ్రాహ్మణేతరులు తాఁకిన యాహారమును భుజించుట, కలకత్తాలో రాత్రులు గడపుట, మఱియొకరికి భోజనముపెట్టి మిగిలిన దాని నారగించుట: ఇవి నే నెప్పుడు చేయుదునో, అప్పు డీ శరీరమును విడుచు దిన మాసన్నమైనదని యెఱుఁగుము." ఈ మాటలెల్ల 'తు' 'చ' తప్పకుండ నిజమని తేలినవి.

మఱియొకనాఁడుకూడ నిట్టి యతీంద్రియ స్థితిలోనే యుండి, తన యవసానమునకు పూర్వము పాలతోఁ జేయఁబడిన ద్రవపదార్థములు మాత్రమే పుచ్చుకొందునని యాయన శ్రీ మాతృదేవికి తెలిపెను. ఇదియును నిజమైనది.

సామాన్యమగు నాధ్యాత్మిక విషయములను గుఱించి శ్రీ గురుదేవుఁడీ క్రింది నిశ్చితాభిప్రాయములు గలిగియుండెను :

ఒకటి : ఆయన సకలమతశిక్షణవిధానములననుసరించి భగవత్సాక్షాత్కారము గాంచియుండుటచే సర్వమతములును సత్యమే యని, అనఁగా, ప్రతి మతసిద్ధాంతపద్ధతియు భగవత్పాదసన్నిధి కేకమార్గమేయని, దృఢముగా విశ్వసించెను. ప్రపంచచరిత్రమునంతయుఁ బరిశీలింప, భిన్నములైన యిన్ని మతసాధనముల నాచరించి, తత్ఫలముగ నిట్టి సత్యమును పూర్వమేయవతారమూర్తియుఁ బ్రకటింపలేదు. కావున శ్రీరామకృష్ణావతారముఖ్యోద్దేశమిదియేయని తోఁచును. మతప్రవక్తల మహనీయత వారి యుపదేశముల విశ్వవైశాల్యస్వభావముంబట్టి నిర్ణయింపఁబడునేని, అట్టి మహోజ్జ్వలవ్యక్తులలో శ్రీరామకృష్ణుఁడగ్రగణ్యుఁడై ప్రకాశించుననుటకు సందియము లేదు.

రెండవది : ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము అను త్రిమతములును మానవులను జీవితపరమావధికిఁ గొనిపోవు మార్గమున సోపానముల వంటివి. కావున పరస్పరవిరుద్ధములు కానేకావు. మనుష్యుల చిత్తవృత్తులందు వ్యక్తిగత భేదములుండుటచే, నొకొక్కరి కొకొక్క మార్గ మనుకూలించును. ఈ సమరసభావమును గ్రహింపక, ప్రతి మతమువారును కేవలము తమ మతసిద్ధాంతములకే యనుకూలించునట్లు శ్రుతిస్మృతుల కర్థములు కల్పించి, జిజ్ఞాసువులను కలవరపెట్టుటచే, నన్నిమతముల యంతరార్థ

మును స్వయముగ ననుభవైకవేద్యము చేసికొని, వాని రహస్యములను విప్పిచెప్పఁగల యుగప్రవక్త యెంతయుఁ గావలసియుండెను. ఈ విషయమున శ్రీ గురుదేవుని యభిప్రాయములు కొన్ని ఇచ్చట ఉదాహరింపఁబడుచున్నవి: "భగవత్సాక్షాత్కార విషయమున నద్వైతము కడమాట. ఆసాక్షాత్కారము మనస్సునకును మాటలకును అతీతమగుటచే, సమాధిస్థితిలో మాత్రమే విదితమగును"; "విశిష్టాద్వైతమువఱకుఁ గల భావములను మనోబుద్ధులు గ్రహించి వ్యక్తీకరింపఁగలవు. దానిని దాఁటి యవి పోఁజాలవు. పరిపూర్ణావస్థయం దఖండసచ్చిదానందవస్తువు, తద్విభూతులు, సమసత్యములనియు, భగవన్నామము, భగవద్ధామము, భగవంతుఁడు, నోకే యాధ్యాత్మికపదార్థమయము లనియు తేటపడును. రూపభేదమేకాని సర్వము నాధ్యాత్మిక వస్తువే"; "ప్రబలమైన యింద్రియాసక్తత గల సాధారణ మనుష్యునకు సంకీర్తనము, ప్రతీకములు, మొదలుగాఁగల ఇంద్రియగోచరాధారములను కొంతవఱ కంగీకరించు ద్వైత మతవిధానము లుపయోగకరముగ నుండును."

కర్మ నిష్కర్మలనుగుఱించి శ్రీ గురుదేవుఁ డిట్లు చెప్పువాఁడు: "పరిపూర్ణచిత్తశుద్ధిగలవాఁడు స్వతస్సిద్ధముగనే కర్మ కతీతుఁడు. ప్రయత్నించినఁగూడ నతఁడు కర్మములు చేయఁజాలఁడు. భగవంతుఁడే అతనిని చేయనీయఁడనికూడ చెప్పవచ్చును. ప్రసవకాలము సమీపించుకొలఁది యిల్లాలికి గృహకార్యభారము తగ్గింపఁబడును. ప్రసవానంతరము గృహకార్యములే లేక కేవలము శిశుపోషణయందే

వినియుక్తయగును గదా. ఇఁక సామాన్య మనుష్యుని విషయము. గృహయజమానునకు సకలోపచారములు చేయుచున్నను, తన గృహమది కాదను యెఱుకఁగల గృహదాసి వలె నెప్పుడును భగవంతునిపైననే ఆధారపడి, దేనియందును సక్తత లేకుండి, నిత్యకర్మములను చేయునపుడు సాధ్యమైనంతవఱకు భగవన్నామము నుచ్చరించుచు, నతనిని ధ్యానించుచుండవలెను.”

మూఁడవది : తన జీవితముచే దృష్టాంతీకరింపఁబడిన విశ్వసామాన్యసిద్ధాంతములను ప్రమాణీకరించువారి సంఘము నొకదానిని తనద్వారా స్థాపింప శ్రీ విశ్వేశ్వరి సంకల్పించి యున్నదని యాయన గ్రహించెను.

కడపటిది : ఇఁక జన్మాంతరములేని (కడజన్మ నందియున్న) వారు—చివర కొకసారియైనను భగవంతుని మనఃపూర్తిగఁ బ్రార్థించినవారు— తనకడకు వచ్చితీరవలెనని యాయన తన యోగదృష్టిచే గ్రహించెను.



## బంధు మరణములు

1873–వ సంవత్సరమున శ్రీ గురుదేవు నగ్రజుండగు రామేశ్వరుండు కామార్పుకుర్‌లో మరణించెను. ఈ దుఃఖవార్త దక్షిణేశ్వరములో తెలిసినప్పుడు శ్రీ గురుదేవుండు తన ముదుసలితల్లికై మిగుల కళవళమంది కాళికాలయమునకుం బోయి, యీ విపత్సమయమున తన తల్లి నూఱడింపుమని దేవిని ప్రార్థించెను. పిమ్మట తల్లికడకరిగి కన్నీటితో నావార్తను దెలిపెను. ఆమె దానిని శాంతముతో గ్రహించి ఇట్లనెను: "ఈ ప్రపంచ మనిత్యము. అందఱును ఎప్పుడో యొకదినము మరణింపక తప్పదు. అందుచే విచారించుట నిష్ప్రయోజనము." ఈ వైరాగ్యభావమును జూచి శ్రీగురుదేవుండు సంతోషాశ్చర్యముల నొంది, తన ప్రార్థనను విశ్వేశ్వరి యనుగ్రహించి తనతల్లి మనస్సు నున్నతజ్ఞానపూరితముగావించెనని తెలిసికొనెను.

శ్రీ మాతృదేవి 1874–వ సంవత్సరమధ్యమున రెండవసారి దక్షిణేశ్వరము వచ్చెను. అచట నామె పూర్వమువలెనే తన యత్తగారితోకూడ వాద్య మండపములో నివసించుచుండెను. కాని యది ఇద్దఱ కిఱుకుగా నుండుటచే శంభుచరణుండామెకొఱ కొక కుటీరము నిర్మించెను. అంత నామె, తనకు సాయముచేయు నొక పనికత్తెతోంగూడ, నాక్రొత్త కుటీరములోనికిం బోయి కాంపురముండెను. ఆచటం బ్రతిదిన మామె వంటచేసి యాయన కదికిం దెచ్చి పెట్టుచుండెను. ఆయనయు నామెకుటీరమునకు పగటిపూట

వెళ్లి, కొంతకాల మక్కడనుండి తిరిగి తనగదికి వచ్చువాఁడు. ఒక సంవత్సర మీపర్ణశాలయం దుండినతర్వాత నామె తీవ్ర గ్రహాణివ్యాధిచే మంచముపట్టెను. కాని, శంభుచరణుఁ డేర్పఱచిన చికిత్సచే వ్యాధి కుదిరి, 1875-వ సంవత్సరము సెప్టెంబెర్ నెలలో కాఁబోలు నామె తిరిగి జయరామవాటికి వెళ్లెను. అచట వ్యాధి తీవ్రముగ పెరుగఁజెట్టి అపాయకర స్థితికిరాఁగా శ్రీ గురుదేవుఁ డిది విని విచారించి, "హృదయా, ఆమె మానవజీవితపరమార్థమును సాధింపకయే మరణించిన నెట్లు?" అని హృదయునితో ననెను. కాని దేవీకటాక్షమువలన నామెకు పరిపూర్ణారోగ్యము గలిగెను.

శ్రీ మాతృదేవి దక్షిణేశ్వరము విడిచి వెళ్లిన కొలఁదికాలములో శ్రీ గురుదేవుని నలువదవ జన్మదినమున శ్రీ చంద్రాదేవి పరమపదమొందెను. బహువృద్ధయైనం దున నామె మనశ్శరీరబలములు చాలవఱకు క్షీణించి యుండెను. కాని. యాధ్యాత్మికబలముమాత్రము తఱుఁగ లేదు. ప్రతిదినమును శ్రీ గురుదేవుఁ డామెతోఁ గొంత కాలము గడపుచు నుపచారములు చేయుచుండెను. ఎప్పటి వలె నాయన యొకనాఁ డర్ధరాత్రివఱ కచ్చటనే యుండి వెళ్లి, మరల మఱునాఁ డుదయ తొమ్మిది గంటలకువచ్చి చూడ, నామె స్మృతితప్పి పడియుండెను. పాలు, గంగా జలము, కొంచెకొంచెముగా నిచ్చుచుండిరి. అవసాన కాలమున నామెను గంగాతీరమునకుఁ దీసికొనిపోయిరి. శ్రీ గురుదేవుఁ డామె పాద సన్నిధిని పుష్పములు సమర్పించెను. పిమ్మట నామె శాంతముగ శరీరమును చాలించెను.

సన్న్యాసియగుటచే శ్రీ గురుదేవుఁ డామె యంత్యక్రియలు చేయలేదు. అవియును, శ్రాద్ధకర్మమును, ఆయన సోదరుని కుమారుఁడగు రామలాలు జరిపెను. పుత్త్రిసామాన్యము వలె తర్పణమైన విడువఁగోరెను గాని, వ్రేళ్లు కొయ్యవాఱి కలియనందున నొక నీటిచుక్కయైనను అఱచేతియందు నిలువకుండెను. ఎన్నిసారులు ప్రయత్నించినను నిరుపయోగ మగుటఁజూచి యాయన విలపించెను. ఒకానొక యాధ్యాత్మి కౌన్నత్యస్థితిలో సాధకుఁడు విధ్యుక్తకర్మాచరణమునుండి విముక్తుఁడగుననియు, అది అసాధ్యముకూడ నగుననియు, పిదప నొక శాస్త్రజ్ఞుఁ డాయనకుఁ దెలిపెను.

ఈ కాలముననే మధుమేహావ్యాధిపీడితుఁడై శంభు చరణమల్లికుఁడుకూడ స్వర్గస్థుఁ డయ్యెను. శంభుచరణుఁడు మరణశయ్యపై నుండినప్పుడు శ్రీ గురుదేవుఁ డాతనిని జూచుటకు వెళ్లి, తిరిగివచ్చి, "శంభుని జీవితదీపములోని చమురైపోయినది" అని హృదయునితోఁ జెప్పెను. ఔదార్యమును, భగవద్భీతియును, గల శంభుచరణుఁడు చిట్టచివర వఱకును ధైర్యము వహించియుండెను. ఇఁక కొలఁది కాలమునకు మరణింపనుండి "అవసానవిషయమై నా కేమియు చింతలేదు. ప్రయాణమునకు సంసిద్ధుఁడనై యున్నాను" అని సంతోషముతో నతఁడు హృదయునితోఁ జెప్పెను. విశ్వేశ్వరి శ్రీ గురుదేవునకు స్వజనమని కనుపఱచిన మహానుభావులలో శంభుఁ డొకఁడు. శంభుచరణుని మొదటి సారి చూచినప్పుడే యతఁ డిట్టివాఁడని శ్రీ గురుదేవుఁడు గుర్తించెను. మథురానాథుని యనంతరము తనసౌకర్యములను జూచుటకు జగన్మాతచే నియమింపఁబడిన రెండవ

'రసద్దారు' (సరఘరాదారుఁడు) ఇతఁడని యాయన చెప్పువాఁడు.

ఈ సందర్భమున శ్రీ గురుదేవుని జీవితములోని యొక సంఘటనము తెలిసికొను టుచితము. దీనివలన సత్యసంధత యాయనయం దెంత గాఢముగా నాటుకొనియుండెనో, యేమఱి యుండినపుడుకూడ శ్రీ విశ్వేశ్వరి యాయన నెట్లు రక్షించుచుండెనో, బోధపడఁగలదు. శంభుని తోఁటలో నొక ధర్మవైద్యశాల గలదు. శ్రీ గురుదేవుఁడు తఱచుగా నతిసార వ్యాధి నొందుచుండునని తెలిసి, తిరిగి దేవాలయమునకు వెళ్ళునపుడు 'మీకు కొన్ని మోతాదుల నల్లమందు నిత్తును, తీసికొనిపొండు' అని శంభుచరణుఁ డాయనతోఁ జెప్పెను. శ్రీ గురుదేవుఁ డందుల కంగీకరించెను. కాని, మాటల సందర్భమున నిరువురునుగూడ మఱచిరి. గృహాభిముఖుఁడై కొలఁదియడుగులు వెళ్లినతరువాత, జ్ఞప్తికివచ్చి వెనుకకు పోయి చూడఁగా, శంభుచరణుఁ డింటిలోనికిపోయియుండెను. అతనిని శ్రమపెట్టుట కిష్టపడక, వైద్యశాలలోని యుద్యోగి యొద్ద కొంచెము నల్లమందు తీసికొని కాళికాలయమునకు బయలుదేఱెను. కాని తన కా ప్రదేశము చిరపరిచితమైనను, ఎట్లో తప్పుదారులఁబడుచున్నట్లు తోఁచెను. వెనుకకు తిరిగి చూడ, శంభుచరణు నింటికిఁ బోవుమార్గము స్పష్టముగఁ గాన్పించుచుండెను. తిరిగి వెనుకకువచ్చి, తాను పోవలసిన మార్గమును జాగ్రత్తగఁ జూచుకొని, మరల బయలుదేఱెను. కాని వెనుకటివలెనే తబ్బిబ్బు తప్పదయ్యెను. సరియైన త్రోవ కానరాక వెనుకకు లాగఁబడు చుండినట్లు తోఁచెను. ఈ విధముగఁ గొన్నిసారులు వెనుకకు ముందుకు తిరిగిన

తర్వాత, శంభుఁడు తనయొద్దనుండి నల్లమందు తీసికొమ్మని చెప్పియుండఁగా, తా నితరునియొద్ద తీసికొంటినని హఠాత్తుగ స్ఫురించెను. అనఁగా శ్రీ విశ్వేశ్వరి యావిధముగ నడ్డగింపనిచో, తా నబద్ధము, దొంగతనము, అను రెండు నేరములు చేసియుండునని యాయన కెఱుకపడెను. అంత తిరిగి వైద్యశాలకు వచ్చిచూడఁగా, తన కానల్లమందిచ్చిన యుద్యోగి కూడ లేఁడు. అందుచే, "ఇదిగో మీ నల్లమందు తిరిగి యిచ్చివేయుచున్నాను" అని కేకవేసి యా పొట్లమును గవాక్షములోనుండి లోనికిఁ ద్రోసివేసెను. అప్పుడు దారి స్పష్టముగఁ గనఁబడెను. ఈ విషయమై కాలాంతరమున శ్రీ గురుదేవుఁ డిట్లు చెప్పువాఁడు: "నా బాధ్యతనెల్ల శ్రీ జగజ్జననిపై పెట్టియుఁడుటచే, నామె నన్ను చేయిపట్టుకొని లేశమైనను సత్యపథమునుండి తొలఁగి తప్పుత్రోవఁ బడకుండ నడిపించుచున్నది."

నేపాళసంస్థానసైనికోద్యోగియగు విశ్వనాథోపాధ్యాయుఁ డొకనాఁడు దివ్యతేజోగోళముచే చుట్టఁబడిన మనుష్యుఁ డొకఁడు తనకడకు వచ్చి, అత్యున్నతమైన యాధ్యాత్మికజ్ఞానమును గైకొనుమని పిలుచుచుండినట్లు కలగనెను. కొలఁదికాలములో దక్షిణేశ్వరమున రాణిరాస్మణి తోఁటయం దొక మహాభక్తుడున్నాఁడని విని యాయనను సందర్శించుటకు వచ్చెను. తనకలలోఁ గనఁబడినయతనినే అచ్చటఁ గాంచి మిగుల నాశ్చర్యపడి, ఆయన శ్రీ గురుదేవునిచే నెంతయు నాకృష్టుఁడై యా రాత్రి అచ్చటనే నిలిచిపోయెను. ఆయనయా వతనిని తన పూర్వస్నేహితునివలె

నాదరించెను. శంభుచరణుని పిదప 'రసద్దారు'గా దేవిచే నియమింపఁబడినవాఁ డితఁడని శ్రీ గురుదేవుఁడు చెప్పువాఁడు.

ఆ కాలమున శ్రీ గురుదేవుఁ డింకను అత్యున్నతా ధ్యాత్మికస్థితిలోనే యుండెను. తఱచు సమాధిస్థితుఁడగుచు నొక్కొకసారి మూఁడుదినము లట్లే ఉండును. ఆయన దివ్యమానసికస్థితి నతఁడు గ్రహించి యాయనను గురువుగ భావింప నారంభించెను. ఒకనాఁడతఁ డొక స్నేహితు నితో నిట్లు చెప్పెను: "నేను వేదములు, ఇతర శాస్త్రములు చదివితిని; నానాస్థలములలో ననేకసాధువులను, భక్తులను, సందర్శించితిని. కాని, శ్రీరామకృష్ణుని దివ్యసన్నిధిని మాత్రమే నా కోరికలెల్ల నీడేరెను. నాకు ఆయన శాస్త్రోదిత సత్యములయొక్క స్వరూపముగ తోఁచుచుండును. నీకు కూడ కాలక్రమమున నట్లే తోఁచును."



## కేశవచంద్రసేనుఁడును, బ్రాహ్మసమాజమును

కేశవచంద్రసేనుఁడు గొప్పవిద్వాంసుఁడు, మహావక్త. ఆదిబ్రాహ్మసమాజములోని పురోగమనశాఖయగు భారతవర్షీయ బ్రాహ్మసమాజమును స్థాపించినవాఁడు. తన పవిత్రశీలముచేతను, బుద్ధివిశేషముచేతను, పారమార్థికచింత గలయనేకుల కతఁడు పూజ్యుఁడయ్యెను. అతఁ డొకసారి తనయనుచరులతో బేల్‌ఘరియాలో నొక యారామగృహమున నుండఁగా, శ్రీగురుదేవుఁ డచటికి హృదయునితోఁ బోయెను. "మీరు భగవంతుని సందర్శించితిరఁట, కావున మీ కడకు వచ్చితిని" అని శ్రీగురుదేవుఁడు ప్రారంభించెను. పిమ్మటి సంభాషణచే కేశవుఁడును, అతని యనుచరులును, మంత్రముగ్ధులవలెఁ గట్టుపడిపోయిరి. కొంతవడి కొక కాళికాంబికా కీర్తనను భక్త్యావేశముతోఁ బాడనారంభించి, ఆయన సమాధిస్థితుఁడయ్యెను. ఆస్థితి వారెఱుఁగనిదగుటచే, వారికం దేమియు విశేషము కాన్పింపలేదు. కాని, యా స్థితినుండి హృదయుని యోంకారమంత్రోచ్చారణానంతర మాయన సామాన్యస్థితికి వచ్చుటమాత్రము వారికి విచిత్రముగా నుండెను. మోము దివ్యతేజోవిరాజితమై, నిరర్గళగంగాప్రవాహము వలె దివ్యవాగ్ధార వెలువడి, శ్రోతలను సమ్మోహితుల నొనర్చెను. అనంతకల్యాణగుణపరిపూర్ణుఁడగు సర్వేశ్వరునిగూర్చి యల్పజ్ఞులు తమతమ భావములే సమగ్రములనితలఁచి, వెఱ్ఱివాదములలోదిగి, వ్యర్థకలహము లాడుచుందురనియు, భగవత్స్వభావము నామూలాగ్ర మెఱుఁగుట మానవచిత్తమున

కసాధ్యమనియు, నుదాహరణపూర్వకముగవివరించి, చివరకు భగవత్కృపలేనిది అతని సాక్షాత్కార మెన్నటికిని సిద్ధింపదని దృఢపఱచెను. ఆ మాటల వైఖరిచే నాయన భగవత్సాక్షాత్కారము నొందిన మహాపురుషుఁడని స్పష్టపడుటచే, నా బ్రాహ్మమతప్రధానాచార్యుఁడు స్తంభీభావమునొంది, శిసువువలె నా దివ్యవాక్యము లత్యంతభక్తిశ్రద్ధలతో నాకర్ణించెను. ప్రసంగముచివర శ్రీ గురుదేవుఁడు కేశవునితో "నీ తోఁక యూడిపోయినది" అనెను. ఆ మాట వారికర్థముకాకపోవుటఁ జూచి ఇట్లు వివరించెను: "అప్పుడే పుట్టిన కప్పపిల్లలకు తోఁకలుండునుగదా. ఆ తోఁక లున్నంతకాల మవి నీటిలో మాత్రమే ఉండఁగలవు; ఊడిపోయినపిమ్మట నేలపైఁగూడ నివసింపఁగలుగును. అట్లే అజ్ఞానమను తోఁక మానవున కున్నంతకాల మతఁడు ప్రపంచమను నీటిగుంటలో మాత్రమే నివసింపఁగలఁడు. ఆ తోఁక యూడిన పిదప నతఁడు ఇష్టప్రకారము భగవంతునియందును, ప్రపంచమునందును గూడ నివసింపఁగలుగును. నీ మన స్సిప్పు డట్టి స్థితిలో నున్నది. ప్రపంచములో నుండఁగలవు, దివ్యానందము కూడ ననుభవింపఁగలవు." ఈ విధముగఁ గొంతకాలము గడపి యాయన దక్షిణేశ్వరమునకు తిరిగివచ్చెను.

శ్రీ గురుదేవునియందు కేశవుని భక్తిగౌరవములు దినదినాభివృద్ధినొంది కొన్నాళ్లకు వారి యన్యోన్యసంబంధ మత్యంత సన్నిహితమయ్యెను. రాకపోకలు, ఆధ్యాత్మిక సంభాషణలు, అధికమయ్యెను. బ్రాహ్మసమాజవార్షికోత్సవ సమయమున ననుచరులతోఁ దాను దక్షిణేశ్వరమువచ్చుటో, ఆయనను సమాజమందిరమునకు రప్పించుకొనుటో, ప్రతి

యేట జరుగుచుండెను. ఇతరసమయములందుకూడ, తఱచు వారందఱు దక్షిణేశ్వరమువచ్చి యాయనతో గంగా నదిలో నౌకావిహారముచేయుచు నాయన ప్రసంగములు విని యానందించువారు. కేశవచంద్రుఁ డాయనవాక్యములలోని దివ్యజ్ఞానామృతమును తామమాత్ర మనుభవించుటతో తృప్తినందక, వార్తాపత్త్రికలమూలమునను, ఉపన్యాసముల మూలమునను, ఆయన మహత్త్వమును, ఆయన దివ్య బోధలను, లోకమున కెఱుకపఱచెను. ఆయన పరిచయ భాగ్యముచే కేశవుఁడు క్రమక్రమముగా సనాతనమతసిద్ధాంత ములలోని యమూల్యసత్యములు గ్రహించి, వానిని విధ్యుక్త సాధనలమూలమున ననుభూతము లొనర్చుకొనఁ బాటు పడెను. అన్నిమతములును భగవత్సందర్శనమార్గము లేయను శ్రీ గురుదేవుని విశ్వజనీనసిద్ధాంతము నెంతో పాటుపడి గ్రహించి, "నవవిధాన" మనుపేర దానిని లోకమునకుఁ బ్రకటించెను.

శ్రీ గురుదేవుని సాంగత్యముచే నిట్లు మార్పుచెంది నది కేశవచంద్రుఁ డొకఁడేకాదు. బ్రాహ్మమతోద్యమము నందుఁ బురోగమనాభిలాషులందఱును—అనఁగా నవవిధాన, సాధారణ, శాఖాద్వయమువారును—అట్టి మార్పు నొందిరి. ఇరుతెగలవారి ప్రార్థనాసంకీర్తనములం దాయన స్వేచ్ఛగాఁ బాల్గొనుచుండుటచే నాయన తమతమ పక్షములకే చెందిన వాఁడని వారు నమ్మికొనిరి! భగవంతుని ఏకానేకాది వివిధ భావములలో సాక్షాత్కరింపఁజేసికొన్న వాఁడగుటచే నాయన యీ యిరుతెగలవారిని తమతమ మార్గములలో నవలీలగా నడుపఁగలిగెను. అల్పస్పర్ధలచేఁ గట్టువడక, యావచ్ఛక్తితో

భగవదన్వేషణము చేయఁగలుగుటకై వారివారి దృక్పథముల లోని లోపముల నాయన సవరించుచుఁ దన బోధలలో వా రంగీకరించు భాగమునే యనుసరింపుఁడని వారికిఁ జెప్పు చుండెను.

శ్రీ గురుదేవుని సంపర్కమువలన బ్రాహ్మసమా జికుల కత్యంత లాభము కలిగెను. వారికి భగవంతునియందు మాతృభావము కలుగుట కాయనయే కారణము. అంతకు ముందు వారికి భగవంతుఁడు దూరస్థుఁడు. ఆయన మహిమాతి శయములను స్తుతించుటే వారి ముఖ్యప్రార్థనము. మహిమాభి వర్ణనము కన్నను ప్రేమమార్గ ముత్తమమని తెలిపినది శ్రీగురు దేవుఁడే. వారి కాయన యొకనాఁ డిట్లు చెప్పెను: “భగవం తుని మహత్త్వములు మీ రంతప్రస్తావించుచుండ నేల! తండ్రియొద్ద నున్నప్పుడు కుమారుఁ డెప్పుడైన నతని యిండ్లు, తోఁటలు, గుఱ్ఱములు, పసువులు మున్నగు సంపదను తలఁ చునా, తనయెడ తండ్రికిఁగల ప్రేమను తలఁచునా? బిడ్డలను పోషించి, వారి యోగక్షేమము లరయుచుండుట తండ్రికి సహజమేకదా! అగుచో, తనబిడ్డలమగు మనయెడ భగవం తుఁడు శ్రద్ధవహించియుండుట చిత్రమా? నిజమైన భక్తుఁ డెప్పుడును భగవంతు నత్యంతసన్నిహితబంధువుగా భావించి, అతనితో నపరిమితమైన చనవు గలిగియుండును గాని, నా యన మహిమాభివర్ణనముతోఁ గాలము వ్యర్థపుచ్చుకొనఁడు. ‘నీవు నాకోరికలను సఫలపఱచి నాకు ప్రత్యక్షమై తీరవలెను’ అని అతఁడు స్వాతంత్ర్యముతో నడుగును. మహిమాభి వర్ణనవ్యగ్రులైనచో, నతని మహాన్నత్యము మిమ్ము భీతి గొల్పును. ఇఁక నతఁడు సన్నిహితుఁ డెట్లగును? పరమాప్తు

నిగా భావించినఁగాని భగవంతుఁడు మీకు సాక్షాత్కరింపఁడు.''

భగవంతునిగూర్చి బ్రాహ్మమతస్థులకుఁగల భావము కూడ శ్రీ గురుదేవుని బోధలచే నెక్కువ వైశాల్యమును, సంపూర్ణత్వమును, పొందెను. వారితో నాయన యిట్లు చెప్పవాఁడు: ''భగవంతుని గూర్చి సర్వమును తెలిసినదని చెప్పట యతనిని సంకుచితపఱుచుటయే. అట్లు చేయుట కెవ్వరికిని అధికారము లేదు. అతఁడు సాకారుఁడును, నిరాకారుఁడును గూడ. అతఁడింకను ఏమేమియో యెవఁడు చెప్పఁగలఁడు?'' 'భగవంతుఁడు రూపరహితుఁడు, కనుక నతనిని విగ్రహాదిరూపములఁ బూజించుట పాప' మనువారి కాయన ఇట్లు చెప్పను: ''నీటికి రూపము లేదు నిజమే, కాని మంచుగడ్డగా ఘనీభవించునపుడు రూపముండునుగదా, నిరాకారుఁడైన బ్రహ్మముకూడ నిట్లే సాధకుని భక్తిఫలితముగా ననేకరూపములను ధరించును. బొమ్మమామిడిపండు నిజమగు మామిడిపండు నెట్లు జ్ఞప్తికిఁదెచ్చునో, అట్లే విగ్రహాదిచిహ్నములు కూడ భగవత్సాక్షాత్కారమునకుఁ దోడ్పడును.''

తాము నిరసించుచుండిన విగ్రహారాధనమార్గములో విశేషార్థము కలదని బ్రాహ్మమతస్థులు గ్రహింపసాఁగిరి. బ్రహ్మమునకును తద్విభూతులకును అవినాభావసంబంధము కలదనియును, వానిని వేఱుచేయు టసాధ్యమనియును, వారి కిప్పుడు తెలిసినది. ఏదోయొక విగ్రహములోనే భగవంతుఁడు కలఁడని చెప్పు టెంత యవివేకమో భగవంతుఁడు

కేవలము నిరాకారుఁడనుటకూడ నంత యవివేకమేయని వారికి గోచరమయ్యెను. భగవంతుని నెట్లు గ్రహించినను, యాతని భావములలో నొక దానినే మనము గ్రహింతుము. సర్వాంతర్యామియగు భగవంతుని మూర్తిభావమే ఈదృశ్య ప్రపంచము. అనఁగా నిది యాయన సాకార, సగుణభావము. ఆకారరహితుఁడుగను, గుణసహితుఁడుగను, భావింపఁబడినప్పుడతనినే సృష్టిస్థితిలయకారకుఁడగు నీశ్వరుఁడందురు. ఇఁక భావాతీత నిరాకార నిర్గుణ పరమసత్యమగు నిత్యుఁడును ఆయనయే! ఆద్యంతములు గల సర్వమునకును, మనోగోచరమగు సర్వ భావనములకును—తుద కీశ్వరభావమునకుఁ గూడ —మూలాధారభూతమైన పరమసత్యముకూడ నతఁడే. ఇట్టి సమగ్ర సత్యజ్ఞానము ప్రపంచములోని వివిధ జాతులకును, వివిధమతములకును, సామరస్యము చేకూర్చి యేకీభావము కలిగించును గదా!

కేశవచంద్రుని మిత్రుఁడు ప్రతాపచంద్రమజుందారు శ్రీరామకృష్ణుని గుఱించి 'థీస్టిక్ క్వార్టర్లీ రివ్యూ' అను నొక పత్రికలో నిట్లు వ్రాసెను: "అతని దేమతము? సనాతనాచారబద్ధమగు హిందూమతమే: కాని చిత్రమైన హిందూమతము. రామకృష్ణపరమహంస యేదోయొక హిందూదేవతనుమాత్ర మారాధింపఁడు. అతఁడు శైవుఁడు కాఁడు, శాక్తుఁడు కాఁడు, వైష్ణవుఁడు కాఁడు, వేదాంతియును కాఁడు. కాని ఇన్నియును. శివుని, కాళిని, రాముని, కృష్ణుని, ఆరాధించును. కాని మహా వేదాంతికూడ. విగ్రహముల నారాధించును. కాని, యఖండ సచ్చిదానందమని తాను చెప్పు నిరాకారుఁడును, నద్వితీయుఁడును, ఐన యనంతదైవము యొక్క

యవ్యాయ పరిపూర్ణతనుకూడ ధ్యానించును. దేవతాస్వరూప ములలో ప్రతిదియు నతనికి నిరంతరానంద జ్ఞాన తేజోవంతమై, నిర్వికారమై, ప్రకాశించు నిత్యనిరాకార పరబ్రహ్మమునకును జీవాత్మకును గల దివ్యసంబంధమును గోచరింపఁ జేయు లోక మహాశక్తికి మూర్తిభావములు. అనిర్వచనీయుఁడును, నిర్వికారుఁడును, అనంతుఁడును, సచ్చిదానంద తేజోమయుఁ డును, అగు శాశ్వతపరబ్రహ్మముయొక్క శక్తియే, లీలయే, యీ యవతారరూప మందునని ఆయన మతము. అతఁడు భగవత్కృపచే సజీవుఁడుగా నుండి, మాకు లభించుచుండు నంతకాలము, మేము సంతోషపూర్వకముగా నతని పాదసన్నిధిని గూర్చుండి, పవిత్రతను గూర్చియు, పారమార్థి కతను గూర్చియు, నాధ్యాత్మికతత్త్వమును గూర్చియు, భగవ ద్ధ్యాన ప్రమత్తతను గూర్చియు, మహోన్నతములగు నుపదేశ ములను బడయుచుందుము." ఈయనయే మఱొక వ్యాస ములో నిట్లు చెప్పెను: "సర్వజీవులను బిడ్డలట్లు కాపాడు నిత్యనిర్నిద్రప్రేమమూర్తియగు భగవంతుని విశ్వమాతృ భావము నతఁడు శిశుసహజమగు నిర్మలభక్తితో, సకుంఠిత విశ్వాసముతో, మామనస్సుల కద్భుతముగా వ్యక్తపఱచెను. పురాణ వర్ణితులగు ముప్పదిమూఁడుకోట్ల దేవతల రూపమున హిందూదేశమం దారాధింపఁబడు భగవంతుని యనంత కల్యాణగుణములను ఆయన సహవాసభాగ్యమువలన మేము వెనుకటికంటె బాగుగా గ్రహింపఁ గలిగితిమి." శ్రీ గురు దేవుఁడు బ్రాహ్మమతస్థుల యాధ్యాత్మికదృక్పథము నెన్ని విధముల, నెంతప్రబలముగా, మార్చెనో ఇందుచే స్పష్ట మగును.

శ్రీ గురుదేవుని దివ్యమూర్తిమత్త్వముచే నాకర్షింపఁబడిన బ్రాహ్మసమాజనాయకులలో మఱియొక విఖ్యాతి పురుషుఁడు పండిత విజయకృష్ణగోస్వామి. శ్రీ గురుదేవుని సహవాసభాగ్య మితని కబ్బినప్పటికే భగవత్సాక్షాత్కారము కొఱ కితఁడు తీవ్రముగ నావేదనపడుచుండెను. అందుచే నా భాగ్యమున కతఁడు పరమానందమొంది, తన ప్రయత్నములను ద్విగుణీకరించుకొనెను. ఆ భక్తిసాధనలలో గలిగిన వివిధానుభవములనుబట్టి, బ్రాహ్మమతసిద్ధాంతప్రకార మింతకుము న్నతనికి ఛాందసమని తోఁచుచుండిన భగవద్రూపములయందలి నమ్మకము తిరిగి కుదిరెను. శ్రీ గురుదేవునిచేఁదా నమూల్యసాహాయ్యము నొందిన ట్లతఁడు బహిరంగముగ నంగీకరించెను. వారు వందలకొలఁది మైళ్లదూరములో నుండినప్పుడుగూడ నతనికి శ్రీ గురుదేవుని దర్శనభాగ్యము కొన్నివేళల నెట్లో లభించుచుండెనఁట!

శ్రీ రామకృష్ణదేవుని సత్సాంగత్యభాగ్యము బ్రాహ్మసమాజనాయకులలో మఱియొకఁడగు శివనాథశాస్త్రికిఁగూడ లభించెను. ఆయన నిరాడంబరతకును, అపూర్వభక్తికిని, శివనాథుఁడు మిగుల నాశ్చర్యపడెను. కొలఁదికాలముననే వారికెక్కువ చనవేర్పడెను. కామకాంచనవిజయవిషయికమగు తన మహోపదేశమును శ్రీ గురుదేవుఁ డెట్లు స్వజీవితమున ననుష్ఠించినది చూచి, శివనాథుఁ డాశ్చర్యచకితుఁడయ్యెను. ఈ విషయమై యతఁ డిట్లు వ్రాసెను: "పరీక్షార్థమొక ప్రేక్షకుఁ డాయనచేతిలో కొన్నినాణెము లుంచెను. వెంటనే యాయన సమాధినిమగ్నుఁడై, అవి తీసినపిమ్మటఁగాని శరీరస్మృతికి రాలేదు." శివనాథుఁడు సంసారమున

కును భగవంతునకును పొత్తు కుదుర్ప యత్నించువాఁడగుటచే, శ్రీగురుదేవుని నిష్కళంక నిష్కామజీవితము నతఁడు పూర్తిగా గ్రహింపలేకపోయెను. ఈ విషయమై యతఁ డిట్లు వ్రాసెను: "మా బ్రాహ్మసమాజ కార్యక్రమమున స్త్రీలకుఁగూడ భాగముకలదనియు, మాది సాంఘిక, గార్హస్థ్యమతమనియు, మేము స్త్రీలకు విద్యాసాంఘికస్వాతంత్ర్యములిత్తుమనియు, నే నొకనాఁడు చెప్పఁగా, నాయన ఉద్రేకపూరితుఁడై, 'ఓ అవివేకీ! నీ కొఱకు మీ స్త్రీలు త్రవ్వు గోతిలోఁబడి నశింపుము' అనెను. పిమ్మట తీక్ష్ణదృష్టితో నావైపు చూచుచు నిట్లనెను: 'తోఁటమాలి చిన్నమొక్కలకు కంచెవేసి, పశువులు మేసిపోకుండ సంరక్షింపఁడా? అవి యెదిగి పశువుల వలని యపాయమెుందని పెద్దవృక్షములైనపిమ్మటగదా కంచె తీసివేయును? నీ యాధ్యాత్మిక జీవితవిషయమునకూడ నట్లే చేయుము. ఆరంభమున స్త్రీలతోడి పొత్తు పెట్టుకొనకుము. బలవంతుఁడవై పరిపూర్ణాభివృద్ధి నొందిన పిమ్మట వారిపొత్తు నపేక్షింపవచ్చును.' ఇందులకు 'స్త్రీలు పశువులవలె నపకారముచేయుదురని నే నొప్పుకొనను. ఆధ్యాత్మిక పరిశ్రమలలోను, సాంఘికాభివృద్ధిలోను, వారు పురుషులకు సహకారిణులు' అని నేను ప్రత్యుత్తరమీయఁగా నాయన యసమ్మతిసూచకముగా తల నాడించెను. పిమ్మట చీఁకటిపడు చుండుట చూచి 'నీకు వేళయయినది. ఆలస్యమగునేమో, జాగ్రత్త! లేకున్న మీ యింటియావిడ నిన్ను గదిలోనికి రానీయదు' అని పరిహసించెను."

శ్రీగురుదేవుఁడు శివనాథుని మిక్కిలి ప్రేమించెను. గాఢముగఁ గౌఁగిలించుకొని, దక్షిణేశ్వరమునకుఁ దఱచు

వచ్చుచుండుమని కోరును. అతఁడు రానందున శ్రీ గురు దేవుఁడే అతనియింటి కొకసారి వెళ్లెను. పారమార్థికచింత గలిగి, వాస్తవభక్తితో జీవింపఁ బ్రయత్నించువా రందఱి యెడ నాయన కంత ప్రేమ.

శ్రీ గురుదేవుని ముఖ్యలక్షణములలో నొకటి యీా యన నిరాడంబరత. ఆయన లోకమాతయొక్క బిడ్డఁడు, ఆమెచేతులలోని యుపకరణము. జగజ్జననియొక్క దివ్య మూర్తిలో లీనమైయుండు నున్నతమానసికావస్థలలో తప్ప, నాయన తన శౌగడ్తలను వినఁజాలఁడు. మఱొక ముఖ్య విశేష మాయన యందఱి కన్నివిధములఁ దోఁచుట. ఎవరితో మాటాడుచుండునో అతని చిత్తవృత్తి కర్హముగా సంభాషణ మార్చుచుండును. జ్ఞానమునుగూర్చి భక్తునితో నెన్నఁడును మాటాడఁడు. జీవితముయొక్క యసత్యత్వమును గుఱించి జ్ఞానితో మాటాడునప్పుడు భక్తుఁ డెవఁడైన వచ్చె నేని వెంటనే ప్రసంగవిషయమును మార్చి, జగత్తు భగ వంతుని ప్రత్యక్షమూర్తియగుటచే సత్యమని చెప్పును. ఏలన, లోకపు టస్తిత్వమునుగూర్చిన భక్తిసిద్ధాంతము జ్ఞానికంత వెగటుగానుండదు గాని, లోక మసత్యమనినచో భక్తుఁడు దిగ్భ్రాంతుఁడగును. అందుచే నాయన భక్తున కుచితముగాఁ దన ప్రసంగమును మార్చును. తనకడకువచ్చు ముముక్షువుల నందఱిను వారివారి బుద్ధిప్రచారమార్గముల కడ్డుపడక, ఆదర్శ సిద్ధిమార్గమున నడపుటె, ఆయన యుద్దేశము. వారెల్లరును తమతమ సాధనవిధానసిద్ధి నాయనయందుఁ జూచుచుందురు. నిజమున కాయన సర్వవిధసాధనల పరమావధియే.

కేశవచంద్రుఁడును, విజయకృష్ణుఁడును, శ్రీ గురు

దేవుని సాంగత్యముచే బ్రాహ్మధర్మపథమునందు మార్పులు కలిగించిన దెజేఁగి, శివనాథుఁడు తమ సమాజక్షేమమునకై యాయన పరిచయమును కొంతవఱకు కరికట్టియుంచెను. ఆయన సమాధ్యవస్థ నతఁడు నరముల దౌర్బల్యమువలన కలిగిన మూర్ఛావ్యాధియని తలంచువాఁడు. ఆస్థితిలో నత్యద్భుతదివ్యవర్చస్సు ముఖము నుద్దీప్తమొనర్చుట నంగీకరించునుగాని, అది భావోద్రేకసూచకమాత్ర మనువాఁడు. కాని మహమ్మదు, శ్రీ చైతన్యుఁడు, మున్నగు పూర్వమహాపురుషుల యతీంద్రియావస్థలుకూడ మూర్ఛలనియే అతని సిద్ధాంతము!

ఐనను శ్రీ గురుదేవునెడ నతనికి హృదయపూర్వక గౌరవము. ఆ గౌరవము నతఁ డిట్లు గ్రంథస్థము చేసియున్నాఁడు: "ఆధ్యాత్మికజీవితముకొఱ కిట్టి తృష్ణను, ఇట్టి తీవ్రాసక్తిని, గనుపఱచిన యితరుని నే నెన్నఁడును జూడలేదు. ఆధ్యాత్మికసాధనకై యిన్ని కష్టనష్టము లెవ్వరును పడియుండరు............అతఁడు సాధకమాత్రుఁడు కాఁడనియు, సిద్ధపురుషుఁడే యనియు, నా గట్టినమ్మకము...... నా కతని పరిచయము స్వల్పమైనను, దానివలన నాకుఁగల యనేకాధ్యాత్మికభావములు స్థిరపడి, దృఢపడినవి. అతఁడు నాయెడఁ జూపిన ప్రేమకు నేను బహుకృతజ్ఞుఁడను. నా జీవితములోఁ జూచిన యసాధారణప్రభావులగు మానవులలో నిస్సందేహముగా నతఁ డొకఁడు".

శ్రీ గురుదేవుని సాంగత్యమువలన లాభము నొందిన బ్రాహ్మప్రముఖులలో త్రైలోక్యనాథసాన్యాలు మఱియొకఁడు. ఇతఁడు శ్రీ గురుదేవునియెడ నత్యంత గౌరవము

గలవాఁడు. ఆయన ప్రేమనుగూడఁ జూఱఁగొనెను. ఆయన అతీంద్రియస్థితు లితఁడు తఱచు చూచి, యా యనుభవముచే వంగదేశములో లక్షలకొలఁదిజనుల హృదయములను కరఁగించు నిరుపమానభక్త్యావేశకరములైన యనేకకీర్తనలను రచింపఁగలిగెను. ఇతని పాటలను శ్రీగురుదేవుఁడు మిక్కిలి మెచ్చుకొని, యవి హృదయాంతరాళమునుండి వెలువడినవి కనుకనే తన మనస్సునంతగాఢముగాఁ గరఁగించునని చెప్పువాఁడు.

బ్రాహ్మసామాజికులతోడి సాంగత్యము శ్రీరామకృష్ణునకుఁగూడ నుపకరించెను. ఆంగ్లవిద్యావంతులగు వంగదేశీయుల మనస్తత్త్వము వారిమూలముననే ఆయనకు మొదటఁ దెలియవచ్చెను. పిమ్మట నాయన భావప్రచారమునకు ముఖ్యసాధనభూతులయిన దీవిద్యావంతులే. ఏదో కుగ్రామములోఁ బుట్టి పెరిఁగి, పిదప తీవ్రసాధనాచరణమందు మునిఁగియుండిన వాఁడగుటచే, విద్యావంతులైన సామాన్యజనులతోడిసాంగత్య మాయనకు లేకపోయెను. కావున పాశ్చాత్యభావవైఖరులు జనులచిత్తములం దెంతనిరంకుశాభివృద్ధి నొందుచుండెనో ఆయన ఎఱుఁగఁడు. తన జీవితముపై ఆ విపచ్ఛాయలు సోఁకలేదు. ప్రాచీనహిందూపద్ధతుల ననుసరించియే జీవితలక్ష్య మాయన సాధించెను. ఆ మహానుభావుఁడు హైందవులలో హైందవుఁడు. ఆయనకు ధర్మాచరణమనఁగా మొదటినుండి తుదవఱకు త్యాగమే: భోగస్పర్శనెఱుఁగని త్యాగము. బ్రాహ్మసామాజికుల సాంగత్యమువలన హిందూదేశపు ఆధ్యాత్మికవాతావరణమప్పుడెట్టి స్థితియందుండెనో మొట్టమొదట నాయన తెలిసి

కొనఁగలిగెను. పాశ్చాత్య తత్త్వవేత్తల యూహలకే యప్పుడు ప్రాముఖ్యము. హిందూ సాధువులకును, మతప్రవక్తలకును, ఆదరణ లేదు. కావుననే స్వజీవితములో సనాతనధర్మసత్యములను తాను స్పష్టముగా వ్యక్తపఱచినను, వాని కంగీకారము లభించుట మిగుల కష్టమయ్యెను. విద్వల్లోకము భగవంతుని, ప్రపంచమును, చిత్రముగా కలగలుపుచేసెను. ఈ వాతావరణమును మార్పుటాయనకు మిక్కిలి కష్టముగఁ దోఁచెను. కాని, దీనికిఁగూడ భగవత్సంకల్పమే మూలమని గ్రహించి, నిరుత్సాహ మేమాత్రము లేక, పూర్ణప్రేమతో నాయన బ్రాహ్మసామాజికులకు తన సిద్ధులు పూర్తిగాఁ దెలిపి, తన యుపదేశసారమును—అనఁగా త్యాగావశ్యకత, స్వమతబోధానుసరణము, భగవద్భక్తి, నిష్ఫలాపేక్ష, యుక్తాయుక్తవిచక్షణ, మున్నగుభావములను—తఱచు విశదీకరించువాఁడు. వారి మనస్తత్త్వము నెఱిఁగియుంటచే, వారి కిష్టమున్నంతవఱకే తనబోధనలను స్వీకరింపవచ్చునని వారికి స్వేచ్ఛనిచ్చెను. అప్పటి స్థితిగతుల కంతమాత్రము చాలునని యాయన యభిప్రాయము. కాని, సర్వసంగపరిత్యాగులై, తన యుపదేశములను పూర్తిగా గ్రహింపఁగల జగదీశ్వరీ పుత్త్రులను గలసికొనవలెనను నాత్ర మప్పటినుండి వేయిరెట్లధికమయ్యెను.



## కామార్పుకుర్‌కు శ్రీ గురుదేవుని కడసారిరాక

కేశవచంద్రసేనుని పరిచయము కలిగిన కొన్నాళ్లకు శ్రీ చైతన్యసంకీర్తనోత్సవము చూడవలెనని శ్రీ గురుదేవునకు కోరిక గలిగెను. ఒకనాఁ డాయన తన గదిబయట నిలిచి యుండఁగా, నొక జనసమూహము పంచవటిదిక్కునుండి బయలుదేఱి దేవాలయారామసింహద్వారముకడకు వచ్చుచు, క్రమముగా చెట్లచాటున మాయమైన ట్లాయనకుఁ గనఁబడెను. శ్రీ చైతన్యుఁడు దివ్యోత్సాహపరవశుఁడై తన యనుచరులలో నెల్ల నత్యుత్తములగు నద్వైత నిత్యానందులతో, నా గుంపుమధ్య మెల్లగా వచ్చుచుండెను. నాలుగువందలసంవత్సరములనాఁటి భక్తిభావోన్మాదపూరిత సంఘటనము తిరిగి శ్రీ గురుదేవునియెదుట ప్రదర్శింపఁబడెను. ఈ సమూహములో కొన్నిముఖము లాయన మనస్సున స్పష్టముగా నాటుకొనెను. కాలాంతరమున వారిని తన ముఖ్యశిష్యులలోఁ గొందఱిగ గుర్తుపట్టి, వారు శ్రీ చైతన్యుని భక్తకోటిలోనివారని విశ్వసించెను.

పిమ్మటఁ గొన్నాళ్లకు శ్రీ గురుదేవుఁడు కామార్పుకుర్‌కు కడసారి వెళ్లెను. అక్కడ నుండినప్పుడు చుట్టుపట్టు గ్రామములకు వెళ్లి, యచటి వైష్ణవసంకీర్తనములలోఁ బాల్గొనుచుండెను. సంకీర్తనసమయములందు శ్రీ గురుదేవుని దివ్యానందస్థితికిని సమాధినిమగ్నతకును ఆశ్చర్యచకితులై, చుట్టుప్రక్కలగ్రామములనుండి యితరభజనకూటములుకూడ వచ్చుటకు వచ్చుచుండెను. ఆ స్థల మీ విధమున స్త్రీ పురుష

లతోఁ గ్రిక్కిఱిసి, యహోరాత్రములు సంకీర్తనము జరుగుచుండెను. ఈ విషయము శ్రీ గురుదేవుఁ డిట్లు చెప్పెను: "నేను హృదయుని యింటిలో నుండఁగా నన్ను శ్యామబాజారునకు తీసికొని వెల్లిరి. ఆ గ్రామములో నిఁకఁ బ్రవేశింతు ననఁగా, నాకు శ్రీ చైతన్యుని దర్శనమైనది. దీనినిబట్టి యా గ్రామజనులు చైతన్యభక్తులని గ్రహించితిని. సంకీర్తన మత్యంతహృదయరంజకముగా నుండుటచే, నేదునాళ్లహోరాత్రములు జను లేకధారగా వచ్చుచుండిరి. ఎల్లప్పుడు గాననాట్యములే. జనులు గోడలపైకి, చెట్లపైకిఁగూడ, నెక్కి చూచుచుండిరి. నేను నటవరగోస్వామియింటిలో నివసించుచుంటిని. అచ్చటఁగూడ నిదేవిధముగా రేయుంబవళ్లోకే జనసమ్మర్దము. ఉదయమొకింత విశ్రాంతికై నేను రహస్యముగా జాఱివెల్లినను, జనసమూహము మద్దెళ్లతోను, తాళములతోను, అచ్చటఁగూడ సిద్ధమగును. తిరిగి అదేకథ! మా స్నానభోజనములు మధ్యాహ్నము మూఁడు గంటలకు! ఇంతటితో కథ ముగియలేదు. దినమున కేడుసారులు మరణించి మరల బ్రతుకు నొకమనుష్యుని గూర్చి జనులు చెప్పకొన మొదలిడిరి. ఈ ఘాక కాఁగలేక సొమ్మసిలి పడిపోవుదునేమోయని, హృదయుఁడు నన్నొరి బయటికి లాగుకొనిపోయినను, అచ్చటకూడ జనసమూహము, తాళములు, తప్పెటలు! 'మీరెందు కీ విధముగా మా వెంటఁ బడెదరు? ఇదివఱ కెన్నఁడును సంకీర్తనములు వినియుండలేదా?' అని హృదయుఁడు వారిని మందలించును. దూరగ్రామములనుండి జనులు వచ్చుచు రాత్రులు కూడ వచ్చటనే యుండిపోవుచుండిరి. దివ్యాకర్షణ యన

నేమో నాకచ్చట బోధపడినది. భగవంతుఁడు భూమిపై నవతరించి చేయు లీలయందుఁగల యాకర్షణప్రభావము యోగమాయాశక్తిచేఁ గలుగుచుండును. సమ్మోహనాస్త్రమై యెల్లరహృదయములను వశపఱుచుకొను భగవంతుని దురవగాహశక్తి యదియే!

కామార్పుకుర్‌లో నుండినకాలమున తనకుఁ గలిగిన యితరవిశేషానుభవములనుగూడ శ్రీ గురుదేవుఁ డిట్లు చెప్పువాఁడు: "ఆ యూరి గోస్వాములు (వైష్ణవప్రముఖులు) వారికి రావలసిన కట్నములలో మేము భాగము కోరుదు మేమోయని నాతో జగడమాడవచ్చిరి. కాని నే నొకబట్టనైనను, చివర కొకనూలుపోగునైనను, తీసికొనని వారు కనుఁగొనిరి. నేను బ్రహ్మజ్ఞానినని వారితో నెవరో చెప్పిరి. అందుచే వారు నన్ను పరీక్షింపనెంచి, వారిలో కొంద ఱిట్లు ప్రశ్నించిరి: 'అయితే యితనికి మెడలో తావళ మును, నుదుటిపై బొట్టును లే వెందుచేత?' దీనికి వారిలో నొకఁడు 'కొబ్బరిచెట్టుయొక్క యెండుమట్టలవలె వానియంత టవియే రాలిపోయినవి!' అని బదులుచెప్పెను. జ్ఞానోదయా నంతరము సాధకునకు బాహ్యానుబంధములెల్ల తమంత తామే విడిపోవుననుట కుదాహరణముగా నీ సామ్యమును చెప్పుచు, శ్రీ గురుదేవుఁడు తన సహజసరళస్వభావముతో తా నెక్కడ దీనిని వినెనో చెప్పుచుండువాఁడు.

శ్రీ రామకృష్ణుఁడు కామార్పుకుర్‌లో నుండఁగా నొకసారి అజీర్ణవ్యాధివలన ద్రవాహారమునే తీసికొను చుండెను. ఒకనాఁటిరాత్రి పాలు, బార్లీగంజి, వాడుక

ప్రకారము తీసికొని పరుండెను. అర్ధరాత్రమం దాకస్మికముగా స్త్రీలను లేపి తినుట కేమైనం బెట్టుమనెను. . యథాప్రకారము పాలు, బార్లీగంజి, పుచ్చుకొంటిరే యని యడుగంగా "ఎప్పుడు పుచ్చుకొంటిని? నే నిప్పుడే కదా దక్షిణేశ్వరమునుండి వచ్చుచున్నాను" అని యాయన మరలం జెప్పెను. వారు కళవళపడి, శ్రీ గురుదేవుం డేదో యసాధారణదశలోనుండి మాటాడుచున్నాండని గ్రహించిరి. కాని ఇంటిలో నటుకులుతప్ప వేఱేమియు లేవు. అటుకులుమాత్రమైనచోం దిననని యు, వేఱేదియైనం గావలెనని యు నాయన చెప్పుటచే, గాఢపదార్థ మా స్థితిలో ప్రతికూలించునని భీతిలియు, మిఠాయీలు కొనితేక తప్పినదికాదు. ఆ యటుకులను, మిఠాయిదినుసులను, ఒకయావగింజంతైన మిగులకుండ నాయన తినివేసెను. కాని మరుసటియుదయమున నాయన చెక్కుచెదరకుండుటను చూచి, వారు సంతోషాశ్చర్యమగ్నులైరి. సేరు మిఠాయితో వ్యాధి కుదిరినది!

జయరాంబాటిలోంగూడ నొకసారి ఇట్లే జరిగెను. ఒకరాత్రి యందఱును నిద్రించుచుండినప్పుడు, తన కపరిమితమైన యాంకలి వేయుచున్నదని యాయన చెప్పెను. నీళ్లలో వేసిన యన్నముతప్ప నప్పుడింకేమియు నింటిలో లేదు. దానినే పెట్టవలసివచ్చినది. ముగ్గురికిం జాలునంత యన్నమంతయు తినెను. కాని ఏ హానియు కలుగలేదు! అప్పుడుకూడ నాయన ఏదియో యసాధారణస్థితిలో నుండెననుట స్పష్టము. మానవచిత్తము సమయోచితరీతిని శరీరధర్మములంగూడ

నెట్లు మార్పుచెందింపఁగలదో, ఈ స్వల్పవిషయముల మూలమున శ్రీ గురుదేవుఁ డెంత చక్కఁగా వ్యక్తపఱచెను!

శ్రీ గురుదేవుఁ డొకనాఁడు గ్రామాంతరము వెళ్లుటకై పల్లకీయొద్దకు వచ్చెను. ఎఱ్ఱని పట్టుబట్ట, తాంబూలరాగరక్తిమము, చేతి బంగరు తాయెత్తు, ఆయన పచ్చని మేనిచాయ కెంతయు తగి యొప్పులు గులుకుచుండెను. సాఁగనంపుట కది వఱకే జనసమూహ మచ్చట చేరియుండెను. పల్లకి యెక్కఁబోవుచు జనసమూహమునుజూచి, వారిరాకకు కారణ మేమని యాయన హృదయు నడిగెను. "నీవు ఊరికి వెళ్లుచున్నావు, కొన్నాళ్లవఱకు రావుగదా, అందుచే వచ్చిరి" అని యతఁడు బదులుచెప్ప, "ప్రతిదినము చూచుచున్నాలో నేఁ డేమి విశేషముకలదని ఇంత పెద్ద గుంపుచేరినది?" అని ఆయన మరల నడిగెను. "నిజమేమనఁగా నీ యిప్పటి దుస్తుతో నీవెంతో చక్కఁగా నగపడుచున్నావు!" అని హృదయుఁడు సమాధానముచెప్పెను. తన శరీరసౌందర్యము జనుల నిట్లాకర్షించుచుండుట విని యాయన మిగుల నొచ్చుకొని, ఆ భావమే తనకు చాల నసహ్యముగా నుండుటచే, "ఒకమనుష్యుని చూచుటకా యింతమంది జనులు గుమికూడుట! నేను వెళ్లను. నే నెక్కడికి వెళ్లినను జను లిట్లే చేరుదురు" అని తిరిగి గదిలోనికిపోయి, అత్యసహ్యతతో నా దుస్తునెల్ల తీసివేసెను. హృదయుఁడును, ఇతరులును, ఎంత బతిమాలుకొన్నను బయలు దేఱలేదు. శరీరసౌందర్యము మొదలుగాఁగల భౌతికవిషయములయెడల శ్రీ గురుదేవున కెంతటి యసహ్యాభావమో విశదపఱచుట కీయొక్క నిదర్శనమే చాలును.

కొన్ని నెలలు తన స్వగ్రామమం దుండిన తర్వాత, శ్రీ గురుదేవుఁడు దక్షిణేశ్వరమునకు వచ్చెను. ఒకనాఁ డాయన శయ్యపై మలినవస్త్రము పఱచియుంటఁజూచి లక్ష్మీ నారాయణుఁడను నొక మార్వాడీభక్తుఁడు ఇట్టి యవసరములలో నుపయుక్తమగుట కాయనపేర నొక పదివేలరూప్యముల నిచ్చి పెట్టుదునని చెప్పెను. శ్రీ గురుదేవుఁ డిది సహింపఁజాలక, చేతులుమోడ్చి అట్టియుద్దేశము లెన్నఁడును పెట్టుకొనకుండుమని యతనిని బతిమాలుకొనెను. శ్రీ మాతృదేవి పేరటనైన నా ధనమును స్వీకరింపుమని యతఁడు హృదయుని వేఁడెను. ఇది శ్రీ గురుదేవునకు తెలిసి, అప్పుడుకూడ నది నిజమునకు తనదేయగుననియును, కూడఁబెట్టు నూహయే తనకు దుస్సహమనియును జెప్పెను. అప్పటికిని ఆ మార్వాడి తన ప్రార్థన మాననందున శ్రీ గురుదేవుఁడు కంటనీరు పెట్టుకొని, "అమ్మా, నీయొద్దనుండి నన్ను వేఱుచేయఁగోరు నిట్టి మనుష్యుల నిచ్చట కేల తీసికొనివచ్చెదవు?" అని దీనముగా నేడ్చెను. ఈ విషయమునుగూర్చి శ్రీ గురుదేవుఁడు కాలాంతరమునఁ జెప్పుచు, "మధురుఁడును, లక్ష్మీనారాయణుఁడును, నాకు ధనదానము చేయఁగోరినప్పుడెల్ల నా తల నెవరో ఱంపముతోఁ గోయుచుండినట్లుండెడిది!" అని తన నిర్లిప్తతను వెల్లడించెను.

హృదయుఁడు కొన్నాళ్లనుండి యొక యావుదూడను మిక్కిలి శ్రద్ధతోఁ బెంచుచుండుటఁజూచి శ్రీ గురుదేవుఁ డొకనాఁడు, "ఆ దూడతో నీవేమి చేయఁదలఁచితివి?" అని యడుగఁగా, "దీనిని మా యింటికిఁ దీసికొనిపోయెదను. కొలఁదియేండ్లలో అరకకుఁ బనికివచ్చు చక్కని యెద్దగును"

అని హృదయుఁడు బదులుచెప్పెను. శ్రీ గురుదేవుఁ డీ మాటలను వినిన వెంటనే మూర్ఛాగతుఁడయ్యెను. చాలసేపటికి తిరిగి స్మృతివచ్చి, "ఆహా! లౌకికులలో నిలువచేయు స్వభావమెంత గాఢము! ఈ చిన్నదూడ కొన్నాళ్లకు పెద్దదై, చివరకు పొలములు దున్నుటకు పనికివచ్చునఁట! ఇంత ముందుగా పన్నాగములు పన్నెదరే కాని, భగవంతునిపై నాధారపడరుగదా! ఆహా! ఏమి యీ మాయ!" అనెను. అప్పుడాయన నెవరో నెత్తిమీఁద మోదుచుండినట్లుండెనఁట!

అతీంద్రియదశలందు సూక్ష్మరూపములతో నంబిక తనకిదివఱకే కనుపఱచిన పరిశుద్ధాత్ములగు శిష్యులను గలిసికొనవలెనని శ్రీ రామకృష్ణున కిప్పు డత్యంత తీవ్రవాంఛ బయలుదేఱెను. తనసందేశమును ప్రపంచమున కెఱుకపఱుపనేర్పడ్డ యా లోకేశ్వరీ ప్రియపుత్త్రులను సుశిక్షితులుగఁ జేయవలసిన కాలము వచ్చినది. అందుచే వారికి తనసిద్ధులను బోధింపవలెనను నారాటముచే నాయన కుమిలిపోఁజొచ్చెను. ఈ విషయమై కాలాంతరమున నాయన యిట్లు చెప్పువాఁడు: "అప్పుడు నాకుండిన యాత్రమునకు మేరలేకుండెను. లౌకికజనుల వైహికప్రసంగములు రోఁతగా నుండినందున, నాయనుంగుస్నేహితులు వచ్చు దినముకొఱకు కన్నులుకాచునట్లెదురుచూచుచుంటిని. వారితో సంభాషించి, నా సిద్ధులను గుఱించి వారితోఁ జెప్పి, నా మనస్సును వెల్లడిచేసినయెడల నాకు శాంతికలుగునని యూహించితిని. ప్రతిస్వల్పవిషయముకూడ వారినే నాకు జ్ఞప్తిచేయుచుండెను. నా మనస్సు వారిని గుఱించిన తలంపులతోనే నిండిపోయెను. ఎవరితో నేమిచెప్పు

వలెనో, ఎవరికేమి యీయవలెనో, యీ విధముగా నా మనస్సులో నిర్ణయము చేసికొనువాఁడను. పగలెట్లో భరించి యూరకుండఁగలిగితినిగాని సూర్యాస్తమయమైనతోడనే ఇఁక నణఁచుకొనఁజాలక, 'అయ్యో! మఱియొక దినము గతించెనే! వారింకను రాలేదే!' యను తలంపు బాధింప, గుడిలో సాయంకాలసేవ జరుగుచుండినప్పుడు, నేను ఇంటిపై కెక్కి హృదయవేదనతోఁ బరితపించుచు, గొంతెత్తి, 'నా బాలులారా! రండు! అయ్యో! మీ రెక్కడ నున్నారు! మీరు లేని యీ జీవితమును భరింపఁజాలను!' అని యేడ్చువాఁడను. బిడ్డనుచూచుట కేతల్లియు, మిత్రుని కొఱకే స్నేహితుఁడును, ప్రేయసికొఱకే ప్రియుఁడును, నేను నా బిడ్డలకొఱకుఁ బరితపించుచుండినట్లు పరితపించియుండరు. అహో! ఆ తీవ్రవియోగవేదనను మాటలతో వర్ణించు టెట్లు! ఈ ఆరాటము కలిగిన కొలఁదికాలముననే భక్తులు రానారంభించిరి."



# శ్రీ రామకృష్ణుని భక్తకోటి

శ్రీ రామకృష్ణుఁ డీ పుడమిపైఁ గడపిన ఏఁబదేండ్లలో, మొదటి 19 ఏండ్లలో నాయన జీవితలక్ష్యము క్రమక్రమముగ నాకృతిదాల్చినది. తా నేదో యొక మహోన్నతకార్యము సాధింప జన్మించితిననియు, తనజీవితము లోకుల కాదర్శప్రాయమగు నుత్తమోత్తమమార్గముపట్టవలెననియు, భగవత్సాక్షాత్కారమొందుట తన ప్రథమకర్తవ్యమనియు, నీ కాలమున నాయనకు స్పష్టమయ్యెను. లోకగురుత్వపదవి నధిష్ఠించుట తనజీవితపరమలక్ష్యమని యనంతరకాలమున నెఱుకపడెను. రెండవ 19 సంవత్సరములలో నలౌకికాద్భుతకఠోరతపస్త్యాగములతోఁ దా నెఱిఁగిన సర్వవిధమతసాధన లభ్యసించి, యన్నిట నొకేపరమార్థమును దర్శించి, సర్వమతములును భగవంతుని చేరు మార్గములేయని గ్రహించెను. నవయౌవనోద్భాసియు, రూపలావణ్యతేజోరాశియు, నగు నర్ధాంగితో నిరంతరసాహచర్య మొనర్చుటచేఁ దన నిర్జితేంద్రియత్వము నగ్నిపరీక్షకుఁబెట్టి పరిపూర్ణవిజయము గాంచెను. చివర కామెను 'షోడశీ' రూపఁగా నారాధించుటతో సాధనాంతముచేరి, తనజీవితోద్దేశమును నెఱవేర్చుటకు వలయు మహోన్నతాధ్యాత్మికశక్తి నపారముగ గడించి, పరిపూర్ణుఁడయ్యెను. ఇఁక మిగిలినది తా నపూర్వవిధమున సాధించిన యాధ్యాత్మిక దివ్యామృతమును లోకమున జిజ్ఞాసువులకును, ముముక్షువులకును, పంచిపెట్టుటయే. ఆయన భూలోకమున నవతరించిన దిందుకొఱకే. ఆయన జీవిత

చరమభాగము 12 ఏండ్లలో చేసిన దీదివ్యకార్యమే. కావుననే, లేఁగటియావు పాలవ్రేఁగు భరింపఁజాలక దూడకై యెంత యారాటముతో, ఎంత యావేశముతో, ఎంత యనురాగముతో, అంభారావములు మిన్నుముట్టించునో, అట్లే ఆయనయుఁ దనకడకు రానున్న బాలశిష్యులను, పరిశుద్ధాత్ములగు దేవీపుత్త్రులను, దుర్భరవిషాదవేదనతో, గృహోపరిభాగము నెక్కి యుచ్చైఃస్వరమున నఱచి పిలువసాఁగెను. ఈ యమృతపుత్త్రులలో ననేకుల నాయన కతీంద్రియదృశ్యములలో జగన్మాత యిప్పటికే చూపియుండెను. వారీదివ్యామృతము నీయవ్యయసాగరమునుండి గ్రహించి లోకమున కందఁజేయుటకై యుద్భవిల్లిన కారణజన్ములు. దక్షిణేశ్వరారామములో వెల్వడిన యీ యుద్రిక్తాహ్వాన మెచ్చటెచ్చటనోయున్న యీ బాలుర హృదయకుహరములలో నేవిచిత్ర రీతిని, ఏ యద్భుతనిస్తంత్రీమార్గమునఁ, బ్రతిధ్వనించెనో కాని వారు వెనువెంటనే రానారంభించిరి. బాలార్కుని థారుణీరంగమునఁ బ్రవేశపెట్టు సాంధ్యరాగచ్ఛాయలవలెఁ గొందఱు ముముక్షువులు మొదటనే తెంచి, యీ బాల శిష్యులరాకకుఁ గారణమైరి.

కాని యీ నూతనాగతులను బేర్కొను లోపల నీయవతారమూర్తిచే నిప్పటికే యాకర్షింపఁబడినట్లు మన మెఱిఁగియున్నవారి నొకింత జ్ఞప్తికిఁ దెచ్చుకొనినచో, శ్రీరామకృష్ణ భక్తకోటిని గొంత సమగ్రముగఁ బర్యవేక్షించినవారమగుదుము.

ప్రప్రథమమునుండియు తన యలౌకిక సౌరభములు దిగ్దిశల వెదచల్లి, యాబాలగోపాల మెల్లర నాకర్షించి,

యానందపారవశ్యమునఁ దేల్చు దివ్యకుసుమమువంటివాఁడు శ్రీరామకృష్ణుఁడు. నిఱుపేదకుటుంబము, బడియీడు బాలుఁడు, చదువైన నంతగాలేదు; కాని కామార్పుకుర్‌లో నా బాలు నెఱుఁగనివారు లేరు. గాఢముగాఁ బ్రేమింపనివారు లేరు. ఈ ప్రేమ మనేకులలో గౌరవముగాఁ బరిణమించినది. కొందఱిలో నింకను గాఢమై భక్తిరూపమును దాల్చినది. శ్రీనివాసుఁడు భక్తిపారవశ్యమున నీ బాలుని బూజించెను. వృద్ధుఁడగు సీతానాథపాయిన్ ఇతని నిష్టదైవముగాఁ జూచు కొనుచుండెను. వృద్ధురాలగు ప్రసన్నమయీదేవి ఇతనియందు బాలకృష్ణునిఁ గాంచుచుండెను. ఇతని మేనత్తకొమార్త హేమాంగినీదేవి దాదాపు పిరువదేండ్లు పెద్దదైనను, ఇతని పాదములను బుష్పములతోఁ బూజించుచుండెను. భైరవీ బ్రాహ్మణి యిష్టదైవమగు శ్రీరామచంద్రు నాయనయందుఁ బ్రత్యక్షముగాఁ గాంచి, యాయన భుక్తశేషమును బ్రసాద ముగా స్వీకరించెను. సుప్రసిద్ధపండితులు, సాధకులు, నగు వైష్ణవచరణగౌరీపండితు లాయనను భగవదవతారమూర్తిగా నిర్ణయించిరి. వీరిలో వైష్ణవచరణుఁ డాయన పవిత్రపాద స్పర్శచే దివ్యావేశపూరితుఁడై సద్యఃకల్పితశ్లోకములతో నాయనను గీర్తించెను. గౌరీపండితుఁడును గొన్నాళ్లపిదప శిష్యప్రాయుఁడై యాయనకడకు వచ్చి, యాధ్యాత్మికసాధన లభ్యసించెను. పండితసార్వభౌములు, సర్వశాస్త్రపారంగతులు, నగు నారాయణశాస్త్రియు, పద్మలోచనుఁడును, ఆయనను దర్శించినపిదపఁ, దమ యల్పజ్ఞత నంగీకరించిరి. వీరిలో నారాయణశాస్త్రి యాయన నాశ్రయించి సన్న్యాస మిప్పించుకొనెను. పద్మలోచనుఁడును దనయిష్టదైవము

నాయనయందుఁగాంచి యాత్మార్పణ మొనర్చుకొనెను. శ్రీ గురుదేవుని ప్రశంసలనందిన బాలభక్తులగు గోపాల గోవిందులను గూడ మన మిట జ్ఞప్తిచేసికొనవలెను. ఇఁక శ్రీ గురుదేవుని సాధనకాలమున నొక్కొక్కసాధన ముగియుటతోడనే ఆయాశైగసాధకులు వందలకొలఁదిగా వచ్చి యాయన యద్భుతబహుముఖసిద్ధులుగాంచి నివ్వెఱఁగంది, యనుష్ఠానవిధు లాయనకడ నభ్యసించి, తమశిష్యులకును అనుచరులకును నేర్పుచుండిరి. బహుసంఖ్యాకులగు వీరి పేళ్లు మన మెఱుఁగుమార్గము లేదు.

ఈ పైఁ బేర్కొనఁబడినవారికిని సాధనాంతమునఁ బరిపూర్ణతఁగాంచిన శ్రీ గురుదేవు నాశ్రయించిన భక్తకోటికిని ఒక ముఖ్యభేదము కలదు. మొదటివా రందఱును సనాతన ధర్మమతావలంబులు, పూర్వాచారపరులు. ఈ క్రొత్తవా రట్టివారుకారు, ఆంగ్లేయవిద్యనభ్యసించి, పాశ్చాత్యసంస్కృతిని పాశ్చాత్యదృక్పథమును అవలంబించి, హిందూమతాచారములను నిరసించుచు, వేదశాస్త్రాదుల నసంబద్ధప్రలాపములుగ భావించుచు, నుండిన నాస్తికప్రాయులు. ఇందనేకులు క్రైస్తవభావచ్ఛాయామిశ్రమగు బ్రాహ్మసమాజములోఁ జేరినవారు. బ్రాహ్మసమాజనాయకుఁడగు కేశవచంద్రునం దపారభక్తిగౌరవములు కలవారు. ఈ కేశవచంద్రుఁడే శ్రీ గురుదేవుని సాంగత్యముచే ననేకవిషయములలోఁ దన పూర్వదృక్పథము మార్చుకొని యాయన సందేశము "నవవిధాన" నామమునఁ బ్రసిద్ధినొందించుటవలనను, ఆయన మహత్త్వమును బత్త్రికలలోను, ఉపన్యాసవేదికల మీఁదను, బాహాటముగాఁ బ్రశంసించుచుండుటవలనను,

హిందూమతవైముఖ్యముగల యీ వంగయువకబృందవుదృష్టి శ్రీ గురుదేవుని దెసకు మరలఁ జొచ్చెను.

ఇఁక నూత్నభక్తగణమును బేర్కొందము. కాని అంతకుముం దొకమాట చెప్పవలసియున్నది. కాలక్రమదృష్టిని జూచినను, ఔన్నత్యదృష్టిని జూచినను, శ్రీ గురుదేవుని శిష్యగణములో నత్యగ్రస్థాన మాయన యర్ధాంగలక్ష్మియగు శ్రీమాతృదేవిది. కాని శిష్యురాలైనను, ఆమెనితరశిష్యులతోఁ జేర్చి చెప్పుట అపచారప్రాయము. శ్రీ గురుదేవునిచేతనే జగన్మాతృమూర్తిగాఁ బూజింపఁబడి, యాయన సాధనఫలముల నన్నిటి నుపాయనముగాఁ గొని, యాయన స్థానమున లోకమున నుంపఁబడిన యా పరమపావనసాధ్వీమతల్లి శ్రీ గురుదేవునితోఁగూడఁ బార్వతీపరమేశ్వరులవలె నొకేస్థానము నాక్రమింపవలసినది. శిష్యగణములో మహోన్నతులగు శ్రీ వివేకానందస్వామియు, శ్రీ బ్రహ్మానందస్వామియు, నామెను ఆయనతో సమానముగనే భావించుచుండిరి. ఆమెకే కొంతయాధిక్యము నిచ్చుటకూడ కలదు. "తల్లి మొదట, తండ్రి పిదప" అని శ్రీ వివేకానందస్వామి యొకసారి వీరినిగూర్చి చెప్పెను. కావున నామెను వీడి శిష్యగణము నిప్పుడు పేర్కొందుము.

శ్రీ గురుదేవుని శిష్యులలో నాయన సన్న్యాసశిష్యులు ప్రథమగణ్యులు. వారిలోఁగూడ 'ఈశ్వరకోటు'లనియు, 'నిత్యసిద్ధు'లనియు, నాయనచే నెన్నఁబడినవారి కగ్రస్థానము కలదు. అవతారమూర్తిలక్షణములు కొన్ని కలిగి, లోకమునకేదేనొకసందేశ మందఁజేయుటకై జన్మించిన నిత్యసిద్ధుల

(జన్మాదినుండియు సిద్ధులై, మాయాజాలమున నెన్నఁడును దగుల్కొనని వారు) నీశ్వరకోటులందురు. కొందఱు శిష్యులకు శ్రీ గురుదేవుఁడు "అంతరంగికు" లను పేరు పెట్టెను. కాశీ పురోద్యాననివాసదినములప్పటికే ప్రపంచమును త్యజించి, అచట నహోరాత్రములుండి, గురుసేవానిమగ్నులై యుండిన వారి కీపేరు వచ్చినది. కాని నిత్యసిద్ధులు కాకపోయినను, ఈశ్వరకోటులు కాకపోయినను, అంతరంగికులు కాకపోయి నను, ఈ సన్న్యాసశిష్యు లందఱును, గృహస్థశిష్యులలో ననేకులును, మహోన్నతాధ్యాత్మికసిద్ధులు పొంది, జీవన్ముక్తులైనవారే. సముద్రములోఁ జేరి, సముద్రముగా మాఱి పోయిన నదుల పూర్వరూపములును పూర్వపరిమాణములును నిలిచియుండునా ? కాని వివిధదివ్యప్రభ లీను శ్రీరామకృష్ణరత్నరాజములోని కొన్నిప్రభలు కొందఱియందును, కొన్నిప్రభలు మఱికొందఱియందును నధికముగఁ బ్రదర్శితము లైనవనుట మాత్రము సత్యము.

గృహస్థభక్తులలో నెవరెవరు శిష్యులో, యెవరు కారో, నిస్సంశయముగఁ జెప్పుట కాధారములు లేవు. కావున నీ విభజన కొన్నిపట్ల పొరపాటుగా నుండవచ్చును. వివేకవైరాగ్యాది సుగుణసంపద గలవారందఱు నాయన కిష్టులే, ఆయన యాశీస్సులందినవారే. అట్టివారే ఆయనకడకు వచ్చువారును. ప్రతివారికిని వారివారి వ్యక్తిత్వమున కనువగు నాదర్శము నొందించుమార్గము నాయన చూపుచుండును. భక్తుని చిత్తశుద్ధినిబట్టి ఆయన యనురాగముకూడ నధికమగుచుండును. కొందఱి కాయన స్వప్నములో మంత్రోపదేశము చేయును ; కొందఱి నాలుకపై బీజాక్షరములు

వ్రాయును. కొందఱకు సాధారణవిధమున నే మంత్ర ముపదేశించును. ఇంక హృదయప్రదేశమున (వక్షస్సు) కొందఱి మీఁదను, మనఃప్రదేశమున (శిరస్సు) కొందఱిమీఁదను, ఇతర ప్రదేశములఁ గొందఱిమీఁదను సమాధిస్థితియందు పాదముంచును. ఇందు కుడిపాద మొక్కొక్కసారి, ఎడమ పాద మొక్కొక్కసారి. కొందఱి వక్షోభాగమును హస్తముతో స్పృశించును. ఆ దేవుఁని స్పర్శ కెట్టి జ్ఞానప్రబోధక శక్తికలదో! ఆ దివ్యస్పర్శ ఫలముగ నొక్కొకరి జీవితము పూర్తిగా మాఱిపోయినది కదా!

గృహస్థభక్తులలో ఐదుగు రాయన "రసద్దారులు"; అనఁగా ఆయనకు వలయు 'సరఫరాలు' చేయుచుండుటకై అంబికచే నియమింపఁబడినవారు. వీరిలో మొదటి మువ్వురను శిష్యులుగా భావించు వాడుక లేదు, కాని అత్యంత సన్నిహితులగుటచే అట్లు భావించుటే సమంజసము. వారీయనను గురువుగ భావించుకొనుచుండిరనుట మాత్రము నిస్సంశయము.

ఇట శిష్యులయొక్కయు భక్తులయొక్కయు పేళ్లు మాత్ర ముదాహరింపఁబడును. గ్రంథాంతముననుండు అనుబంధములో వీరి వివరములు తెలుపఁబడును.

## సన్న్యాస శిష్యులు

1. నరేంద్రనాథదత్త (వివేకానందస్వామి), 2. రాఖాల్‌చంద్ర ఘోష్ (బ్రహ్మానందస్వామి), 3. బాబురామ్‌ఘోష్ (ప్రేమానందస్వామి), 4. నిత్యనిరంజనఘోష్ (నిరంజనానందస్వామి), 5. యోగేంద్రనాథ

చౌధురి (యోగానందస్వామి), 6. గోపాల్ సుర్ [పెదగోపాలుఁడు] (అద్వైతానందస్వామి), 7. లాటూ (అద్భుతానందస్వామి), 8. తారకనాథఘోషాల్ (శివానందస్వామి), 9. శశిభూషణచక్రవర్తి (రామకృష్ణానందస్వామి), 10. శరచ్చంద్రచక్రవర్తి (శారదానందస్వామి), 11. హరినాథచట్టోపాధ్యాయ (తురీయానందస్వామి), 12. గంగాధరఘటక్ (అఖండానందస్వామి), 13. శారదాప్రసన్నమిత్ర (త్రిగుణాతీతానందస్వామి), 14. తులసీచరణదత్త (నిర్మలానందస్వామి). 15. హరిప్రసన్నచట్టోపాధ్యాయ (విజ్ఞానానందస్వామి), 16. కాళీప్రసాదచంద్ర (అభేదానందస్వామి), 17. సుబోధచంద్రఘోష్ (సుబోధానందస్వామి). (ఇందు 1, 2, 3, 4, 5 : ఈశ్వరకోటులు; 1 మొదలు 10, 16 : అంతరంగికులు).

## గృహస్థ శిష్యులు, భక్తులు

1. మథురామోహనవిశ్వాస్, 2. శంభుచరణమల్లిక్, 3. విశ్వనాథ ఉపాధ్యాయ, 4. సురేంద్రనాథమిత్ర, 5. బలరామ్‌బోస్, (1—5 రసద్దారులు); 6. రామచంద్రదత్త, 7. మనోమోహనమిత్ర, 8. కేదారనాథచట్టోపాధ్యాయ, 9. హరీశుఁడు, 10. భవనాథచట్టోపాధ్యాయ, 11. మహేంద్రనాథగుప్త, 12. అధరచంద్రసేన, 13. తారకనాథముఖోపాధ్యాయ, 14. వైకుంఠనాథసాన్యాల్, 15. దుర్గాచరణనాగ్, 16. గిరీశచంద్రఘోష్, 17. దేవేంద్రనాథమజుందార్, 18. కాళీపాదఘోష్, 19. నవగోపాల్‌ఘోష్, 20. అతులకృష్ణఘోష్, 21. భూపతి, 22. అక్షయకుమారసేన, 23. ఉపేంద్రనాథముఖోపాధ్యాయ, 24. నిత్యగోపాలుఁడు, 25. ప్రాణకృష్ణముఖోపాధ్యాయ, 26. సురేశచంద్రదత్త, 27. ఈశానచంద్రముఖోపాధ్యాయ, 28. మణిలాల్

మల్లిక్, 29. నిత్యగోపాలగోస్వామి, 30. పండిత శ్యామాపాదభట్టాచార్య, 31. హరివల్లభబోస్, 32. గిరీంద్రమిత్ర, 33. నవాయిచైతన్య, 34. కవిరాజ మహేంద్రనాథపాల్, 35. మాణిలాల్‌బోస్, 36. కిశోరి గుప్త, 37. కిశోరిమోహన్‌రాయ్, 38. హరమోహన్‌మజుందార్, 39. మన్మథుడు. (23 వఱకు శిష్యులు, 24—39 భక్తులు).

## బాలభక్తులు

1. నారాయణుడు, 2. నరేంద్రనాథమిత్ర, 3. పూర్ణచంద్ర ఘోష్, 4. తేజచంద్రుడు, 5. హరిపాదుడు, 6. ద్విజుడు, 7. ప్రమదా (పల్టు).

## భక్తురాండ్రు

1. శ్యామాసుందరీదేవి, 2. యోగిన్‌మా, 3. గోలాప్‌మా, 4. దేవేంద్రనాథమజుందార్ తల్లి, 5. యదునాథమల్లిక్ వృద్ధబాంధవి, 6. మణిలాల్‌మల్లిక్ కొమార్తె, 7. గౌరీమా (గౌరీదాసి), 8. అఘోర మణీదేవి.

(ఈ గ్రంథాంతమున ముద్రింపఁబడిన యనుబంధము నిజమున కీ యధ్యాయములోని భాగమే. కావున ఇచ్ఛగలవారు దీనితో చేర్చియే దానిని చదువవచ్చును. శ్రీ రామకృష్ణ జీవితికథను నిరంతరాయముగా చదువఁగోరువారి సౌకర్యముకొఱకై వేఱుగా ముద్రింపఁబడినది.)



# కొందఱితో పరిచయము

శ్రీ గురుదేవుని కీర్తి వ్యాపించినకొలఁది పరిపరి తెఱంగుల జను లాయనయొద్దకు రాసాఁగిరి. ఒకనాఁడు మహారాజా యతీంద్రమోహనఠాకూరు మున్నగు కలకత్తా పౌర ప్రముఖులు వచ్చిరి. వివేక వైరాగ్యములనుగూర్చి మాటాడుచు శ్రీ గురుదేవుఁ డిట్లనెను: "మీరు భగవన్నామము రేయుంబవ ళ్లుచ్చరించుచుండినను, మనస్సు లౌకికవిషయమగ్నమై యున్నచో, నిష్ప్రయోజనము." అందుపైని యతీంద్రమోహనుఁ డిట్లనెను: "అయ్యా, మావంటి లౌకికులకు నిజమగు శ్రద్ధాభక్తులతో భగవంతుని ప్రార్థించుట సాధ్యమా? యుధిష్ఠిరునివంటి పుణ్యాత్ముఁడుకూడ అబద్ధము చెప్పి, కొన్నిక్షణములైనను నరకమున నుండవలసివచ్చెను." ఇందుపై శ్రీ గురుదేవుఁ డుద్రేకముతో, "బళీ! యుధిష్ఠిరుని జీవితములో ఈ ఒక్కవిషయమునుమాత్రము జ్ఞప్తియుంచుకొంటివి! అతని నిశ్చలసత్యానురక్తి, నిరుపమాన దయాదాతృత్వములు, శాస్త్రనియమాదరణ, మొదలగు సుగుణములెల్ల మఱచితివి. ఎంత తుచ్ఛబుద్ధివి!" అనెను.

'హిందూదేశాభిమాని' పత్రికాధిపతియు, జాతీయోద్యమస్థాపకులలో నొకఁడును, అగు బాబుకృష్ణదాస్ పాల్ కూడ శ్రీ గురుదేవుని దర్శించెను. వైరాగ్యవిషయమునుగూర్చి అతఁడు "ఈ వెఱ్ఱియే దేశమును నాశనదశకు తెచ్చి దాస్యము చేకూర్చినది. పరోపకారము, విద్యాప్రదానము, దేశోద్ధరణము: ఇట్టి కార్యములందు ప్రసక్తులు కండని మీరు యువకులకు బోధచేయుఁడు. భక్తి వైరాగ్య

బోధ దేశము నింకను బలహీనమొనర్చును" అని చెప్పెను. ఇందులకు శ్రీ రామకృష్ణుఁడు తీవ్రస్వరముతో ఇట్లనెను: "నీవు మందబుద్ధివిగా నున్నావు! సుగుణములలో నెల్ల సత్యోత్తమమని మన శాస్త్రములెల్ల పొగడినదానిని నిరసింప సాహసింతువా! వర్షము లారంభమైనప్పుడు గంగానదిలో నప్పటికప్పుడు పుట్టుచుండు చిన్నచిన్న ఎండ్రకాయలను చూచితివా? ఈ మహావిశ్వములో నీ వా యల్పజీవికంటె అల్పుఁడవు. ప్రపంచమున కుపకారము చేయుటకును, ప్రపంచము నుద్ధరించుటకును నీ వెవ్వఁడవు? కొండజాకు భోజనము పెట్టుట, రోగులకు చికిత్స చేయుట, రోడ్లు వేయించుట, బావులు త్రవ్వించుట, ఇవి సత్కార్యములే కాని, యీ మహావిశ్వముతో పోల్చిచూచినయెడల ఇవి యెంత స్వల్పములు? యమ దేవత నోటినుండి ఎందజను రక్షింపఁగలవు? ఈ రాష్ట్రము నెల్ల నాశనము చేయుచున్న మన్నెపు జ్వరముల నరికట్టుట కేమి చేయఁగలవు? ప్రపంచ యోగక్షేమములను కనిపట్టఁగలవాఁడు భగవంతుఁడొక్కఁడే. మనుష్యుఁడు మొదట తన్నుద్ధరించుకొనుటకై ఈశ్వరసాక్షాత్కారమును పడసి, యాయన యొద్దనుండి ఇతరులకు మేలుచేయు నధికారమును పొందవలెను. అహంకారమును పూర్తిగా విడిచిపెట్టినవాఁడుకాని ప్రపంచముకొఱకు పాటుపడుననుజ్ఞ శ్రీ విశ్వేశ్వరిచే పొందఁజాలఁడు." *

---

* సరియైన దృక్పథ మితరులకు సేవ చేయుటకాని, సాయము చేయుట కాదు. అహంకారయుతములైన ప్రేరణలవలన పనిచేయు మనుష్యునకు బంధము లేర్పడును. కాని తా నీశ్వరునిచేతి యుపకరణమనని భావించు సిద్ధపురుషున కట్టి విపత్తు కలుగదు.

శ్రీ గురుదేవుని శిష్యవర్గమునకన్న చాలకాలము ముందే ఆయనను దర్శించినవారిలో కాశీపురనివాసి మహిమాచరణ చక్రవర్తి యొకఁడు. ఇతఁడు వేదశాస్త్రప్రమాణము లుదాహరింపఁగలిగియుండెను. ఇది శ్రీ గురుదేవున కెంతయు ప్రీతికరము. సాధకులలోని కొంచెపాటి యాధ్యాత్మిక సంపత్తినికూడ ఆయన గొప్ప చేయువాఁడు. అందుచే ఆయన మహిమాచరణుని లోపములు సరకుసేయక యాతనిని ప్రేమతో నాదరించును. ఆతనికి వేదాంతము ప్రీతికర మగుటచే శ్రీ గురుదేవుఁడా మార్గమునే ఆతనికి బోధించువాఁడు. కాని ప్రపంచమును పరిత్యజించు టాతనికి సాధ్యము కాదని యెఱిఁగి "ప్రపంచమును పరిత్యజింపనేల? సక్తతను విడిచి, యింద్రియనిగ్రహముకై ఆధ్యాత్మికశిక్షణము నభ్యసించిన చాలును" అని చెప్పుచుండును.

మహిమాచరణుఁడు శాస్త్రపఠనమున కెక్కువ ప్రాముఖ్య మిచ్చుట చూచి శ్రీ గురుదేవుఁ డతనికిట్లు చెప్పెను: "ఎంత కాలమిట్లు శాస్త్రములు చదువుచుందువు? శుష్కవాదములవలన లాభ మేమి? భగవత్సాక్షాత్కారముకై మొదట ప్రయత్నింపుము. గురుభక్తి కలిగి విధ్యుక్త సాధన లొనర్పుము. నీకు గురువు లేనియెడల, హృదయపూర్వకముగా భగవంతుని ప్రార్థింపుము. అతఁడే తనస్వభావమును తెలుపును. బజారు దూరముగ నున్నంతవఱ కేదియో రొదమాత్రము వినఁబడును. కాని యందు ప్రవేశించినప్పుడు సర్వమును స్పష్టముగా కనఁబడును, వినఁబడును. ఈశ్వర సాక్షాత్కారమైనపిదప పుస్తకములు, శాస్త్రపురాణాదులు, చెత్తవలె కనఁబడును.

ప్రతాపచంద్రహాజ్రా (హాజరా) యనునతఁడు కొన్ని యేండ్లపాటు దక్షిణేశ్వరాలయములో నివసించెను. ఇతనికి శాస్త్రపరిజ్ఞానముకాని భగవత్సాక్షాత్కారముకాని లేక పోయినను, వేదాంతినని లోకులను భ్రమపెట్టుచు, శుష్కవాదములచే సాధకులను కలవరపఱచుచుండువాఁడు. శ్రీగురుదేవుని సదభిప్రాయము నొందఁజాలని ఈ దాంభికుని నరేంద్రుఁడుమాత్రము ఎట్లో విశ్వసించి, అతనికి మరణ కాలమున మోక్షమిప్పింపుఁడని శ్రీగురుదేవుని ప్రార్థించి యాయన వాగ్దానము పడసెను.

వైధిభక్తికన్న ప్రేమభక్తి శ్రేష్ఠమని బోధించుచు శ్రీగురుదేవుఁడు హాజ్రాతో నిట్లొకసారి చెప్పెను: "నీవొకనాఁడు జపమాల త్రిప్పుచుండఁగా చూచి, 'అమ్మా! ఇతఁ డెంత అవివేకి! ఇక్కడకూడ జపమాల త్రిప్పుచున్నాఁడు! ఇక్కడకు వచ్చువారికి స్వతస్సిద్ధముగా, అప్రయత్నముగా, జ్ఞానము కలుగునుకదా' అని శ్రీవిశ్వేశ్వరికి విన్నవించితిని."

"అమ్మా! హాజ్రా బూటకుఁడైనచో అతనిని ఇచ్చటి నుండి తొలఁగింపుము" అని శ్రీగురుదేవుఁ డొకనాఁడు దేవిని ప్రార్థించెను. కొలఁదినాళ్లయినతరువాత నతఁడు దక్షిణేశ్వరము విడిచివెళ్లెను. తన సందేశమును లోకమున కందిచ్చుచుండిన శ్రీరామకృష్ణుని కార్యమును తాఱుమాఱుచేయఁబూనిన హాజ్రాను శ్రీవిశ్వేశ్వరి సహించునా?



## హృదయుని నిష్క్రమణము

శ్రీ రామకృష్ణునెడల హృదయునిభావము కాల క్రమమున చాల మార్పుచెందెను. అతనికి ధనతృష్ణ యెక్కువకాఁగా, ఆయన దర్శనార్థము వచ్చువార లతని యనుగ్రహముకై పాటుపడి వారివారి స్థితిగతులకు తగినట్టు నజరు లర్పించుకొనుచుండిరి. శ్రీ గురుదేవుఁ డిట్లు నజర్లు తీసికొనవలదని అతనిని మందలించుచు, ఏమియు ఈయవల దని ఆగంతుకులతోకూడ చెప్పెను. ముఖ్యముగా లక్ష్మీ నారాయణుని పదివేల రూప్యములను నిరాకరించుట హృద యునికి చాల కోపకారణ మాయెను. ఈ ధనకాంక్షవలన అతఁడు తన పూర్వప్రేమను మఱచుటేకాక, బహిరంగముగ శ్రీ గురుదేవు నసహ్యములగు మాటలతో ఎత్తిపొడువ నారంభించెను. అతని పూర్వసేవాకారణమున ఈ దురహంకారప్రవర్తన మాయన యోర్చుకొనుచుండినను, కొన్నివేళల కన్నుల నీరునించువాఁడు. శ్రీ గురుదేవుని యమూల్య సుగుణముల నలవఱుచు కొనుటకు మాఱుగా ఆయన బాహ్యలక్షణముల ననుకరించుచు, అతఁడు భక్తుల యెదుట ఆయనవలెనే పాడుచు, ఆడుచు, తానుకూడ నొక పరమహంసవలె నటింప మొదలిడెను. ఒకవైపున భక్తుల కడ నజర్లు లాగుచు, మఱొకవైపున పదుగడుగునకు శ్రీ రామకృష్ణునిపై అధికారము చెలాయించుచు, హద్దుపద్దు లేకుండ సంచరింపసాఁగెను. రానురాను అతని ప్రవర్తన దుస్సహ మగుచుండెను. తనతో సంబంధముగల ప్రతివానిని

దూషింప మొదలిడెను. కాళీకాలయములోని యితర సేవ కులుగూడ నతనియెుత్తిడికి నొచ్చుకొనుచుండిరి. శ్రీ గురు దేవుఁ డెన్నిసారులు నయమున బోధించినను అతఁడు పెడ చెవిని పెట్టుచుండెను. కాని చివరకు ప్రాయశ్చిత్తకాలము వచ్చెను. దేవాలయ వార్షికోత్సవదినమున మథురుని కుమారుఁడు త్రైలోక్యనాథుఁడు కుటుంబసహితముగా దేవా లయమునకు వచ్చియుండెను. అప్పు డేడుమిదేండ్ల వయస్సు గల యాతని కొమార్తను దేవీరూపఁగా నారాధింపవలెనని హృదయునకు కోరికకలిగి, తాంత్రికవిధులప్రకార మా బాలిక పాదములకు గంధము పూసి పువ్వులు సమర్పించెను. ఆపిల్ల ఇంటికి వెళ్లినతరువాత పాదములపై గంధపుమచ్చలు చూచి సర్వమును తెలిసికొని తల్లి భయభ్రాంత యయ్యెను. శూద్రబాలికపాదములను బ్రాహ్మణుఁ డర్చించినయెడల నామెకు కీడుకలుగునని జనుల నమ్మకము. ఇది విని త్రై లోక్యనాథుఁడు హృదయుని వెంటనే దేవాలయమును విడిచివెళ్లుమని యాజ్ఞాపించెను. హృదయుఁడు వచ్చి సర్వము నెఱింగింప శ్రీ గురుదేవుఁ డతనిని అట్లేల చేసితివని అడిగెను. అతఁడు భయపడుటకుమాఱు "మామా! ఏల నీ కీ యాయాసము! నీవుకూడ • దేవాలయమును విడిచి నాతోరమ్ము. నీ వింక నిచ్చట నుండకూడదు. ఎప్పు డైన నిన్నుకూడ వీ రవమానపఱతురు" అని చెప్పెను. కాని శ్రీ గురుదేవుఁ డంగీకరింపలేదు. హృదయుఁ డంత విన్నఁబాటుతో వెళ్లెను. కొంచెముసేపటి కొక మనుష్యుఁడు వచ్చి శ్రీగురుదేవునితో "మీరుకూడ ఇచ్చటినుండి వెళ్ల వలయు"నని చెప్పెను. శ్రీగురుదేవుఁడు మాఱుమాటా

డక లేచి తోఁటగుమ్మమువైపునకు నడచెను. దూరము నుండి త్రైలోక్యనాథుఁ డీది చూచి తొందరగా ఆయనకడకు వచ్చి నమ్రుఁడై "మహాశయా, తామెక్కడకు పోవు చున్నారు?" అని యడుగ, శ్రీగురుదేవుఁడు శాంతముగా, "నీవు నన్ను పొమ్మనలేదా?" యని ప్రశ్నించెను. త్రైలోక్య నాథుఁడు మిగుల ప్రాధేయపడి యాయనను మరల వెనుకకు తోడ్కొనివచ్చి పిల్ల కేమియు హానికలుగకుండ అమ్మను ప్రార్థింపుఁడని వేఁడుకొనెను. అమ్మ దయవలన బాలిక సుర క్షితముగా నుండునని యభయమిచ్చి యేమియు జరుగనట్లే ఆయన తనగదిలోనికి వచ్చెను. హృదయుని నిష్క్రమణ మునుగూర్చి కాలాంతరమున శ్రీగురుదేవుఁ డిట్లు చెప్పె వాఁడు: "ఆతని నిరంకుశవర్తనము నానాఁటికి దుస్సహమై దేవీకార్యమున కంతరాయము కల్పించుచుండుటచే నతని నామెయే తొలఁగించెను." హృదయునియడ్డు తీఱుటచే శ్రీగురుదేవుని యువకభక్తులు ధారాళముగావచ్చి యాయన పవిత్రసాన్నిధ్యమున తమ జీవితములను సుశిక్షితము లొనర్చుకొను మహాభాగ్యము నొందఁగల్గిరి.



## కొందఱు సుప్రసిద్ధ పురుషులతో ప్రసంగములు

1881-వ సంవత్సరమున నొకనాఁడు అశ్వినీకుమారదత్త, కేశవుఁడు, మున్నగువారు శ్రీ గురుదేవుని దర్శించిరి. అప్పుడు జరిగిన ప్రసంగములో శ్రీ గురుదేవుఁడిట్లు చెప్పెను: "తోఁకకు రాయికట్టఁబడిన ముంగిసవంటివారు గృహస్థులు. విపత్తేది వచ్చినను, అది పైకిపరుగెత్తి గూటిలోఁ దూఱును. కాని, యచ్చట నెట్లుండఁగలదు? రాయి క్రిందికి లాగుచున్నదిగదా? మీ రించుక ధ్యానము నభ్యసింపవచ్చును. కాని, యాలుబిడ్డల భారము క్రిందకు లాగివేయును." * * * "మాయకు వశుఁడై యుండు మానవుఁడు లేఁతకొబ్బరికాయ వంటివాఁడు. దానిలో కొబ్బరి వలయువారు పెంకునుకూడ కొంచెము గోఁకియే తీసికోవలెను. మాయ కతీతుఁడగువాఁడు ముదురు కొబ్బరికాయవంటివాఁడు. దాని కొబ్బరి పెంకునకు అంటుకొనక వేఱైయుండును. వాని యాత్మ శరీరప్రసక్తి లేక స్వేచ్ఛగా నుండును." * * * "సర్వకష్టములకు అహమే కారణము. 'నేను' అను భావ మొక మాత్రమున నశింపదు. శిథిలగృహమున పెంటలో పెరుఁగు రావిచెట్టువంటిదది. నేఁడు నఱికివేసిన తేపది చిగిర్చి మరల పొడచూపును. ఉల్లిపాయల గిన్నె నెన్నిసార్లు కడిగినను వాసన పూర్తిగా పోదు." ప్రసంగానంతరము జరిగిన సంకీర్తనములో శ్రీ గురుదేవుఁడు సమాధిఁ గొందెను. అశ్వినీకుమారుఁ డా స్థితిచూచి యాశ్చర్యచకితుఁడయ్యెను.

మఱియొకసారి అశ్వనీకుమారుఁ డాయనను దర్శించి నప్పుడు మీరు జాతినియమములు పాటింతురాయని యడిగెను. అందుల కాయన యిట్లు చెప్పెను: "అంతగా పాటింతు నని చెప్పఁజాలను. కేశవునింటిలో కూరతింటిని. ఒక మహమ్మదీయుఁడు కాఁబోలు మంచుగడ్డ అమ్ముచుండ, వానియొద్ద కొన నిచ్ఛగింపనైతిని. కాని, కొంచెముసేపటికి వానియొద్ద నుండియే మతెవ్వరో తేఁగా, దానిని తింటిని! కొబ్బరి తాడిచెట్లు ముదురుకొలఁది, మట్టలు తమంత తామే రాలి పోవునట్లు జాతి నియమములు కూడ పోవును. కాని, కొందఱు సంఘసంస్కర్తలవలె బలవంతముగా వానిని ఊడఁ బెఱుకరాదు."

కొందఱు సాధకులనుగూర్చి ప్రసంగము సాఁగినపిదప భగవత్సాక్షాత్కారమెట్లు దొరకునను ప్రశ్నకు శ్రీగురుదేవుఁ డిట్లు బదులుచెప్పెను: "అయస్కాంతము ఇనుమునువలె భగవంతుఁడు మనల నెప్పుడు నాకర్షించుచునే యుండును. కాని, మురికిచే కప్పఁబడిన ఇను మాకర్షింపఁబడదు. మనస్సును కప్పిన మురికిని కన్నీరు కడిగివేయును. వెంటనే మనస్సు భగవంతుని వైపున కాకర్షింపఁబడును." * * *

"గంజాయి అని పలికినంత నే మత్తు కలుగునా? దానిని తెచ్చి నీటితో నూరి త్రాగవలెను. నీవు గృహస్థుఁడవు కనుక నీ మనస్సు నించుక భగవద్ధ్యాన ప్రమత్తత నొందనిచ్చిన చాలును: పనిచేయుచున్నప్పుడుకూడ ఆ ప్రమత్తతను నిలుపుకో. ప్రాపంచిక జీవన మభిలషించితివేని భగవంతునకు ముక్త్యారునామా ఇచ్చి, బాధ్యతలనెల్ల నతని కప్పగించి, అతని యిష్టము వచ్చినట్లు చేయనిమ్ము."

సుప్రసిద్ధ దేశసేవకుఁడును, భగవద్భక్తుఁడును, అగు నీతఁడు శ్రీ గురుదేవునిగూర్చి యిట్లు వ్రాసెను : "నేనాయనను చూచినది నాలుగైదువార్లే కాని, మా స్వల్పపరిచయముననే మిక్కిలి చనవుగా సహాధ్యాయులవలె నుంటిమి. ఆయన సముఖమున నెంతో స్వేచ్ఛగా మాటాడుదును. కాని బయటకు వచ్చుటతోడనే, ఎట్టి మహోన్నత పురుషునితో నట్లు మాటాడుచుంటినని వెఱఁగుపడుదును. ఆ కొలఁది నాళ్ల సాంగత్యమే నా జీవితమంతటికిని మాధుర్యమొసఁగినది. ఆ దివ్య మందహాసము నా మనఃఫలకమునం దిప్పటికిని సుప్రతిష్ఠితమై నిరంతరానందమును వర్షించుచున్నది."

విద్యాసాగర బిరుదమును సార్థకపఱచిన యపార పాండిత్యమునకును, విశ్వమానవ సౌహార్ద్రమునకును, పేరొందిన పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరుని శ్రీ గురుదేవుఁడు 1882-వ సంవత్సరమున మహేంద్రభవనాథులతో సందర్శించెను. అప్పుడు శ్రీ గురుదేవుఁడు లేనగవుతో విద్యాసాగరుని చూచి యిట్లనెను: "నేఁడు సముద్రముని చేరితిని. ఇంతవఱకు చూచినది కాలువలు, వాఁగులు, నదులు, మాత్రమే." అట్లైనచో ఈ యుప్పునీటిని కావలసినన్ని తీసికొనుఁడని పండితుఁడనెను. "అదెట్లు? మీరవిద్యాసాగరులు కారు. విద్యాసాగరులు. పురాణవర్ణితక్షీరసాగరులు." * * *

"మీరు చేయునది సాత్త్విక (అస్వార్థ) కార్యము, సత్త్వము యొక్క రాజసిక (క్రియాత్మక) రూపము. దయ సత్త్వజనితము. దయాప్రేరితకార్యము రాజసికకార్యమే కాని ఈ రజస్సు సత్త్వసంభూతము కావున హానిచేయదు. సాత్త్వికనిధులగు శుకదేవాదులు దయాగుణమును వదలక లోకులకు భగవ

ద్బోధ కావించిరి. మీరు చేయు అన్నవిద్యాదానములు సుప్రశస్తములు. నిష్ఫలాపేక్షతో చేయఁగలిగితి రేని యవి భగవత్సాక్షాత్కారమునకు తోడ్పడును. కొందఱు పేరు కొఱకో, పుణ్యముకొఱకో, పని చేయుదురు. అది స్వార్థరహిత కర్మ కాదు. ఇంతేకాక మీ రిప్పటికే సిద్ధులు". అది యెల్లని విద్యాసాగరుఁ డడుగఁగా శ్రీ గురుదేవుఁడు నవ్వుచు "సిద్ధమైన (ఉడుకఁబెట్టఁబడిన) ఉరలగడ్డలు, కూరగాయలు, మెత్తనగునుగదా! మీరుకూడ మెత్తనివారు, దయామయులు" అని బదులుచెప్ప, విద్యాసాగరుఁడు "నూఱిన పప్పువంటి కొన్నివస్తువులు ఉడుకఁబెట్టిన గట్టిపడును!" అనెను. అందుపై శ్రీ గురుదేవుఁడు "మీ రట్టివారు కారు. కేవల పుస్తకజ్ఞానమే కల విద్యావంతులు తెగులుపట్టిన కాయలవంటివారు; అవి పండఁజాలవు. రాబం దెంత యెత్తున కెగిరినను, దాని దృష్టి నేలపైనున్న కళ్లెన పీనుఁగు మాంసముమీఁదనే ఉండును. కేవల విద్యావంతులుకూడ నట్టులే కామకాంచనములయం దాసక్తులై యుందురు. సక్తత అవిద్యాజనితము. దయ, భక్తి, త్యాగము, మున్నగునవి విద్యాజనితములు." *** "బ్రహ్మమవిద్యకును, విద్యకును కూడ నతీతుఁడు; మాయాతీతుఁడు. బ్రహ్మ మిట్టిదని మాటలతో నిరూపించు టసాధ్యము. వేదములు, పురాణములు, తంత్రములు, షడ్దర్శనములు, సర్వమును నోటితో నుచ్చరింపఁబడుటచే ఎంగిలిపడినవి. అట్లు ఎంగిలిపడనిది బ్రహ్మ మొక్కటే. బ్రహ్మ మిట్టిదని ఇంతవఱ కెవరును చెప్పియుండ లేదు." *** "బ్రహ్మమునుగూర్చి యంతయు నెఱుఁగుదుమని జను లనుకొందురు. చీమ చక్కెరకొండకడ కేగి యొక కణము

తిని తృప్తిపడి, మఱొక కణము నోటఁ గఱచికొని వెళ్లును, ఇంకొకసారివచ్చి కొండనెల్ల తీసికొని పోఁదలఁచెనఁట! అత్యల్పజీవులగు మనుష్యులు కూడ ఇట్లే తలఁతురు. బ్రహ్మమవాఙ్మానసగోచరుఁడని వారెఱుఁగరు. మానవుఁ డెంత గొప్పవాఁడైనను భగవంతు నెన్నఁడు నెఱుఁగఁజాలఁడు. శుకదేవాదు లేడెనిమిది చక్కెర కణములు కఱచుకొని పోఁగల గండుచీమలవంటివారు. అంతయే.'' * * * ''శాస్త్రములలో బ్రహ్మమునుగూర్చి సూచనలుమాత్రమే కలవు. సమాధిస్థితిలో బ్రహ్మజ్ఞానము—బ్రహ్మానుభూతి—కలుగును. ఆ యవస్థలో హేతుబద్ధజ్ఞానము స్తబ్ధమైపోవును. మౌన మావహిల్లును. సముద్రపు లోఁతు కనుఁగొని ఇతరులకు తెలుప నొక యుప్పుబొమ్మ వెళ్లెను! కాని సముద్రజలము తాఁకిన వెంటనే యది కరఁగిపోయెను! ఇఁక లోఁతు తెలుపువారెవరు?'' * * * ''లోకులకు బోధచేయుటకై శంకరాచార్యుఁడు నిర్మలత నొందిన తన యహమును నిలుపుకొనెను. ఈశ్వరసాక్షాత్కారమగువఱకే మాటలు. అంతవఱకే హేతుబద్ధవాదములు. పూర్తిగ కాఁగువఱకే వెన్నలో చిటపటలు. బాగుగా కాఁగినతోడనే శబ్దము నిలిచిపోవును. కాని పచ్చి గారెను దానిలో వేసినయెడల, మరల 'చుఁయ్, చుఁయ్' శబ్దము కలుగును. సిద్ధపురుషు లిట్లే మానవకోటికి బోధ చేయుటకై లోకమునకు దిగివచ్చి మాటాడుచుందురు.'' * * * ''పువ్వుపై వ్రాలువఱకు తేనెటీఁగ 'ఝుం, ఝుం' అని రొదచేయుచుండును. వ్రాలి తేనె త్రాగ నారంభించినంతనే నిశ్శబ్దమగును. కాని యొక్కొకప్పుడు కడుపార త్రాగి కేవలానందమున ఝుమ్మని యఱచుటయు కలదు.'' * * * ''కడవ

నీటిలో మునుఁగునప్పుడు, 'బుడ, బుడ' చప్పుడగును. నిండిన పిదప చప్పుడుండదు. కాని, మఱియొక కడవలోని కా నీరు పోయుచో మరల శబ్దమగును."

భగవంతుఁడు మానవులకిచ్చు శక్తిలో తారతమ్యములు కలవని శ్రీ గురుదేవుఁడు చెప్పఁగా, విద్యాసాగరుఁడు దీని నెక్కువ సవిస్తరముగా తెలిసికొనఁగోరెను. అందుపై ఆయన వివిధవిషయములనుగూర్చి యిట్లు ప్రసంగించెను: "సర్వశక్తియైన భగవంతుఁడు చీమ మొదలెల్లజీవులందు కలఁడు. కాని, శక్తి విజృంభణమున భేదముండును. అట్లు కానిచో, నొకఁడు పదిమంది నోడింపఁగలుగుట, మఱొకఁ డొక్క శత్రునికే భీతిలి పాఱిపోవుట ఎట్లు కలుగును? మిమ్ము జనులేల గౌరవింతురు? రెండు కొమ్ములు మొలచినవా? మీకుఁ గల దయాపాండిత్యములవలననే మిమ్ము గౌరవించి, దర్శించుచున్నారు." * * * "శుష్కపాండిత్యము నిరర్థకము. భగవంతునిచేరు మార్గము తెలిసికొనుటకై జనులు పుస్తకములు చదువుదురు. గీతయొక్క భావమేమి? పదిసార్లా మాట నుచ్చరించుటచే వచ్చునదే. గీ-తా-గీ-తా-గీ అన్నచో నది 'త్యాగి'* అగును. సర్వమును త్యజించి భగవత్సాక్షాత్కృతికై ప్రయత్నింపుమనుటే గీతాబోధ. ఎల్లరును—సన్న్యాసియు, గృహస్థుఁడును—మనస్సులో సర్వ సంగపరిత్యాగము చేయవలెను." * * * "సిద్ధపురుషులు కూడ భక్తిమార్గ మనుసరించుటేల? అహమును నిర్మూలించుటసాధ్యము కావుననే. సమాధిలో అహ మదృశ్య

* వంగదేశస్థులు 'కియ్యావడి' నంతగా పలుకరు.

మైనను, పిమ్మట మరల పొడచూపును. కలలో పులిని చూచినచో మేలుకొన్నపిదపకూడ గుండె దడదడలాడు చుండును. దీనికంతకును అహమే కారణము." * * * "భగవంతుఁడు రెండు సందర్భములలో నవ్వును. మరణోన్ముఖుఁడగు రోగిని తాను కుదుర్తునని వైద్యుఁడు చెప్పునప్పుడొకసారి. నేను చంపనున్నట్టివాని నితఁడు రక్షించునఁట అని! ఆ వైద్యునికి సర్వమును తనచేతనున్నట్టే భావము! సోదరులు భూములు పంచుకొనునప్పుడుకూడ నవ్వును. విశ్వమంతయు తనదై యుండఁగా దానిని వీరు పంచుకొనుచున్నారే అని!." * * * "బుద్ధిచే భగవంతు నెఱుఁగుట అసాధ్యము. సర్వము నతనికి సమర్పించి దాసభావముతో ప్రార్థింపుము." * * * "రామనామమందుండు పూర్ణ విశ్వాసముచే, హనుమంతుఁ డంభోధి నొక్కగంతున దాఁటఁగలిగెను! కాని, శ్రీరాముఁడే సేతువు కట్టవలసి వచ్చెను." * * * "హోమపూజాదికర్మలు భగవంతుని ప్రేమించువానికి అక్కఱలేదు. దక్షిణానిలమారంభించినప్పుడు విసనకఱ్ఱతో నేమిపని?" * * * "స్వలాభమును పాటింపక పనులు చేసినచో మనస్సు పవిత్రమై భగవత్ప్రేమ లభించును. ఆ వెంటనే భగవంతుఁడు సాక్షాత్కరించును. లోకమున కీశ్వరుఁడొక్కఁడే తోడ్పడఁగలఁడు. మానవుఁడెన్నటికిని తోడ్పడఁజాలఁడు. స్వార్థరహితకర్మచేత పెంపొందునది స్వశ్రేయమే." * * * "నీలో బంగారు కలదు. ఎంతో లోఁతునకూడ కాదు. పైపైననే. కాని దాని యునికి నీ కింతవఱకు తెలియనే తెలియదు. నీ కది ఏమాత్రము కానిపించినను, నీ కర్మాచరణమంతయు

తనంతట తానే తటిఁగిపోయి, నీవాత్మధ్యానైకనిమగ్నుఁడ వగుదువు.''

ఇట్లు కొంతసేపు మాటలాడి శ్రీ గురుదేవుఁడు సెలవుతీసికొని శిష్యులతో కూడి వెడలిపోయెను.

పిమ్మట రెండు మూఁడు నెలలకు కేశవచంద్రుఁడు గంగానదిపై నౌకావిహారము చేయుచు శ్రీ గురుదేవుని వెంటఁదీసికొనిపోయెను. అప్పుడాయన ఇట్లు ప్రసంగించెను: ''భక్తుని హృదయమే ఈశ్వరుని ఆలయము. అతఁడు అన్నిటను కలఁడు; కాని భక్తుల హృదయములలో విశేషముగా దీపించుచుండును. జమీందారుఁడు తన జమీందారీలో ఎచ్చటనైన ఉండవచ్చును. కాని అందొక చావడి ముఖ్యనివాసస్థానముగా నుండునుగదా!'' * * * ''జ్ఞాను లెవనిని బ్రహ్మమందురో, అతనినే యోగులాత్మయనియు, భక్తులు భగవంతుఁడనియు అందురు. ఒకే బ్రాహ్మణుఁడు పూజచేయునప్పుడు పూజారి, వంటచేయునప్పుడు వంటవాఁడు.'' * * * ''ఒక చెఱువునకు చాల ఘట్టములున్నవి. ఒకఘట్టములో హిందువులును, మఱొకదానిలో మహమ్మదీయులును, ఇంకొకదానిలో ఆంగ్లేయులును నీరు ముంచుకొందురు. వారు వారా నీటినే క్రమముగా నీరని, పానీ అని, వాటర్ అని అందురు. కాని మూఁడును ఒకటే; భేదము పేరులోనే. అట్లే కొందఱు వానిని 'అల్లా' అనియు, కొందఱు 'గాడ్' అనియు, మఱికొందఱు బ్రహ్మమనియు, కాళియనియు, దుర్గయనియు, రాముఁడనియు, హరియనియు, ఏసుక్రీస్తనియు, అందురు.'' * * * ''గృహస్థుఁడొక చేతితో

తనపనిని చేయుచు మఱొకచేతితో భగవంతుని పాదములు పట్టుకొని యుండవలెను. పనియైన పిదప రెండు చేతుల తోడను ఆయనపాదములుపట్టుకొని, ఆశ్రయింపవలెను.'' ***

''సర్వము మనస్సుపైననే ఆధారపడియున్నది. బంధమోక్షములు మనస్సులోనే ఉన్నవి. మీ రేరంగు వేసిన మన స్సారంగు ధరించును. అద్దకపు ఇంటిలోని బట్టవంటిదది. భార్య నొక విధముగను బిడ్డ నింకొక విధముగను ముద్దాడుదురుకదా. కాని ఈ రెండుపనులు చేయు మనస్సొకటే.'' *** ''మీకు రాధాకృష్ణులయందు నమ్మకమున్నను లేకున్నను, వారి యన్యోన్యతీవ్రకాంక్ష నలవఱచుకొన యత్నింపుడు.''

ఒకసంవత్సరము పిమ్మట శ్రీ గురుదేవుఁడు కేశవు నింటికిపోయి తీవ్రవ్యాధిగ్రస్తుఁడగు నతనిని కడసారి చూచెను. అప్పుడు వివిధవిషయములనుగూర్చి యిట్లు చెప్పెను: ''ఈశ్వరసాక్షాత్కారానంతరము మానవుఁ డెల్ల యెడల నతనినే చూచును. భగవంతుఁడు ఎక్కువ స్పష్టముగా నరులలో—అందులో ముఖ్యముగా కామకాంచనవాంఛా లేశములేని నిర్మలాత్ములలో—శోభిల్లుచుండును. ఐహికభాగ్యమున కతఁడధీనుఁడు కాఁడు. ఇఁక నతని కేమియిష్టము? దివ్యభావోద్రేకము, ప్రేమ, భక్తి, వివేకము, వైరాగ్యము, మున్నగు గుణములే.'' *** ''నీ అనారోగ్యమున కర్థమున్నది. దివ్యావేశకల్లోలము లెన్నియో నీ శరీరమును ఊఁపివైచినవి. తత్కాలమున తెలియరాకున్నను కాలక్రమమున వాని ప్రతిఘాతములు దేహమున చూపట్టును. గంగానదిలో పెద్ద పొగయోడలు పోవునప్పుడు విశేషమైన

మార్పేమియు కనఁబడదు కాని, కొంతసేపటికి నీరు తీరములను తీవ్రవేగముతో తాఁకి మహాసంక్షోభ మొనర్చును. ఒక్కొక్కప్పుడు ఒడ్డులో కొంతభాగమును కూల్చివేయుట కూడ కలదు.'' * * * ''సకలము పూర్తియైనదని నీవను కొందువు కాని, రోగము లేశమున్నను భగవంతుఁడు నిన్ను విడువఁడు—చికిత్సకై యౌషధశాలలోఁ జేరినచో ఇష్టము వచ్చినప్పుడు వచ్చివేయ నలవికాదు. వ్యాధిశేష మేమున్నను, డాక్టరు పోనీయఁడు. ప్రవేశింపకపూర్వమే నీ స్వాతంత్ర్యము.'' * * * ''నీ వెప్పుడు జబ్బుపడినను నాకు మిక్కిలి వ్యాకులముగానుండును. మునుపు నీవు జబ్బుపడ్డప్పుడు నేను వేకువజామున ఏడ్చుచు 'కేశవునకేదైన అనర్థము కలిగినచో నే నింకెవరితో మాటాడుదును' అని అమ్మతో మొఱయిడువాఁడను. కలకత్తా వచ్చినపుడు కాళికాంబ నర్చించి నీ వ్యాధినివారణకై ప్రార్థించితిని.''

పిదప అచిరకాలముననే కేశవుఁడు మరణించెను. అది విని శ్రీ గురుదేవుఁ డపారదుఃఖముతో మూఁడునాళ్లు మంచముపట్టెను. ''చేయియో కాలో పడిపోయినట్లైనది'' అని పిదప చెప్పెను.

కేశవు నింటినుండి శ్రీ గురుదేవుఁడు జయగోపాల సేను అను బ్రాహ్మభక్తు నింటికి వెళ్లెను. అచ్చట జరిగిన ప్రసంగములో శ్రీ గురుదేవుఁ డిట్లు చెప్పెను: ''అప్పుడప్పుడు నిర్జనస్థలములకు పోయి, భగవంతుని ప్రార్థించి, ఆతని సాక్షాత్కారము పడయు యత్నము చేయవలెను.'' * * * ''గృహస్థులు సంసారమును పూర్తిగా విడిచిపెట్ట నక్కఱ లేదు. తీఱికయైనప్పుడెల్ల ఒకటి రెండు దినములు ఏకాంత-

స్థలమున ప్రపంచసంబంధములు వీడి. పరమార్థచింతతోఁ గడపవలెను. ఏకాంతస్థలమున కేగనిచో. సాధుసాంగత్యము చేయవలెను.'' * * * ''ఎవని మనస్సు, ఆత్మ, భగవదర్పితములై యుండునో, అతఁడే సాధువు. కామకాంచనముల నతఁడు పరిత్యజించియుండును. సామాన్యముగా స్త్రీలకు దూరముగా నుండును. ఒకవేళ సమీపించినచో, వారిని మాతృభావముతో పూజించును. నిరంతరము భగవంతుని గూర్చియే అతని తలంపులును, మాటలును. సకల జీవులందును భగవంతుఁ డున్నాఁడని గ్రహించి, సర్వభూతములకు సేవచేయును.'' * * * ''భగవత్సాక్షాత్కారమగు వఱకు నిత్యానిత్యవస్తువివేచనచేసి అనిత్యవస్తువులను వీడవలెను. భగవత్సాక్షాత్కృతినందినవారి కతఁడే సర్వమునయ్యెనని తెలియును. అతఁడే మాయ, జీవుఁడు, విశ్వమును కూడ. విశ్వమును, సకల జంతుజాలమును అతనిలోనే ఉన్నవి. మారేడుపండు బరువు కనుఁగొనవలెనన్నచో బెరడును, గింజలనుకూడ కలిపియే తూఁచెదవు. అప్పుడుగాని పండుబరువు తెలియదు. బెరడనఁగా విశ్వము. గింజలనఁగా అందులోని జీవులు. నిత్యానిత్యవస్తువివేచన చేయునపుడు బెరడును గింజలును అనిత్యములనియు, గుంజుమాత్రము నిత్యమనియు తోఁచును. కాని వివేచనానంతర మీ మూఁడు భాగములే సంపూర్ణవస్తువుగా నైనట్లు బోధపడును. గుంజుగా ఏ పదార్థమైనదో, అదియే బెరడును గింజలనుకూడ కల్పించినట్లు గోచరమగును. మారేడుపండనఁగా పండంతయు ననియే. నీ యర్థము.''



## కొన్ని సంఘటనములు

1884-వ సంవత్సరారంభమున ఒకనాఁడు శ్రీ గురుదేవుఁడు దక్షిణేశ్వరోద్యానమున ఒంటరిగా నడచుచు సమాధినంది క్రిందపడుటచే ఎడమచేతి ఎముకలు తొలఁగి, దుర్భరబాధ కలిగెను. కాని ఒక్కొకప్పుడు పాటును గూర్చి పరిహాసముగా మాటాడును; మఱికొన్ని వేళల దివ్య ప్రేరణవలన శరీరస్మృతి కోల్పోయి సమాధి నిమగ్నుఁడగును. అప్పుడొకనాఁ డాయన మంచముపై కూర్చుండి యుండెను. రాఖాలు, మహిమాచరణుఁడు, హాజ్రా మున్నగువారు గదిలో నుండిరి. శ్రీ గురుదేవుఁడు కనుల నీరునించి, "అమ్మా, నన్నిట్లేల చేసితివి? అయ్యో, ఎంత నొప్పిగా నున్నది!" అని మొఱపెట్టుకొనుచు, "నాకీనొప్పిపోదా?" అని భక్తుల నడిగెను. "పోకేమి? తప్పక పోవును" అని పసిబిడ్డనుబోలె వారు ఆయన నోదార్చిరి. మరల ఉన్నత మానసికావస్థలో నిట్లనెను: "ఓం ఓం ఓం-అమ్మా! ఈ మాటాడుచున్నది నేనా? బ్రహ్మజ్ఞానమిచ్చి, నా శరీరస్మృతిని ఏల హరించెదవు? అమ్మా, నాకు బ్రహ్మజ్ఞానమీయకుు. నేను నీ బిడ్డనుకానా? బిడ్డలు భయస్థులుకదా? మా యమ్మ కావలెను నాకు, బ్రహ్మజ్ఞానమునకు లక్ష నమస్కారములు. కావలయువనువారికి దాని నిమ్ము. ఆనందమయీ, జననీ, ఆనందమయీ, జననీ!" * * * మరల: "అమ్మా! నేనేమి తప్పుచేసితిని? ఎప్పుడైన నన్యాయమైనది నేను చేయుచున్నానా?

సర్వమును నీవే కాదా చేయునది? నేను యంత్రమును. నీవు దానిని నడుపుదానవు.''

అంత బాధపడుచుండియు, ఒకప్పు డుల్లాపముతో నాడుకొను బాలునివలె ఆయన మరల ''భగవత్సాక్షాత్కార మొందినఁగాని నిష్ప్రయోజనము'' అని వారితో చెప్పెను. భగవంతునికై యుండనగు తీవ్రవాంఛనుగూర్చి యిట్లనెను: ''అతఁడే మనతల్లియు, తండ్రియు. కనుక నతని యింటిలో మనకు న్యాయ్యమైన హక్కు కలదు. 'నాకు ప్రత్యక్షము కమ్ము. లేనిచో ఆత్మహత్య చేసికొందును!' అని మన మాయనను బలాత్కరింపవచ్చును.'' * * * ''నేను దేవి నిట్లు ప్రార్థించువాఁడను: 'అమ్మా! ఓ ఆనందమయ జననీ! నీవు నాకు సాక్షాత్కరించి తీరవలెను.' మఱొకప్పు డిట్లు చెప్పు కొనువాఁడను: 'దీనరక్షకా, విశ్వనాథా, నేను నీ విశ్వము లోనివాఁడను కానా? నేను భక్తిజ్ఞానహీనుఁడను, సాధన లెఱుఁగను, నాకేమియు తెలియదు. కావున ప్రభూ, కేవలము నీ యవ్యాజకరుణావిశేషము చేతనే నా అండకు వచ్చి నన్ను రక్షింపవలయును.' ఈ ప్రార్థనను సముచిత దీనస్వరముతో శ్రీ గురుదేవుఁడు మేళవించి పలుకఁగా అచటి భక్తుల హృదయములు కరఁగిపోయెను. ఇంతలో అధరుఁడువచ్చి యాయన పాదములంటఁగా, నతనిని తేలికగా పాదములొత్తుమని చెప్పి మహిమాచరణునితో నిట్లనెను: ''నిష్ఫలాపేక్షతో, భక్తికలిగియుండుము. ఇట్లు చేయఁగలి గిన చాలును. 'నాకు ముక్తి, కీర్తి, భాగ్యము, రోగనివారణ, ఇవేవియు అక్కఱలేదు. నీవే నాకు కావలెను.' అను లే నిష్కామభక్తి. ధనికునికడ కనేకులు స్వలాభములు కోరి

వత్తురు. ఎవరైన నేదియు కోరక తనయెడఁగల ప్రేమచే వచ్చినచో, ఆ ధనికున కతనియందు క్రమముగా ప్రేమ కలుగును. ప్రహ్లాదుని దిట్టి నిర్మలప్రేమ.''

ఈ సంవత్సరమున శ్రీ గురుదేవుఁడు గిరీశచంద్రునిచే రచింపఁబడిన శ్రీ చైతన్యలీలానాటకమును ప్రహ్లాద జీవిత నాటకమును చూచి, అందలి భావములను మెచ్చుకొని, గిరీశుని యాంతరంగికభక్తిని మిక్కిలి కొనియాడెను. నటుల నటనాకౌశలమునుగూడఁ బ్రశంసించెను. నాటకరచనా కార్యమును విరమించుకొనఁజూచుచున్నానని గిరీశుఁడు చెప్పఁగా అది యనేకులకు జ్ఞానప్రదముగా నున్నది కావున, విరమింపవలదని చెప్పెను.

చేయి బాగగుటకు కొన్ని నెలలు పట్టెను. అయినను, శ్రీ గురుదేవుని యాధ్యాత్మిక ప్రసంగ ప్రవాహమును, తన్మూలమున భక్తు లనుభవించుచుండిన ఆనందాతిశయమును, ఎప్పటివలెనే అవిచ్ఛిన్నముగా నడచుచుండెను.

శ్రీ గురుదేవున కప్పుడప్పు డపరిమితమైన ఆఁకలి కలుగుచుండెడిదిగదా. దక్షిణేశ్వరములోకూడ నిది ఈ కాలమున మరల తటస్థింపసాగెను. ఈ యాఁకలి ఉన్నత మానసికావస్థల వలన సంభవించుటచే శారీరకదుర్గుణము లేవియు కలుగకుండెను. ఒకనాఁ డాయనకై యొక పాల పిండివంట నొకభక్తురాలు సమర్పించిపోయెను. రాత్రి ఇట్టి యాఁకలి కలిగి ఆ పిండివంటనంతయు తినెను. అది యరుగుట దుర్లభమగునంత పరిమితికలదయ్యును జబ్బేమియు చేయలేదు.

మఱియొకనాఁ డర్ధరాత్రమున శ్రీ గురుదేవుఁడు నిద్ర మేలుకొని అపరిమితముగా ఆఁకలి యగుచున్నదనెను. శ్రీ మాతృదేవి కొందఱు భక్తురాండ్ర సాయముతో శీఘ్రముగా చాల హల్వాచేసి యొక భక్తురాలిచేత పంపెను. ఆయన అసంపూర్ణస్మృతితోనే కూర్చుండి దానినెల్ల తినెను. తన్ను తెప్పవాల్పక చూచుచుండిన యా భక్తురాలిని ఆయన యిట్లు ప్రశ్నించెను: "ఈ తినుచున్న దెవరను కొందువు? నేనా, మఱియొక రెవరైననా?" "ఎవరో మఱియొకరు మీలోపల నుండి తినుచున్నట్లగపడుచున్నది" అని యా స్త్రీ బదులు చెప్పెను. "సరిగా చెప్పితివి" అని శ్రీ గురుదేవుఁడు నవ్వుచు అనెను.

దివ్యానందపరవశత్వము శ్రీ గురుదేవునం దనేక చిత్రపరివర్తనలు కలిగించుచుండెడిది. ఒక్కొకప్పుడు శరీరము పూర్తిగా స్వాధీనముతప్పి, త్రాగినవానివలె తూలుచు నడచును. ఇట్టివేళలందు క్రొత్తవారాయన నిజముగా త్రాగియున్నాఁడనియే తలంతురు. శ్రీ గురుదేవుఁ డొకనాఁడు రామచంద్రునింటికి పోవుచుండెను. సందు మొగయొద్దనే బండిదిగి, కొలఁది గజముల దూరము నడువవలసి వచ్చెను. అప్పు డాయన దివ్యభావావేశపరవశుఁడై యుండి సరిగా నిలువలేకపోవుటచే ఇద్దరుభక్తులు పట్టుకొని నడిపించిరి. సమీపముననున్న కొందఱుక్రొత్తవా రిదిచూచి "ఇతఁడెంత తప్ప త్రాగియున్నాఁడు!" అని గట్టిగా గుసగుసలాడుచుండిరి. భక్తులలో కొంద ఱామాటలువిని, "ఔను! నిజమే!" అనుకొనిరి.

మఱియొకనాఁడు దక్షిణేశ్వరములో, శ్రీగురుదేవుఁడు కాళికాలయమునకు వెళ్ళి, అందుండి దివ్యానందపరవశుఁడై, మెఱ్ఱవాఱిన మోముతో తూలుచు తప్పటడుగులు వేయుచు, తిరిగి వచ్చుచుండెను. దారిలో శ్రీ మాతృదేవినిచూచి "నేను త్రాగియున్నానా?" అని యడిగెను. "లేదు! లేదు!" అని ఆమె బదులుచెప్పెను. "అట్లైనచో, ఇట్లేల ప్రవర్తించుచున్నాను?" అని యాయన మరల నడిగెను. ఇందుపై నామె "మీరు శ్రీ విశ్వేశ్వరీధ్యానానందామృతము మాత్రము త్రాగియున్నారు!" అని చెప్పెను. శ్రీ గురుదేవుఁడు సంతసించి "బాగుగా చెప్పితివి!" అనెను.

1884-వ సంవత్సరము అక్టోబరులో జరిగిన బ్రాహ్మసమాజ సమావేశమునకు శ్రీ గురుదేవుఁడరిగెను. విజయుఁడును త్రైలోక్యుఁడును ఒక సబ్ జడ్జియు సభయందుండిరి. త్రైలోక్యుని పాటలువిని శ్రీ గురుదేవుఁడు తఱచు సమాధిస్థితుఁడగుచుండెను. ఆ సందర్భమున 'గృహస్థులమగు మేమెన్నాళ్లు మాపనులు చేయుచుండవలె'నని సబ్ జడ్జి అడుగఁగా "పిల్లలను పెంపవలెను. భార్యను పోషింపవలెను. మీ పిమ్మట నామెపోషణ కేర్పాటుచేయవలెను. ఇది చేయనివారు క్రూరులు. దయాహీనుఁడు మనుష్యుఁ డనిపించుకొనఁడు." అని యాయన చెప్పెను. "బిడ్డల నెంతకాలము పోషింపవలె" నను ప్రశ్నకు "పెద్దవారగువఱకు. పిల్ల పెద్దదైన పిదప పక్షి దానిని దగ్గఱకు రానీయదు" అని బదులుచెప్పెను. "భార్యయెడల మా విధ్యుక్తధర్మములు ఎవ్వి" అను ప్రశ్నమున కీయుత్తర మిచ్చెను : "మీ జీవితకాలములో ఆమెకు జ్ఞానప్రబోధము కలిగించి పోషింపవలెను.

సత్ప్రివర్తనగల భార్యకు మీ మరణానంతరము పోషణ కేర్పాటుచేయవలెను. కాని యీశ్వర సాక్షాత్కారముకై మహావేశపరవశులై యుండువారికి ధర్మములేవియు అక్కఱ లేదు. అట్టివారి కుటుంబవిషయమై భగవంతుఁడే శ్రద్ధ వహించును. యుక్తవయస్సురాని కుమారుఁడు కల జమీందారుఁడు మరణించుచో, కోర్టు ఆఫ్ వార్డ్సువారు బాలుని రక్షణభారమును వహింతురుగదా.'' అంత త్రైలోక్యుఁడు "గృహస్థాశ్రమస్థునకు నిజమైన జ్ఞానముకలుగునా? అతఁడు భగవంతుని చూడఁగలఁడా?'' అని యడుగఁగా ఆయన నవ్వుచు "ఈ రెంటిని నీ విప్పటికే సమరసపఱచితివి కదా? సంసారములోనుండియు నీవు భగవంతుని చింతించుచుంటివి. గృహస్థులు భగవంతునెఱుఁగుట నిస్సంశయముగ సాధ్యము. భగవన్నామోచ్చారణమాత్రమున నీ కనులనుండి బాష్పములురాలి, దేహము పులకరించినచో, కామ కాంచనములందు నీ సక్తతపోయినదని, భగవంతుని తెలిసికొంటివని, గ్రహింపుము. అగ్గిపుల్ల పొడిగానున్నచో ఒక్కసారి గీచినను వెలుఁగును; తేమగానున్నచో వేఁబది పుల్లలున్నను, అన్నియు వ్యర్థమైపోవును'' అనెను. పిదప నొక భక్తుఁడడిగిన "జీవితకాలములోఁ దఱచు భగవంతుని తలఁచుచు, మరణకాలమున వానిని తలఁపనివానికి పునర్జన్మముండునా?'' అను ప్రశ్న కాయన యిట్లనెను: "మనుష్యులు భగవంతుని తలఁతురే కాని, విశ్వాసము లేశ మేనియునుండదు. వానిని మఱచి, సంసారమును అంటపెట్టుకొని యుందురు. అప్పుడేకడిగినను, బయటకు తెచ్చుటతోడనే యేనుఁగు మన్ను చల్లుకొనును. మనస్సు మదపుటేనుఁగువంటిది. కాని కడుగు

టతోడనే కొట్టములోనుంచితిమేని, మట్టి చట్లుకొనుట కవకాశ ముండదు. ఇట్లే మరణకాలమున భగవంతుని ధ్యానించినచో మనస్సు నిర్మలమై, మరల కామకాంచనకళంకిత మగుటకు వీలుండదు.'' అరిషడ్వర్గమును నిగ్రహించుటకు ఉత్తమమార్గమేదని యొక బ్రాహ్మ భక్తుఁ డడుగఁగా నిట్లు చెప్పెను: ''కామాదులను భగవత్పరముగా నుపయోగింపుము. ఆత్మతో సంగమ మపేక్షించి కామమును చూపుము. భగవంతునితో కూడిక నడ్డగించువారిపట్ల కోపము చూపుము. అతనిని తెలిసికొను తహతహపాటుచే లోభమును చూపుము. 'నేను, నాది' అని చెప్పవలసివచ్చినచో 'నా కృష్ణుఁడు' 'నా రాముడు' అని భగవద్విషయమున మోహమును చూపుము. గర్వముండెనేని 'రాము నెదుట వంచిన ఈ శిరము మఱియొకరియెదుట వంగఁజాలదు' అని చెప్పిన విభీషణునివలె గర్వివై యుండుము''. ''అతఁడే సర్వమును చేయుచున్నయెడల మనమెట్లు మన పాపములకు బాధ్యుల మగుదుము'' అని మరల ఆ భక్తుఁడు ప్రశ్నింపఁగా ఆయన నవ్వుచు ఇట్లు బదులిడెను: ''దుర్యోధనుఁడుకూడ ఇట్లే చెప్పెను: 'కృష్ణా! నీవు నా హృదయములో నున్నావు, నీ వెట్లాడించిన నే నట్లాడితిని!'. ఔను! నిష్కపటమైన యంతఃకరణముతో భగవంతుని నమ్మువాఁడు వానిచేతి యంత్రమే కాని, స్వతంత్రుఁడు కాఁడు. అందుచే అతఁడు పాపము చేయఁజాలఁడు. నేర్పరియైన నటుఁ డెన్నఁడును తప్పటడుగు వేయఁడు. హృదయము నిర్మలమగువఱకును భగవంతుఁ డున్నాఁడను నమ్మకమే కలుగదు.''



## పండిత శశధర తర్కచూడామణితో సమావేశము

పండిత, శశధర తర్కచూడామణి హిందూశాస్త్ర పారంగతుఁడగు మహావిద్వాంసుఁడు. అసాధారణ వాగ్ధాటి గల హిందూమతబోధకుఁడు. 1884-వ సంవత్సరమున శ్రీ గురుదేవుఁ డితనిని చూడఁబోయెను. అప్పుడు ప్రసంగి వశమున శ్రీ గురుదేవుఁడిట్లు చెప్పెను: "ఈ కలియుగమున, నారదుఁడు బోధించిన భక్తిమార్గ ముచితము. శాస్త్ర నిర్దిష్టమైన కర్మకలాపమును యథావిధిగఁ జేయ నిప్పటివారికి తీఱిక లేదు. కాన, కర్మకాండ బోధించినచో, అనుకూలమగు వటి కాచరింపుఁడని చెప్పవలెను." * * * "ఈశ్వర సాక్షాత్కారపూర్వము కర్మల నెవరును పూర్తిగా విడువఁజాలరు. కాయ కాచిన వెంటనే పువ్వురాలిపోవును. భక్తి కాయ, కర్మలు పువ్వులు. క్రమక్రమముగా లయించు ఘంటానాదమువలె సంధ్య గాయత్రియందును, గాయత్రి ఓంకారమందును, ఓంకారము సమాధియందును లీనమగును". * * * "భగవదాజ్ఞనొంది బోధకపదవి స్వీకరించుటలో దోషములేదు. అట్టి బోధకుఁడు అజేయుఁడు. దీపముకడకు కీటకములు తమంత తామే చేరును. ఇట్లే భగవదాజ్ఞ గల యుపన్యాసకుఁడు శ్రోతల నాహ్వానింప నక్కఱలేదు. అయస్కాంతము ఇనుము నాహ్వానించునా!" * * * "భక్తిజ్ఞాన కర్మమార్గములలో దేనిననుసరించినను చిత్తశుద్ధియున్నచో ఈశ్వరసాక్షాత్కారము లభించును. అమృతపుకోనేటిలోనికి. మెట్లమీఁదుగ దిగినను, పైనుండియే దుమికినను, ఒకరిచే.

పడవ నుల్టాఁత లూఁగించుచు మిమ్మందఱ నట్టేటముంచెద నని భీకరముగా గర్జించి, వారిని లొంగఁజేసెను. శ్రీ గురు దేవుఁ డిది విని అతనిని తీవ్రముగా మందలించి ఇట్లనెను: "కోపము 'పాపిష్ఠిది' దానికి తా వీయరాదు. బుద్ధిహీనులు అజ్ఞానముచే నేమేమో ప్రేలుదురు. మన మా వాఁగుడును వినిపించుకోఁ గూడదు".

నిరంజనుఁ డొకసారి యొక యుద్యోగ మంగీకరించె· నని విని శ్రీ గురుదేవుఁడు చింతాక్రాంతుఁడై, తల్లిని పోషించుటకు గత్యంతరము లేక అంగీకరించెనని వినువఱకు శాంతింపలేదు. "నీ కొఱకే ఐనచో, నీ ముఖముకూడ చూచి యుండఁజాల" ననెను. అచటనున్నవా రెవరో "ఉద్యోగ మంగీకరించుట అంత దోషమా" అని ప్రశ్నింపఁగా ఆయన "లోకసామాన్యమునుగూర్చి కాదు నేను చెప్పినది. ఈ సాధకులనుగూర్చి మాత్రమే. వా రొక వేఱుతరగతికి చేరిన వారు" అని చెప్పెను.

౫. యోగేంద్రనాథచౌధురి [యోగేన్] * (యోగానందస్వామి). ఇతఁడు బాబురామ్ ఈడువాఁడు. నిరాడంబరుఁడు, భోగాసక్తిరహితుఁడు, లజ్జాస్వభావము గలవాఁడు. చిన్ననాఁటినుండియు నితనియందు కొంత విశిష్టత కలదు. అంతర్ముఖత్వ మితనికి నైజము. తోడి బాలురతో ఆడుకొనుచు, ఉన్నట్లుండి ఆకసము వంకచూచి ఆలోచనా నిమగ్నుఁడై, తాను ఆమెచ్చటినుండియో వచ్చెననియు, ఈ లోకము తోడను ఈ చెలికాండ్ర తోడను తనకు సంబం

* యోగిన్ (జోగిన్) అనురూపము వ్యాప్తిలో నున్నది కాని అది సరికాదు. అది యొక సుప్రసిద్ధ భక్తురాలి పేరు.

ధము లేదనియు, తలఁచువాఁడు. అవివాహితుఁడై, వైరాగ్య దీక్షతో, ఈశ్వర సాక్షాత్కార ప్రయత్నమున, జీవనము గడప వలెనని అతని కోరిక. కాని బ్రదికిచెడ్డ కుటుంబము, తల్లి దండ్రుల యాసలన్నియు తనపైననే నిలిచియున్నవి, అని అతఁ డెఱుఁగును.

ఇతని స్వగ్రామము దక్షిణేశ్వరమే. కాని శ్రీ గురు దేవున కచట "వెఱ్ఱి బ్రాహ్మణుఁడు" అని పేరగుటచే కాఁబోలు, చాలకాల మాయనకడకు రాలేదు. 1882 వ సంవత్సరమున నొకనాఁ డతఁడు వచ్చి శ్రీ గురుదేవుని గది బైట నిలిచి లోపలి ప్రసంగమును వినెను. విషయము భక్తి తత్త్వము, మాటలు "వెఱ్ఱి బ్రాహ్మణు" నివే. కాని ఎంత తేటతెల్లముగా, ఎంత మనోరంజకముగా, నున్నవి! జోగేన్ మంత్రముగ్ధునివలె స్తంభీభూతుఁడై నిలుచుండి ఆ వాగమృత మును గ్రోలెను. "ఈయనయా వెఱ్ఱివాఁడు, భగవద్దర్శన ముచే ధన్యతఁగన్న మహామహుఁడుగాని! ఈయనకు వెఱ్ఱియను వారు పామరులు, భ్రాంతులు!" అని తలఁచుచు ఆ బాలుఁ డింటికి పోయి, అత్యంతసముత్సుకతతో మఱునాఁడు వచ్చి ఆయనను సందర్శించెను. ఆయనయు నతని నత్యంతప్రేమతో ఆదరించి "నీ వాధ్యాత్మికమహోన్నతి నొందఁగలవు. నీయం దెన్నియో శుభలక్షణము లున్నవి. ఇచటికి తఱచు వచ్చు చుండుము" అని చెప్పెను. శ్రీ గురుదేవునియందు పరమ లక్ష్యము కలిగి యతఁ డనుదినమును వచ్చుచుండెను. కాని పెద్దలకు వెఱచి, పూజార్థము పూవులకని మిష పెట్టివచ్చును, రహస్యముగా ఆయనను దర్శించును. కొలఁది నాళ్లకే అతని భావములందు మహావిప్లవము కలిగెను. అతని జీవిత

లక్ష్య మిప్పుడు భగవదన్వేషణ మొక్కటియే. తన ఉన్నత విద్యచే కుటుంబస్థితిగతులు బాగుపడును నిజమే; కాని, కామినీకాంచనపరిత్యాగము భగవత్సాక్షాత్కృతికి ఆవశ్యక మని శ్రీగురుదేవుఁడు చెప్పెనుగదా! రెంటిని సమరసపఱుపఁ జాలక, చదువుమాని, గ్రామాంతరము పోయి, ఉద్యోగముచే ధన మార్జించి ఇంటికి పంపుచుండవలెనని నిశ్చయించుకొనెను. తన కీమార్గమున భగవద్ధ్యానాదులకు వలయు నవకాశ ముండును. అంత తండ్రి కడ కేగి తనకు చదువునం దభిరుచి లేదనియు, కాన్పూరులో మేనమామకడ కరిగి యుద్యోగము సంపాదించుకొని ఇంటికి ద్రవ్య మంపుచుందు ననియు, చెప్పి కాన్పూరు వెళ్లెను.

అచట నుద్యోగము దొరకక, కాలమంతయు ధ్యాన ప్రార్థన లందే గడప సాఁగెను. ఇది విని వివాహముచేతఁ గాని త్రోవకు రాఁడని తలిదండ్రులు సర్వసన్నాహములు చేసి, నిజము తెలిసిన నతఁడు పాఱిపోవునని 'తల్లికి జబ్బుగా నున్నది, వెంటనే రావలసినది' అని వ్రాసిరి. జోగేశ్ ఆత్ర ముతో వచ్చిచూడ, ఇల్లంతయు పెండ్లిప్రయత్నములతో కలకల లాడుచుండెను, తల్లి కేమియు జబ్బులేదు! పెండ్లి చేసికొనని ఎంతో మొండిచేసెను గాని తల్లి దీనముగా విలపించుచు "నీ కిష్టములేకున్నను, నాకొఱకైన నంగీక రింపు"మని వేఁడుకొనుటచే ఎట్టకేలకు వివాహమాడెను.

కాని జోగేశ్ జీవితము నరకకూపమున కూలి పోయెను. అతని సంకల్పసౌధములు గాలిమేడ లయ్యెను. "ఇంద్రియభోగములఁ బడిన నిర్భాగ్యునకు ఇంకేటి భగవత్సా క్షాత్కారము! త్యాగమూర్తియగు శ్రీరామకృష్ణున కిఁక

మొగము చూపు టెట్లు? చూపినను ఆయన చూచునా? శాశ్వతబ్రహ్మచర్య మవలంబింతునని చెప్పినప్పు డాయన యెంత యానందించెను! అదంతయు ఇప్పుడు భగ్నమై పోయెనుగదా!" అని తలపోయుచు, విచారసాగరమున మునింగి, యతఁడు శ్రీ గురుదేవునికడకు పోవుట మానుకొనెను. విషయ మంతయు విని యాయన యెన్నియోసార్లు కబు రంపెను గాని యతఁడు వెళ్లఁడు. చివర కతని మిత్రు నొక నితో ఆయన "జోగేఁ చేతికి కొన్ని నెలల క్రిందట దేనికో కొంత పైకమిచ్చితిని. దాని కతఁ డెన్నిసార్లు పిలిపించినను వచ్చి లెక్క చెప్పఁడు, మిగత చిల్లర నీయఁడు. నీవు కనుఁ గొనుము" అని చెప్పెను. జోగేఁ కడ కొద్దిపాటి చిల్లర మిగిలియుండుట వాస్తవమే, కాని వివాహకారణముచే ఆయనయొద్దకుఁ బోవ నిష్టములేక ఈయ లేదు. ఇప్పుడు తన శీలమునకు కళంక మాపాదింపఁబడుటచే, చిల్లర తీసికొని వెంటనే దక్షిణేశ్వరము వెళ్లెను. శ్రీరామకృష్ణుఁ డతనిని దూరమునుండియే చూచి, దివ్యతేజము పొంగిపొరలు ముఖాబ్జాతముతో సమీపించి, యతని చేయి పట్టుకొని యిట్లనెను: "వివాహ మైననేమి? నాకు కాలేదా? అంత మాత్రమునకే జంకేల? ఈ తావు (తన్నుచూపుచు) సుము ఖముగా నున్నంతకాలము లక్షవివాహములైన నిన్నేమి చేయఁగలవు? గృహస్థుఁడవుగా నుండఁదలఁతువేని నీ భార్య నిచటి కొకసారి తీసికొనిరమ్ము, నీ యాధ్యాత్మికాభివృద్ధికి తోడ్పడున ట్లా బాలిక బుద్ధిని త్రిప్పివేసెదను. లేక గృహస్థుఁ డవుగా నుండ నొల్లవేని నీ లోకాసక్తత నంతయు మ్రింగి వైతును!". ఆయన నిప్పులు గ్రక్కుచుండెను!

ఈ యాకస్మిక పుష్పవృష్టిపాతముచే ఆ బాలుఁడు దిగ్భ్రాంతుఁ డయ్యెను. ఇదంతయు కలయా, నిజమా? కొట్టుపై నున్నవాని నున్నట్లుండి ఏనుఁగుపై కెక్కించిన ట్లాతఁడు ఆశ్చర్యానందములలో మునిఁగిపోయెను. తన్నెట్లైన రప్పించి ధన్యునొనర్చుటకేనా ఆ నిందారోపణము! ఆ మిష!

జోగేశ్ మరల నాధ్యాత్మికసాధనలలో మునిఁగి శ్రీ గురుదేవుని శిక్షణమున త్యాగప్రాబల్యము చూపసాఁగెను. తలిదండ్రుల లాకులపాటు నొందిరి. తనకొఱకు వివాహ మాడుమని చెప్పిన తల్లికూడ ఇష్ట డాక్షేపించుటచే, ఆ బాలునకు ప్రపంచముపైఁ గల రోఁత ఇంకను అధికమయ్యెను. తలఁపులకును మాటలకును సామ్యము శ్రీ రామకృష్ణునందు మాత్రమే కలదని గ్రహించి, అప్పటినుండి దక్షిణేశ్వరమున నే అధికముగా కాలము గడపసాఁగెను.

జోగేశ్ అతిమృదులహృదయుఁడు. ఒకసారి అంగడివాని మంచితనమును నమ్మి యొకయోటిమూఁకుడు కొని తెచ్చెను. మఱొకసారి గుడ్డలలోని కెక్కియున్న పరిగెపురుగును చంపిరమ్మని శ్రీగురుదేవుఁడు చెప్పఁగా, వదలిపెట్టి వచ్చెను. ఇంకొకసారి తాను పడవలో పోవుచుండఁగా అందు కొందఱు శ్రీగురుదేవుని దూషింపసాఁగిరి. అజ్ఞతచే వారట్లు మాటాడుచున్నారని యూతఁ డూరకుండెను. ఈ మూఁడు విషయములలోను శ్రీగురుదేవుఁ డతనిని మందలించెను. బజారు వెళ్లినప్పుడు సరకును జాగ్రత్తగా పరీక్షించిగాని తీసికోఁగూడదనియు, నాలుగంగళ్లలో ధరలు విచారింపవలెననియు, మామూలుగా వచ్చు కొసరులు కూడ తీసికోవలెననియు, మొదటి సందర్భమున చెప్పెను. గుర్వాజ్ఞను

అక్కరాల నెఱవేర్పవలెననియు, అందు స్వేచ్ఛ నవలంబించి
నచో ముఖ్యవిషయములలో తీవ్రహాని కలుగుననియు,
రెండవసందర్భములో చెప్పెను. "గురుదూషణ చేయువారిని
చంపవలెను, లేనిచో ఆచోటు వదలిపోవలెను, అని శాస్త్ర
నిర్దేశము. నీవు రెండును జేయక దూషణను సైచితివి" అని
మూఁడవసందర్భములో చెప్పెను. ఈ మూఁడవబోధ నిరం
జనున కిట్టిసందర్భముననే చేసిన బోధకు ప్రత్యక్షవిరుద్ధ
ముగా నుండుటకు కారణ మేమనఁగా, నిరంజనుఁడు
మిక్కిలి దుడుకువాఁడు, అతనికి నేర్పవలసినది శాంతము;
జోగేౝ మిక్కిలి మెత్తనివాఁడు, అతనికి నేర్పవలసిన దొకింత
కఱకుఁదనము. ఈ యాధ్యాత్మికచికిత్సకుఁడు రోగితత్త్వమును
బట్టి యౌషధమును మార్చుచుండును.

శ్రీరామకృష్ణుని బోధ ననుసరించి జోగేౝకూడ
ఆయనను పరీక్షించెను. ఒకరాత్రి యతఁడాయన గదిలో
పరుండుట తటస్థించెను. అర్ధరాత్రమున మెలఁకువవచ్చి
చూడఁగా గదితలుపు తెఱచియుండెను, ఆయన లేఁడు.
రహస్యముగా భార్యయొద్దకు పోయియుండునా అను
సంశయము కలిగి, ఆమె పరుండు వాద్యమండపము చెంత
కరిగి కనుపెట్టి యుండెను. అంతలో శ్రీగురుదేవుఁడు పంచ
వటివైపునుండి వచ్చుచు అతనిని జూచి యిచట నేమిచేయు
చున్నా వనియడిగెను. జోగేౝ లజ్జతో తలవంచుకొనెను.
శ్రీగురుదేవుఁడు నిజమెఱిఁగి యతనిని మెచ్చుకొనెను.

దేవతాప్రసాదములలో తనపాలికి రావలసిన భాగ
మొకనాఁడు రానందున శ్రీగురుదేవుఁడు వెళ్లి విచారించెను.
అర్చకసామాన్యమగు లోభబుద్ధి యాయన కింకను అంటు

కొని యుంటయే దీనికి కారణమని జోగేన్ తలఁచెను గాని, ఆయన వచ్చి విషయము తేటపఱచెను: "ఇచ్చటికి వచ్చు భాగము రాణిరాస్మణి యుద్దేశానుసారము భక్తజనముకై వినియోగింపఁబడును. అర్చకుల భాగమో, విక్రయింపఁబడును, కొంత వారి యుంపుడుకత్తెలకు చేరును. కావున నా భాగము వా రపహరింపకుండఁ జూచితిని."

శ్రీ రామకృష్ణుఁడు యోగేంద్రు నపారముగా ప్రేమించెను. ఈశ్వరకోటు*లని యాయనచే ప్రశంసింపఁబడిన యార్గురిలో ఇతఁడొకఁడు. శ్రీ గురుదేవుని శిక్షణమున నితఁడు కామినీ కాంచనములపై పరిపూర్ణవిజయము సాధించెను.

6. గోపాల్ సుర్ [పెదగోపాలుఁడు] (అద్వైతానందస్వామి). ఇతఁడు శ్రీ గురుదేవుని సన్న్యాసశిష్యుల రాకకెంతోముందుగనే ఆయనను దర్శించినవాఁడు. ఆయనకన్న పెద్ద, వివాహితుఁడు. కాగితములవ్యాపారము చేయుచుండిన లౌకికుఁడు. భార్యామరణదుఃఖముచే నితఁడు దిక్కుతోఁపక దుఃఖోపశమనార్థియై శ్రీ గురుదేవునికడకు వచ్చెను. ద్వితీయ దర్శనమున ప్రాపంచికవిషయముల యస్థిరత్వమునుగూర్చి యాయన చేసిన బోధ యితని హృదయమున గాఢముగా నాటుకొని వైరాగ్యమునకు దారితీసెను. కాలక్రమమున నితఁడు భగవదన్వేషణాపరుఁడై శ్రీ గురుదేవు నాశ్రయించి యాయన సేవయందే కాలముగడప నారంభించెను.

7. లాటూ (అద్భుతానందస్వామి). ఈ నిఱుపేద బాలుఁడు బిహారదేశస్థుఁడు. రామచంద్రదత్తయింట నౌకరు. శ్రీ గురుదేవునిగూర్చి విని యొకనాఁ డితఁడు దక్షిణేశ్వరమున

* ఇం దైదుగురు సన్న్యాసశిష్యులు. ఒకఁడు గృహస్థ (బాల) శిష్యుఁడు.

కేగెను. కాషాయవస్త్రములు లేక సామాన్యజనులవలెనే అచట తిరుగుచుండిన శ్రీ గురుదేవుని గుర్తింపలేదుగాని, అకారణముగా ఆకర్షింపఁబడి యాయనకు సాష్టాంగప్రణామము చేసెను. ఆయన సమక్షమున అనిర్వచనీయమహానందమనుభవించి, ఆయన యెవరైనది విచారింపకయే, తాను చూడవచ్చిన పరమహంసనుగూర్చి కనుఁగొనకయే, పరమ భక్తిభావముతో ఆనాఁ డింటికేగెను. ఆయనయు ఆప్రథమ దర్శనకాలముననే యతనిలో ప్రచ్ఛన్నమైయున్న ఆధ్యాత్మిక బలమును గ్రహించి, మిక్కిలి ప్రేమతో మాటలాడి, మరల రమ్మని చెప్పెను. ఆ ప్రేమచే ముగ్ధుఁడై యతఁ డెన్నియో సార్లావిషయము రామచంద్రునితో చెప్పెను.

వంగదేశీయులు తాఁకిన ఆహారమును తినఁగూడదను బిహారదేశాచారము నితఁడు పట్టుదలతో పాటించువాఁడయ్యెను, ద్వితీయదర్శనకాలమున "మీ ప్రసాదమైనచో తినెదను" అని అప్రయత్నముగా పలికి, యాయన పెట్టిన యన్నమును తినెను!

రామచంద్రుఁడు (శ్రీ) గురుదేవుని ముఖ్యగృహస్థ శిష్యులలో నొకఁ డగుటచే నతఁ డీబాలునిచే ఆయనకు తఱచు భక్ష్యములుపంపువాఁడు. ఆ బాలుఁడును అత్యుత్సాహముతో నచటికి పోవువాఁడు. కొన్నిసార్లచటనే ఆయన కోర్కెపై రెండుమూఁడునాళ్లుకూడ నుండువాఁడు. ఇట్లు కొన్నాళ్లు జరిగినపిదప రామచంద్రు నడిగి యాయన అతనిని తనయొద్దనే ఉంచుకొనెను.

లాటూకు సంకీర్తనమందు మిక్కిలి యాసక్తి. దక్షిణేశ్వరములోని సంకీర్తనములలో నతఁడు మహోత్సాహ

ముతో పాల్గొనుచు, మైమఱచి నృత్యము చేయువాఁడు. ఇతనియొక్కయు, ఇతనిపిమ్మట వచ్చిన తక్కిన బాలభక్తుల యొక్కయు, భక్తిప్రాబల్యమును చూచి శ్రీ గురుదేవుఁడంబికను ప్రార్థించి వారికి కొన్ని దివ్యానుభూతులు ప్రసాదింపఁ జేసెను. అటుపిమ్మట వారు ధ్యానవేళలందు దివ్యానందానుభూతి నొందసాఁగిరి. శ్రీ గురుదేవుఁడు లాటూకు ధ్యానవిధానమును, ఇతరసాధనలును, నేర్పెను. అంత నతఁడతిత్వరితముగ నాధ్యాత్మికాభివృద్ధి నొందెను. శ్రీగురుదేవుని శిష్యబృందములో ప్రపంచమును పరిత్యజించి ఆయన సేవకే ఆత్మనివేదన మొనర్చుకొనినవారిలో నితఁడు ప్రథముఁడు.

లాటూ నిరక్షరకుక్షి. శ్రీ గురుదేవుఁ డతనికి కొంచెము చదువు చెప్పఁజూచెను గాని, అక్షరములుకూడ రాలేదు! అతనికి పట్టుపడినది బ్రహ్మవిద్య యొక్కటియే!

8. తారకనాథఘోషాల్ (శివానందస్వామి). ఇతఁడు జోగేకన్న కొంచెము పెద్ద. ఇతని తండ్రి న్యాయవాది, దేవీభక్తుఁడు, తాంత్రికసాధకుఁడు. తారకుఁడు చిన్ననాఁటి నుండియు ఆధ్యాత్మికాసక్తి కలిగి ధ్యానాభ్యాసము చేయువాఁడు. బ్రాహ్మసమాజములో చేరెనుగాని సంతృప్తి పడయఁజాలకపోయెను. ఒకనాఁ డొక మిత్రునితో ఆధ్యాత్మికచర్చ చేయుచు సమాధినిగూర్చి ప్రశ్నింప, నతఁ డది మిక్కిలి యసాధారణస్థితి యనియు, శ్రీ రామకృష్ణుఁ డొక్కడే ఆ యనుభూతి కలవాఁ డనియు చెప్పెను. పిమ్మట నితఁడు రామచంద్రుని యింటి కాయన వచ్చునని యొకనాఁడు విని యచటికిఁ బోఁగా, ఆయన సమాధినిగూర్చియే ప్రసంగించుచుండెను. కావున మిక్కిలి కుతూహలముతో దక్షిణేశ్వ

రముపోయి ఆయన నొకనాఁటి సాయంకాలము దర్శించెను. ప్రసంగసందర్భమున ఆయన "దైవము సాకారమనియా నిరాకారమనియా నీ నమ్మకము" అని యడిగెను. నిరాకారమని యితఁడు చెప్పఁగా, ఆయన "సరే, కాని సాకారదైవమును, అనఁగా భగవచ్ఛక్తిని కూడ తప్పక యొప్పుకొనవలసి యుండును" అని చెప్పుచు, ఇతనిని కాళికాలయమునకు పిలుచుకొనిపోయి దేవికి సాష్టాంగనమస్కారము చేసెను. బ్రాహ్మసామాజికుఁడగు నీ బాలుఁడు మొదట సంకోచించెను గాని భగవంతుఁడు సర్వగతుఁడైనచో ఈ విగ్రహమున కూడ కలఁడుగదా యని వెంటనే తోఁపఁగా, తానుకూడ నట్లే ప్రణమిల్లెను. ఆ రాత్రి తనయొద్దనే ఉండుమని ఆయన బలాత్కరించెను గాని యతఁ డుండలేదు.

తారకునికి శ్రీ గురుదేవునియందు మిక్కిలి గురితికలిగి, తఱచు రా నారంభించెను. ఆయన యొకసారి యతని నొక వివిక్తస్థలమునకు తీసికొనిపోయి నాలుకపై నేమియో వ్రాసెను. వెంటనే ఆ బాలుఁ డొక అనిర్వచనీయానుభూతి నొంది, అంతరవలోకనాయత్తుఁడై, అగాధ ధ్యాననిమగ్నుఁ డయ్యెను. ఇట్లే మఱియొకసారికూడ జరిగెను.

అప్పటి తనచిత్తవృత్తినిగూర్చి తారకుఁ డిట్లు చెప్పు వాఁడు: "శ్రీ గురుదేవుని సన్నిధిని పెక్కుతడవలు నాకు ఏడుపు వచ్చెడిది. ఒకరేయి కాళికాలయము నెదుట నిలిచి యపరిమితముగా నేడ్చితిని. నేను కనఁబడనందున శ్రీ గురుదేవుఁడు ఆతురపడుచుండెను. నన్ను చూడఁగనే 'తనకై విలపించువారియెడ భగవంతుఁ డనుగ్రహము చూపును. ఆ కన్నీటిచే పురాకృతపాపములు కొట్టుకొనిపోవును' అనెను. మఱొక

నాఁడు నేను పంచవటిలో ధ్యానించుచుండఁగా ఆయన యచటికివచ్చెను. నాపై ఆయనచూపు సోఁకఁగనే నేను విలపింప సాఁగితిని. ఆయన మౌనముగా నిలుచుండెను. ఒడలు జలదరించి నేను వణఁకనారంభించితిని. నా కట్టిస్థితి లభించినందున కాయన హర్షించి అది దివ్యభావోద్రేకఫలిత మని చెప్పెను. పిమ్మట తన గదికి తీసికొనిపోయి, తినుట కేదియో పెట్టెను. భక్తునియందు డాఁగియున్న యాధ్యాత్మిక శక్తిని ఆయన చూపుమాత్రముననే మేలుకొలుపఁగలఁడు."

తన్ను జీవితపరమార్థమునకు కొనిపోవుశక్తి శ్రీ గురుదేవునకు కలదనియు, ఆయన దివ్యప్రభావముచే నానాఁటికి తన బంధము లన్నియు సడలిపోవు చున్నవనియు, తారకుఁడు గ్రహించెను. వివాహితుఁ డయ్యును, ఆతనికి ప్రాపంచిక భోగములం దభిరుచి నశించుచుండెను. ఆయన సర్వమత సమన్వయమూర్తియనియు, ఆయన నెఱుఁగుట భగవంతు నెఱుఁగుటే యనియు, అతనికి తోఁచెను. ఈ జ్ఞానోదయముతో తారకునకు ఆయనయెడఁ గల భక్తిప్రేమలు శతగుణాధికము లయ్యెను. ఆయనకూడ నతనిని పూర్ణ వాత్సల్యముతో చూచుచు, సర్వవిధముల నతని యాధ్యాత్మికాభ్యున్నతికి దోహదముచేసెను.

9. శశిభూషణ చక్రవర్తి (రామకృష్ణానందస్వామి), 10. శరచ్చంద్ర చక్రవర్తి (శారదానందస్వామి). వీరు సన్నిహితజ్ఞాతులు. నరేంద్రదరాఖాలులయీడువాఁడు శశి, రెండేండ్లుచిన్నవాఁడు శరత్తు. బడిలో నిరువురును చుఱుకుఁదనమునకు మిక్కిలి పేరొందినవారు. ఇరువురును బ్రాహ్మసమాజ సభ్యులు.

1883 వ సంవత్సరము అక్టోబరు నెలలో బ్రాహ్మ సమాజవార్షికోత్సవము దక్షిణేశ్వరమున జరిగెను. ఆ సమయమున వీ రిరువురును శ్రీ గురుదేవుని కడికి వెళ్లి యాయనను దర్శించిరి. ఆనాఁ డాయన వారితో ముఖ్యముగా చెప్పినది ఆధ్యాత్మికాభివృద్ధి కొంత కలిగిన పిదపఁగాని ప్రాపంచికజీవనమునఁ బ్రవేశింపఁ గూడ దను విషయము. "ఇటికలను, పెంకులను, ఆవములో కాల్చుటకు ముందే కదా కంపెనీలపేళ్లు వానిపై ముద్రింపఁబడును. అప్పుడే ఆ పేళ్లు శాశ్వతముగా నిలుచును. అట్లే సంసారతాపత్రయములో పడుటకుముందే మనుష్యుఁడు ఈశ్వరజ్ఞానము పొందవలెను. కాని బాలుర కీ కాలమున చిన్ననాఁడే వివాహము చేయుదురు. చదువులు ముగియు లోపలనే వారికి బిడ్డలు, ఉద్యోగము సంపాదించి ధన మార్జించుకొను ఆవశ్యకతయు! ఇఁక భగవదన్వేషణకు తీఱిక ఏదీ?" అందుపై ఈ బాలురలో నొకఁడు "పెండ్లియాడుట తప్పా? భగవంతుని సంకల్పమున కది విరుద్ధమా?" అని యడుగఁగా ఆయన తన పుస్తకములలోనుండి బైబిలును తీయించి, అందు భగవదన్వేషణాసక్తులకు బ్రహ్మచర్య మావశ్యక మని క్రీస్తుప్రభుఁడు చెప్పిన వాక్యములను, తచ్ఛిష్యుఁడగు సెయింట్ పాల్ కూడ "అవివాహితులును విధవలును నిష్ఠురబ్రహ్మచర్య మవలంబించుట అత్యుత్తమమార్గము. కాని కామోద్రేకతాపమును భరింపఁ జాలనివారుమాత్రము కుమిలి పోవుటకంటె వివాహమాడుటే మేలు" అని చెప్పిన వాక్యములను, చదివించి, వివాహమే మనుష్యునకు ముఖ్యబంధకారణ మని చెప్పెను. అందుపై అచట నున్నవారిలో ఒకరు

"వివాహములు లేనిచో ప్రపంచ మెట్లు నడచును?" అని ప్రశ్నింపఁగా ఆయన "నేను చెప్పినది మాలోమాట. మీ ఇష్టప్రకారము మీరు ప్రవర్తింపవచ్చును" అని చెప్పెను. పిదప ఆయన "సాకారభగవంతునా, నిరాకారభగవంతునా, నీవు నమ్మునది" అని శశి నడుగ, అతఁడు "భగవంతుని యునికివిషయమే యెఱుఁగని నేను మీ ప్రశ్నకు ఎట్లుత్తర మీయఁగలను" అని నిష్కపటముగా పలికి యాయన కానందము కలిగించెను.

ఈ ప్రథమసమావేశముననే శ్రీ గురుదేవునివలె ఆధ్యాత్మికరహస్యము లిఁక నెవ్వరు నెఱుఁగ రను విశ్వాసము వారిరువురకును కుదిరినది. శశికి చిన్ననాఁటి నుండియు పూజాధ్యానప్రార్థనాదులందును, మహాపురుషజీవితాది పవిత్ర గ్రంథపఠనమందును, చాల ఆసక్తి. కావున శ్రీ గురుదేవుని మహత్త్వ మెఱుఁగుటతోడనే యాయననాశ్రయించి అచిర కాలముననే ఆయనముఖ్యశిష్యులలో నొకఁడయ్యెను.

శరత్తునకు కూడ ఆయనయందు పరిపూర్ణభక్తి కుదిరెను. ఆయన నిస్తులత్యాగ మతని నత్యంత మాకర్షించెను. ప్రసంగవశమున ఆయన యొకసారి గణనాథుని గుణగణమును ప్రశంసించుచుండఁగా, అతఁడే తన యాదర్శదైవ మని శరత్తు చెప్పెను. శ్రీ గురుదేవుఁడు వెంటనే "కాదు. నీ యాదర్శదైవము శివుఁడు. నీయొద్ద శివలక్షణములు కలవు. నీవు శివుఁడ వనియు నేను శక్తిననియు ఎల్లప్పుడును భావించుచుండుము. నీశక్తి కంతయు మూలాధారమను నేను" అని చెప్పెను. అత్యంతనిగూఢార్థము గల ఈ పలుకులు లోకసామాన్యము గ్రహింపఁజాలదు గాని, కాలాంతర

మున శరత్తునందు శివలక్షణములగు శాంతిక్షాంతిస్థైర్య జీవకారుణ్యాదులు అపారముగా ప్రదర్శితములయ్యె ననుట మాత్రము నిజము. స్వజీవితమున నేమి, మఠసేవాసంఘ కార్యనిర్వహణమున నేమి, తనకు లభించిన విజయ మంతటి కిని శ్రీ గురుదేవుని శక్తియే మూలకారణ మని శరచ్చంద్రుని పూర్ణవిశ్వాసము.

"భగవంతుఁ డెట్లు సాక్షాత్కరించుట నీ కిష్టము? ధ్యానమున నెట్టి దివ్యదృశ్యములు చూచుట నీకు కోరిక?" అని శ్రీ గురుదేవుఁ డొకసారి శరత్తు నడిగెను. "సర్వ చరాచరరూపమున భగవంతుఁడు సాక్షాత్కరింపవలె నని నాకోరిక. ఏ ప్రత్యేకరూపముగాని నా కిష్టములేదు. దృశ్య ములు నాకు ప్రీతికరములు కావు" అని యా బాలుఁడు బదు లిడ "అది ఆధ్యాత్మికవిజయపరమావధి. ఒకమాత్రమున నదెట్లు లభించును?" అని యాయన అనెను. అందుపై ఆబాలుఁడు "దానితోఁ గాని నేను తృప్తి నందను. ఆ దివ్య స్థితి లభించు వఱకును సాధనలు సాఁగించుచునేయుందును" అని బదులుచెప్పెను.

వీరిరువురు నొక పూర్వజన్మమున ఏసుక్రీస్తు అనుచరు లని శ్రీగురుదేవుఁడు చెప్పువాఁడు.

11. హరినాథచట్టోపాధ్యాయ(తురీయానందస్వామి).

ఇతఁడును నరేంద్రుని యీడువాఁడే. చిన్ననాఁటినుండియు ఇతని కాధ్యాత్మికాసక్తి మెండు. అధర్మ మోర్వఁడు; వేగు జామున లేచి గీతాపారాయణము చేయును; త్రిసంధ్య లందును స్నానమాడును; హవిష్యాన్నము వండుకొని, భగ

వంతుని కర్పించి, ఆ పిదప ఆరగించును; శంకరాచార్యునం దపారభక్తి. ఆయన బోధించిన యద్వైతవేదాంతమును జీవితమున ననుష్ఠింపఁ బ్రయత్నించును. ఈ ప్రయత్న మెంత గాఢ మనఁగా, నొకనాఁడు గంగాస్నానము చేయుచు కొంచెము దూరమున నొక మొసలిని చూచి యించుక జంకియు, వెంటనే తన నిత్యత్వము జ్ఞప్తికి రాఁగా, నచటనే నిలిచి స్నానము ముగించుకొనె నఁట!

ఇతఁడు 12, 13 ఏండ్ల బాలుఁడుగా నున్నప్పుడు దీననాథఘోష్ ఇంటిలో శ్రీ గురుదేవుని చూచెను గాని మాటలాడలేదు. అప్పు డాయనముఖముచుట్టును చక్రాకృతిగల తేజస్సు దీపించు చుండినందున ఆయన శుకదేవుని వంటివాఁడని యనుకొనెను. పిదప రెండుమూఁడేండ్ల కతఁ డొక సెలవుదినమున దక్షిణేశ్వరమునకు పోయెను. జనసమ్మర్ద మెక్కువగా నుంటచే ఆయన యతనిని ఆవలకు పిలిచి తీఱికగా మాటలాడ ననువగు మఱొకనాఁడు రమ్మని చెప్పి పంపివేసెను. ఆనాఁటి ప్రసంగములో వినవచ్చిన పలుకు లా బాలునకు సత్యామృతగుళికలై మహాసంతుష్టికరములయ్యెను. అట్టి జ్ఞానమయవాక్కు లతఁ డెన్నఁడును వినలేదు.

ఆయనతో బాగుగా పరిచయ మైనపిదప నొకనాఁడతఁడు "ఇచట సర్వమును ఆనందమయము. దీనితో పోల్చిచూచిన నాకు కలకత్తా నరకలోకమువలె నుండును" అనెను. అందుల కాయన "అదెట్లు! శ్రీహరిసేవకుఁడవగు నీకు అసంతుష్టి ఎట్లుండఁగలదు?" అని యడిగెను. "నేను హరిసేవకుఁడనా? నా కా సంగతియే తెలియదు" అని యాబాలుఁ డనఁగా, ఆయన "నీ వెఱిఁగినను ఎఱుఁగకున్నను

సత్యము సత్యమే'' అని నమ్మఁజెప్పి యా బాలు నానంద మగ్ను నొనర్చెను.

హరికి స్త్రీలన్న ద్వేషము. పసి బాలికలను గూడ దరికి చేరనీయఁడు. శ్రీ గురుదేవుఁ డొకనాఁ డీ దృక్పథము పొరపాటనియు, ద్వేషించు కొలఁది స్త్రీలవలని యపాయ మధిక మగుచుండుననియు, వారిని మాతృసమానలనుగా భావించి గౌరవింపవలెననియు చెప్పెను.

"జ్ఞానోదయమునకు గుర్తేమి?" అని యతఁ డొకనాఁ డడిగెను. "ప్రపంచవిషయమున దృక్పథము మాఱిపోవుట తప్ప వేఱుభేద మేమియు నుండదు. స్పర్శవేధి సోఁకిన ఉక్కుఖడ్గము బంగారుదిగా మాఱును. ఖడ్గరూపమే, కాని చంపఁజాలదు. కఱకుఁదనము పోయి మెత్తఁదనమువచ్చును.'' అని యాయన సమాధానము చెప్పెను.

వేదాంతశాస్త్రగ్రంథపఠననిమగ్నుఁడై యతఁడు దక్షిణేశ్వరము రాక రాక యొకనాఁడు వచ్చెను. అప్పుడు శ్రీ గురుదేవుఁడు "నీవు వేదాంతగ్రంథములు చదువుట మంచిదే కాని, వాని సారము 'బ్రహ్మము సత్యము, జగత్తు మిథ్య' అనియే కదా. అట్లైనచో మిథ్యను త్యజించి సత్యమునందే ఏల ప్రతిష్ఠితుఁడవు కావు?'' అని యడిగెను. హరి కిందుచే వేదాంతాభ్యాసమునకు నిజమగు నర్థము తెలిసినది. కొలఁది నాళ్లలో శ్రీ గురుదేవుఁడు కలకత్తాకు వచ్చి హరిని పిలువ నంపెను. అతఁడు వచ్చుసరి కాయన యసంపూర్ణశరీర స్మృతితో నిట్లు చెప్పుచుండెను: "భౌతికప్రపంచ మసత్య మని ఎఱుఁగుట సులభమా? ఈశ్వరకృపావిశేషము చేతనే అది సాధ్యమగును. కేవలస్వయంకృషి వలన ఆ జ్ఞానమును

పొందుట అసాధ్యము. మనుష్యుఁ డత్యల్పజీవి. అతని శక్తి మిక్కిలి పరిమితము. ఆ స్వల్పశక్తితో పరమసత్యమునందు వేయవపాలైన నతఁడు గ్రహింపఁ జాలఁడు'' ఈమాటలు తన్ను గూర్చియే చెప్పఁబడెనని హరికి తోఁచెను. స్వయం కృషిచే జ్ఞానసిద్ధి నొందవలెనని కదా తాను గాఢప్రయత్న ములు చేయుచుండెను! అంతట ఆయన ఈశ్వరకృపామహిమ నగ్గించు పాట నొకటి పాడెను. భావాతిశయముచే ఆయన కన్నులనుండి యశ్రుధారలు ప్రవహించెను. హరికూడ విల పించెను. అంత నతఁడు కృపాభిక్షుకై యీశ్వరపాదాబ్జాత ములప్రోల శరణు చొచ్చెను.

శ్రీ గురుదేవునికి హరిపై అత్యంతప్రేమ. అతఁ డాధ్యాత్మికౌన్నత్యము నొందఁగలఁడని యాయన చెప్పు వాఁడు. మొదటినాళ్లలో నతఁ డొకసారి చాలకాలము దక్షిణేశ్వరము రాలేదు. పిదప వచ్చినప్పు డాయన యిట్లు చెప్పెను: ''నీ విచటి కేల వచ్చుటలేదు? మీరందఱు భగ వంతుని కత్యంత ప్రియులు కావుననే మీపై నా కనురక్తి. మీరు భగవత్సాక్షాత్కారము నొంది, భవసాగరమును దాఁటి, దివ్యానంద మనుభవించుటే నాకోర్కె. అది యెట్లైన ఈ జన్మముననే సాధింపవలెను. మఱెచ్చటనైన నీ కా సిద్ధి లభించు నెడ అవశ్య మచటికే పొమ్ము. కాని నీ విచటికి (తనయొద్దికి) వచ్చుచుండినచో, నీకు భగవత్సాక్షాత్కారము సునాయాసముగా లభించునని అమ్మ నాకు చెప్పినది. కావుననే నిన్నిచ్చటికి రమ్మని నే నింతగా బలాత్కరించుట.'' ఈ మాటలు చెప్పునప్పు డాయన భావావేశము పొంగిపొరల విలపించెను.

12. గంగాధరఘటక్ (అఖండానందస్వామి). ఇతఁడు హరినాథుని స్నేహితుఁడు, కాని అతనికన్న మూఁడేండ్లు చిన్న. హరివలెనే యితఁడును మిక్కిలి శిష్టాచారపరుఁడు: ముప్పూట స్నానము, గీతాదిపారాయణము, స్వహస్తపాకము, ఏకభుక్తము. తీర్థయాత్రలు చేయు తలంపుతోఁ జిఱు బాల్యముననే ఒక సాధువు వెంట పాఱిపోయెను. కాని తల్లిదండ్రు లలజడి పడుదురని యొక నెల కింటికి వచ్చెను. ఈ లోపల హరికి శ్రీగురుదేవుని పరిచయము లభించుటచే, అతనివెంట గంగాధరుఁడుకూడ ఆయనను 1884 వ సంవత్సరమున దర్శించెను. ఆయన పూర్వపరిచితునితోవలె మిక్కిలి ప్రీతి పూర్వకముగా మాటాడి, యతఁడు సాధువుతో చేసిన ప్రయాణమునుగూర్చి ప్రశ్నించెను.

అప్పటినుండి గంగాధరుఁడు తఱు చాయన దర్శనము చేయుచుండెను. ద్వితీయదర్శనకాలమున నతని నాలుకపై ఆయన బీజాక్షరములు వ్రాసి ధ్యానవిధానము నేర్పెను. ఒకసారి కాళికాలయములోని కతనిని తీసికొనిపోయి అందలి శివవిగ్రహమును సజీవముగా కన్పింపఁజేసెను. క్రమముగా అతని రాకపోక లెక్కువయ్యెను గాని, పగటిపూట పోయినచో దేవాలయప్రసాదము భుజింపుమనునేమోయనుభీతిచే సాయంకాలవేళలనే వెళ్లి ఫలహారాదులే పుచ్చుకొను చుండెను. శ్రీ గురుదేవుఁ డిది కనిపట్టి యొకనాఁ డతఁడు పగటిపూట వచ్చి వంటచేసికొనఁ జూచుచున్నప్పుడు "కాళికాప్రసాదాన్నము గంగాజలముతో వండఁబడినది. అత్యంత పవిత్రము. హవిష్యాన్నమునకన్న శ్రేష్ఠము" అని చెప్పఁగా ఆ బాలుఁడు మత్స్యమాంసభాగమును మాత్రము విసర్జించి

ఆప్రసాదమును స్వీకరించెను. కాని భోజనానంతరము శ్రీగురుదేవుఁ డిచ్చిన తాంబూలము వేసికొనలేదు. అందుపై ఆయన "నీవు బాలుఁడవు. నీకు మత్స్యతాంబూలవిసర్జన మేల? హవిష్యాన్నభోజన మేల? నరేంద్రుని చూడుము. మత్స్య మాంసములు నిరభ్యంతరముగా భుజించును. తాంబూలము నూఱుసార్లుకూడ వేసికొనును. కాని అతని మన స్సెప్పుడును మహోన్నత స్థితియందే యుండును. సర్వమున నతఁడు బ్రహ్మమునే చూచుచుండును. అతని పరిచయము చేసి కొనుము" అని బోధించెను. ఆప్రకార మతఁడు నరేంద్రుని యొద్దకు పోయి చూచి, అతనియందు బద్ధానురాగుఁ డయ్యెను. నరేంద్రునకును ఈ బాలునిపై అపారప్రేమ. ఇంతటి ప్రేమ మితరసోదరశిష్యు లెవ్వరిపైనను లేదని కూడ చెప్పవచ్చును. కాని గంగాధరుఁడు మాత్రము తన పూర్వా చారనిష్ఠను వదలలేదు. 'శాస్త్రనిర్దిష్టమగు నాచారమును శ్రీగురుదేవుఁ డేల ప్రోత్సహింపకున్నాఁడు? శాస్త్రనియమ ములను ఆయన నమ్మఁడా' అని యతఁ డాలోచించుచుండెను. ఇట్లుండ నొకసారి యాయన యొకరితో మాటాడుచు గంగాధరాదిబాలుర యాచారనియమములను ప్రశంసించి, పురాకృతపుణ్యమే అందులకు కారణమనియు, కావుననే అట్టి బాలురకు తాను త్యాగావశ్యకతను బోధించుట యనియు చెప్పుచుండెను. అప్పు డాబాలునకు శ్రీగురుదేవుని దృక్పథము తేటయయ్యెను. ఆచారనియమములకన్న చిత్తశుద్ధికి ప్రాధాన్యమీయవలసినదనియే ఆయన బోధ.

13. శారదాప్రసన్న మిత్ర (త్రిగుణాతీతానందస్వామి). ఇతఁడు గంగాధరునికన్న నొకయేఁడు పెద్ద, గొప్ప కుటుంబ

మున పుట్టినవాఁడు. చిన్ననాఁటినుండియు భక్తిపూరిత చిత్తుఁడు, పూజాదులం దాసక్తుఁడు. శ్రీ గురుదేవుని ముఖ్యశిష్యులలో నొకఁడగు మహేంద్రనాథగుప్త హెడ్ మాస్టరుగానున్న హైస్కూలులో ఈబాలుఁడు ప్రవేశ పరీక్షకు చదువుచు అత్యంతబుద్ధిసూక్ష్మత చూపెను. పరీక్ష నాఁడు తన బంగారుగడియారము పోవుటచే నితఁడు మిక్కిలి ఖిన్నుఁడై పరీక్షయందు మొదటితరగతికి తప్పెను. ఈ ఆశాభంగముచే మఱియు క్రుంగిపోవు చుండుట చూచి, మహేంద్రుఁ డతని నొకనాఁడు శ్రీ గురుదేవుని కడకు తీసి కొని పోయెను. ఆ ప్రథమసమావేశమందే అతని చిత్త మాయనయందు గాఢముగా లగ్న మగుటచే నతఁడు తీఱిక యైనప్పుడెల్ల ఆయనను దర్శింప నారంభించెను.

ఘనకుటుంబమున జన్మించినవాఁ డగుటచే నితఁడు కొన్నిపనులు నీచములని భావించు వాఁడు. ఈ లోపమును తీర్పఁబూని శ్రీ గురుదేవుఁ డొకమధ్యాహ్న మితనిని నీళ్లు తెచ్చి తన పాదములు కడుగు మనెను. శారదాప్రసన్నుఁడు నివ్వెఱఁగు నొందెను. నిజముగా త న్నీపనిని చేయుమనెనా? ఇట్టి నీచకృత్యములు చేయవలసినది సేవకులుగదా! ఈ సందిగ్ధావస్థ నెఱుఁగనట్లే ఆయన తన యాదేశమును మరల తెలిపెను. గత్యంతరములేక ఆ బాలుఁ డందఱయెదుట ఈ "నీచకృత్యమును" చేసెను. శ్రీ గురుదేవుని కరుణవలన ఈ ఒక్కసంఘటనముచేతనే ఆ బాలుని యాభిజాత్యగర్వ మంతయు నిర్మూలమైనది. అప్పటినుండి యతఁడు శ్రీ గురు దేవునే కాక జనసామాన్యము నందఱనుగూడ నిరహంకార బుద్ధితో సేవింప సంసిద్ధుఁడయ్యెను.

శ్రీ గురుదేవుని దివ్యానుగ్రహ మితని కొక యద్భుత రీతిగా నుపకరించెను. కామమును పూర్తిగా జయింపవలెనని యితని కోరిక. ఎంత ప్రయత్నించినను సాధ్యము కాలేదు. ఇట్లుండ నొకనాఁడు ధ్యానస్థితుఁడై యుండఁగా, తనలోనికి శ్రీ గురుదేవుని కృపాతరంగములు చొచ్చు టతనికి గోచరించెను. వెనువెంటనే కామభావము నిశ్శేషముగా తొలఁగి పోయెను. మరల నెప్పుడును కన్పింపలేదు.

14. తులసీచరణదత్త (నిర్మలానందస్వామి). బలరామ్ బోస్ ఇంటికి ఎవరో పరమహంస వచ్చుచున్నాఁడని విని అనేకు లచటికి పోవుచుండఁగా, ఈ పదునెనిమిదేండ్ల బాలుఁడుకూడ నచటి కేగెను. చావడియును తూర్పువసారాయును ప్రేక్షకులతో నిండి యుండుటచే ఇతడు పడమటి వసారాలో నిలుచుండెను. కొంత సేపటికి తప్పత్రాగిన వానివలె తూలుచు ఒక మనుష్యుఁ డింటిలోనుండి అచటికి వచ్చి ఈ బాలుని కొంచెముసేపు పరికించి చూచి, చావడిలోనికి పోయెను. తులసీచరణునకు ఒడలు జలదరించెను. కలవరపాటుతో అట్టె కొంచెముసేపచట నిలుచుండి అంతట నింటికి పోయెను.

కొలఁదినాళ్ల పిదప నతఁడు తనస్నేహితుఁడగు హరితో దక్షిణేశ్వరము పోయెను. శ్రీ గురుదేవుఁడు లేఁడు. గదిలో నొక ఛాయాపటమును చూచి అది శ్రీ గురుదేవునిదని విని, బలరామునింట తానుచూచిన దాయననేయని కనుఁగొనెను.

పిదప కొన్నాళ్ల కతఁడు దక్షిణేశ్వరమునకు మరల పోయి శ్రీ గురుదేవుని దర్శించెను. అప్పు డాయన "నీవంటి బాలుఁడే యిటీవల వచ్చి భగవత్సాక్షాత్కారమార్గము

చూపుదురా అని యడిగె''నని అతనితో చెప్పెను. తన్ను గురువుగా నంగీకరింపుమని యాయన సూచించుచున్నాఁడని తలఁచి యతఁ డూరకుండెను. పిమ్మట అతని బుజముపై ప్రేమతో చేయివేసి పంచవటికి తీసికొని పోయి అచ్చట కొంతసేపు కూర్చుండి, పారవశ్యస్థితిలో జగదీశ్వరితో నేమియో మాటలాడి, పిదప తన గదికి వచ్చెను. అంత నా బాలుఁ డింటికి పోయెను.

15. హరిప్రసన్న చట్టోపాధ్యాయ (విజ్ఞానానందస్వామి). శ్రీ గురుదేవుని సన్న్యాసశిష్యు లందఱిలో నితఁడు చిన్న వాఁడు. నరేంద్రునకన్న ఐదేండ్లు చిన్న. ఇతఁడు తన 15-వ ఏఁట తన కాలేజీమిత్రుఁడగు శరత్తుతో శ్రీ గురుదేవుని ప్రథమదర్శనము చేసికొనెను. తన యెడల అప్పు డాయన చూపిన ప్రేమయే తాను చివరకు ప్రపంచమును త్యజించుటకు మూలకారణ మయ్యెనని అతఁడు చెప్పువాఁడు. జ్ఞానదీపితము లగు ఆయన పలుకులును, 'కల్లాకపటము' లెఱుఁగని యాయన స్వభావమును, ఆయన అవ్యాజప్రేమను, చూచి ఆ బాలుఁ డాశ్చర్యమగ్నుఁడయ్యెను. కొన్నాళ్ల కతఁడు బిహారరాష్ట్రమునకు పోవలసివచ్చుటచే ఆయనను పిదప దర్శింపఁజాలకపోయెను. ''అతఁ డిఁకనిప్పటిలో రాఁడని అమ్మ చెప్పుచున్నది'' అని శ్రీ గురుదేవుఁడు శరత్తుతో చెప్పెను.

కాని యతఁడు దక్షిణేశ్వరము వచ్చుచుండినప్పుడే ఒకనాఁడు శ్రీ గురుదేవుఁ డతనికి వలయు నాధ్యాత్మికశక్తి నిచ్చెను. ఆనాఁటిరాత్రి అతనిని తనగదిలోనే పరుండఁజేసి యతనితో మిక్కిలి ప్రేమపూర్వకముగా నిట్లు చెప్పెను: ''మీ యెడ నాకింత ప్రేమ యేల తెలియునా? మీ రందఱును

నాకు స్వకీయులు. అమ్మ నా కిది తెలిపినది.'' పిదప ఆ బాలు నకు కొంచెము నిద్రపట్టుచుండగా ఆయన ఏదియో తనలోతా నను కొనుచు చప్పట్లుచఱచుచు అతని పడకచుట్టును తిరిగెను. ఆయనను పిచ్చియని ఆబాలుఁడు తలఁచెను కాని తన కాధ్యాత్మికశక్తి నప్పుడు ప్రసాదించె నని పిమ్మట కనుఁ గొనెను. మఱొకసారి యతని ధ్యానశక్తిని గూర్చి ప్రశ్నించి, నాలుకపై బీజాక్షరములు వ్రాసెను. వెంటనే అతనికి చక్కని ధ్యానశక్తి కలిగి అది శాశ్వతముగా నిలిచి యుండెను.

హరిప్రసన్నుని భవిష్య మాయన కప్పటికే తెలిసి యుండెను. కావుననే యొకసారి యతనిని ఇంటింటికిపోయి భిక్షాన్నము తెచ్చుకొనఁగలవా యని ప్రశ్నించి యతఁ డంగీకరించుటచే తృప్తినందెను.

అతనికి శ్రీ గురుదేవుఁ డొక ముఖ్యబోధ చేసెను: ''మేలిమి బంగారువంటి సౌశీల్యము కలిగి భగవంతునందలి ప్రేమచే నేలపై పొరలునట్టిదైనను, స్త్రీని కన్నెత్తిచూచుట హానికరము.''

16. కాళీప్రసాదచంద్ర (అభేదానందస్వామి). హరి ప్రసన్నున కన్న నితఁడు రెండేండ్లు పెద్ద. బాబురామ్ సహా ధ్యాయి. చిన్ననాఁటినుండియు ఇతని కాధ్యాత్మికాసక్తి కలదు. గీతాదిశాస్త్రములు చదువువాఁడు.

ఉపాధ్యాయుఁ డొకనాఁ డతనిచిత్రకళానైపుణ్య మును ప్రశంసించి కళాప్రపంచమున నతఁడు ప్రఖ్యాతుఁ డగునని చెప్పెను. అందుపై నతఁడు ''చిత్రకారుఁడు వస్తు వుల బాహ్యస్వరూపమునుమాత్రమే చిత్రించుచు, వేదాంతి

అట్లుగాక వస్తువుల యంతస్తత్త్వమును పరిశీలించును. నేను వేదాంతి నయ్యెదను'' అనెను.

ఇతని జ్ఞానార్జనాభిలాష అపారము. రేయుంబవళ్లు శాస్త్రపఠనమున—అందు ముఖ్యముగా యోగశాస్త్రపఠనమున—మునింగియుండువాఁడు. గురుముఖమునఁగాని యోగాభ్యాసము సాధ్యముకాదని ఒకచోట చదివి సద్గురునికై యన్వేషించుచు, శ్రీ రామకృష్ణుఁ డట్టివాఁ డని విని, యాయన దర్శనముకై దక్షిణేశ్వరము వెళ్లెను. ఇది యితని 17 వ యేఁట. ఒక బల్లపై కూర్చుండఁ జేసి యితనిని ఆయన తాఁకఁగా, ఏదో శక్తి తనలో ప్రవేశపెట్టఁబడిన ట్లితనికితోఁచెను. పిమ్మట కాళికాలయములో కొంచెముసేపు ధ్యానించిరమ్మని, ధ్యానవిధానము బోధించి, ఆనాఁటికి పంపెను.

ఇతని కనుబొమలు శ్రీకృష్ణుని కనుబొమలనుపోలినవనియు, ఇతనియందు శ్రీకృష్ణుని అంశము కొంత కలదనియు, పూర్వజన్మమున నితఁడు యోగి యనియు, అందుచేతనే అంతచిఱుతప్రాయముననే యితనికి యోగాభ్యాసమునందు ఆసక్తియనియు, శ్రీ గురుదేవుఁడు చెప్పువాఁడు.

శ్రీ గురుదేవుని ఉపదేశానుసారముగా సాధన లభ్యసించి ఆయన యనుగ్రహముచే ఆ బాలుఁ డచిరకాలముననే అద్భుతదృశ్యములు చూడఁగలిగెను. ఒకసారి పూర్వావతారము లన్నిటితోపాటు శ్రీ గురుదేవుఁడుకూడ కన్పించి, వారెల్ల రొకరివెనుకనొక రాయనలో చొచ్చి మరల వెలికి వచ్చుట చూచెను. అందుచే ఆయన పూర్వావతారము లన్నిటి సమ్మేళన మని అతఁడు గ్రహించెను. మఱొకసారి దేవతాస్త్రీపురుషమూర్తు లెన్నియో కన్పించి అవన్నియు

నొక తేజోమూర్తిలో లీనమయ్యెను. శ్రీ గురుదేవుఁ డిదివిని "ఆహా! నీకు వైకుంఠదర్శనమైనది. నీ కిఁక దృశ్యములు కన్పింపవు. నీ వాస్థితి నతిక్రమించితివి" అనెను. అట్లే అతని కాపిమ్మట ధ్యానకాలమున దేవతాస్వరూపములు కన్పించుటకు మాఱు అనంతత, అపరిమేయత, మున్నగు నిర్గుణబ్రహ్మ లక్షణములు మనస్సు నాక్రమించుచుండెను.

కాళీప్రసాదుఁడు చేఁపలుపట్టుటయందు నిపుణుఁడు. శ్రీ గురుదేవుఁ డొకనాఁ డతని క్రూరత నధిక్షేపింపఁగా నతఁడు "మహాశయా, నే నేమితప్పు చేసితిని? సర్వభూతములును ఆత్మయే. ఆత్మ నిత్యము. అనశ్వరము. కావున సత్యదృష్టిని నే నాచేఁపలను చంపలేదు" అనెను. ఇది విని శ్రీ గురుదేవుఁడు "నాయనా, పొరపడుచున్నావు. సిద్ధపురుషుఁ డెన్నటికిని ప్రాణిహింస చేయఁడు. అది యతని స్వభావమునకే విరుద్ధము. అతని బుద్ధి ప్రమాదమునఁగూడ తప్పుత్రోవలో చరింపదు. దీనినిగూర్చి ఆలోచింపుము" అని చెప్పెను. కాళీప్రసాదుఁడు మాటాడక వెళ్లిపోయి, మూఁడుదినము లాలోచించి శ్రీ గురుదేవునివాక్యములు సత్యములని గ్రహించెను.

17. సుబోధచంద్రఘోష్ (సుబోధానందస్వామి)

ఇతఁడు హరిప్రసన్నునకన్న నొకయేఁడు పెద్ద, తక్కిన సన్న్యాసశిష్యులందఱిలో చిన్న. ఇతనికి పసినాఁటినుండియు ఆధ్యాత్మికవిషయములం దాసక్తి. "శ్రీ రామకృష్ణుని ఉపదేశవాక్యములు" అను పుస్తకమును చూచి మిక్కిలి యానందించి ఆయన నొకనాఁడు చూడఁబోయెను. అప్పు డతనికి 17 ఏండ్లు. "నీవు శంకరఘోష్ కుటుంబము వాఁడవు గదా" అని యాయన అడుగఁగా అచ్చెరువంది "ఔను; కాని మీ

కెట్లు తెలిసినది?'' అని యతఁ డడిగెను. ''నీవు వత్తువని నే నెఱుఁగుదును. ఆధ్యాత్మికజ్ఞాన మర్థించు వారిని అమ్మ యిచటికి పంపుచుండును'' అనిచెప్పి, యాతని చేయిపట్టుకొని కొంచెముసేపు కండ్లు మూసికొని ''నీకు ఆదర్శసిద్ధి కలుగును. అమ్మ అట్లు చెప్పుచున్నది'' అనెను. పిదప నతనితో ''మంగళవారమునాఁడుకాని శనివారమునాఁడుకాని వచ్చు చుండుము. అమ్మ యనుగ్రహ మందుదువు'' అని చెప్పెను. అందుపై నతఁడు ''మీరు చెప్పునది ఇప్పుడే చెప్పుఁడు; ఆ వారములలో నేను వచ్చినచో నారాక మావారికి తెలిసి పోవును'' అనెను. కాని ఆయన ''నా మాటను మార్చు కొనుట సాధ్యముకాదు. ఒకచోటి కొకనాఁడు పోవుదు నన్నచో, ఆచోటికి ఆనాఁడు పోయియే తీరవలెను. నా కిష్టము లేకున్నను, అమ్మ నన్నచటికి ఈడ్చుకొని పోవును'' అని కచ్చితముగా చెప్పెను. గత్యంతరము లేక అతఁ డంగీకరించెను.

మఱుసటి శనివారమునాఁడు వచ్చుసరికి శ్రీ గురు దేవుని గది క్రిక్కిఱిసి యుండుటచే, అతఁడు వెలుపలినుండియే ఆయనకు నమస్కరించెను. వెంటనే ఆయన బయటకు వచ్చి గంగాజలముతో చేతులు కడుగుకొని, శివాలయముల త్రోవ మెట్లపై కూర్చుండి, తన ప్రక్క నతనిని కూర్చుండఁబెట్టు కొని, అతని నాలుకపై నేమియో వ్రాసి, నాభియొద్దనుండి కంఠమూలమువఱకు చేతితో ఎగనిమురుచు ''మేలుకొమ్ము, అమ్మా, మేలుకొమ్ము'' అనెను.

ఆ యద్భుతకరస్పర్శఫలముగా సుబోధునియందు డాఁగియున్న యాధ్యాత్మికశక్తి మేలుకాంచెను. అతఁడు

ధ్యానోన్ముఖుఁడుకాఁగానే శరీరమంతయు వడఁకి, వెన్నె ముకలోనుండి మెదడున కేదియో శక్తి ఎగయుచున్నట్లు తోఁచెను. అనిర్వాచనీయానందపరవశుఁడై యాతఁడు తనలో నొకదివ్యతేజమును, అందనేక దేవతాస్త్రీపురుషరూపము లను, చూచెను. పిదప ధ్యాన మింకను అగాధమై వ్యక్తిత్వ స్మృతినే కోలుపోయెను. కొంత సేపటికి శ్రీ గురుదేవుఁ డతని శరీరమును తలయొద్దనుండి క్రిందివైపుగా నిమురు చుండఁగా ఆ బాలునకు మరల శరీరస్మృతి కలిగెను. అంతట "నీకు ధ్యానాభ్యాసము కలదా?" అని యాయన ప్రశ్నింప, నతఁడు "ఏదో కొంచెము! మా అమ్మ యొద్ద విన్న దేవతలనుగూర్చి కొంచెము తలఁచు వాడుక" అని బదులుచెప్పెను. అందుపై ఆయన "కావుననే నీమన స్సింత సులభముగా ఏకాగ్రత పొందినది. ఇఁకమీఁదట మహేంద్రు నప్పుడప్పుడు చూచుచుండుము, ఇక్కడికికూడ వచ్చు చుండుము" అని చెప్పెను.

శ్రీ గురుదేవుని దర్శించిన పిదప ఆ బాలునకు కను బొమల నడుమ నొక తేజస్సు కనిపింపసాఁగెను. అతని తల్లి యది విని "అది నీ యదృష్టము. కాని ఇతరుల కీ విషయము చెప్పకుము. చెప్పినచో ముప్పు కలుగఁగలదు" అని హెచ్చ రించెను. కాని ఆబాలుఁడు తనకు కావలసిన దీ వెలుఁగు కాదనియు దీనికి మూలకారణమగు వెలుఁగనియు చెప్పెను.

సుబోధునకు చదువునం దాసక్తి నశించెను. అతని కిప్పుడు కావలసినవి శ్రీ గురుదేవుని సాన్నిధ్యము, జపము, ధ్యానము, ప్రార్థనము: ఇవి మాత్రమే. మహేంద్రు నొద్దకి కూడ చాలకాలము పోలేదు. కారణ మడుగఁగా "అతఁడు

గృహస్థుఁడు. ఆలుబిడ్డలతో కాలము గడపువాఁడు. అతనితో నాకేమి పని ?" అని బదులుచెప్పెను. కాని శ్రీ గురుదేవుఁడు "అతఁడు నన్నుగూర్చియే మాటాడును, పొమ్ము" అని తెలిపినమీఁదట పోవ నారంభించెను.



## II. గృహస్థ శిష్యులు, భక్తులు

1. మధురానాథవిశ్వాస్. * ఇతనినిగూర్చి తెలిసిన ముఖ్యవిషయము లిప్పటికే చెప్పఁబడినవి. శ్రీ గురుదేవుని యక్కఱ లన్నియు తీర్చుచుండుకొఱకు జగజ్జననిచే నియుక్తుఁడైన మొదటి "రసద్దారుఁ" డితఁడు. తన పని ముగియుతోడనే మరల దేవీలోకమునకుఁ బోయిన సుకృతాత్ముఁడు. శ్రీ గురుదేవు నితఁడు "బాబా"(తండ్రి) యని పిలుచుచు, గురువుగను (పు. 91) రక్షకునిగను (పు. 194) చూచుకొనుచు, భృత్యానుభృత్యుఁడై మెలఁగుచుండెను.

2. శంభుచరణ మల్లిక్. ఇతఁడు ఉన్నతాశయుఁడు, భక్తిపరుఁడు, దయాదానగుణములకు పేరొందినవాఁడు. దక్షిణేశ్వర కాళికాలయసమీపమున నితనికొక యారామగృహము కలదు. శ్రీ గురుదేవుఁ డచటికి తఱచు వెళ్లువాఁడు. వారి పరిచయ మధిక మగుకొలఁది, ఆయనయం దితని ప్రేమ గౌరవములుకూడ నధికమై, ఆయన అక్కఱ లన్నియు నితఁ డత్యుత్సాహముతో తీర్పఁబూనుకొనెను. ఆయన నితఁడు "గురుజీ" అని పిలుచువాఁడు. శ్రీ గురుదేవుఁ డిది యొల్లక

* "మథురామోహన్ విశ్వాస్" అని నామాంతరము.

చిరాకుతో "ఎవరు ఎవరికి గురువు? నీవు నాకు గురువవు" అని యొక్కొక్కసారి యనును. కాని శంభుఁ డాయనను చివరవఱ కట్లే పిలుచుచుండెను.

ఇతఁడు వివిధమతశాస్త్రముల నాసక్తితో చదువువాఁడు. ఇతఁడు బైబిలు చదివి వినిపింపఁగా వినియే శ్రీగురుదేవుఁడు క్రైస్తవమతద్వారమునఁగూడ దైవసాక్షాత్కార మొందఁగోరినది. ఆ కోర్కె యెట్లు ఫలించెనో 231 వ పుటలో తెలుపఁబడినది.

జగన్మాత శ్రీ గురుదేవునకు స్వజనముగా కనుపఱచిన మహోత్తమపురుషులలో ఇతఁ డొకఁడు. ఆమెచే నియుక్తుఁడైన రెండవరసద్దారు. ఇతనినిగూర్చి 240, 242, 243 పుటలలో నిప్పటికే కొంత చదివియుంటిమి.

3. విశ్వనాథ ఉపాధ్యాయ. శ్రీ గురుదేవుని సేవకై జగన్మాతచే నియుక్తుఁడైన మూఁడవ రసద్దారుఁ డితఁడు. ధైర్యసాహసములకును, భగవద్భక్తికిని, పేరొందిన వంశమున జన్మించినవాఁడు. ఇతని తండ్రి హిందూదేశసైన్యములో సుబేదారుగా నుండి యుద్ధభూమిలోకూడ శివు నర్చించువాఁడు. విశ్వనాథుఁడు విద్యాసంపన్నుఁడు, భక్తిపరుఁడు, సత్యప్రియుఁడు, శాస్త్రావలోకనకుతూహలము కలవాఁడు, నియమనిష్ఠాపరుఁడై ఇష్టదైవమును అనుదినము యథావిధిగా నర్చించువాఁడు. గీతాభాగవతవేదాంతశాస్త్రము లితనికి కంఠస్థములు. నేపాళసంస్థానాధీశుని కొలువులో నితఁ డొక యున్నతోద్యోగి. కలకత్తాలోని నేపాళసంస్థానపు కలప దొడ్డిపై ఈకాలమున విచారణాధికారిగా నుండెను. శ్రీ మాతృదేవి నివాసార్థమై శంభుచరణుఁడు కట్టించిన

కుటీరమునకు (పు. 240) కలప సరఫరాచేసిన దితఁడే.

శ్రీ గురుదేవు నితఁడు గురువుగ భావించువాఁడు (పు. 245). తమయింటికి ఆయన నప్పుడప్పుడు పిలుచుకొని పోయి, ఇష్టమృష్టాన్నములతో సత్కరించి, మహాశ్రద్ధా భక్తులతో నాదరించును. ఇతఁ డాయన పాదము లొత్తుచుండఁగా ఇతనిభార్య విసరును. ఆయనచే నితఁ డెట్లాకర్షింపఁబడెనో 244, 245 పుటలలో తెలుపఁబడినది.

4. సురేంద్రనాథమిత్ర. ఇతఁడు విద్యావంతుఁడు. ఆంగ్లేయవర్తకసంస్థ యొకదానిలో గొప్పయుద్యోగి. సంఘ నీతినియమములను పాటింపని స్వేచ్ఛావర్తనుఁడు. ఆధ్యాత్మిక దృష్టి లేదు గాని, దయామయుఁడై దీనజనుల కష్టములు తీర్చు స్వభావము కలదు. ఒకనాఁ డొకసన్న్యాసిని యితని కగపడి "నాయనా, భగవంతుఁ డొక్కఁడే సత్యము, తక్కిన దంతయు అసత్యము" అని చెప్పెనఁట. ఈ పలుకు లతనియందు తీవ్రసంచలనము కలిగించెను. ఇంద్రియలోలమగు తన క్షుద్ర స్వభావమును లోఁబఱచుకొన యత్నించి, జయింపఁ జాలక, దుర్భరమనోవేదన ననుభవించి తుద కాత్మహత్యకూడ చేసికొనఁ జూచెను.

ఇతని మిత్రుఁడగు రామచంద్రదత్త ఎన్నోతడవలు చెప్పఁగా తుద కొకనాఁ డితఁడు దక్షిణేశ్వరము వెళ్లి శ్రీ గురుదేవుని గదిలో తక్కినవారితోఁగూడ కూర్చుండెను. అప్పుడు శ్రీ గురుదేవుఁడు ప్రసంగించుచుండినది స్వయం కృషికిని శరణాగతికిని గల భేదమునుగూర్చి. కోఁతిపిల్ల తానే తల్లిని కఱచుకొని, యొక్కొకసారి పట్టుతప్పి పడిపోవు ననియు, పిల్లిపిల్ల అట్లుగాక తల్లినే నమ్మియుండుటచే తల్లి తానే

దానిని నోట కఱచుకొనిపోయి సురక్షితముగా నుంచుచుండు ననియు శ్రీ గురుదేవుఁడు చెప్పుచుండెను. ఆ కోఁతిపిల్లవలె ప్రవర్తించుచుండుటచేతనే తాను సర్వకష్టములపాలయి, తుద కాత్మహత్యకూడ తలపెట్టుచుండెననియు, ఆ నిమిషము నుండియు జగదీశ్వరి బిడ్డఁడై భారమంతయు ఆమెపైననే యుంచి తాను నిర్విచారముగా నుండవలె ననియు, నిశ్చయించుకొనెను. అట్లు నిశ్చయించుకొనిన క్షణముననే అతని హృదయభార మంతయు తగ్గిపోయి, ఎన్నఁడులేని నూత్నశక్తి లభించి అతని జీవితమే పూర్తిగా మాఱిపోయి, శ్రీ గురు దేవునియం దపారభక్తి కలిగెను.

అప్పటినుండియు నతఁడు ప్రతి ఆదివారము ఆయన దర్శనమున కేగువాఁడు. అతనికి కలిగిన భగవత్సాక్షాత్కార తీవ్రవాంఛ యెల్లర నాశ్చర్యనిమగ్నుల నొనర్చెను. కాని ఎట్టి వారైనను పూర్వమార్గముల నొకేమాటు విడువఁ గలరా! అప్పుడప్పు డతఁడు పూర్వపరిచితులలో కలియుచు, దక్షిణేశ్వరము వచ్చుటకు లజ్జించును. శ్రీ గురుదేవుఁ డిందుకై కోపగించుకొనక "అతని కింకను కొంత భోగకాంక్ష కలదు. అనుభవింపనిమ్ము. అచిరకాలముననే నిష్కల్మషుఁ డగును" అని యొకసారి చెప్పెను. ఈ ప్రేమమయవాక్కులు సురేంద్రునకు తెలియవచ్చి పిమ్మటివార మతఁ డచటికి వచ్చెను. కాని దూరముగా నొకమూలను కూర్చుండెను. శ్రీ గురు దేవుఁ డతనిని మిక్కిలిప్రీతితో తన చెంగటికి పిలిచి, యసంపూర్ణ శరీరస్మృతితో "అయోగ్యస్థలములకు పోవువారు జగన్మాతను ఏల వెంటతీసికొనిపోరు? ఎన్నో అనర్థములు తప్పును గదా!" అని పలికెను. ఎన్నాళ్లనుండియో తనకు

లోఁగకుండిన దుర్వ్యసనములను సులభముగా లోఁగఁదీసి కొను మార్గము సురేంద్రుని కీమాటలలో గోచరించి ఆయన యందలి భక్తి శతగుణాధిక మయ్యెను.

సురేంద్రుఁ డొకనాఁడు తన ఆఫీసులో పనిచేయు చుండఁగా, ఉన్నట్టుండి శ్రీ గురుదేవుని దర్శింపవలె నను నత్యంతతీవ్రవాంఛకలిగి, దాని నాఁపుకొనఁజాలక, నిలువ యున్న పనినంతయు కట్టిపెట్టి, వాయువేగమున దక్షిణేశ్వరము చేరెను. అతనిని చూడఁగనే శ్రీ గురుదేవుఁడు "నీవు వచ్చుట చాల మేలైనది. నిన్ను చూడఁగోరి నేను కలకత్తాకు బయలుదేఱు చుంటిని" అనెను. సురేంద్రుఁ డాశ్చర్యచకి తుఁడై, "ఏమి ఈ చిత్రము! నే నాయనను చూడఁగోరితిని. ఆయనయు నన్ను చూడఁగోరెను!" అని తలపోసి "తాము నాకొఱకై కదా కలకత్తా వెళ్లఁదలఁచితిరి. మా యింటికి దయచేయుఁడు" అని ప్రార్థించెను. ఆయన యంగీకరించుటచే పట్టరాని యానందముతో ఆయనను తనయింటికి తీసికొని పోయెను.

ఇప్పటినుండియు సురేంద్రుఁడు శ్రీ గురుదేవుని యాంతరంగికభక్తకోటిలోనివాఁడుగా ఎన్నఁబడుచుండెను. పలుమా ఱతఁ డాయనను, భక్తకోటిసహితముగా తనయింటి కాహ్వానించి, సంకీర్తనాదు లేర్పాటు చేసి, ఉత్సవములు జరుపువాఁడు. శ్రీ గురుదేవుని సౌకర్యములకై ఎంత వ్యయ మైనను చేయును. భక్తులు దక్షిణేశ్వరముననే నిలిచి యుండుట తటస్థించినపుడు వారి వ్యయమును కూడ భరించును. ఇతఁడుకూడ జగన్మాతచే తనకై నియమింపఁబడిన రసద్దారుఁ డని శ్రీ గురుదేవుఁడు చెప్పువాఁడు.

సురేంద్రుని దుర్వ్యసనములలో త్రాగు డొకటి. కాని శాక్తేయుఁడగు నతని కది తప్పుగా తోఁపలేదు. దానిని మాన్పుటకు రామచంద్రుఁ డెంతో ప్రయత్నింపఁగా చివరకు "శ్రీ గురుదేవుఁ డిది ఎఱుఁగును గదా. ఆయనకడకు పోవుదము. ఆయన నిషేధించినచో తప్పక మానెదను. కాని నీవీ సంగతి ఎత్తకూడదు" అని సురేంద్రుఁడు చెప్పెను. ఆయన వకుళవృక్షముక్రింద ఉన్నతమనోభావమునఁ గూర్చుండి యుండఁగా వీ రచటికిపోయి ప్రణమిల్లిరి. వెంటనే ఆయన "సురేశా, నీవు మద్యమును మద్యముగా ఏల త్రాగెదవు? కాళి కర్పించి యామె ప్రసాదముగా తీసికొనుము. కాని మైకము కలుగకూడదు సుమీ! నడక తడఁబడ కూడదు, తలఁపులు చలింప కూడదు. మొదట ఎప్పటివలె ఉద్రేకము కలుగును గాని త్వరలోనే ఆధ్యాత్మికానందమునకు దారితీయును" అని చెప్పెను. మిత్రు లాశ్చర్యమగ్నులైరి. సురేంద్రుఁ డీ బోధ ననుసరించి ప్రతిసాయంకాల మొకింత మద్యమును కాళి కర్పించి పుచ్చుకొనువాఁడు. తత్ఫలముగా నతనికి భక్తిభావోద్రేకము కలిగి శిశువువలె దేవికై దీనముగా రోదనము చేయును. భగవంతునిగూర్చియే మాటాడును. ఒక్కొకసారి అగాధసమాధినిమగ్నుఁడై నిశ్చలముగా కూర్చుండును. అతనిచిత్తశుద్ధియు, భక్తియు, ఎల్లర కాశ్చర్యము గొలిపెను. మద్యమువలని దుర్గుణము లేవియు అతనిని స్పృశింపలేకపోయెను!

5. బలరామ్‌బోస్.* ఇతఁడు భక్తిపూరితకుటుంబమున పుట్టినవాఁడు. మిక్కిలి ధనికుఁడు. కాని ఆ స్తిని విచారించు

* 'బోస్' అను పేరునకు రూపాంతరము బసు (వసు)

చుండు భార మొకజ్ఞాతి కప్పఁజెప్పి, నెలసరి కర్చులకు వలయు కొలఁది సొమ్మును మాత్రము పుచ్చుకొని, పుణ్యస్థలములలో నివసించుచు, జపధ్యానప్రార్థనాదులందు కాలము గడపు వాఁడు. ఇతని తండ్రియు నిరంతరజపతత్పరుఁ డగు వైష్ణవ భక్తుఁడు. బాబురామ్ (ప్రేమానంథస్వామి) సోదరి యగు ఈయనభార్యయు భక్తిసౌశీల్యములకు పేరొందినదే. ఇంతేల, ఆ యింట నందఱును భక్తులే. ఇలువేల్పగు జగన్నాథేశ్వరుని కర్పింపనిది ఇంట నెవ్వరును ఏమియును నోట పెట్టుకొనరు.

కేశవచంద్రునిచే ప్రకటింపఁబడిన శ్రీరామకృష్ణ ప్రవచనములను చదివి గాఢముగా ఆకర్షింపఁబడి బలరాముఁడు 1882 వ సంవత్సరమున ఒకనాఁడు ఆయన దర్శనము చేసికొని "భగవంతుఁడు కలఁడా, భక్తులకు సాక్షాత్కరించునా, అట్లైనచో నే నెంత ప్రార్థించినను నా కేల సాక్షాత్కరింపకున్నాఁడు?" అని ప్రశ్నించెను. "కలఁడు, భక్తులకు తప్పక సాక్షాత్కరించును, కాని అతనిని స్వకీయునిగా తలఁచి, అత్యంతప్రేమతో ప్రార్థింపవలెను" అని బదులు చెప్పి "నీకన్నను, నీబిడ్డలకన్నను, ప్రియునిగా తలఁచి అతనిని ప్రార్థించితివా?" అని యడిగెను. భయభక్తులతో సాష్టాంగ ప్రణామము లాచరించుచు భగవంతుని కొల్చుచుండిన బలరామున కొక యద్భుతనూతనదృక్పథ మీమాటలలో తోఁచినది. ఆ మహానుభావుఁ డాడిన ప్రతిఅక్షరము సత్యమని యతనికి గోచరించినది. ఆయనయే తనకు జ్ఞానబోధ చేయఁగల గురువనికూడ అప్పుడే నిర్ణయించుకొనెను. ఆయన తనయెడ చూపిన అవ్యాజగాఢప్రేమయు అతనిని ముగ్ధుని చేసెను.

అప్పటినుండి అతని మనస్సంతయు దక్షిణేశ్వర

మందే లగ్నమయ్యెను. మఱునాఁడు మరల దర్శనమునకు వచ్చినప్పు డతనివిషయ మంతయు విచారించి "నీవు మాలో నొకఁడ వని అమ్మ చెప్పినది. ఇచటికి (అనఁగా తనకు) సంబంధించిన అనేకవస్తువులు నీ యొద్దకలవు. ఏదైనను కొని ఇచటికి పంపుము" అని యాయన చెప్పెను. బలరాముఁ డిది మహాభాగ్యముగా తలంచి ఉప్పొంగి ఆనందముతో అంగీకరించెను. అటుపిదప శ్రీ గురుదేవుని భోజనవ్యయ మంతయు ఇతఁడు భరించువాఁడు. ఆయనకై నియమితుఁడైన కడపటిరసద్దారుఁ డితఁడు. ఆయనను చైతన్యావతారముగా నెంచువాఁడు.

శ్రీ గురుదేవునికి బలరామునిపై మహాప్రీతి. అతని యింటి భోజనము పరమపవిత్ర మని ఎన్నోసార్లచట భోజనము చేయువాఁడు. బ్రాహ్మణేతరుల యిండ్లలో మధుర భక్ష్యములు, ఫలాహారములు, మాత్రమే స్వీకరించువాఁ డిచట అన్నము కూడ తినును. "భగవద్భక్తి, సాధుయాచక జనసత్కారము, ఈ యింట వంశపారంపర్యముగా కలవు. ఇతని తండ్రి ధ్యానప్రార్థనాతత్పరుఁడై జీవితశేషమును బృందావనమునఁ గడపుచున్నాఁడు. తల్లిదండ్రులు మొదలు పసికూనవఱకు ఈ యింట నెల్లరకు నొకే యాదర్శము! ఎల్లరును భగవద్భక్తులే: ఎవ్వరును ప్రార్థనలకు పూర్వము పచ్చిగంగయైన పుచ్చుకొనరు. ఈ సత్కుటుంబమున అన్నము తినుటకు నాకు నిరాక్షేపముమాత్రమే కాదు, ఆనందము కూడ" అని ఆయన చెప్పువాఁడు. పగటిపూటగాని రాత్రి పూటగాని కలకత్తాలో ఉండవలసివచ్చినప్పు డిచటనే యుండును. తాను అతీంద్రియదృశ్యమున చూచిన చైతన్యో

త్సవములో ఇతఁడు కూడ నుండెనఁట. కావున నొక పూర్వజన్మమున నితఁడు చైతన్యునిఅనుచరుఁడని ఆయన విశ్వాసము.

సగుణబ్రహ్మరూపులగు కాళికాశివులను, రాధాకృష్ణులను, భేదభావమేమియు లేక సమభక్తితో చూచుచు, వారెవరినామము విన్నను భావోద్రేకముతో కన్నీరు కార్చుటయు, నిర్గుణబ్రహ్మమును తలఁచుచో సమాధినిమగ్నుఁడగుటయు, చూచి బలరాముఁడు శ్రీ గురుదేవుని బుద్ధివైశాల్యమునకు నివ్వెఱఁగు నందువాఁడు. ఆయన శిక్షణమున సాధన లొనర్చి బలరాముఁ డాధ్యాత్మికౌన్నత్య మంది, సామాన్యపూజాకలాపములను మాని, ప్రేమభక్తిమాధుర్యమును చవిచూచెను. పరిపూర్ణ విశ్వాసముతో ఈశ్వరేచ్ఛయందు శరణాగతుఁడయ్యెను.

ప్రాణిహింస మహాపాతకమని బలరాముని యభిప్రాయము. కాని పరమార్థసాధకమగు ధ్యానము నిరాటంకముగా సాఁగుటకు కొన్ని దోమలను చంపు టంతగా దోషము కాదేమో యని యొకసారి తలఁచి, అయినను శ్రీ గురుదేవుని కూడ కనుఁగొందమని బయలుదేఱెను. తా నెఱిఁగినవఱ కాయన యెన్నఁడును ప్రాణిహింస చేసి యెఱుఁగఁడు. కావున నిస్సంశయముగా ఆక్షేపించు నను నమ్మకముతో అచటికి చేరెను. కాని, నేఁ డిదేమి చిత్రము! దిండులోనుండి నల్లులను బైటవైచి చంపుచు "ఇవి కుట్టి మనస్సును చలింపఁజేయుచున్నవి" అని యాయన బలరామునితో చెప్పెను! అడుగకముందే ప్రశ్నకు ఉత్తరము లభించినది! సర్వమనోవేదియగు ఆ మహాత్ముఁ డిట్లే భక్తుల

సంశయములను అద్భుతవిధముగా తీర్చుచుండును!

6. రామచంద్రదత్త. శ్రీ గురుదేవుని దివ్యాహ్వాన ఫలముగా ఆయనకడకు మొట్టమొదట వచ్చినవారు ఇతఁడును, మనోమోహనుఁడను మఱియొకఁడును. పైన పేర్కొనఁబడిన సన్న్యాసశిష్యు లెవరుగాని (గోపాల్ సుర్ తప్ప) అప్పటికి రాలేదు. నరేంద్రుని, సురేంద్రుని, ఇతఁడే ప్రవేశ పెట్టినవాఁడు.

ఇతఁడు డాక్టరు. నాస్తికప్రాయుఁడు. కాని జిజ్ఞాసాపరుఁ డగుటచే మనశ్శాంతి నొందఁజాలక పోయెను. ఇట్టి స్థితిలో కేశవచంద్రుని పత్రిక యొకదానిలో శ్రీ గురుదేవుని ప్రశంస చదివి 1879 వ సంవత్సరమున ఒకనాఁ డాయనను దర్శించి, సాయంకాలమువఱ కాధ్యాత్మికప్రసంగములు చేసి యింటికి పోయెను. ఆయన చూపిన అవ్యాజప్రేమ, ఆయన పలుకులలోని అగాధసత్యము, అతని మనస్సును ప్రబలముగా నాకర్షించినవి.

శ్రీ గురుదేవునితోడి సాంగత్య మధిక మగుకొలఁది రామచంద్రుని నాస్తికభావములు చలింపఁజొచ్చి, కొన్నాళ్లకతఁడు "భగవంతుఁడు కలఁడా" అని ఆయనను ప్రశ్నించెను. అందుల కాయన "నిస్సంశయముగా కలఁడు. ఈ మహాద్భుతమగుసృష్టి నిదర్శనముకాదా అతని యునికికి? కాని, యతని సాక్షాత్కారము కోరువారు విహితసాధనలొనర్పవలెను, కాలము పరిపక్వమగువఱకు వేచియుండవలెను" అని బదులుచెప్పెను.

ఆపిదప నతఁడు భగవత్సాక్షాత్కారముకై తీవ్రసంక్షోభమునొంది ఆ వియోగవేదనను భరింపలేకపోయెను.

అప్పుడు స్వప్నమున (శ్రీ) గురుదేవుఁడు కనిపించి స్నానము చేసి రమ్మని ఒకమంత్ర ముపదేశించెను. కాని అతని కందు నమ్మకము లేక, మనస్సంక్షోభము దినదినాభివృద్ధి నొందు చుండినను, మంత్రము జపింపక ఊరకుండెను. ఒకనాఁడు పట్టపగలు నడువీథిలో నొక నల్లని మనుష్యుఁడు కనిపించి "ఏల ఆతురత? తొందర పడకుము" అని చెప్పి యదృశ్యుఁ డయ్యెను. (శ్రీ) గురుదేవునితో ఈ సంగతులు చెప్పఁగా ఆయన "ఇట్టి చిత్రము లింక ఎన్నిటినో చూతువు" అనియు, "స్వప్నోపదేశము లభించుట మహాభాగ్యము" అనియు చెప్పెను. అప్పటికికూడ రామచంద్రుని తార్కికబుద్ధి యందు విశ్వాస మంకురింపలేదు. కాని కొంతమనశ్శాంతి చేకూఱి, లోకమునెడ వైరాగ్యము జనించి, సన్న్యసించు కోరిక కలిగెను. (శ్రీ) గురుదేవున కిది తెలుపఁగా ఆయన వారించి సన్న్యాసస్వీకార మతని కసాధ్యమని చెప్పెను.

కొన్నాళ్లకు మనస్సంక్షోభము మరల నారంభమై దుర్భరము కాఁగా, నతఁడు (శ్రీ) గురుదేవునితో మొఱపెట్టు కొనెను. కాని ఆయన నిర్దాక్షిణ్యముగా "నే నేమిచేయఁ గలను? భగవదిచ్ఛ యెట్లున్నదో!" అనెను. రామచంద్రుఁడు దిగ్భ్రాంతుఁడై "ఇన్నాళ్లు మిమ్ము నమ్మికొనియుంటిని. మీ రిట్లు చెప్పిన నా గతియేమి?" అని యనెను. అందులకాయన మరల నట్లే నిష్ఠురముగా "నీకు నే నేమియు ఋణపడి యుండ లేదు. ఇష్టమున్న రా, లేకున్న మానుకో" అనెను. రామ చంద్రుని గుండెపగిలి, దిక్కు తోఁపక ఆత్మహత్య చేసికొంద మనికూడ తలఁచెను. కాని ఉత్తరక్షణమున "ఆత్మహత్య కంత తొందర యేల? స్వప్నోపదేశము మహాభాగ్యమని

శ్రీ రామకృష్ణుఁడు చెప్పెను గదా ! ఆ మంత్రఫలమును ఏల పరీక్షింపరాదు ?'' అనుకొని వసారాలో పరుండి ఆ మంత్రమును మానముగా జపింప నారంభించెను. అర్ధరాత్రివేళ శ్రీ గురుదేవుఁ డచటికి వచ్చి ''భక్తులకు సంతర్పణ మొనర్పుము'' అని చెప్పి పోయెను.

రామచంద్రుఁడు కొంచెము లోభి. కావున శ్రీగురుదేవుని భక్తసంతర్పణసూచనను మఱపునఁ బెట్టి ఊరకుండెను. కాని శ్రీ గురుదేవుఁడే జ్ఞప్తిచేసి, విందున కొకదినముకూడ నిర్ణయించెను. విందు జరిగిన మఱునాఁడు రామచంద్రుఁడు దక్షిణేశ్వరము మరల వచ్చెను. శ్రీ గురుదేవుఁడు మిక్కిలి ప్రేమతో రాత్రి 10 గంటల వఱ కతనితో మాటాడి వివిధవిషయములు బోధించెను. రామచంద్రుఁడు సెలవుగొని వసారాలోనికి పరుండుటకై పోయెను. కాని యతఁ డింకను నిలుచుండి యుండినపుడే శ్రీ గురుదేవుఁ డచటికిపోయి ''నీ కేమి కావలయును ?'' అని యడిగెను. రామచంద్రుఁడు కలవరపడెను. ఎట్టి వరమైనను ప్రసాదింపఁగల మహాశక్తి యెదుట నున్నట్లు తోఁచి ఏ మడుగవలయునో నిర్ణయించుకోఁజాలక, భావోద్రేకపూరితుఁడై, గద్గదకంఠమున ''ప్రభూ, ఏ మడుగవలెనో నేను ఎఱుఁగను. తామే నిర్ణయింపుఁడు'' అని విన్నవించుకొనెను. అంతట ఆయన ''నీకు స్వప్నములో నే నిచ్చిన మంత్రమును మరల నిమ్ము'' అని చేయి చాఁపి సమాధినిమగ్నుఁ డయ్యెను. రామచంద్రుఁడా మంత్రమును ఆయన పాదములకడ సమర్పించి సాష్టాంగప్రణామ మొనర్పఁగా, తన కుడికాలి బొటనవ్రేలి నతని తలపై నుంచెను. ఎంతసే పట్లుగడచెనో రామచంద్రుఁ డెఱుఁగడు.

శ్రీ గురుదేవుఁడు సామాన్యస్థితికి వచ్చి తన కాలిని తీసి వైచెను. రామచంద్రుఁడు అంతట లేచి నిలుచుండఁగా, ఆయన "నీ వేమైనను చూడఁగోరినచో నన్ను చూడుము" అనెను. చూడఁగా నతని యిష్టదైవము కానిపించెను. "ఇఁక నీకు సాధన లేవియును అక్కఱలేదు. అప్పుడప్పుడు ఇచటికి వచ్చుచుండుము. వచ్చునప్పు డొకకాని కేదైనను తెచ్చుచుండుము" అని చెప్పెను.

7. మనోమోహనమిత్ర. ఇతఁడు రామచంద్రునకు సన్నిహితబంధువు. వీరిరువు రొక్కసారిగనే శ్రీ గురుదేవుని ప్రథమదర్శనము చేసికొనిరి.

ప్రథమదర్శనముననే వీరికి శ్రీ గురుదేవునియందు గుఱి కుదురుటచే, ఆయనకడకు తఱుచు పోసాఁగిరి. వైరాగ్య లక్షణములుకూడ వీరిలో నంకురించెను. మనోమోహనుని మేనత్త యీసాంగత్యమును నిలుపఁదలఁచి వారిని నిరోధింపఁ జూచెను. కాని వారు మానలేదు. వారు దక్షిణేశ్వరము వెళ్లునరి కాయన ముఖము సొంపుతఱిఁగి యుండెను. కారణ మడుగఁగా ఆయన "ఇచటికి వచ్చు భక్తు నొకని నతని మేనత్త నిరోధించుచున్నది. అతఁ డెక్కడ ఆమెకు లోఁబడి పోవునో అని చింతిల్లుచున్నాను" అనెను. మఱియొకసారి యిట్లే మనోమోహనుని భార్య నిరోధించెను. శ్రీ గురుదేవుఁడు అప్పుడు కూడ ఖిన్నుఁడై కన్నీరుకార్చుచుండి తొల్లిటి వలెనే ఖేదకారణము చెప్పి, వారి నాశ్చర్యపరవశులఁ జేసెను. ఈ యద్భుతశక్తినిదర్శనములను, తమ యాధ్యాత్మికాభివృద్ధి యందు ఆయనకుఁగల మహాసక్తిని, ఆయన యవ్యాజప్రేమాతి శయమును, చూచి మనోమోహనుఁ డాయన పాదాబ్జముల

కడ పరిపూర్ణముగా నాత్మార్పణము చేసికొనెను.

కాని మనోమోహానునకు తనయంతటి భక్తులింకెవ్వరునులే రను దుర్గర్వము కలదు. సురేంద్రునిభక్తి యసామాన్యమని శ్రీ గురుదేవుఁ డొకసారి కొనియాడఁగా నితఁడది సహింపఁజాలక ఆయన కడకు వెళ్లుట మానుకొనెను. శ్రీ గురుదేవుఁ డెన్నిసార్లు చెప్పిపంపినను, రాక పోవుటయే గాక, ఆయనను మఱచిపోవలెనని కూడ ప్రయత్నించెను. కాని ప్రయత్నించినకొలఁది బుద్ధి ఆయనమీఁదికే పోవుచు, నిత్యకృత్యములు చేయుటకూడ అసాధ్యమయ్యెను. హృదయ మంతయు ఆయన కధీనమైపోయెనని యతఁ డెట్టకేల కంగీకరింపవలసివచ్చెను. ఇట్లుండఁగా నతఁ డొకనాఁడు స్నానార్థమై గంగానదికి పోయెను. గంగాజలపవిత్రతనుగూర్చి యాయన చేయు ప్రశంసలు జ్ఞప్తికి వచ్చి, ఆ వెనువెంటనే యతని మనోవీథియం దాయన ప్రశాంతమూర్తి గోచరించెను. మాపుకొనుట కెంత ప్రయత్నించినను ఆ దివ్యమూర్తి అట్లే నిలిచియుండెను. ఇంతలో అతని దృష్టి తన వైపునకు వచ్చుచుండిన యొక నావపై పడెను. అం దొక పరిచితమూర్తి నిలిచి, తన్నెవరికో చేతితో చూపుచుండెను. వారు నిరంజనుఁడును శ్రీ గురుదేవుఁడును అగుట కనుఁగొని మనోమోహానుఁ డులికిపడెను. "నీ వేల దక్షిణేశ్వరమునకు రావు? నిన్ను చూచు తీవ్రవాంఛచే శ్రీ గురుదేవుఁ డిచటికి వచ్చినాఁడు" అని నిరంజనుఁ డనెను. ఆ నాఁడు ప్రచండముగా ఎండకాయుచుండుటచే శ్రీ గురుదేవుఁడు విసరుకొనుచుండెను. మనోమోహానుని సమీపింపఁబోవుచు ఆయన సమాధినిమగ్నుఁ డయ్యెను. మనోమోహానుఁ డిది యంతయు

నివ్వెఱపాటుతో చూచి భావోద్రేకము పొంగి అశ్రుధారా రూపమున ప్రవహింపఁగా విలపింప సాఁగెను. "ఎంత అపరాధము చేసితిని! ఆయన మన స్సెంతగా నొప్పించితిని! నాకై యీ మిడిమెండలో ఇంతశ్రమపడి ఆయన వచ్చెను!" అని తలపోయ నారంభించెను. హృదయభార మణఁచుకొనఁ జాలక అతఁడు సొరిగి పడఁబోఁగా, నిరంజనుఁడు క్రిందికి దుమికి పట్టుకొనెను. ఇంతలో శ్రీ గురుదేవుఁడు స్మృతినంది "మనోమోహనా! నీకై నే నెంతో గగ్గోలుపడి నిన్ను చూడవచ్చితిని" అనెను. మనోమోహనుఁ డాయన పాదములపై వ్రాలి "మహాశయా, ఈ యపరాధ మంతటికిని నా దుర్గర్వమే కారణము" అని ఇంకేమియు చెప్పఁజాలక పసిబిడ్డవలె నేడువ సాఁగెను. పడవ దక్షిణేశ్వరపు దారిపట్టెను.

8. కేదారనాథ చట్టోపాధ్యాయ. ఇతఁడు మిక్కిలి దైవభక్తి కలవాఁడు. భగవన్నామోచ్చారణమాత్రమున భావోద్రేకమంది కన్నీరు కార్చువాఁడు. కొన్నాళ్లు బ్రాహ్మమతమార్గమును, పిదప ఇతరమార్గములను, అవలంబించి చూచెను. కాని వేనియందును ఆదర్శసిద్ధి నొందఁజాలక, తుదకు శ్రీ రామకృష్ణదేవుని పాదాబ్జముల నాశ్రయించెను. అతని యాధ్యాత్మికోత్సాహమున కాయనయు ఆనందించువాఁడు. అతఁడు ఢాకాలో నివసించుచు శ్రీ రామకృష్ణబోధామృతము నచటివారికి పంచి పెట్టుచుండును. శ్రీ గురుదేవుఁడు చివరిదినములలో తనకడకు సంఖ్యాతీతముగా రానారంభించిన జిజ్ఞాసువు లందఱితోను సంభాషించుట సాధ్యము కాక, ప్రాథమికబోధ లొనర్చు భార మీ కేదారుని మీఁదను, గిరీశ రామచంద్రవిజయకృష్ణమహేంద్రుల మీఁదను,

పెట్టుమని అంబిక నొకసారి ప్రార్థించెను.

కేదారునియందు బృందావనగోపికాలక్షణములు కొన్ని యుండెడివి. కావున నతనిని చూచుటతోడనే శ్రీ గురుదేవుఁడు భావపారవశ్యస్థితి నందువాఁడు. కాని భక్తి సంపద కలవాఁడయ్యును కేదారునకు కామినీకాంచనవ్యామోహము పూర్తిగా నశింపలేదు. దానిని జయింప యత్నింపుమని శ్రీ గురుదేవుఁ డితనిని హెచ్చరించువాఁడు.

9. హరీశుఁడు. ఈ యువకుఁడు ధనవంతుఁడు, వివాహితుఁడు. హృదయుని నిష్క్రమణానంతరము ఇతఁడు శ్రీ గురుదేవుని కొన్నిసార్లు దర్శించి, ప్రాపంచికజీవితము నెడ పూర్ణవైరాగ్యము పూని, భార్యను బిడ్డను వదలి, దక్షిణేశ్వరముననే నివాస మేర్పఱచుకొనెను. ముఖ్యముగ శ్రీ గురుదేవుని సేవయందును, తీఱిక వేళలలో ధ్యాన ప్రార్థనలందును, కాలము గడపువాఁడు. ఇతని చిత్తశుద్ధి, కార్యదీక్షాపరత, శాంతస్వభావము, శ్రీ గురుదేవుని గాఢముగా నాకర్షించెను. భార్య నిద్రాహారములు మానినను, శ్రీ గురుదేవుఁడు కూడ నామె నోదార్చిరమ్మని ప్రోత్సహించినను, ఇతఁ డింటికి పోలేదు. కార్యదీక్షాతత్పరత్వముచే ప్రాపంచికభావమున మృతప్రాయులై జీవించు ధీరజనుల కుదాహరణముగా శ్రీ గురుదేవుఁ డితనిని పేర్కొనువాఁడు. ఇతఁడు కాశీపురోద్యానదినముల వఱకును శ్రీ గురుదేవుని సేవించుచుండి, అచట కొన్నాళ్లకు మతిచెడి ఇంటికిఁ బోవలసిన వాఁ డయ్యెను.

10. భవనాథ చట్టోపాధ్యాయ. ఈ బాలుఁడు 1881 వ సంవత్సరమున శ్రీ గురుదేవునికడకు వచ్చెను. ఆ

"వెఱ్ఱి బ్రాహ్మణుని" యొద్దకు పోవలదని ఇంటిపెద్ద లెంత చెప్పినను వినక, ఇతఁ డొకొక్కకసారి రాత్రులుకూడ ఆయనతో గడపువాఁడు. ఇతని చిత్తశుద్ధికిని, భక్తిభావమునకును, శ్రీ గురుదేవుఁ డితనిని మిక్కిలి ప్రేమించువాఁడు. నరేంద్రుఁ డితనికి ప్రాణమిత్రుఁడు. శ్రీ గురుదేవుఁడు "నిత్యసిద్ధులు" గా పరిగణించిన వారిలో నితఁ డొకఁడు. దక్షిణేశ్వరము రా నారంభించినపిదప నితఁడు మత్స్యతాంబూలములను విసర్జించెను. కాని శ్రీ గురుదేవుఁడు "వీనిని విసర్జించు టేల? ఆధ్యాత్మికజీవనమున కిదియా ముఖ్యము: కామినీకాంచనవిసర్జనము కాని?" అని యితనికి బోధించెను. భవనాథుఁడు వివాహితుఁడు. కాని కామోపభోగవాంఛారహితుఁడు. శ్రీ గురుదేవుఁ డొకసారి పరీక్షార్థ మితనితో "విషయభోగము లొకింత చవి చూడరాదా?" అనెను. భవనాథుఁడు చీఁదఱతో "మనము కూడ అట్టి తుచ్ఛభోగములం దాసక్తి కొనుటయా!" అనెను. పవిత్రశీలుఁడగు ఈ బాలుని చూచినతోడనే శ్రీ గురుదేవుఁ డెన్నియోసార్లు దివ్యభావోద్రేక మొందువాఁడు.

11. మహేంద్రనాథ గుప్త. శ్రీ రామకృష్ణుని దివ్యసందేశమును లోకవ్యాప్తి నొందించుటలో వివేకానందస్వామి యెంత ముఖ్యుఁడో ఈయనయు అంత ముఖ్యుఁడు. ఈయన రచించిన "రామకృష్ణకథామృతము" ప్రపంచవిఖ్యాతి కాంచిన యత్యద్భుతగ్రంథము. దాని ప్రభావమున నెన్నియో ఊషరహృదయములు సారవంతములైనవి; ఎందఱో విషయలోలురు భగవదన్వేషణపరులైరి.

ఇతఁడు బి.ఏ. పరీక్షయం దత్యున్నతస్థానమును పడసి

ఒక హైస్కూలులో హెడ్‌మాస్టరుగా నుండెను. ఆ కారణమున నితనికి "మాస్టరుమహాశయుఁడు" అనియు, కథామృతములో రచయితపేరు "మ." అని వ్రాసికొనియుండుటచే "శ్రీ మ." అనియు, పేర్లు వచ్చినవి.

ఇతఁడు కేశవచంద్రసేన్‌కు బంధువు. బ్రాహ్మసమాజ సభ్యుఁడు. చిన్ననాఁటి నుండియు మిక్కిలి భక్తిపరుఁడు. 1882 వ సం॥ తన 28 వ ఏఁట, ఇతఁడు శ్రీ గురుదేవుని దర్శించెను. ప్రథమసంభాషణవేళయందే ఇతని పాశ్చాత్య దృక్పథము తీవ్రసంఘర్షణమొంది అసియాడసాఁగెను. ఆధ్యాత్మికాభివృద్ధి నొందఁగోరువానికి ఆ యీడుననే వివాహమై బిడ్డలుకలిగి యుండుట శోచనీయ మనియు, చదువురానివారుకూడ "విద్యావంతులు"గా నుండనోపుదురనియు, భగవంతుఁడు సాకారుఁడును నిరాకారుఁడును కూడ ననియు, విగ్రహారాధన మాక్షేపణీయము కాదనియు, చదువులలో ఆటితేటిన మాత్రముననే లోకులకు బోధించు అధికారము కలుగదనియు, అతఁ డానాఁడు క్రొత్తగా గ్రహించెను. ఆయన జ్ఞానతేజోవైభవమును చూచి ఆశ్చర్యచకితుఁడై, విద్యాగర్వమును అహంభావమును కట్టిపెట్టి, వినయవిధేయతలతో కొన్ని ప్రశ్నము లడిగి సంశయములు తీర్చుకొని ఆనాఁటి కింటికి పోయెను.

అప్పటినుండియు అతఁ డాయన పాదాబ్జాతముల నాశ్రయించి ఆయనను తఱుచు దర్శించుచుండెను. పరిచయ మధిక మగుకొలఁదిని ఆ దివ్యరత్నమునకు అనేకపక్షములు కలవని యతఁ డెఱుఁగఁజొచ్చెను: ఒక నిమిషమున హాస్యోక్తుల చేతను, వినోదాభినయములచేతను, శిష్యులను

పొట్టలుబ్బ నవ్వించును ; ఉత్తరక్షణమున సమాధిస్థితి నంది ఎల్లరను భయాశ్చర్యమగ్నుల నొనర్చును. ఒక నిమిషమున కన్నుల నీరుకాఱ భావోద్రేకముతో భగవన్నామము నుచ్చరించును; మఱుక్షణమున అత్యంతమనోహరముగా సంకీర్తనము చేయుచు మైమఱచి నృత్యముచేయును. ఒకసారి అతీంద్రియ స్థితిలో జగదీశ్వరితో ప్రసంగించును; మఱొకసారి అత్యంత నిగూఢ వేదాంతరహస్యములను తేటమాటలతో వెల్లడించును.

అచిరకాలముననే మహేంద్రుఁ డాయనకు అత్యంత ప్రియశిష్యుఁ డయ్యెను. కొన్నిదినములపాటు దక్షిణేశ్వరము ననే నివసించుచు, ఆయన దివ్యశిక్షణమున సాధన లభ్యసించి, ఆధ్యాత్మికాభ్యున్నతి నందెను.

శ్రీగురుదేవుఁడు చూచిన గౌరాంగసంకీర్తనదృశ్యమున బలరాముఁడే కాక ఇతఁడుకూడ ఉండెనఁట. "నీవు నాకు స్వకీయుఁడవు. తండ్రి, బిడ్డలవంటివారము మనము" అని శ్రీగురుదేవుఁ డీతనితో చెప్పెను.

మహేంద్రునిది తార్కికబుద్ధి. కావున శ్రీగురుదేవుఁ డతనిని వాదప్రతివాదములందు చొరవలదని చెప్పెను. "భగవంతుఁడు మొదట, లోకము పిదప! భగవంతు నెఱిఁగినవాఁడు లోకమును సులభముగా నెఱుఁగఁగలఁడు. చర్చలందు దిగితివేని హాని పొందుదువు. దిగనని వాగ్దానము చేయుము" అని బోధించి అతని వాగ్దానమును పడసెను.

12. అధరచంద్రసేన్. ఇతఁడు డెప్యూటీ మాజిస్ట్రేటు పదవియం దుండెను. 1880 సంవత్సరమున శ్రీగురుదేవుని దర్శనము చేసికొనెను. పిదప కొన్ని మాసముల కతఁడు గుఱ్ఱపుస్వారి చేయుచు, పట్టు తప్పి, అకాలమృత్యువు వాతఁ

బడెను. శ్రీగురుదేవుని కీ భవిష్యము మొదటినుండియే తెలిసి కాంబోలును అతనికి జీవితపు అనిత్యత్వమునుగూర్చి తఱచు బోధించుచుండెను. గృహపుస్వారి విషయమున జాగ్రత్తగ నుండుమని కూడ చెప్పెనట! కాని కాలము మూడిన వాఁడు హెచ్చరికలు పాటించునా!

ప్రథమదర్శనముననే అధరునకు శ్రీగురుదేవునియం దపారభక్తి కుదిరినది. ఆఫీసుపని ముగిసిన పిదప ఇంచుమించు ప్రతిదిన మతఁడు దక్షిణేశ్వరము వచ్చుచుండును. శ్రీగురుదేవుఁడుకూడ నతని యింటి కప్పుడప్పుడు వెళ్లి అతఁడు జరుపు ఉత్సవములలో ఇతరభక్తులతోఁ గూడ పాల్గొనుచుండును. ఆ యిల్లు తన విహారభూములలో నొకటి యని అంబిక ఆయనకు తెలిపినది.

శ్రీగురుదేవుఁడు తన యింటికి కొన్నాళ్లు రాలేదని అధరుఁ డొకనాఁడు చింతాక్రాంతుఁడై, ఆయన రాకకై భక్త్యుద్రేకముతో ప్రార్థించెను. ఆ సాయంకాలమే ఆయన ముగ్గురు నల్గురు భక్తులతో అటకు పోయి కొంచెము సేపు భగవత్కీర్తనలువిని, ఫలాహారములు గొని, తిరిగి పోయెను!

ఉద్యోగకార్యవ్యగ్రుఁడై అధరుఁ డొకసారి చాలనాళ్లు దక్షిణేశ్వరము రాలేదు. పిదప వచ్చినప్పుడు కారణ మడిగి తెలిసికొని, అస్థిరమగు నీ ప్రపంచపు వ్యాసంగములలో చిక్కి భగవంతుని మఱవరాదనియు, శరీరము ఏక్షణమున నైనను రాలిపోవచ్చును గనుక, మించిపోక మునుపే భగవంతుని యందు బుద్ధి నంతయు నిలిపి ప్రార్థింపవలయు ననియు, గ్రుచ్చి గ్రుచ్చి చెప్పెను. అధరుఁడు పశ్చాత్తప్తుఁడై మిక్కిలి వినమ్రతతో శ్రీగురుదేవున కిట్లు విన్నవించుకొనెను: "మహా

శయ్యా, తాము మా యింటికి దయచేసి చాలకాల మైనది. చావడికి మగ్గుడు వాసన పట్టినది. అందుఁ గల వస్తువు లన్నియు కాంతి తప్పినవి.'' శ్రీ గురుదేవుని మనస్సీ దీనసంప్రార్థనముచే ద్రవించెను. ఆకస్మికముగ లేచి యాయన అధరునియొక్కయు శ్రీమ. యొక్కయు శిరస్సును వక్షఃస్థలమును, తాఁకి దీవించి అత్యంతప్రేమార్ద్రవాక్కులతో నిట్లనెను: ''మీరు నాకు స్వకీయులు, భగవంతుఁడుగనే నా కగపడుచున్నారు''.

మఱికొన్నాళ్లకు అధరుఁడు కలకత్తా పురపాలక వర్గపు ఉపాధ్యక్షపదవికై ఎంతో పాటుపడి ఎవరి నెవరినో ఆశ్రయించెను. అతని కోరికపై శ్రీ గురుదేవుఁడుకూడ జగన్మాత నర్థించెను. కాని ఉద్యోగము లభింపలేదు. పిదప, అధరుఁడు తన కడకు వచ్చినప్పు డతనిప్రాపంచికతృష్ణను తీవ్రముగా తెగడి, భగవంతుఁ డొక్కఁడే నిత్యమని మరల జ్ఞప్తిచేసెను.

పిదప అధరుని మరణవార్త విని శ్రీ గురుదేవుఁడు మిక్కిలి ఖిన్నుఁడై, అంబిక కడ కేగి విలపించెను.

13. తారకనాథముఖోపాధ్యాయ. ఇతఁడు వివాహితుఁడు. కాని ఆధ్యాత్మికదృష్టి గలవాఁడు. అనేకశుభలక్షణ సంపన్నుఁడు. కుటుంబమువారు ఎంత ఆక్షేపించినను ఇతఁడు శ్రీ గురుదేవుని తఱచు సందర్శించుచుండెను ఆయనయు ఇతనిని మిక్కిలి ప్రేమించి, తన భక్తులయం దితనికి ఉన్నత స్థానము నిచ్చువాఁడు.

తనకడ కప్పుడప్పుడు వచ్చుచుండు మనియు, కామినీ కాంచనములు అను బురదగుంటలో ఇఱుకుకొన వలదనియు, శ్రీ గురుదేవుఁ డితనికి చెప్పెను. ఇంటిపెద్ద లితనిరాక కాక్షేపించుట విని భగవంతునికై పెద్దలమాట నిరాకరించుట

దోషము కాదని భరతుఁడు, ప్రహ్లాదుఁడు, విభీషణుఁడు, మున్నగువారి చర్యలను ఉదాహరణములుగ చెప్పెను.

తారకుని అఱచేతి బరువు నొకసారి పరీక్షించి "నీ యందు ఇంకను కొంచెము వక్రత కలదు. కాని అది నశించును. భగవంతు నొకించుక ప్రార్థించుచుండుము. ఇచటి కప్పుడప్పుడు వచ్చుచుండుము" అని శ్రీ గురుదేవుఁ డతనికి చెప్పెను.

శ్రీ గురుదేవుఁ డొకనాఁడు మహానుగ్రహసూచకముగా సమాధిస్థితియం దతని వక్షఃస్థలమున తనపాదముంచెను. ఇతని యాధ్యాత్మికఘనత శ్రీ గురుదేవుఁ డొకసారి యాడిన యీ పలుకుల వలన గ్రహింప వచ్చును. "తారకుఁ డింటికి పోవుచుండఁగా ఈ శరీరములో (తనలో) నుండి కాంతిజ్వాల యొకటి వెడలి అతని ననుసరించెను."

14. వైకుంఠనాథసాన్యాల్. ఈ బాలుఁడు చిన్ననాఁ డాధ్యాత్మికదృష్టి కలవాఁడే కాని, కొన్నాళ్లకు సంశయ గ్రస్తుఁడై, అదృష్టవశమున నొకసారి శ్రీ గురుదేవుని యొద్దకు వచ్చెను. ఆయనచే ప్రబలముగా నాకర్షింపఁబడి ఎన్నఁడెఱుగని శాంతిని, ఆనందమును, ఆయన సముఖమున అనుభవింపసాఁగెను. కాలక్రమమున ఆయన దివ్యశక్తి కధీనుఁడై పోయెను.

శ్రీ గురుదేవుఁ డొకసారి యతనితో "రామచంద్రుఁడు మొదలగువారు ఈ శరీరమును (అనఁగా తనను) భగవదవతార మనుచున్నారు. నీ కేమి తోఁచుచున్నది?" అని యడిగెను. అందులకా బాలుఁడు "వారు చెప్పిన దొక అతిశయమా! అవతారమనఁగా భగవంతునిలో నొకభాగము మాత్రమే. ఆ భాగము కొద్దిగానుండవచ్చును, గొప్పగా

నుండవచ్చును: కాని భాగము మాత్రమే. మీరు అట్లు కాక శివస్వరూపు లనియే నా నమ్మకము. శివుని ధ్యానింపుమని మీరు నాకు చెప్పిరి. కాని యెంత యత్నించినను నాకది సాధ్యమగుటలేదు. ధ్యానస్థితుఁడ నగుటతోడనే మీ నగుమోము నా యెదుట ప్రత్యక్షమగును. దానిని నేను పాఱఁదోలఁజాలను. పాఱఁదోలు కోరికయు కలుగదు. కనుక మిమ్ము నేను శివునిగనే భావింతును.'' అని బదులిడెను. శ్రీ గురుదేవుఁ డిదివిని చిఱునగవుతో ఇట్లనెను: ''నిన్ను చూడ నాకు విచిత్రముగా నున్నది. కాని నేను నీ రోమమునకు కూడ సమానుఁడను కానని యెఱుఁగుదును. నిన్నుగూర్చి నా కాతురపాటు కలిగి యుండెను. ఇప్పుడు సంతృప్తుఁడనైతిని.'' తన్నా బాలుఁడు ఆధ్యాత్మికపరమ లక్ష్యముగా గ్రహించుటే ఆయన తృప్తికి కారణము. ఈ రీతిగా శిష్యుల ఆధ్యాత్మికభావములను ఆయన కనుఁగొనువాఁడు.

15. దుర్గాచరణనాగ్ (నాగమహాశయుఁడు). ఇతఁడు నిఱుపేదకుటుంబమున పుట్టినవాఁడు. చిన్ననాఁడు పదిమైళ్ల దూరముననున్న బడికి ప్రతిదినము నడచిపోయి చదువు నేర్చుకొనెను. నిత్యసత్యవ్రతుఁడు. హోమియోపతీ చికిత్సా విధానము నభ్యసించి, అందు మహానైపుణ్య మందెను గాని, దానివలన ధన మార్జించువాఁడు కాఁడు. తనకు రావలసిన సొమ్ముకన్న నధికముగా నితరు లిచ్చినను పుచ్చుకొనఁడు. బీదలకు 'ఉచితము'గా చికిత్స చేయుటేకాక వారికి వలయు సౌకర్యముల నేర్పఱచి తాను పస్తైన నుండును. చలికాలమున నొక బీదవానికి తన కంబడినిచ్చి తాను చలికి వడఁకు

చుండెను! మనుష్యులనేకాక సర్వప్రాణికోటి నతఁడు ప్రేమించును. బ్రదికియున్న చేఁపలను జాలరులయొద్ద గంపలు గంపలుగా కొని వానిని మరల నీటిలో వదలిపెట్టును. పాములను కూడ హింసింపఁడు. "మనుష్యుని కపాయకరములగు పాము లివికావు, వాని కోరికలే" అని చెప్పువాఁడు. తండ్రి బలాత్కరించి పెండ్లి చేసెను గాని, అనిత్యమగు ఈ తుచ్ఛ శరీరమును ఆశింపక నిత్యపదార్థముపై దృష్టి నిలుపుమని భార్యకు జ్ఞానబోధ చేయువాఁడు. సంసారసాగరము తరించు తీవ్రవాంఛతో ప్రతిరాత్రియు ధ్యానప్రార్థనలందే మగ్నుఁడై యుండును. కుటుంబగురువు నొద్ద నుపదేశ మందెను కాని అందుచే భగవత్సాక్షాత్కారము లభింపలేదు.

కొన్నాళ్ల కొక మిత్రుని వలన శ్రీ గురుదేవునిగూర్చి విని ఆయనకడకేగి ఆయన పాదము లంటఁబోయెను. అందుల కాయన యనుమతింపకపోయినను, ఆయన మహాత్మ్యముచే నాకర్షింపఁబడి మఱువార మత్యాతురతతో మరల ఆయనకడకు పోయెను. ఆయనయు "నీవు వచ్చుట మంచి పని. నీ కొఱకు నిరీక్షించుచుకొనియున్నాను" అని, కొంచెము సేపటికి "నాయనా, భీతిలకుము. అత్యున్నతస్థితి నీది" అని చెప్పెను. పిదప నతనివెంటవచ్చిన మిత్రుఁ డొంటరిగా నున్నప్పు డిట్లు చెప్పెను: "చూచితివా, ఇతఁడు మహాజ్యోతివలె ఎట్లు వెలిఁగిపోవుచున్నాఁడో!"

అతఁడు మూఁడవసారి వచ్చినప్పుడు శ్రీ గురుదేవుఁడు "నీవు డాక్టరువుకదా. నా పాదమును పరీక్షింపుము" అని పాదమును చాఁపెను. అందేమియు దోషములేమిచే నతఁడాయన యవ్యాజకృపతో తనపాదములంటు నవకాశమును

ప్రసాదించెనని గ్రహించి, ఆనందబాష్పపూరితనేత్రుఁడై ఆపాదము లొత్తి కన్నుల నద్దుకొనెను. "మనస్సులోని కోరిక లాయన గ్రహించి తనంతటతానే వానిని తీర్చును. అడుగవలసిన అక్కఱలేదు" అని యతఁడు చెప్పువాఁడు.

ఇప్పటి నుండియు ఆయనయే అతని కిష్టదైవము. "తన వాస్తవతత్త్వము నత్యంతకృపతో నా కాయన యెఱుకపఱచెను, లేనిచో ఆయన నెఱుఁగుట ఎవ్వరితరము!" అని యతఁ డనువాఁడు. ఒకనాఁ డాయన తన శరీరమును చూపి "దీనినిగూర్చి నీయభిప్రాయమేమి?" అని యతని నడిగెను. "ప్రభూ, ఇంకను నాకడ దాఁపఱికము శక్యమా! నీకృపచే నాకు సత్యము బోధపడినది. నీవు సాక్షాద్భగవంతుఁడవే" అని యతఁడు బదులుచెప్పెను. ఇది విని శ్రీగురుదేవుఁడు సమాధినిమగ్నుఁడై యతని వక్షఃస్థలమున తన కుడిపాదము నుంచెను. తత్ఫలముగా నఖిలప్రపంచము అపారదివ్యానంద సాగరమునఁ దేలియాడుచున్న ట్లతనికి గోచరించెను.

నాగమహాశయుఁడు శ్రీగురుదేవున కత్యంత ప్రియశిష్యుఁడై ఆయనను తఱచు దర్శించుచుండెను. ఆయన నోట వచ్చినమాట లన్నియు అతనికి వేదవాక్యములు. వేడుకగా పలుకుమాటలలోకూడ గూఢార్థముండునని అతని విశ్వాసము. "వైద్యులకు, న్యాయవాదులకు, తఱుగరులకు* ఆధ్యాత్మికాభివృద్ధి దుష్కరము" అని ఆయన యొకసారి చెప్పుచుండఁగా విని ఆనాఁడే తన మందులపెట్టెను, వైద్యగ్రంథములను, గంగలో పాఱవేసి కాలమంతయు ధ్యాన

* బేరములు కుదిర్చి ధనమార్జించు వృత్తికలవారు.

ప్రార్థనలకే వినియోగింప నారంభించెను. అచిరకాలముననే సన్న్యసించు వాంఛకలిగి శ్రీగురుదేవుని యనుజ్ఞ కోరెను కాని ఆయన నిషేధించి "బుద్ధినంతయు భగవంతునియందే నిల్పి జనకచక్రవర్తివలె లోకమున నుండుము. ఆదర్శగృహస్థుఁడ వవుదువు" అనెను. అతని కప్పటినుండి ఎప్పుడును ధ్యానప్రార్థనలే! అన్నవస్త్రాదులపైనకూడ మనస్సు పోవుట లేదు! ఇఁక ఇల్లుగడచు మార్గమేది? శ్రీగురుదేవుఁ డిది చూచి "ఎప్పుడును ఇంటనే ఉండుము. సామాన్యములగు అన్నవస్త్రములకు మీకెన్నఁడునులోటుకలుగదు"అని చెప్పెను.

కాని గృహస్థుఁడుగానున్నను అతఁడు సన్న్యాసము యొక్క మూర్తిభావమే. ఒడలిపైని ఒక ముతకబట్ట మాత్రము కప్పుకొనును. కాలికి పాదరక్ష లుండవు. రుచు లేమియులేని సాదా అన్నముమాత్రమే తినును. ప్రసాదాన్నమైనను రుచికరపదార్థము లున్నచో సాధ్యమైనంతవఱకు స్పృశింపఁడు. "రుచు లొకసారి మరగినచో మన స్సెప్పుడును వానిమీఁదికే పోవుచుండును. ఇఁక భగవంతుని తలఁచు టెప్పుడు?" అనును. వినమ్రత కతఁడు పెట్టినపేరు. అహంభావస్పర్శకూడ నతనిలో లేదు. లోకములోని అధమాధములకన్న తా నధముఁడని యతని భావము. అట్టివారికికూడ నతఁడు సేవచేయును.

16. గిరీశచంద్రఘోష్. ఇతఁడు నాటకకర్తగను, నాటకప్రదర్శకుఁడుగను, వంగదేశమున మహాప్రఖ్యాతి గాంచిన యసమానప్రతిభాధురీణుఁడు. చిన్ననాఁటినుండియు "భగవంతుఁడు కలఁడా, ఉన్నచో నాకు లభించునా?" అను ప్రశ్న మతనిమనస్సున కలదుగాని, అనాత్మవాదమయమగు

పాశ్చాత్యసంస్కృతి కెరయై, యితఁడు గాఢతపోనియమా భ్యాసములచే నెన్నఁడో లభించునని చెప్పఁబడు పరమసుఖమున కన్న, అశ్రమముగా సర్వత్ర లభించు నింద్రియసుఖములను చూఱకొనుటయే శ్రేష్ఠమనియెంచి, సర్వవిధములగు దుర్వ్య సనములలో చిక్కి నిరంకుశజీవనము గడపుచుండెను. కాని యీ నిర్విచారజీవనము చాలకాలము జరుగలేదు. నిర్మల ముగానుండిన యతని జీవితాకాశము ఉన్నట్టుండి కారు మబ్బులతో నిండిపోయెను. దిక్కుతోఁపక భక్తాభీష్టప్రదుఁడని పేరుగన్న తారకేశ్వరశివు నతఁడు ప్రార్థించెను. వెంటనే విచిత్రవిధముగ మబ్బులు విరిసిపోవుటచే భగవద్విశ్వాసము మరల నుద్భవించినది. దానితో పరలోకవిజయముకూడ సాధింపవలెనను వాంఛయు పొడమినది. కాని ఇందులకు గురుసాహాయ్యము వలయునందురే! అదెట్లు లభించును? మనుష్యగురువులపై నతనికి విశ్వాసములేదు. కావున ఆ భారముకూడ శివునిమీఁదనే వేయ నిర్ణయించుకొని ప్రతి ప్రాతఃకాల మతఁడు ఆయన దివ్యనామము స్మరింప మొదలిడెను.

దక్షిణేశ్వరమున నొక పరమహంస కలఁడనియు, బ్రాహ్మసమాజనాయకులుకూడ ఆయనను సందర్శించుచున్నా రనియు, ఎచ్చటనో చదివియుండి పిదప కొన్నాళ్లకా పరమ హంస తనయిరుగుపొరుగున నొకయింటికి వచ్చుట ఎఱిఁగి, అచటికి పోయెను. అది సంజచీఁకటివేళ. దీపములుకూడ పెట్టిరి. అప్పుడసంపూర్ణశరీరస్మృతిలో నుండిన శ్రీగురు దేవుఁడు సాయంకాలమైనదా అని యొకరి నడిగెను. గిరీశుఁ డదివిని వెక్కసపాటుతో లేచిపోయెను.

కొన్ని యేండ్లపిదప శ్రీ గురుదేవుఁ డొకసారి బలరామ్‌బోస్ ఇంటికివచ్చెను. గిరీశుఁడుకూడ నాహ్వానింపఁబడి అచటికి పోయెను. గది జనులతో నిండియుండెను. పరమహంసలును యోగులును ఇతరులతో పలుకక, ఇతరులకు మ్రొక్కక, స్వాతిశయభావ పూరితులై యుందురని గిరీశుని తలంపు. ఈ పరమహంస అట్లుకాక సామాన్యజనులవలెనే ప్రవర్తించుచుండుటచే అతని కాయనయందు సుముఖభావము కలిగెను. కాని అతని నచటినుండి యొకమిత్రుఁడు పిలుచుకొనిపోయెను.

పిదప కొన్నాళ్లకు గిరీశునినాటకశాలలో జరుగనున్న అతని "చైతన్యలీల"ను చూచుటకై శ్రీ గురుదేవుఁడు కొందఱుశిష్యులతో వచ్చెను. గిరీశుఁ డాయన నొకసుఖాసనమునఁ గూర్చుండచేసి, విసరుచుండుట కొకనిని నియమించి, తన కస్వస్థతగ నుండుటచే ఇంటికిపోయెను.

ఈ సమయముననే ఒక వైష్ణవచిత్రకారుఁడు తానర్పించు నైవేద్యాహారమును తనయిష్టదైవముః వాస్తవముగా భుజించుననియు, గురుకృపకలవారికేకాని యిట్టి యనుభూతి కలుగదనియు, గిరీశునితో చెప్పెను. ఆ మాటలు నిజమోకావోగాని గిరీశునిహృదయమున అవి గాఢముగా నాటుకొనెను. తన గదిలో కూర్చుండి అతఁడు కన్నీరు వఱదలై పాఱ నేడ్చెను.

మూన్నాళ్లపిదప శ్రీ గురుదేవుఁడు శిష్యసహితముగా గిరీశుని యింటిముందుగా పోవుచు అతనికి నమస్కరించెను. ప్రతినమస్కారము చేసినవెంటనే, అతని కాయనకడకు పరుగిడవలెనను తీవ్రవాంఛ కలిగెను. ఆలో నొకరువచ్చి

శ్రీ గురుదేవుఁడు పిలుచుచున్నాఁడని అతనితో చెప్పిరి. అతఁడు వెంటనేపోయి "గురువనఁగా ఏమి?" అని యాయన నడిగెను. "భక్తునకును భగవంతునకును మధ్యవర్తి" అని బదులుచెప్పి ఆయన "నీ గురు వేర్పడినాఁడు" అనెను. మంత్ర మనఁగానేమి యను రెండవప్రశ్నకు "భగవంతుని నామము" అని యాయన బదులుచెప్పెను. తనకు గురు వేర్పడెనని శ్రీ గురుదేవుఁ డన్నమాట యతనికి చాల మన శ్శాంతిని చేకూర్చెను. ప్రసాదము పంచిపెట్టఁబడునప్పుడు తానుకూడ తీసికొనవలెనని కోరెను కాని, ఇతరు లేమను కొందురో అని తీసికొనలేదు!

పిదప కొలఁదినాళ్లకు శ్రీ గురుదేవుఁడు మరల అతని నాటకశాలకు వచ్చెను. గిరీశుఁ డాయనను మేడపైకి తీసికొని పోయి ఆయనపాదము లంటెను. ఏల అంటెనో అతనికే తెలియదు! పిమ్మటి ప్రసంగసందర్భమున "నీయందు కొంత వక్రతకలదు" అని శ్రీ గురుదేవుఁడనెను. గిరీశునం దెన్నో వక్రతలు కలవు! కాని ఏవక్రత అనియడుగక అతఁడు "అది ఎట్లు పోవును?" అని యడిగెను. "శ్రద్ధ కలిగియుండుము" అని ఆయన బదులుచెప్పెను.

కొలఁదినాళ్లకు గిరీశుఁ డొకసాయంకాలము రామ చంద్రునింట సంకీర్తనమున కేగి, సమావేశాంతమున "నా వక్రత ఎన్నఁటికైన నశించునా?" అని యాయన నడిగెను. "నశించును" అని యాయన చెప్పెను. ఈ ప్రశ్నము ముమ్మాఱుఅడుగఁగా ఆయన ముమ్మాఱు అదేజబాబుచెప్పెను.

పిదప కొన్నాళ్లకు గిరీశుఁడు దక్షిణేశ్వరముపోయి యనను దర్శించెను. "నీ విషయమే ఇప్పుడు భవనాథు

నితో మాటాడుచుంటిని" అని చెప్పి యాయన గిరీశు నకు కొన్ని బోధనవాక్యములు చెప్పనారంభించెను. "నా కీ బోధలు వలదు. ఇట్టి వెన్నియో నేనును వ్రాసితిని. చేత నైనచో, ఏదైన అనుభూతిని ప్రసాదింపుఁడు" అని గిరీశుఁ డనెను. తలఁపుల నింత విస్పష్టముగా పలుకులందు ప్రతిబిం బింపఁజేయు నతని నిర్మలనిష్కపటస్వభావమునకు శ్రీ గురు దేవుఁడు మిక్కిలి సంతసించెను గాని, యేమియు బదులాడక ఆనందమయమగు చిఱునగవుతో నతనివైపు చూచెను. ఆ చిఱునగవుయొక్క దివ్యప్రభావ మేమియోకాని, వెంటనే గిరీశుని హృదయమునుండి సర్వమాలిన్యములు తొలఁగి పోయిన ట్లతనికి తోఁచెను. గిరీశుఁడు ఆశ్చర్యపరవశుఁ డయ్యెను. ఆ నాఁడు ఇంటికి పోవుచో నతఁడు "మహా శయా, ఇచ్చటికివచ్చి తమదర్శనము చేసికొన్నానుగదా. నే నిన్నా ళ్లవలంబించుచుండిన వృత్తి నింకను సాఁగించు చుండవచ్చునా?" అని ప్రశ్నించెను. "అవును" అని యాయన బదులుచెప్పెను. ఇందుచే నాటకశాలాసంబంధము వలన తనకు హానికలుగదని యతఁడు గ్రహించెను. గురు ప్రభావ మిప్పటికే అతనికి చూచాయగా తెలియనారంభించి యతని హృదయమును భక్తిశ్రద్ధలతోను, ధైర్యోత్సాహ ములతోను, నింపివేసెను. మహాపురుషాశ్రయము లభించినది కనుక భగవత్సాక్షాత్కృతియులభింపఁగలదనిఅతనికితోఁచెను.

గిరీశునకు శ్రీ గురుదేవునియందు సుస్థిరభక్తి కుది రినది. స్వాభావికముగా నతనిహృదయము నిష్కపటము, పరిశుద్ధము, కోమలము, అని యెఱిఁగి, శ్రీ గురుదేవుఁ డతని శిక్షణకాలమున నితరశిష్యుల కీయని స్వాతంత్ర్యము లిచ్చు

వాఁడు. అతఁ డొకసారి నాటకశాలలో మద్యపానమత్తుఁడై శ్రీ గురుదేవునిగూర్చి బూతులాడెను. ఇదివిని యాయన అచటి కపుడువచ్చిన రామచంద్రునితో మొఱపెట్టుకొనఁగా, అతఁడు "గిరీశుఁడు తిట్టినను, కొట్టినను, మీరు భరించుకో వలసినదే. కాళీయసర్పము శ్రీకృష్ణునకు తనకడనున్న విష మునేకదా సమర్పించినది. అట్లే గిరీశుఁడును తనయొద్ద నున్న దానిని మీకు సమర్పించినాఁడు" అని సమాధానముచెప్పెను. శ్రీ గురుదేవుని మన స్సీమాటలచే కరఁగి వెంటనే గిరీశుని యింటి కేగెను. గిరీశుఁ డప్పటికే పశ్చాత్తాపఖిన్నుఁడై యుం డఁగా, శ్రీ గురుదేవుఁడు తనప్రేమమయవాక్కులతో నతని ఖిన్నతను పాఱఁదోలెను. ఈ సంఘటనఫలముగా గిరీశుని శరణాగతి మునుపటికన్న పరిపూర్ణతనొందెను.

గిరీశుని త్రాగుడునుగూర్చి కొందఱుభక్తు లాక్షేప ములు పలుకఁగా శ్రీ గురుదేవుఁడు "అందుకై మీరు బాధ పడనేల? అతనిబాధ్యత వహించినవా రదంతయు విచారిం తురు కదా! గిరీశుఁడు వీరభక్తుఁడు. త్రాగు డతనికి హాని చేయదు" అనెను.

గిరీశుఁ డీ యలవాటును మానుటకై ప్రయత్నించి కొంతవిజయము సాధించెనుగాని, ఒకనాఁ డొక నటియింటి కేగి, మితిమీఱ త్రాగి, రాత్రియంతయు మత్తిలియుండెను. తెల్లవాఱి పశ్చాత్తప్తుఁడై దక్షిణేశ్వరమున కేగి శ్రీ గురు దేవునికడకు పరుగిడి పాదాక్రాంతుఁడై విలపింప మొద లిడెను. ఆలో శ్రీ గురుదేవుఁడు బండిలో నతఁడు మఱచి వచ్చిన సారాయిబుడ్డిని, చెప్పులను, రుమాలును, తెప్పించి యుంచెను. హృదయభారోద్రేక మొకింత శాంతించినపిదప

నతనికి మరల సారాయిపై మరులు పొరలి తన మతిమఱ పునకు విచారించుచుండఁగా, శ్రీ గురుదేవుఁ డా బుద్ధి నతని కిచ్చెను. అతఁ డండఱయెదుట త్రాగి పిదప తనచేఁతకు లజ్జించెను. శ్రీ గురుదేవుఁ డిదిచూచి శాంతముగా నిట్లనెను: "ఇంకకొన్నాళ్లు తృప్తిగా ననుభవింపుము. చాలకాలము ఉండదులెమ్ము." అటుపిమ్మట నతఁ డెప్పుడో కాని మద్యము త్రాఁగువాఁడు కాదు.

ప్రసంగవశమున నొకనాఁడు "ప్రాత స్సాయంకాల వేళలందైనను భగవంతుని స్మరింపవలెను" అని యాయన గిరీశునకు చెప్పెను. గిరీశుఁ డేమియు బదులుచెప్పక "ఇది మిక్కిలి సులభమేకాని, నా కెన్నో పనులుండును, నిద్రా హారములకుకూడ వేళలేదు, అట్టిస్థితిలో మఱవవచ్చును. వాగ్దాన మెట్లుచేయఁగలను" అని తలపోయుచుండెను. శ్రీ గురుదేవుఁ డతని తలఁపుల నెఱిఁగి "అట్లు చేయఁజాల వేని భోజనము చేయఁబోవునప్పుడును, నిద్రపోఁబోవునప్పుడును స్మరింపుము" అనెను. దీనికిఁగూడ గిరీశుఁడు సమ్మతింపక పోఁగా ఆయన "సరే! అట్లైనచో నాకు ముక్త్యార్ నామా ఇచ్చివేయుము. నీ బాధ్యతనంతయు నేనే భరించెదను. నీ వేమియు చేయనక్కఱలేదు" అని చెప్పెను. ఇదంతయు శ్రీ గురుదేవుఁడు ఉన్నత మానసికావస్థయం దున్నప్పుడు జరిగిన విషయము.

ఇందుచే తనకు పరిపూర్ణ స్వేచ్ఛాప్రవర్తనాధికారము లభించినదని గిరీశుఁడు మొదట నానందించెనుకాని, తన కిఁక నే విషయమందును కర్తృత్వశక్తి లేదనియు, ఆశక్తినంతయు శ్రీ గురుదేవుని స్వాధీనము చేసితిననియు గ్రహింపలేదు.

నిజమున కీడు నతఁడాయన యిచ్ఛకధీనుఁడే!

త్వరలోనే అతనికి నిజము తెలిసినది. కర్తృత్వము విడిచి ప్రతివిషయమునందును భగవదిచ్ఛ — అనఁగా శ్రీ గురుదేవుని యిచ్ఛ—ప్రకారమే నడచుకొన నారంభించెను.

17. దేవేంద్రనాథమజుందార్. ఇతఁ డీశ్వరసాక్షాత్కారగాఢకాంక్షతో, సమర్థుఁడగు గురువుకొఱకై భగవంతుని ప్రార్థించుచుండెను. కాల్నాకుపోయి భగవాన్‌దాస్ బాబాజీ (పు. 217) నాశ్రయింపఁదలఁచెను కాని, పయనమున కెన్నియో విఘ్నములు కలిగెను. ఏమియు తోఁపక చేతనున్న యొకపుస్తక మూరకే తెఱవఁగా అందు "దక్షిణేశ్వర కాళికాలయమున నుండు శ్రీ రామకృష్ణపరమహంస యభిప్రాయము" అని ఏమో వ్రాసియుండెను. పరమహంస యైనచో తన కేలతోడ్పడఁజాలఁడని వెంటనే దక్షిణేశ్వరము వెళ్లి శ్రీ గురుదేవునిదర్శించి, యాయన భగవత్ప్రేమ తత్త్వమునుగూర్చి చేసినబోధ నాలకించెను.

తన కాశ్చర్యకారణములగు నెన్నియో లక్షణములాయనయొద్ద చూచి ఆయనవిషయ మంతయు సవివరముగా రామలాల్ వలన కనుఁగొని అద్భుతపారవశ్యచిత్తముతో నింటికి పోయెను.

ఇంటికి పోవుటతోడనే చలిజ్వరము తీవ్రముగావచ్చి అతఁడు ఆఱు వారములు స్మృతిలేక పడియుండెను. ఆ జ్వరములో పరమహంసదేవునిగూర్చి ఎన్నియోసార్లు పలవరించుచుండెను. బాధతో కన్నులు తెఱచిచూచినప్పుడెల్ల తన ప్రక్క ఆయనప్రశాంతవిగ్రహము తోఁచుచుండెను. కాని నిమ్మళించినపిదప, అదంతయు జ్వరతీవ్రత కారోపించి, భ్రాంతి

జనితముగా తలంచుటే కాక, దక్షిణేశ్వరమే తనజ్వరమున కు కారణమనికూడ ఎంచి, అచటికి కేక పోరాదని నిశ్చయించుకొనెను.

భగవత్సాక్షాత్కారవాంఛ మునుపటివలె నంత తీవ్రముగా లేకపోయినను కొంత పీడించుచునే యుండెను. దక్షిణేశ్వరము పోవుటకు బదులు గాయత్రీమంత్రోపాసన మారంభించెను. కాని దీనిచే మనశ్శాంతి కలుగుటకు మారుభగవంతునికొఱకును, గురువుకొఱకును, మరల తీవ్రవాంఛ కలిగి మిక్కిలి వేధింపఁజొచ్చెను.

ఈ క్లిష్టసమయమున శ్రీ గురుదేవుఁడు బలరామ్‌బోస్ గృహమున కొకసాయంకాలము వచ్చునని అతనికి తెలియ వచ్చెను. ఆయనను దర్శింపరాదనుతీర్మానము వెంటనే విచిత్రరీతిని మాయమైపోఁగా నతఁ డచటికి పోయెను; కాని యెదుటఁబడుటకు మొగముచెల్లక అందఱును ఆయనపాద ధూళిని తీసికొనునప్పుడు గుంపులోచేరి తానుకూడ పోయెను. ఆ సర్వజ్ఞమూర్తి యతనిని వీపుపైతట్టి తేనియలొలుకు ప్రేమమయవాక్కులతో "ఎన్నాళ్లైనది, వచ్చితివా! నీవు నా కెన్నియోసార్లు జ్ఞప్తికి వచ్చుచున్నావు. దక్షిణేశ్వరము రమ్ము" అనెను. దేవేంద్రుఁ డంతట వెళ్లి అచిరకాలము ననే ఆయన దివ్యసాన్నిధ్యానందము ననుభవింపసాఁగెను. ఆయన శిక్షణమున సాధన లభ్యసించి అనేకదివ్యానుభూతులు పొందెను. సన్న్యసించుటకుకూడ సంకల్పించెను కాని శ్రీ గురుదేవుఁడు అనుమతింపక, గృహస్థజీవనము నీ యాధ్యాత్మికాభివృద్ధికి ఆటంకము కలిగింపదని చెప్పెను.

18. కాళీపాదఘోష్. ఇతఁడు గిరీశుని మిత్రుఁడు.

అతనివలెనే దుర్వ్యసనములలోఁ జిక్కియుండెను. ఒకనాఁడతనిభార్య శ్రీ గురుదేవునితో తనగోడవ చెప్పుకొని ఆయన ఆశీస్సు లర్థించెను. ఆయన "నీ భర్తచిత్తము భగవదాయత్తమైనదే. త్వరలోనే నాకడ కతఁడు రాఁగలఁడు" అనిచెప్పి ఊఱడించి పంపెను.

శ్రీ గురుదేవునిగూర్చి చిత్రవిచిత్రవిషయము లెన్నెన్నియోవిని ఇతఁ డొకసారి ఆయనను సందర్శించెను. ఆయనయు మిక్కిలిప్రేమాదరములతో పూర్వపరిచితునితోవలె మాటలాడెను. కొంచెముసేపు మాటలాడినపిదప ఆయన కలకత్తా పోవ సంకల్పించెను. తనపడవలో నెక్కిరండని కాళీపాదుఁ డాయన నాహ్వానించి ఆయనతో బయలుదేఱెను. త్రోవలో నతనిని "నీ యిష్టదైవ మెవ"రని శ్రీ గురుదేవుఁ డడిగెను. "కాళికాంబిక" అని యతఁడు బదులుచెప్పెను. అందుపై "మంత్రోపదేశ మొందితివా" అని యాయన యడుగఁగా "లేదు, కాని తా ముపదేశము చేయునెడ మహాభాగ్యముగా గ్రహింతును" అని యతఁడనెను. మనుష్య గురువును ఏమాత్రము విశ్వసింపని యతఁ డి ట్లేలచెప్పెనో అతనికే తెలియదు. అట్టిది శ్రీ రామకృష్ణదేవుని దివ్య ప్రభావము! ఇదియే వారి ప్రథమసమావేశముకూడ! శ్రీ గురుదేవుఁడు చిఱునగవుతో నతనినాలుకపై నేమియో వ్రాసి, "ఇదియే ఉపదేశము" అనిచెప్పెను. ఆ పిదప కాళీపాదుఁ డాయన శిష్యగణములో చాలప్రముఖుఁ డయ్యెను. అతఁడు వీరభక్తగణములోనివాఁడు.

19. నవగోపాల్ ఘోష్. ఇతఁడును, ఇతనిభార్యయును, మహాభక్తులు. వారియెడ శ్రీ గురుదేవునకును

మిక్కిలియనురక్తి. వా రొకసారి దక్షిణేశ్వరమువచ్చి ఆయన సందర్శనము చేసికొనిపోయి, పిదప మూఁడేండ్లు రాలేదు. శ్రీ గురుదేవుఁడే అతనిని మిక్కిలిప్రీతితో పిలువనంపి మాటాడెను. "నీకు సాధన లంతగా పనిలేదు. ఇచటికి వచ్చుచుండిన చాలును" అనిచెప్పెను. తన యైహికాసక్తతను జయించు మార్గము చూపుఁడని శ్రీ గురుదేవుఁడు సమాధిస్థితియందున్నప్పు డితఁడు పాదాక్రాంతుఁడై ప్రార్థించెను. అందుల కాయన "చింతిలవలదు. ఇంకేమియు చేయఁజాలవేని, దినమున కొక్కసారి నన్ను స్మరింపుము" అనెను.

20. అతులకృష్ణఘోష్. ఇతఁడు గిరీశుని సోదరుఁడు. శ్రీ గురుదేవునియం దితనికి గౌరవము లేకపోవుటయే కాక, ఆయనను పరిహసించువాఁడు కూడ. ఆయన నొకసారి తమ యింట చూచి యాయన నిరాడంబరతకు ముగ్ధుఁడై దక్షిణేశ్వరమున కేగి సందర్శించెను. దేవాలయము లన్నియు చూచి గంగానదియొద్దున కేగఁగా, అచట నతనికి అత్యద్భుతమగు నొకదివ్యదృశ్యము గోచరించెను. తత్ఫలముగా నతఁడు శ్రీ గురుదేవుని శరణుచొచ్చి యాయనను గురువుగా నంగీకరించెను.

21. భూపతి. ఇతఁడు విద్యార్థి; బ్రాహ్మమతస్థుఁడు; నిష్కపటచిత్తుఁడు; ఈశ్వరభక్తిసంపన్నుఁడు. ఈ సుగుణసంపదచే శ్రీ గురుదేవున కత్యంతప్రియుఁ డయ్యెను. ఇతఁ డొకసారి కాళికాలయసమీపమున కూర్చుండి ఈశ్వరమహిమాభివర్ణన మొనర్చు నొకపాటను భక్త్యావేశముతో పాడుచుండెను. శ్రీ గురుదేవుఁ డీ పాటను దూరమునుండి విని

సమాధిస్థితిలో సమీపించి, అతని వక్షఃస్థలమున పాదము నుంచెను. అతఁ డున్నతభావమంది ఇష్టదేవతాసాక్షాత్కార మును గాంచెను.

22. అక్షయకుమారసేన్. శ్రీ గురుదేవుఁ డితనికి మంత్రోపదేశము చేసెను. కాలాంతరమున నితఁ డాయన జీవితచరిత్రమును మనోహరపద్యకావ్యముగా రచించెను. వివేకానందస్వామియంతటిరసజ్ఞుఁడే యీ కావ్యము నత్యంత ముగా ప్రశంసించెను.

23. ఉపేంద్రనాథముఖోపాధ్యాయ. ఇతఁడును శ్రీ గురుదేవుని శిష్యులలో నొకఁడే. ప్రాఁతపుస్తకము లమ్మి జీవించుచుండిన నిఱుపేద. "పాప మీ బాలునికి సంపద కలిగిన బాగుండు" నని శ్రీ గురుదేవుఁ డొకసారి యనెనఁట. అచిరకాలముననే యితని స్థితిగతు లనుకూలముగ మాఱనారం భించెను! నరేంద్రనాథరచితమగు సంగీతశాస్త్రమును ప్రక టించుటతో నితని పేరు బయటకు వచ్చెను. పిదప నితఁడు "వసుమతీ" పత్త్రికా యజమానుఁడై కీర్తిధనముల నపార ముగా నార్జించెను.

24. నిత్యగోపాలుఁడు. ఇతఁడు శ్రీ గురుదేవునియం దపారభక్తి కలిగి యాయనదర్శనమునకు తఱచు వచ్చు వాఁడు. భగవన్నామోచ్చరణము విన్నమాత్రముననే ఇతనికి భావోద్రేకము కలిగెడిది. సంకీర్తనము విన్నమాత్రముననే పారవశ్యస్థితి కలిగెడిది. శ్రీ గురుదేవుఁ డితనిని మిక్కిలి ప్రేమించి, యితనిది పరమహంసస్థితి యని చెప్పువాఁడు.

ఇతఁడు రేయుంబవళ్లు ధ్యానప్రార్థనలందే నిమగ్నుఁడై యుం డుటచే వక్షఃస్థల మెప్పుడును రక్తమెగఁబ్రాఁకి ఎఱ్ఱగానుం డెడిది. అతీంద్రియస్థితిలో శ్రీ గురుదేవుఁ డితనిచేయి పట్టు కొని నృత్యము చేయువాఁడు. ఆ స్థితిలో వారి పరస్పర సంభాషణము మనుష్యభాషలో కాదు!

ఒక భక్తురాలితనియెడ వాత్సల్యభావము చూపుచు మిక్కిలి చనవుగా నుండెను. స్త్రీలతో నిట్టిసంబంధ మనర్థ కారకమని శ్రీ గురుదేవుఁ డితనికి బోధించువాఁడు.

కాలాంతరమున నితఁడు సన్న్యసించి జ్ఞానానందావ ధూత యనుపేరుతో వ్యవహరించు చుండెను.

25. ప్రాణకృష్ణముఖోపాధ్యాయ. ఇతనికి శ్రీ గురు దేవునియందు చాల భక్తి, పెక్కుతడవ లాయనను దర్శించి వేదాంతచర్చలు చేయువాఁడు. ఆయనయు నొకసారి యితని యింటి కేఁగి ఇతఁ డేర్పాటుచేసిన యుత్సవములో పాల్గొనెను. శ్రీ గురుదేవుఁ డితనితో ఆధ్యాత్మికవిషయములను, తన యనుభూతులను, చెప్పుచుండువాఁడు.

26. సురేశచంద్రదత్త. ఇతఁడు నాగమహాశయుని మిత్రుఁడు. ఇతనివలననే యతఁడు శ్రీ గురుదేవునిగూర్చి విన్నది. ఇరువురును కలిసియే ఆయనను మొదటితడవ దర్శించినది. ప్రథమదర్శనానంతర మితఁడు శ్రీ గురుదేవుని తఱచు దర్శించువాఁడు. ఆలో నితనిని క్వైటాకు మార్చిరి. అచటికి పోవులోపల నాగమహాశయుని కోరికపై శ్రీ గురు దేవుఁ డితనికి మంత్రోపదేశము చేయ నంగీకరించెను కాని, తనకు మంత్రములందు విశ్వాసములేదని యితఁడు చెప్పుటచే

శ్రీ గురుదేవుఁడు "అట్లైనచో తొందర యేల, కాలక్రమమున సర్వము లభించును" అనెను. కొన్నాళ్ల కితనికి మంత్రోపదేశముకొఱకు తీవ్రవాంఛ కలిగి క్వెట్టానుండి వచ్చెను గాని, శ్రీగురుదేవుఁ డప్పటికే మహాసమాధి నొందియుండెను. ఐనను పిదప నితని యీప్సితము విచిత్రవిధముగా నెఱవేఱెనcట.

27. ఈశానచంద్రముఖోపాధ్యాయ. ఇతఁడు ధర్మనిష్ఠాపరుఁడు, దయాదానశీలుఁడు. పెక్కుసార్లు దక్షిణేశ్వరములో శ్రీగురుదేవుని దర్శించువాఁడు. ఆయనయు మిక్కిలి ప్రేమతో నితనియింటి కప్పుడప్పుడు పోవువాఁడు. ఇతఁడు న్యాయబుద్ధికి పేరొంది, పరిచితు లందఱిచే గౌరవింపఁ బడువాఁడు. ముఖస్తుతిపరులమాటలను నమ్మవలదనియు, కాలమంతయు భగవదన్వేషణముననే వినియోగించుచు జీవితపరమార్థమును సాధింపుమనియు, శ్రీగురుదేవుఁ డితనికి బోధించెను.

28. మణిలాల్ మల్లిక్. ఇతఁడు బ్రాహ్మమతస్థుఁడు, భగవద్భక్తిసంపన్నుఁడు. శ్రీగురుదేవునియెడ నపారభక్తిగౌరవములు కలిగి దక్షిణేశ్వరము తఱచు వచ్చుటయే కాక ఆయనను తనయింటికిని ఆహ్వానించుచుండువాఁడు. ఇతని కొమార్తకూడ శ్రీగురుదేవుని భక్తురాలే.

29. నిత్యగోపాలగోస్వామి. ఇతఁడు సత్యాన్వేషణపరుఁడు. శ్రీగురుదేవునిగూర్చి విని, వెంటనే కలకత్తావచ్చి యాయనను దర్శించెను. అప్పు డాయన భోజనము చేయుచుండియు మహానందభరితుఁడై లేచి యితనితో మాటలాడి,

పిమ్మట కాళులొత్తుమని తనసేవాభాగ్య మనుగ్రహించెను. ఇతని కా సేవాకాలమున తనజీవితలక్ష్యమగు శాంత్యానంద నిధానము లభించిన ట్లయ్యెను.

30. పండితశ్యామాపాదభట్టాచార్య. ఇతఁడు గొప్ప పండితుఁడు. శ్రీ గురుదేవుని దర్శించి యొకసాయంకాల మితఁడు గంగయొడ్డున కూర్చుండి సంధ్యావందన మాచరించుచు నొక యత్యద్భుతదృశ్యమును చూచెను. పిదప శ్రీ గురుదేవుని సమక్షమునకు వచ్చి యొక భాగవతశ్లోకము చదువఁగా, ఆయన సమాధినిమగ్నుఁడై అతనియొడిపై తన పాదములుంచెను. వాని నతఁడు గట్టిగా పట్టుకొని "ప్రభూ, కరుణామయుఁడవై నా హృదయమును వికాసవంత మొనర్పుము" అనెను.

31. హరివల్లభ బోస్. ఇతఁడు కటకములో న్యాయవాది, బలరామ్‌బోస్‌కు జ్ఞాతి. శ్రీ గురుదేవునితో బలరామ్‌బోస్ చేయు సాంగత్యము గిట్టక కొంద ఱితనికి వ్రాసి కటకమునుండి పిలిపించిరి. ఇతఁ డేమనునోయని బలరాముఁడు జంకుచుండఁగా, శ్రీ గురుదేవుఁడు గిరీశునిచేత నితనిని పిలిపించుకొని మిక్కిలియాదరముతోఁ బ్రసంగించెను. ఇతని శరీరచిహ్నములు చూచి "ఇతఁడు శిశునిర్మలహృదయుఁడు; హృదయ మీశ్వరభక్తిపూరితముగా నున్నఁ గాని కన్ను లీ రీతిగా నుండవు" అని గిరీశునితో చెప్పి, హరివల్లభుని భుజముపై చేయివేసి, "నిన్ను చూడ నాకేమియు జంకు కలుగుటలేదు. నా స్వజనములోనివానిగా నిన్ను తలఁచుచున్నాను" అనెను. హరివల్లభుఁ డాయన పాదధూళిగొని "మీకృపాఫల మది" అనెను.

పిమ్మట ప్రసంగసందర్భమున ఆయన భక్తిశ్రద్ధలును శరణాగతియు ఆధ్యాత్మికజీవనమునకు ముఖ్యలక్షణము లని చెప్పి, శిష్యుఁ డొకనిచేత నొకపాట పాడించి, దాని కర్థము చెప్పుచు సమాధినిమగ్నుఁ డయ్యెను. అప్పుడు హరివల్లభున కేదో వింతయనుభూతి కలిగి, యతని కన్నుల నశ్రుధారలు కాఱఁ దొడఁగెను. శ్రీ గురుదేవుని జ్ఞానమయవాక్కులును, తేజోమయముఖాబ్జాతమును, అతని చిత్తము నపహరించినవి. పిమ్మట నతఁడు శ్రీ గురుదేవుని పలుమాఱు దర్శించుచుండెను.

తన కొక యతీంద్రియదృశ్యమున నితఁడును, డాక్టరు సర్కారును, కన్పించిరనియు, వీరు వత్తురని తనకు తెలియుననియు, శ్రీ గురుదేవుఁడు చెప్పెను.

32. గిరీంద్రమిత్ర. ఇతఁడు సురేంద్రనాథమిత్ర సోదరుఁడు. బ్రాహ్మమతస్థుఁడు. నిరాకారబ్రహ్మమందే నమ్మకము కలవాఁడు. శ్రీ గురుదేవుని కృపవలన నితని దృక్పథము విశాలమయ్యెను.

33. నవాయిచైతన్య. ఇతఁడు మనోమోహనుని మేనమామ. భక్తివైరాగ్యసంపన్నుఁడు. శ్రీ గురుదేవుని తఱచు దర్శించి యాయనకోరికపై భక్తికీర్తనలు పాడువాఁడు. ఆ కీర్తనలచేత తన్మయుఁడై ఆయన నాట్యముచేయుటయు కలదు. శ్రీ గురుదేవుఁడు 1885 వ సం॥ వేసవిలో పాణిహాటీతీర్థమునఁ బొల్గొనునని విని, యాయనకై అచటికేగి, చివర కాయన పడవలో నెక్కి బయలుదేఱుచుండఁగా, పరుగిడిపోయి పాదాక్రాంతుఁడై విలపించుచు, ఆయన యాశీస్సు లర్థించెను. అతని భక్తిశ్రద్ధల కలరి శ్రీ గురుదేవుఁడు సమాధిస్థితిలో నతనిని

తాఁకెను. అంత నతఁ డానందాతిశయమున నాడుచు, ఆయ
నకు పునఃపునః ప్రణామము లాచరించెను. శ్రీ గురుదేవుఁ
డతనివీపుపై దువ్వి కొంత బోధయొనర్చి సామాన్యస్థితికి
తెచ్చెను. అంతట నతఁడు కుటుంబభారమును కుమారునిపై
పెట్టి గంగాతీరము నాశ్రయించి కాలమంతయు ధ్యానప్రార్థ
నములందే గడప నారంభించెను.

34. కవిరాజమహేంద్రనాథపాల్
35. చూణీలాల్ బోష్
36. కిశోరిగుప్త
37. కిశోరిమోహన్ రాయ్
38. హరమోహన్ మజుందార్

} వీరుకూడ శ్రీ గురుదేవుని దర్శించుచు ఆయన యాశీస్సుల నందిన భక్తులే.

39. మన్మథుఁడు. ఇతఁడు సాములలో నాటితేటిన పైలుమాను. నీతినియమములు పాటింపక దౌర్జన్యములలో పాల్గొను దుశ్చరితుఁడు. కావున జనసామాన్యమునకు ఇతఁ డనిన సింహస్వప్నము. శ్రీ గురుదేవుఁడు తన శిష్యురాలగు జోగీన్ మా యింటియుత్సవమునకు రానున్నప్పుడు, ఆమె సోదరుఁడు హీరాలాల్ కు ఇదంతయు నిష్టములేక, వచ్చిన వారి నదరఁగొట్టి పంపివేయుటకై యీ మన్మథు నచటికి రప్పించియుంచెను. కాని శ్రీ గురుదేవుని చూచి యాయన మాట లొకటిరెండు వినుటతోడనే మన్మథుఁ డాయన పాదములపై వ్రాలి "ప్రభూ, ఈ యపరాధిని క్షమింపుఁడు" అని విలపింపసాఁగెను. పిదప ఆయనకోరికపై దక్షిణేశ్వరము పోఁగా, కాళికాలయప్రదక్షిణసమయమున నొకమూలలో నతని నాశీర్వదించి మఱియొకనాఁడు రమ్మనెను. ఆ రెండు

దర్శనములతో మన్మథుని జీవితమే మాఱిపోయెను. పరమసాధువై ఆధ్యాత్మికసాధన లెన్నియో అభ్యసించుచు "ప్రియనాథా, ప్రియనాథా" అని జీవితాంతమువఱకు శ్రీ గురుదేవుని పలుమాఱు స్మరించుకొనుచుండువాఁడు.



## III. బాల భక్తులు

1. నారాయణుఁడు. ఈ బాలుఁడు 'కల్లాకపటము' లెఱుఁగనివాఁడు. ఈశ్వరభక్తిసంపన్నుఁడు. కావున శ్రీ గురుదేవున కత్యంతప్రియుఁడు. ఇతనిని ఆయన శ్రీమన్నారాయణునిగనే చూచును. దక్షిణేశ్వరము వెళ్లవలదని యింటివా రెంతకొట్టినను, ఈ బాలుఁ డచటి కప్పుడప్పుడు వచ్చుచునే యుండును. ఈ బాలుఁ డొకసారి తనకడకు వచ్చుచుండుట దూరమునుండి చూచి, తాను వినుచున్న సంకీర్తనము కూడ వీడి, శ్రీ గురుదేవుఁ డితనికి తనచేతితో భక్ష్యములు తినిపించెను.

2. నరేంద్రనాథమిత్ర (చిన నరేంద్రుఁడు). ఇతఁడు స్వతస్సిద్ధముగా నాధ్యాత్మికదృష్టి కలవాఁడు. పసితనమున కూడ భగవంతునికై విలపించువాఁడు. శ్రీ గురుదేవుఁడితని బుద్ధియొక్క చుఱుకుఁదనమును అపరిమితముగా ప్రశంసించుచు, ఇట్టివాఁడిమి తన గురువగు తోతాపురి బుద్ధికి ఉండెడి దనువాఁడు. ఇతనినికూడ ఇంటివారు కొట్టువారే కాని, శ్రీ గురుదేవునియందుఁ గల యపారప్రేమచే నితఁ డెన్ని

దెబ్బలకైన నోర్చి, ఆయనకడకు వచ్చుచుండుటే కాక, మూఁడునాలుగు నాళ్లు ఆయనయొద్దనే యుండువాఁడుకూడ. భగవన్నామశ్రవణమాత్రమున నితఁడు భావపారవశ్యమంది రెండుమూఁడుగంటలసేపుకూడ మైమఱచి యుండువాఁడు. ఇతఁ డత్యంతపరిశుద్ధాత్ముఁ డనియు, ఐహికస్పర్శనే ఎఱుఁగఁ డనియు శ్రీగురుదేవుఁ డనువాఁడు. కొన్నాళ్లు దక్షిణేశ్వరము రానిచో ఇతనిని పిలిపించుకొని, వచ్చినప్పుడు తన చేతులతో ఇతనికి భక్ష్యములు తినిపించువాఁడు. ఇతనికై ఆయన యెన్నోసార్లు అంబిక కడకేగి విలపించి ప్రార్థించువాఁడు.

3. పూర్ణచంద్రఘోష్. ఇతనివయస్సు 13 ఏండ్లే. బాలభక్తు లందఱిలో చిన్నవాఁడు. కాని ఆధ్యాత్మికముగా నందఱికన్న నధికుఁడు. తల్లిదండ్రులకు వెఱచి రహస్యముగా శ్రీగురుదేవునికడకు వచ్చువాఁడు. ప్రథమసమావేశముననే ఆయన ఈ బాలునిలో ప్రచ్ఛన్నముగానున్న యపారశక్తిని గుఱుతించి ఇతనికి ధ్యానప్రార్థనవిధానమును బోధించెను. ఇతఁడు సత్త్వగుణపరిపూర్ణుఁడనియు, శ్రీమన్నారాయణుని లక్షణము లితనికడ కొన్నికలవనియు, తన యొద్ద కాధ్యాత్మికజ్ఞానోత్తేజముకై వత్తురని యతీంద్రియదృశ్యమున తనకు చూపఁబడిన అత్యుత్తమభక్తులలో ఇతఁడు చివరివాఁడనియు, శ్రీగురుదేవుఁడు చెప్పువాఁడు. తమ కిరువురకును గల ఆధ్యాత్మికసంబంధ మీబాలునకు స్వతస్సిద్ధముగనే తెలిసి, ఆయనసమక్షమున నితఁ డానందపరవశుఁడై యుండువాఁడు. ఆయన లీలామానుషవిగ్రహుఁడగు భగవంతుఁడని యీబాలుఁ డొకసారి చెప్పెను! అంత పసితనమందే

ఇది యెఱుఁగు టాయనకే చిత్రముగా తోఁచి ఆ బాలుని దీవించి శక్తిమంత్ర ముపదేశించెను.

ఇతఁడు "ఈశ్వరకోటి"లో చేరినవాఁడని శ్రీ గురుదేవుఁడు చెప్పువాఁడు. సన్న్యాసశిష్యులలోకూడ ఈ గణమునకు చేరినవారైదుగురుమాత్రమే కలరు. ఇందుచే ఈ బాలుని యాధ్యాత్మికౌన్నత్యము తేటపడఁగలదు. గుమ్మడి, బీర, మొదలగుజాతులకు కాయ మొదట, పూవు పిదప, ఎట్లో, అట్లే ఈశ్వరకోటులకు భగవత్సాక్షాత్కారము మొదట, సాధనలు పిదప : అని యాయన చెప్పెను.

శ్రీ గురుదేవునితోడి సాంగత్యము కలిగినపిదప ఈ బాలుఁడాధ్యాత్మికభావావేశమహాతరంగములలో మునిఁగిపోఁజొచ్చెను. కన్నీరు వఱదలై పాఱును; రోమములు నిక్కపొడుచుకొనును; ఆనందాధిక్యమున నొక్కొకసారి రాత్రి యంతయు నిదురపట్టకయే యుండును.

ఇంత చిఱుప్రాయముననే యితని కిట్టి మహోన్నతమగు నాధ్యాత్మికస్థితి యెట్లు లభించెనని బలరాముఁడడుగఁగా, అతఁడు పూర్వజన్మములలో చేసిన కృషిచే ప్రాథమికదశలన్నియు ఈ జన్మమునకుముందే దాఁటియుండెనని శ్రీ గురుదేవుఁడు బదులుచెప్పెను.

4. తేజచంద్రుఁడు
5. హరిపాదుఁడు
6. ద్విజుఁడు
7. ప్రమదా (లేక పల్టు)

} వీరుకూడ శ్రీ గురుదేవుని దర్శించుచు ఆయనప్రేమ చూఱగొన్నవారే.



## IV. భక్తురాండ్రు

శ్రీ రామకృష్ణుఁడు అనంతకల్యాణగుణసమగ్రుఁడు. ఆయన ఎఱుఁగని మతములేదు, చేయని సాధనలేదు, గెలుపొందని మార్గములేదు. ఆయన భక్తులకు భక్తుఁడు, జ్ఞానులకు జ్ఞాని, విజ్ఞానులకు విజ్ఞాని, పురుషులకు పురుషుఁడు, స్త్రీలకు స్త్రీ, బాలురకు బాలుఁడు. వింతలతో, వినోదములతో, కథలతో, పరిహాసములతో, బాలభక్తులను చేరఁదీసి, వారి కెఱుక లేకయే వారి నీశ్వరోన్ముఖులఁ జేయుచుండెను. అట్లే భక్తురాండ్రుకూడ ఆయనను తమలో నొకరినిగనే చూచుకొనుచుండిరి. ఆయనకడ వారికి భేదభావములు లేవు, దాఁపఱికములు లేవు. వారందఱకును ఆయన ప్రియబంధువు, అత్యంతాప్తుఁడు. రుచ్యములగు భక్ష్యము లెవ రెప్పు డేవి చేసినను, ఆయన కందు భాగ ముండును. ఆయన కోరికలను వా రాజ్ఞలుగా భావించి తలఁదాల్తురు. కుటుంబగౌరవములను పూర్వాభ్యాసములను మఱచి, ఎట్టివారైన ఆయనకై బజాఱునకుకూడ పోవుదురు. ఆయనయు పసిబిడ్డవలె వారి యెడ ప్రేమాదరములు చూపుచునే వారి కాధ్యాత్మికాభివృద్ధి చేకూర్చుచుండును.

1. శ్యామాసుందరీదేవి. ఈమె మనోమోహానుని తల్లి. అసాధారణమగు నాధ్యాత్మికభాగ్యము నొందిన ధన్యురాలు. భర్తను ఇహలోకమున నున్నప్పు డెంతటి భక్తిప్రేమలతో నారాధించుచుండెనో, పరలోకమున కేగినపిదప కూడ నంతటి భక్తిప్రేమలతోనే భగవదైక్యమూర్తిగా నారాధించుచుండిన పరమసాధ్వి. ఈమె యల్లుఁడు రాఖాలు

సన్న్యసింప నుద్యుక్తుఁడగుచున్నాఁడని విన్నప్పు డామె చింతిల్లుటకు మాఱు సంతసించి "అట్లతఁడు చేసినచో, అది నా జీవితములో శుభముహూర్తము" అనెను. శ్రీ గురుదేవునియందా మెకుఁగల భక్తిగౌరవములు మేరలేనివి. ఆయనప్రీతికై యామె మతసాంఘికనియమముల నెట్టివాని నైన నిరాక్షేపముగ నతిక్రమించును.

2. జోగీన్‌మా (యోగీంద్రమోహినీ దేవి). ఈమె యత్తవారిది వైభవోపేతమగు ధనికకుటుంబము. కాని యీయామె సుఖపడుటకు నోఁచుకోలేదు. తమబంధువగు బలరామ్‌బోస్ వలన ఈమె శ్రీ గురుదేవునిగూర్చి విని, ఆయన నొకసారి దర్శించెను. ఆ క్షణముననే తన కష్టదుఃఖముల నెల్లమఱచి ఆయన పాదాబ్జములకడ ఆత్మనివేదన మొనర్చు కొనెను. (శ్రీ) గురుదేవుఁడును ఆమె రాకకు సంతసించి (శ్రీ) మాతృదేవి నామెతో పరిచయింపఁజేసెను. (శ్రీ) మాతృదేవికిని ఈ యోగీన్‌పై నత్యంతప్రేమ. ఆమెకు తోడు నీడయై, ఇంటిపనులలో సాయముసేయుచు, ఆమెతోడ నప్పు డప్పుడచటనే నివసించుచు, శ్రీ గురుదేవునిశిక్షణమున సాధన లభ్యసించుచుండెడిది. (శ్రీ) గురుదేవుఁ డీమెకు మంత్రోప దేశముకూడ చేసెను. "జోగీన్ అసామాన్యాధ్యాత్మికశక్తి కలది. కాలాంతరమున నామెసిద్ధులకు లోక మద్భుతపడును" అని (శ్రీ) గురుదేవుఁ డొకసారి చెప్పెను. కొన్నాళ్ల కట్లే ఆమె ధ్యానకాలమున దివ్యావేశపారవశ్య మందుచుండెడిది.

3. గోలాప్‌మా (గోలాప్‌సుందరీ దేవి). ఈమె ఏకైక పుత్త్రికామరణముచే దుఃఖసాగరమున మునిఁగి, దక్షిణేశ్వరమువచ్చి, తన విషాదకథను (శ్రీ) గురుదేవునకు విన్నవించు

కొనెను. అంతయు విని యాయన అసంపూర్ణశరీరస్మృతియం దామె కిట్లనెను : "నీ వదృష్టవంతురాలవు. ఎవరికి స్వకీయులు లేకపోవుదురో వారికి భగవంతుఁడే తోడై యుండును." ఈ మాట లామెకు మరల ప్రాణముపోసినవి. శ్రీ గురుదేవుఁ డామెబాధ్యతను వహించి భక్తజనలభ్యమగు దివ్యానందము నామె కచిరకాలముననే చవిచూపెను. తన భక్తగణముతో ఆయన యొకసారి ఆమెయింటికికూడ పోయి విం దారగించెను. ఆ తరుణమున నామెకు కలిగిన మహానందము వర్ణనాతీతము.

ఈమెయు ఇంక నిరువురు శిష్యులును ఒకసారి శ్రీగురుదేవునితోకూడ కలకత్తానుండి పడవలో దక్షిణేశ్వరము పోవుచుండిరి. భోజనవేళ మించిపోవుటచే అందఱకును ఆఁకలి యగుచుండెను. చేత నొకఅణామాత్రమే కలదు. ఆ అణాకు భక్ష్యము లేవియో తెచ్చిరి. కాని, అందఱు నాశ్చర్యముతో చూచుచుండ, శ్రీ గురుదేవుఁ డవన్నియు తా నొక్కఁడే తిని, గంగోదక మొక పుడిసెఁడు త్రావి "ఆఁకలి తీఱినది" అనెను. తత్క్షణమే విచిత్రవిధమున తక్కినముగ్వుర యాఁకలియు తీఱెను! పూర్వకాలమున శ్రీ కృష్ణుఁ డిట్టి యద్భుతచర్య నొనర్చెనుట పురాణప్రసిద్ధము. ప్రకృతిలోని రహస్య శక్తులను వశపఱచుకొన్న మహాపురుషుల ప్రభావమును దేశకాలభేదములు నిరోధింపఁగలవా! ఒక్క అణా తినుబండారములతో నలుగురి యాఁకలి తీర్పవలసిన యక్కఱకలిగి శ్రీ గురుదేవుఁడు తనమహిమచే నట్లుచేసెను.

4. దేవేంద్రనాథమజుందార్ తల్లి. ఈమె శ్రీ గురుదేవునియెడ వాత్సల్యభక్తి చూపెడిది. ఆయనయు ఈమెను

'అమ్మా' యని పిలుచువాఁడు. ఈమె యొకసారి దక్షిణేశ్వరము వచ్చుచు, దేవతానివేదనార్థమై చక్కెరపూరణపు ఉండలను బొడ్డుకొంగున మూటకట్టుకొని వచ్చెను. వెంట వచ్చిన కుమారునకీ సంగతి తెలియదు. ఆమెయు శ్రీ గురుదేవుఁడును ఆయన మంచముపై కూర్చుండి తల్లిబిడ్డలవలె కొంతసేపు మాటలాడిరి. ఆ యానందములో ఆ వృద్ధస్త్రీ చక్కెరఉండలమూటయే మఱచెను. ఇంతలో శ్రీ గురుదేవుఁడు తనకు చక్కెరపూరణపుటుండలపై బుద్ధిపోవుచున్నదని చెప్పఁగా దేవేంద్రుఁడొకనిని బజారున కంపెను. కాని శ్రీ గురుదేవుఁడాలస్యమున కోర్వక, పసిబిడ్డవలె ఆమె కొంగు పట్టుకొని లాగ నారంభించెను. మూట బయటపడెను. శ్రీ గురుదేవుఁడా యుండలను మహాప్రీతితో తినుచుండ, నామె సంతోషము పట్టఁజాలక ఆనందబాష్పములురాల్చెను.

5. యదునాథమల్లిక్ వృద్ధబాంధవి. ఈమెకు శ్రీ గురుదేవునిపై అత్యంతభక్తి. అప్పుడప్పుడు తమయింటికాయన నాహ్వానించుచుండును. ఒకనాఁడామె తనయిష్టదైవముకై నైవేద్యపదార్థములు తనగదిలో నమర్చిపెట్టి, ధ్యానస్థిత యయ్యెను. ఇంతలో శ్రీ రామకృష్ణుఁడతీంద్రియావస్థ చెంది, తనగదిని వీడి, యదునాథునింటిలో వృద్ధస్త్రీ ధ్యానముచేయుచున్నచోటికి పోయెను. ఆమె కన్నులువిప్పి చూచుసరికి ఆయన ఆ నివేదితపదార్థముల నారగించుచుండెను. ఇట్లు హఠాత్తుగా లభించిన భగవదనుగ్రహమునకామె యానందపరవశురాలై, కనులనీరుకాఱ, గద్గదకంఠముతో "ఆహా! నేఁడు నాకోర్కె లన్నియు ఫలించినవి. మీ వాస్తవతత్త్వ మెఱుఁగఁగలిగితిని. నాకీ జన్మముననే భగ

వత్సాక్షాత్కారము లభించునట్లు అనుగ్రహింపుఁడు" అని ప్రార్థించెను. అంత శ్రీగురుదేవుఁడు తనపాదముతో నామె శిరమును స్పృశింపఁగా, ఆమె దివ్యానుసంధానమహానందము ననుభవించెను.

6. మణిలాల్‌మల్లిక్ కొమార్తె. ఈమె మిక్కిలి పవిత్రశీల. శ్రీగురుదేవునియెడ చాల భక్తికలది. ధ్యాన వేళలందామెమన స్సెమాత్రము నిలువక చెదరిపోవుచుండుటచే, ఆమె యొకనాఁడు శ్రీగురుదేవునితో మొఱపెట్టుకొనెను. ఈ లోకమున నందఱికన్న నెక్కువగా నీ వెవరిని ప్రేమింతువని యాయన యడుగఁగా, తన సోదరుని బిడ్డను పేర్కొనెను. అట్లైనచో ఆ బిడ్డని బాలకృష్ణునిగా భావించి ధ్యానింపుమని యాయన చెప్పెను. ఆమె యట్లుచేసి అచిర కాలముననే అనేక దివ్యానుభూతుల నొందఁగలిగెను.

7. గౌరీమా (మృడానీ చట్టోపాధ్యాయ). ఈమె భక్తి త్యాగములు అసామాన్యములు. చిన్ననాఁడే సన్న్యాసినియై బృందావనమున నివసించి వైష్ణవసాధనల నభ్యసించెను. బలరామ్‌బోస్‌వలన శ్రీగురుదేవునిగూర్చి విని దక్షిణేశ్వరమువచ్చి యాయనను దర్శించెను. ప్రథమదర్శనముననే ఆయనను శ్రీగౌరాంగావతారముగా విశ్వసించి, యపార భక్తితో చూడఁదొడఁగెను. పెక్కుతడవ లామె శ్రీమాతృదేవితోకూడి నివసించుచు, శ్రీగురుదేవునికి వంటచేసి పెట్టుచుండును. ఒకనాఁడామెకు ఒకకోరిక కలిగెను. శ్రీగౌరాంగావతారమున నెన్నోసార్లు ప్రదర్శితమైన భక్త్యావేశతరంగములు తనకు ప్రత్యక్షానుభూతములు కావలెననియే ఆ కోరిక. ఈ కోర్కె యెవరికిని తెలుపఁబడకపోయినను విచిత్ర

విధమున సిద్ధించెను.

ఒకనాఁటియుదయమున పెక్కండ్రుభక్తులు దక్షిణే శ్వరమునకు వచ్చిరి. గౌరీమా వంటచేసి శ్రీగురుదేవుని కడికి తెచ్చెను. ఆయన అచటనున్న కేదారచట్టోపాధ్యాయను ఆమె కెఱుకపఱచెను. వారిరువుర దొకే మతము. వారొకరినొకరు చూచుకొన్నతోడనే భక్తిభావావేశము పొంగిపొరలఁజొచ్చెను. ఆ చూపు లట్లేనిలిచి కన్నులనుండి పెద్దపెద్ద నీటిబిందువులు చెక్కిళ్లనంటి ప్రవహించుచుండెను. ఈ భావప్రదర్శనముచూచి శ్రీగురుదేవుఁడు అన్నముకడ నుండి లేచి నిలిచెను. అచటి భక్తులందఱుకూడ చేరఁబాటి గుమికూడిరి. వాతావరణమే దివ్యభావముతో స్పందింప సాఁగెను. అందుఁజిక్కి భక్తులు తమ్మును ప్రపంచమును మఱచిపోయిరి. కొందఱు నవ్విరి; కొంద ఱేడ్చిరి; కొందఱు పాడిరి; కొంద ఱాడిరి; కొందఱు వణఁకిరి; కొందఱు నేలపైఁ బడి పొరలాడిరి. ఇదంతయు రెప్పపాటుకాలములో జరిగెను. ముందుగా ఎవ్వరును ఎఱుఁగరు. ఈ దివ్యోన్మాదము కొంత సేపు సాఁగినపిమ్మట శ్రీగురుదేవుఁ డందఱను స్పృశించి సామాన్యస్థితికి తెచ్చెను.

౭. అఘోరమణీదేవి. దక్షిణేశ్వరమునకు ఉత్తర దిక్కున మూఁడుమైళ్లదూరములో గంగాతీరమున నుండు నొక రాధాకృష్ణాలయ మీమెకు నివాసము. అఱువదేండ్ల వితంతువు. రాబడి మిక్కిలిస్వల్ప మగుటచే కొంచెముసేపు నూలువడకుకొని యొక్కెట్లో కటికి పేదఱికమున దినములు గడపుచుండును. బాలకృష్ణుఁ డీమె కిష్టదైవము. ఆ దేవు నామె తనబిడ్డనిగా భావించుకొనును. లేమితోడనే సంతుష్టి

నొంది, సుఖము లాశింపక, లోకముతో పొత్తులేక, ఆ గంగ యొడ్డుగదిలో ఆమె ముప్పదేండ్లనుండి రాత్రిందివములు బాలకృష్ణజపధ్యానములందే నిమగ్నురాలై యుండెను.

1884 వ సంవత్సరమున నొకనాటి యపరాహ్ణవేళ ఆమె శ్రీగురుదేవుని దర్శించెను. ఆ సమావేశముననే వారికి పరస్పరగౌరవభావము ఉదయించెను. రెండవసారి వచ్చినపు డామె బజారునుండి ఏవియో సామాన్య భక్ష్యములు కొని, తెచ్చెను. ఆమె కనఁబడినతోడనే శ్రీగురుదేవుఁడు "నా కేమి తెచ్చితివో పెట్టుము" అని యడిగి, ఆభక్ష్యములు పుచ్చుకొని పరమప్రీతితో తిని "ఇంత వ్యయముచేసి వీని నేల కొనితెచ్చితివి? తీయకొబ్బరియుండలు నీవే చేసి తీసికొనిరావచ్చునుగదా? లేనిచో నీవు వండుకొను కూర లేవైన తెమ్ము" అని చెప్పెను. ఇట్లామెవచ్చినప్పుడెల్ల తిండి మాటే! ఆధ్యాత్మికబోధ లేదు! దేవునిప్రస్తావమే లేదు! "ఇతఁ డెట్టిసాధువు! ఎప్పుడును తినుబండారములు తెచ్చి పెట్టుటకు నాకు శక్తికలదా? ఇఁక నిచటికి రారాదు" అని నిశ్చయించుకొనును; కాని, లోపల నేదియో ప్రబలశక్తి యొకటి మరల లాగుకొనివచ్చును. మూఁడునాలుగు నెల లిట్లు గడచెను. ఆమె తెచ్చిన కూరలు ప్రీతితో తినును, ఇంకను కావలెననును! ఎప్పుడును తిండియే! చివర కామె విసిగి తన యిష్టదైవముతో "గోపాలా, ని న్నింతకాల మింతగా సేవించిన ఫలముగా ఈ తిండిపోతు సాధువునొద్దకు తెచ్చితివా" అని మొఱపెట్టుకొనెను. కాని, ఎంతప్రయత్నించినను, ఆయనయొద్దకు పోవుట మాత్రము మానుకొన శక్యము కాకుండెను!

పిదప నొకనాఁడు తెల్లవాఱుజామున నామె వాడుక చొప్పునజపముచేసి, ధ్యానఫలము ఇష్టదైవమునకర్పించుకొనఁ బోవుచుండఁగా, తన యెడమపార్శ్వమున శ్రీ రామకృష్ణుఁ డుండుటచూచి యులికిపడెను. కుడిచేయి పిడికిలిపట్టు, మొగ మున లేనగవు! ధైర్యముచేసి యెడమచేయి పట్టుకోఁబోఁగా, రామకృష్ణరూప మదృశ్యమై తత్స్థానమున బాలకృష్ణ రూపము కనఁబడెను! ఆ బాలుఁడు దోఁగాడుచువచ్చి, యొక చేయి చాఁచి, వచ్చిరానిమాటలతో "అమ్మా వెన్న పెట్టు" మని యడిగెను. పట్టరాని ఆశ్చర్యానందములతో ఆమె యొక కేక వేసి, "బీదదానను గదా, నాయనా, నీకు వెన్న మీఁగడ లెక్కడ తెచ్చిపెట్టఁగలను!" అని బుజ్జగింపుమాట లాడెను కాని, ఆ బాలుఁడు మంకు చేసెను. చివరకు తీయ కొబ్బరియుండ లీయఁగా శాంతించెను. ఆమె కింక జపము సాధ్యమా! ఆ ముద్దులబాలుఁ డామెయొడిలోని కెగిరి కూర్చుండును, జపమాల లాగుకొనును, బుజములపై కెక్కును, గదియంతయు చిందులాడును. తెల్లవాఱువఱ కెట్లో అచటనే గడపి, ఆ బాలు నెత్తుకొని దక్షిణేశ్వరము నకు పరుగిడి వచ్చెను. గోలాప్‌మా అప్పుడు శ్రీ గురుదేవుని గది చిమ్ముచు, ఎవరో దూరమునుండి "గోపాలా!" "గోపాలా!" అని వెఱ్ఱికేకలు వేయుచు వచ్చుచుండుట విని, చూడఁగా అఘోరమణి! పిచ్చి రేఁగినదానివలె నుండెను! చింపిరితల, వెఱ్ఱిచూపులు, నేలపై జీరాడుచున్న చీరకొంగు! శరీరస్మృతి లేదు! ప్రపంచస్మృతి లేదు! శ్రీ గురుదేవుఁ డప్పుడు తనచిన్నమంచముపై కూర్చుండియుండి పారవశ్య స్థితినందెను. అఘోరమణి వచ్చి ఆయనప్రక్కను గూర్చుం

డఁగా, ఆయన ఆమెయొడిలోని కేగెను. ఆనందబాష్పములు అలుఁగులఁబాఱుచుండ, నామె వెన్నమీఁగడలను, ఇతర మధురభక్ష్యములను, ఆయనకు తినిపించుచుండెను. కొంత సేపటి కాయన సామాన్యస్థితికి వచ్చి తన పెద్దమంచము మీఁదికి పోయెను. కాని ఆమె యింకను ఈ లోకమునకు రాలేదు! ఆనందపారవశ్యమున గదిలో నృత్యముచేయ సాఁగెను. ఆమెమాట లితరుల కర్థమగుటలేదు : "ఇదుగో గోపాలుఁడు నా చేతులలో ఉన్నాఁడు"—"అదుగో, అదుగో, నీ లోనికి ప్రవేశించుచున్నాఁడు"—"అదుగో మరల బైటికి వచ్చినాఁడు"—"రా, నాయనా, నాదగ్గఱికిరా, నాతండ్రివి కదూ!". ఆ నాఁటినుండి ఆమెకు "గోపాలుని తల్లి" అని పేరువచ్చినది. శ్రీ గురుదేవుఁ డామె వక్షఃప్రదేశమును నిమిరినపిదప నామె శాంతించినది. అంతట ఆమె కేవేవియో రుచ్యభక్ష్యములుపెట్టి, సాయంకాలమువఱకు దక్షిణేశ్వరమునసే ఉంచుకొని పిమ్మట పోనిచ్చెను

అప్పటినుండియు ఆమెకు గోపాలుని నిత్యసాక్షాత్కారము! ఒక నిమిషమైన నెడఁబాటులేదు. జపము చేయనీయఁడు, ఇల్లంతయు గంతులువేయుచుండును, వంటకై పుల్ల లేరుకొని రాఁబోఁగా, తానుకూడ పోయి పుల్ల లేరును. వంటచేయునప్పు డడ్డములువచ్చి అల్లరి చేయును!

పిదపకొన్నాళ్ళ కామె దక్షిణేశ్వరము వచ్చి శ్రీ మాతృదేవిగదిలో జపము చేయుచుండఁగా శ్రీ గురుదేవుఁడు చూచి సాధన సిద్ధికలిగిన దని చెప్పి జపము మాన్పించెను.

ఆచారనియమములుకూడ ఆమె మునుపటివలె పాటిం

చుట సాధ్యముకాలేదు. శ్రీ గురుదేవుఁడు తాఁకిన యాహారము మును పామె తినునదికాదు. కాని యిప్పు డాయనయే తనగోపాలుఁడనియు, తనయనుభూతియంతయు ఆయనలీలయే యనియు, తెలిసికొన్నది గదా! ఇఁక నిషేధించు టెట్లు? మఱియు, తనగోపాలుఁడు కాలనియమములు లేక ఎప్పుడును ఏవో తినుబండారము లడుగుచుండును. ఇచ్చినఁగాని యూరకుండఁడు. తినునప్పుడు దానిని తననోటిలో కొంత పెట్టును. వలదనుటెట్లు? తినకపోయిన నతఁ డేడ్చును! కాలాంతరమున శ్రీ గురుదేవుని శిష్యులపట్ల కూడ తన నియమముల నామె సడలించెను. వివేకానందస్వామియొక్క ఆంగ్లేయ శిష్యురాలగు నివేదితసోదరియింట నుండి, ఆమెసేవ లందుచునే శరీరమును విడిచెను. అప్పటి కామె అందఱయందును తనగోపాలునే చూడఁగలిగెను!

ఈ యవిచ్ఛిన్నసాక్షాత్కారము రెండునెలలుండినది. పిదప ధ్యానవేళలందే సాక్షాత్కారము. ఇందుల కామె మొదట ఖిన్నయై, తనయం దేదియో లోపము కలిగెనని భీతిలెను కాని, యీ కలియుగమున మన స్సంతయున్నత పదవి నధిష్ఠించి చాలకాల మున్నచో, శరీరము ఆ ధాటి కాఁగలేక పతనమొందునని శ్రీ గురుదేవుఁడు తెలిపి ఆసంశయము తీర్చెను. శ్రీ గురుదేవుఁడును తన గోపాలుఁడును అభిన్నులు అను జ్ఞానము కలిగినపిమ్మట, ఆమెకు ధ్యానమున తఱచు శ్రీ గురుదేవునిమూర్తియే కనిపించెడిది.

ఈ పరమసాధ్వియెడ శ్రీ గురుదేవునకుఁ గల ప్రేమగౌరవములు వర్ణనాతీతములు. తనభక్తులలోని మలినహృదయులు సమర్పించు భక్ష్యపదార్థములు అనర్థహేతువు

లని తానుతినక, తనశిష్యసామాన్యమును తిననీయక, ఈమెను, నరేంద్రుని, నిరభ్యంతరముగా తిననిచ్చును. ఐహికకల్మష స్పర్శనే యెఱుఁగని యామెను, జ్ఞానతేజోదుర్నిరీక్ష్యుఁడగు నతనిని, ఎట్టియాహారముకాని కలుషిత మొనర్పఁజాలదని యాయన విశ్వాసము. ఆమెను ఆయన యొకసారి చూపి, "ఈశరీరమున భగవంతుఁడుతప్ప మఱేమియు లేదు" అని చెప్పి, పసిబిడ్డను బోలె ఆమెను లాలించుచు, ఆమెపాద ములుకూడ నంటెను. పిదప నామెకు రుచ్యములగు భక్ష్య ములు తినిపింపమొదలిడెను. "నాకు తినిపింప నీ కింతప్రీతి యేల?" అని యామె యడుగ "మునుపు నాకు నీవు తిని పించితివి గదా!" అనెను. "ఎప్పు" డని ప్రశ్నింప "పూర్వ జన్మములందు" అనెను. ఆ సాయంకాల మామె యింటికి పోవునపుడు చాల కలకండ నామెకిచ్చి తీసికొని పొమ్మనెను. "ఇంతయేల" అని యామె యడుగ, మిక్కిలి ప్రేమతో నామె గడ్డముపట్టుకొని "నీవు మొదట బెల్లమవు, పిదప చక్కెరవైతివి, ఇప్పుడు కలకండవు. కావున కలకండతిని యానందింపుము" అనెను.

శ్రీ గురుదేవుఁ డొకసారి యామె యనుభూతులను నరేంద్రునకు చెప్పించెను. వాని నతఁ డాశ్చర్యానందము లతో, భావోద్రేకజనితబాష్పజలముతో, విని ఆమె పలు కులలోని ప్రతి అక్షరమును తాను విశ్వసించితినని చెప్పెను.

శ్రీ రామకృష్ణార్పణమస్తు.

ఓం తత్ సత్



## ఈ చరిత్రములోని ముఖ్యసంఘటనముల కాలక్రమము

1775 క్షుదిరాముని జననము.

1791 చంద్రాదేవి జననము.

1805 రామకుమారుని జననము.

1814 క్షుదిరాముఁడు కామార్పుకుర్ చేరుట.

1826 రామేశ్వరుని జననము.

1835 క్షుదిరాముని గయాక్షేత్రసందర్శనము.

1836 శ్రీ రామకృష్ణుని జననము. ఫెబ్రువరి 18-వ తేది, ఉదయము రమారమి 5 గంటల 15 నిమిషములకు. మన్మథసంవత్సర ఫాల్గునశుద్ధద్వితీయాబుధవారము.

1843 క్షుదిరాముని మరణము.

1845 శ్రీ రామకృష్ణుని ఉపనయనము.

1850 రామకుమారుఁడు కలకత్తాలో పాఠశాల పెట్టుట.

1852 శ్రీ రామకృష్ణుఁడు కలకత్తాకు వచ్చుట.

1853 శ్రీ మాతృదేవి జననము. డిసెంబర్ 22 వ తేది.

1855 దక్షిణేశ్వర దేవాలయ నిర్మాణము; హృదయుఁడు దక్షిణేశ్వరమునకు వచ్చుట; శ్రీ రామకృష్ణుఁడు రాధాకృష్ణాలయార్చకుఁడుగను, పిమ్మట కాళికాలయార్చకుఁడుగను, నియమింపఁబడుట.

1856 రామకుమారుని మరణము; దేవీసాక్షాత్కారము; ప్రథమ దివ్యోన్మాదము.

1858 హలధారి దక్షిణేశ్వరమున అర్చకుఁడగుట; శ్రీ రామకృష్ణుఁడు కామార్పుకుర్ పోవుట.

1859 వివాహము.

1860 దక్షిణేశ్వరమునకు తిరిగివచ్చుట; మథురుని దివ్యదృశ్యము.

1861 రాణిరాస్మణి మరణము; బ్రాహ్మణి ఆగమనము; తాంత్రికసాధన; రెండవ దివ్యోన్మాదము.

1863 తాంత్రికసాధనసమాప్తి; పండిత పద్మలోచనునితో సమావేశము; చంద్రాదేవి దక్షిణేశ్వరములో నివసింపవచ్చుట.

1864 శ్రీ రామకృష్ణుఁడు జటాధారియొద్ద వాత్సల్యభావమభ్యసించుట; మధురభావాభ్యాసము; తోతాపురియొద్ద సన్న్యాసాశ్రమస్వీకారము; నిర్వికల్పసమాధి.

1865 హలధారి స్థానమున అక్షయుఁడు ప్రవేశించుట; తోతాపురీ నిష్క్రమణము.

1866 శ్రీ రామకృష్ణుఁ డాఱునెలలు అద్వైతస్థితిలో ఉండుట; వ్యాధి; మహమ్మదీయమతసాధన.

1867 శ్రీ రామకృష్ణుఁడు కామార్పుకుర్ పోవుట; బ్రాహ్మణీ నిష్క్రమణము.

1868 తీర్థయాత్ర; గంగామాయి దర్శనము.

1870 మథురాబాబుతోడి పర్యటనము; కలుటోలా హరిసభలో శ్రీ రామకృష్ణుని ప్రవర్తన; శ్రీరామకృష్ణుఁడు కాల్నా నవద్వీపములు దర్శించుట.

1871 మథురుని మరణము.

1872 శ్రీ మాతృదేవి దక్షిణేశ్వరమునకు మొదటి సారి వచ్చుట; షోడశీపూజ.

1873 రామేశ్వరుని మరణము.

1874 శ్రీ మాతృదేవి దక్షిణేశ్వరమునకు మరల వచ్చుట.

1875 శ్రీ రామకృష్ణుఁడు కేశవచంద్రసేనును మొదటి సారి కలసికొనుట; కామార్పుకుర్‌కు శ్రీ రామకృష్ణుఁడు కడసారిపోవుట.

1876 చంద్రాదేవి మరణము.

1877 } కేశవచంద్రసేనుతో పరిచయ మెక్కు-
1878 } వగుట; శ్రీ మాతృదేవి దక్షిణేశ్వరమునకు మూఁడవసారి వచ్చుట.

1879 శిష్యులు రా నారంభించుట.

1880 రాఖాలునరేంద్రనాథులు వచ్చుట.

1881 హృదయుని యుద్యోగ పరిసమాప్తి.

1882 పండిత ఈశ్వరచంద్రవిద్యాసాగరుని దర్శించుట; శ్రీ మాతృదేవి దక్షిణేశ్వరమునకు మరల వచ్చుట.

1884 కేశవచంద్రసేను మరణము; పండిత శశధరుని కలియుట; గోపాలునితల్లి; శ్రీమాతృదేవి దక్షిణేశ్వరములో నివసింప కడసారిగా వచ్చుట.

1885 వ్యాధి; పాణిహాటీ తీర్థ చరమ సందర్శనము; శ్యామపుకుర్ లో నివాసము; డాక్టరు సర్కారు తో పరిచయము.

1886 కాశీపురములో చికిత్స; శిష్యసంఘపు ఏర్పాటు; మహాసమాధి (ఆగస్టు 15 వ తేది అర్ధరాత్రికి పిదప 1 గంట, 2 నిమిషములకు. ఇంగ్లీషు లెక్కప్రకారము 16 వ తేది. వ్యయసంవత్సర శ్రావణ కృష్ణప్రతిపత్తు, ఆదివారము.)



# అకారానుక్రమ విషయసూచిక



# శ్రీ రామకృష్ణ ప్రభ

(స్థాపితము : 1944)

ఆధ్యాత్మికవిజ్ఞానమును పెంపొందించుచు, విశ్వమానవకల్యాణమున కును సర్వమతసామరస్యమునకును సాధనభూతములగు చక్కని వ్యాసములతో వెలువడుచున్న ఆధ్యాత్మిక మాసపత్రిక. మతధర్మప్రబోధకములగు వ్యాసములుమాత్రమే కాక శ్రీ రామకృష్ణ వివేకానంద వాఙ్మయమును, సాంఘిక, నైతిక, వైజ్ఞానిక విషయములును, కవిత్వమునకు సంబంధించిన విషయములును ఇందు ప్రచురింపఁబడుచున్నవి.

మాచే బ్రకటింపఁబడు ఆంధ్ర గ్రంథము లనేకములు చందాదారులకు తగ్గింపువెలల కొసఁగఁబడును.

సంవత్సర చందా రూ. 3      విడి సంచిక అ. 6

ఇవియేకాక

సంస్కృత, ఆంగ్ల, ద్రావిడ, హిందీ, కన్నడ గ్రంథములును

వేదాంత కేసరి (ఆంగ్లము)

శ్రీ రామకృష్ణ విజయము (తమిళము)

అను మాస పత్రికలును మాయొద్ద దొరకును.

శ్రీ రామకృష్ణ పరమహంస

శ్రీ శారదాదేవి

శ్రీ వివేకానందస్వామి

మున్నగువారి ఛాయాచిత్రములును మాయొద్ద దొరకును.

సవివరమగు మా కేటలాగు వలయువారికి ఉచితముగాఁ బంపఁబడును.

ఇట్లు వ్రాయుడు :

మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు-4.